# శ్రీ సీ తా రా మ ము.

వంగభాషను వ్రాయఁబడిన బంకించంద్రుని నవలనుండి
కృష్ణామండలమునందలి కొవ్వూరు కోర్టులో న్యాయవాదిగనున్న
తల్లాప్రగడ సూర్యనారాయణరావు బి. ఏ. గారిచే

నాంధ్రీకరింపఁబడినది.



వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ
బ్రకటితము.

---

చెన్నపురి.

మొదటి కూర్పు 1000 ప్రతులు.

1912.

# అంకితము.



౧. పదియేండ్లకే తండ్రి ♦ పరమపదించిన
    నెలలోనె మమువిద్య ♦ నేర్వఁ బనిచె
పుత్రులేవురుమృతి ♦ బొందిన దుఃఖంబు
    మమ్మార్తరడింపంగ ♦ మదినడంచె
అబలతానయ్యును ♦ ప్రబలధైర్యమున మా
    సంసారికం బెల్ల ♦ చక్కఁబెట్టె
అతిథులేవేళఁదా ♦ మరుదెంచినను వారి
    కాతిథ్యమిడఁ గష్ట ♦ మన్న దెఱుఁగఁ

తే. దేమహాసాధ్వి మహాలక్ష్మి ♦ నామయామె
నన్నుఁ గన్నట్టి ♦ తండ్రినిఁ గన్నతల్లి
సుబ్బనామాత్యు నర్ధాంగి ♦ సుగుణరాశి
యామెకొనరింతు దీనినే ♦ నంకితంబు.






అహాహా! బంకించంద్రుని యనుపమాన ప్రతిభా విశేషము! భాషాభిమానముఁ గలిగి యీషద్రచనా సామర్థ్యముఁ గల మనుజులెవ్వ రీ గ్రంథమును జదివినను తమకుఁగలిగిన యానందముతోఁ దృప్తిఁ జెందక తమతోడివారికిఁ గూడ నట్టి యానందముఁ గలిగించి యందఱుం గలసి యానందాంబుధి నోలలాడ నువ్విళ్లూరుచున్నవారు. నేనాంధ్రీకరించిన యీమహామహుని గ్రంథములలో నియ్యది మూఁడవది. ఈ మూఁడు గ్రంథములును గూడ మఱియొకరిద్దరు నాకుముందో వెనుకనో భాషాంతరీకరించియే యున్నవారు. ఈగ్రంథకర్త ప్రతిభ యెంతటిదియునుఁ గాకయుండిన, యీయన గ్రంథములన్నింటికిని గూడ నిట్టిమహావ్యాప్తిలభించునా! స్వకపోల కల్పితగ్రంథము రచించుట ప్రతిభావంతునకు సుకరము. భాషాంతరీకరణము మిక్కిలి కష్టకార్యము. ఇందు గ్రంథకర్త కిసుమంతయు స్వాతంత్ర్యము లేదు. ఆదిమగ్రంథకర్త భావములెవ్వియో వానిని పూర్ణముగ గ్రహించి ఆతని ప్రతిభావిశేషమును తానుగూడ నావేశమునకుఁ దెచ్చికొని చేసిన భాషాంతరీకరణము లే గ్రంథకర్త నిజమయిన యుద్దేశ్యములను భాషాంతరమున వ్యక్తీకరింపఁ గలుగు. భాషాంతరీకరణము జదువునప్పు డయ్యది భాషాంతరీకరణము వలెనుండక స్వకపోల కల్పితమేయని యనిపించుకొనిన భాషాంతరీకరణములే భాషాంతరీకరణములు. గ్రంథకర్త చెప్పినఁగాని యయ్యది భాషాంతరీకరణమని తెలిసికొనుట కనువుగాకుండనుండవలయు. కేవలదేశ భాషావేత్తలకు మార్గదర్శకములుగనుండఁదగిన గ్రంథములుమాత్రమే భాషాంతరీకరణయోగ్యములు. ప్రతిచెత్తపుస్తకమును భాషాంతరీకరించుట భాషకనర్థదాయకము. పనికిమాలిన స్వకపోలకల్పిత గ్రంథములు వ్రాయుటవలన భాష కెంతయనర్థము కలుగునో, అట్టిగ్రంథములు భాషాంతరీ

కరణమువలనఁగూడనంతనష్టము సంభవించును. తత్కారణముననే భాష సేవకులు ముందువెనుక లాలోచించి మఱి గ్రంథములు వ్రాయఁగడంగుదురు. గ్రంథప్రాశస్త్యము పూర్ణముగ నందలి యాశయముల గ్రహింపఁగల పాఠకులకు మాత్రమే బోధపడఁగలదు. బంకించంద్రుఁడే గ్రంథము వ్రాసినను తనమతగ్రంథములయందు, తనదేశాచారములయందు, తన దేశమునందు, తనకుఁగల యభిమానమును పూర్ణముగ వ్యక్తీకరింపుచ అందు ఖిలమయిన యాచారవ్యవహారముల పునరుద్ధరింపఁ బురికొల్పుచ పనికిమాలినవారిని దోసివేయ ప్రబోధింపుచు మొత్తమొత్తగ తన సంస్కరణాభిలాష గ్రంథములం జూపించియున్నవాఁడు. శాస్త్రాధారము లేనిసంస్కరణ మీతనికి రుచింపదు:—శాస్త్రప్రసిద్ధములగు నాచారములకును సాంప్రదాయములకును మూలకారణములు గని పెట్టుటలో నింతటివాఁడు మఱియొకఁడుండఁబోఁడు. ఈయన సంస్కరణమెంతటిదిబాధించినను వెగటుగాఁ గనుపట్టదు. అట్టిమహానుభావుఁడు దారిదీయఁబట్టియే బంగాళీభాష యంతకొలఁది కాలములో వృద్ధిలోనికి వచ్చినది.

మనభాషయందు స్వకపోలకల్పితములయిన గ్రంథములు చాలమట్టుకు శాస్త్రాధ్యము పూర్ణముగ లేనివారిచేతను, శాస్త్రములయందు విశ్వాసమే లేని వారిచేతను, తమలోకజ్ఞానమే సమస్తమునని యనుకొను వారిచేతను, వ్రాయఁబడుచుండుటచే, ఆగ్రంథములు జనుల కంత యుపయోగకరముగనుండుటలేదు. గ్రంథములు కేవల భాషాభివృద్ధికిమాత్రమే యేర్పడినవికావు. ఎయ్యవి జ్ఞానదాయకములయి, ఇహపరంపరలు రెండింటికినిగూడ మార్గదర్శకములయి యుండునో అవియే బహుజనపఠనీయములు. అవియేసద్గ్రంథములు. అట్టివే యాచంద్రతారార్కముగ నిలిచి యుండునవి. పాఠకులశ్రమకుఁ దగినఫలము దొరకని గ్రంథమొక గ్రంథమా! గ్రంథము మొదలిడిన చివరవరకు నాపుటకు బుద్ధి పుట్టకూడదు. ఇట్టిసుగుణసంపత్తికంతకును బంకించంద్రుని గ్రంథములు, ఆకరములయి

గనుపట్టు. అందుమూలముననే మూలగ్రంథము వ్రాసిన భాష భాషాంత రీకరణకర్త కంతగా రాకుండినను గ్రంథప్రాశస్త్యమును బట్టియు, నందలి రచనాచమత్కారమును బట్టియు, పథకనిర్మాణ చాతుర్యమునుబట్టియు, వస్తు, నేతృ, గుణపోషణమునుబట్టియు, ఆయాగ్రంథములు మఱియొక్క భాషనుండి కష్టించి వ్రాయఁగడంగుచున్నారు. ఈశ్రీసీతారామము పయివిషయములన్నిటిచే నిండియుండి పాఠకులకెంతయు మనోహర ముగ నుండుననుటకు సందేహము లేదు.

ఈయది, ఆంగ్లేయభాషనుండి భాషాంతరీకరింపఁబడుటచే మూలగ్రంథము నందలి భావములు కొన్నియెడల భేదించియుండవచ్చు. ఆభేదములు కథాసందర్భమున కించుకంతయును రసభంగమును గలిగిం చునవికావు. నేను వ్యాపారబాహుళ్యము గలవాఁడ నగుటచేతను గ్రంథము నేనుండుస్థలమునకుఁ జాల దూరమున ముద్రింపఁబడుట చేత ను ముద్రాయంత్రమువారు వ్రాతప్రతినిబట్టి, అచ్చుప్రతిని దప్పులేకుం డ సరిచూచి మఱి ప్రకటింతుమని వాగ్దానము చేసియు వారం దొకింత యసడ్డచేసి యుండుటచేతను గ్రంథమంతయు నొక్కసారి వ్రాసినది కాక పోవుటచేతను నిందుదోషములు నావి కానివి చాలవరకుపడినవి. అట్టి వానిని సవరించి చదువుకొనుఁడని పాఠకులకు విన్నవించుట దక్క యీ కూర్పునకు నేఁ జేయవలసిన కార్యం బొండు గానఁబడదు.

ఇందు విసంధు లెచ్చుగా పడినవి. అవియన్నియు నే నంత యుద్దే శ్యపూర్వముగా వేసినవికాకయున్నను గ్రంథమునకవి యించుకంత యును హాసికరములయినవిగాని లాక్షణికదోషముల దెచ్చిపెట్టునవి గానికావు. వాడుకలోనున్న శబ్దములే నేను సాదుచేసి కొన్ని యిందువాడి యుంటిని. అయ్యవి గ్రంథకర్తయాశయముల సులభముగఁ దెలుపుటకై యుద్దేశింపఁబడినవి. కాని ప్రస్తుత భాషాసంస్కర్తలపక్ష మవలంబించి

వ్యాకరణ విరుద్ధముగ గ్రామ్యశబ్దములుమాత్ర మెచ్చటను ప్రయోగించలేదని మాత్రము చెప్పఁగలను.

ఈయదినాచేతఁ బ్రకటింపఁబడిన మాధవీకంకణమునకు మున్నే యాంధ్రీకరింపఁబడినను నంతరాయ బాహుళ్యముచే నింతవరకు గ్రంథము బయలుగాంచుటకు వలనుగాక పోయెను. నే నిం దెంతవరకు కృతార్థుండనయితినో యయ్యది పాఠకులు చెప్పఁదగినది కాని నాపనిగాదు. గుణజ్ఞులు దోషములం దెలిపిన ముందుకూర్పున సవరించుకొన సంసిద్ధుఁడనై యున్నవాఁడ.

ఇట్లు,

| | |
|---|---|
| కొవ్వూరు<br>17-8-1912 | విద్వజ్జన విధేయుఁడు,<br>తల్లాప్రగడ. సూర్యనారాయణరావు. |

# గ్రంథవిమర్శనము.

శ్రీ

సీతారామ రాయల మువ్వురిభార్యలలోఁ బరిత్యక్తయు దూరస్థురాలు నగు నామె. కానిహృదయముల వారిరువురకుంగల యనుబంధమును బట్టిచూడ వారు మిగుల సమీపస్థులనియే యెన్నవలయు. సీతారాముని సుఖదుఃఖముల కన్నిఁటికిని, అతనియుచ్చస్థితికినీచస్థితికినికూడ నామెయే కారకురాలు. హిందూరాజ్య సంస్థాపనకు కారకురాలామె. తద్వినాశనమునకు కారణభూతురాలామె. గ్రంథ మామెకు గలిగిన విపత్తుతోఁ బ్రారంభమైనది. ఆమె మూలమున సీతారాముని రాజ్యమునకు కలిగిన విపత్తుతోఁ నంతమొందినది. ఆదినుండి అంతమువఱకును, సీతారాముఁడు చేసినకార్యము లేవిచూచినను, శ్రీ మూలమున జరిగినవిగనే కన్పట్టును. నందపరమ పతివ్రతాతిలకంబయినను ఆమెమూలమున గ్రంథమునకు గలిగిన వృద్ధిక్షయము లేమియును లేకపోవుటచే ఆమె నిందు నాయకగాఁ జేకొనఁదగదు. గ్రంథమున నితి శ్రీగా నెవ్వరిప్రభావము నిండియున్నదో? ఎవ్వరిప్రభావము మూలమున కథారచనకు వృద్ధిక్షయములు గలుగుచుండునో అట్టివారిపేరున గ్రంథము వరలుట న్యాయము. ఉత్తమగ్రంథములన్నియును ఆనియమమును పురస్కరించుకొనియే నామకరణముచేయఁబడినవి. ఇందలి యావత్కార్యములకు కర్త సీతారామరాయలు. కారయిత శ్రీ. వీరిరువురికిఁగల అన్యోన్యసంబంధమును దెలుపు గ్రంథమగుటచే దీనికి "శ్రీసీతారామము" అని నామకరణముచేయఁబడియె.

బంగాళీభాషను "సీతారామ్" యనిమాత్రమే నామకరణము చేయఁబడినట్లు భాషాంతరీకరణ కర్తలవలన చేకొనిన నామమును బట్టి తెలియుచున్నది. బంకించంద్రుఁడు కేవలమును కార్యనిర్వాహకునిమాత్రమే ప్రధానముగా గ్రహించి యాతని నామమునే గ్రంథమునకుంచినాఁడు. కాని రాయలకార్యనిర్వాహకత్వము కేవల మస్వతంత్రమయినది. భారతయుద్ధమంతయు నర్జునునిచేతిమీదనే నడచినది. కేవలమోఘుఁడాతఁడేయని చెప్పవలయును. శ్రీకృష్ణుఁడు రథచోదకుండై ప్రవర్తించె. కాని యావత్కార్యమునకును మూలకారకుఁడు ముకుందుఁడుగాని యర్జునుఁడుకాడు. కథాసూత్రమంతయు నాతనిచేతిలోనున్నది. ఆతఁడెట్లుత్రిప్పిన నర్జునుఁడట్లునడచినాఁడు. అట్లే యిచ్చటను రాయలకార్యములన్నియును శ్రీ నాశ్రయించియున్నది. అందు మూలమున శ్రీమంతముగాని సీతారామనామమంత సమంజసముకాదని చెప్పనొప్పు.

ఈగ్రంథమున గ్రంథకర్తకు జ్యోతిశ్శాస్త్రమునందు గలవిశ్వాసమును పూర్ణముగ వ్యక్తీకరించినాఁడు. శ్రీకిని రాయలకును జరిగిన వివాహబంధమెడమగుటకు కారణము జ్యోతిశ్శాస్త్రము. ఆమె జాతకమత్యుచ్చదశనందవలసినజాతకము. సంసారమునందున్న

పట్టమహిషి కావలసినది. తత్పరిత్యాగముగలిగిన సన్యాసినికావలసినది. హిందూసిద్ధాంతమునుబట్టి యీరెండునుకూడ నుచ్చదశలే. రెండింటికిని సామ్యమం దందుగల స్వాతంత్ర్యసాధర్మ్యమునుబట్టి కలిగినవి. ఈమెకీరెండవది లభించినది. జ్యోతిశ్శాస్త్రవేత్తలీమె జాతకమునుజూచి యీమెతో పరిణయానుబంధముగల మనుజునకు మరణమవిలంఘ్యమనితలంచి పతిమారక జాతకురాలగు నామెను పరిత్యజింపవలెనని బోధించిరి. జ్యోతిష్కులు తమ బుద్ధిబలముకొలంది, యుక్తియుక్తముగ పరిహారోక్తులు వెదకుచుందురు. అట్లే యిందు దానికితగు పరిహారమొకటి కల్పింపఁబడియె. స్త్రీజాతకమువలనఁగలుగు నష్టము ప్రియవియోగము.

"భార్యకు భర్త ప్రాణప్రియుఁడు. భార్య భర్తను ప్రేమించకుండునేని యాయరిష్టమితరులను గొట్టుకొనిపోవును. వధూవరుల కుభయులకును సమావేశమే సంఘటిల్లకుండునేని వారి యుభయులకు ననురాగముదయింపంబోదు. ఆఁడుదానికి పురుషునియం దనురాగముదయింపదేని నామె యాతని మరణమునకు కారకురాలు కానేరదు. వారుభయులు నేకశయ్యాగతులుకారేని యొకరిమనం బొకరిపైఁ బోవుట సంభవింపదు. వారిరువురకు నెడబాటగు నుపాయమాలోచింపు" మని ప్రబోధించిరి. దాని ననుసరించి రాయలకు మఱిరెండు వివాహములు జరిగినవి. ఆతనిమనస్సు స్త్రీపై కరుగకుండనున్నంతమట్టుకాతని కేయిక్కట్టులును కలుగలేదు. రాయలమనస్సున స్త్రీప్రవేశించినది. అదిమొదలాతని కన్నియు నష్టములే సంభవించినవి. స్త్రీనివెనుకబోయి వచ్చునప్పటికి రమపై యాపనిందపడినది. అది వదల్చుకొనునప్పటి కామెకు రోగము ప్రారంభమైనది. అంతలో స్త్రీసంయోగముకూడ తటస్థంబైనది. రాజ్యకార్యములన్నియును దానితో రూపుమాసినవి. రమ మరణించినది. మతిచెడినది. అంత రాయలు చేయరాని పనులెన్నియేనిచేసినాఁడు. తుదకు రాజ్యమంతయును కోలుపోయినాఁడు. ఇదియంతయును జాతకఫలము కాదా? పతిమారకజాతకముగల స్త్రీకి వివాహానుబంధము కలిగినది. దానికి పరిహారోక్తి జ్యోతిష్కులు చెప్పినారు. దానిని పాటించుశక్తి తత్ఫలభోక్తలకడ లేకపోయినది. అందుమూలమున జాతకము చెప్పినంత ఫలమునిచ్చి తీరినది.

హిందూశాస్త్రములయందు బకించంద్రునకున్నంత విశ్వాసము మఱియొకరికున్నట్టు చెప్పవలనుపడదు. ఆతనికున్న విశ్వాసము తనగ్రంథపాత్రములం బ్రవేశపెట్టి పాత్రములవు కథారూపమునబోధించుట యాయనప్రతిభానైపుణ్యము. వేదాంతశాస్త్రవేత్తలలోనగ్రేసరుండగు శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులు "సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం నిర్మోహత్వే నిశ్చలతత్వం నిశ్చలతత్వే జీవన్ముక్తిః, భజగోవిందం భజగోవిందం గోవిందం భజమూఢమతే." అని చెప్పియున్నాఁడు. దీని నీతఁడీ గ్రంథమున దృష్టాంతీకరించియున్నాఁడు. స్త్రీసన్యసించి యయంతిచరణశుశ్రూష సేయుచు నామె

చేనియుక్తయయి పతిసాన్నిధ్యముం జేరి యాతనికి మతాభినివేశముం గలిగింప నుద్యుక్తురాలయి వచ్చినది. ఆమె జితేంద్రియత్వమున చాలవరకు విజయముం గాంచినది. ఇంద్రియ సౌఖ్యములనెల్ల వర్జించినది. తపస్సంబంధమగు నోజస్సు విశేషముగ సంపాదించుకొన్నది. తన్మూలమున మనస్సింక చలింపదనుకొని సీతారామునియొద్ద నైదువత్సరములుండినది. ఆమె నాక్రమించియున్న యోజో మహిమముచే యింద్రియలోలుండగు రాయలామెను సమీపింప లేకపోయెను. ఆమెమనస్సు చాలదినములవఱకు చలనరాహిత్యము నందియుండెను. అంతవఱకు రాయలామె నేమియును అనలేకపోయెను. ఆమెపై దుశ్చింతయేని యాతని కుద్భవింపదయ్యెను. తపస్సంబంధములగు కార్యములన్నియును కట్టుబడిపోవుటచే కొన్ని దినములయ్యెడు సరికామె యార్జించిన యోజస్సంచయమెల్ల రాయలసాంగత్యదోషంబున వెచ్చమయ్యెను. అతని యిచ్ఛాశక్తి కొంతతడవైనవెనుక శ్రీ మనశ్శక్తికన్న హెచ్చయినది. ఎప్పుడు శ్రీకి మనశ్చలనంబు సంభవమయ్యెనో, ఆతరుణమున రాయలమనంబున దుశ్చింతలుద్భవంబయినవి. ఆమెను బలిమిని బట్టవలెనను దుర్బుద్ధి అప్పటికి కాని పుట్టినదికాదు. రాయలమనంబున నీబుద్ధియుత్పన్నమయినదియును, శ్రీకి చిత్తచాంచల్యముదయమయినదియును, ఒక్కసారియేయని పాఠకులు కనిపెట్టగలరు. అయ్యది వారిద్దరు నొకరికొకరు చెప్పికొనినదికాదు.

శ్రీకిమనంబున రాయలయం దనురాగము పూర్ణముగ నశింపలేదు. కాని యింద్రియ సంబంధమగు నానందము నామె యాతనివలన నభిలషించినదికాదు. దాంపత్యసౌఖ్యమునందలి పరమార్థమునకామె యాశించినది. ఈమెమనస్సిప్పు డైహికాముష్మికవిషయముల రెండింటంగూడ సమానముగ పనిచేయుచున్నది. రాయలమనస్సొక్క యైహికవిషయమునందుమాత్రమే తదేకదీక్షగ పనిచేయుచున్నది. ఈతని కాముష్మిక విషయములందు మనస్సుబోవుటయే మానినది. అందుమూలమున నీతని మనశ్శక్తికి ప్రపంచవిషయములందలి దార్ఢ్యము హెచ్చయి శ్రీయందుకూడ ప్రాపంచకవిషయమగు కోర్కెలు కొన్నియుండుటచే వానినాధారము చేసికొని యామెయందలి యాముష్మికవిషయంబగు నిశ్చలభావమును క్రమక్రమముగ నశింపఁజేయగలిగినది. ఆమెకు సత్సాంగత్యము నశించినది దుస్సాంగత్యతరంగములు చాలగ నామెతట్టునకు ప్రసరించి యామె మంచినిముంచివేయ, ప్రాపంచిక వాంఛలే మిగిలిపోయినవి.

అట్టితరుణమున యయాంతి యామెను సాయపడబట్టిగాని శ్రీయప్పుడు రాయలకు తప్పక వశవర్తినియయి మెలంగియుండు. ఆమెకుగల భయము తనమూలమున తనభర్తకు మరణము సంభవించుననునది. అందులకు తాను కారకురాలు కాకూడదను విశ్వాసముచే నామె జితేంద్రియత్వము నలవరచికొన్నది. ఇంద్రియవశ్యత నలవరించుకొనువారలు తత్సంబంధికులగు వారలసాంగత్యమేకాని వైలక్షిణ్యమగు సాంగత్యము ననుసరింపరాదు

అందుమూలముననే యట్టివారి కేకాంతాధివాసము మంచిదిగ శాసింపంబడియె. తదను రూపంబగు వనవాసాచరణము విధింపబడియె. విరాగుల సాంగత్యము నియోగింపంబడి యె. ఇందులకు భిన్నముగా ప్రవర్తించినందువలన గలుగు ప్రత్యవాయములన్నియును గ్రంథకర్త శ్రీసీతారామరాయల ప్రవర్తనముల నాయాపట్టులం జూపించియున్నాఁడు.

కామోద్రిక్తుండై యున్న సీతారామరాయలయందు గనంబడిన దారుణకర్మములంబట్టి మోహోన్మత్తులగువారు చేయుదుండగములనెల్ల చాటించినాఁడు. అట్టివారికడనున్న రాజ్యము లెంతలో నాశనములగునో దానికి వారె యెట్లు మార్గదర్శకులగుదురో తెలియజెప్పినాడు.

ఈనీతినిజూపుచు హిందువులు రాజ్యనిర్మాణములకేగాని తత్సంరక్షణకుచాలినవారుకారని సూచించినాఁడు. ఈతనిరాజ్యము క్రమముగ స్థాపనమయినది. అప్పటికి మహమ్మదీయులు ప్రబలులయియున్నారు. అట్టిసమయమున రాజ్యమునిలుపవలయునన్న జాతిభేదములేకుండ హిందూ మహమ్మదీయ తారతమ్యములేకుండ ప్రవర్తించుట యెంతయవసరముగ వారు కనిపెట్టిరో యయ్యది తద్రాజధానికొసంగంబడిన మహమ్మదుపురమను పేరుచేతనే గ్రహింపందగినది. గంగారాముకోట మహమ్మదీయులకు వశముచేయఁదలంచియున్నవాఁడు. రాయలనన్యసహాయుండై యెట్లోయుద్ధముచేసి శత్రుసైన్యముల నెట్లు నుగ్గాడెనో, అన్యదేశ పరిపాలకుల దొరతనమున స్వదేశరాజులు తమ రాజ్యములం నిలుపంబెట్టుకొనవలెనన్న యెట్లు ప్రవర్తింపవలయునో, అవియన్నియుం జూపినాఁడు. అట్టిరాయలు తుదకు కాలవిపర్యయముచే నుత్సన్నధర్మమార్గానువర్తియై యెందులకుంగొరమాలినవాఁడయ్యెను. దీపమారిపోవునపుడు ఒక్కసారిగ వెల్తురు పెద్దదగురీతిని విస్మృతధర్ముండయిన రాయలు సర్వమును నాశనమయినవెనుక కన్నుదెరచెను. అప్పటికన్నియును అయిపోయినవి. ఇంక పశ్చాత్తాపముగలిగియు ప్రయోజనములేదు. ఇట్లే హిందువులందఱును తమతమ రాజ్యములం బోగొట్టుకొనిరని గ్రంథకర్త బోధింపనెంచినాఁడు.

ఇందు కవికి వ్యాసవాల్మీకుల నిరువురనుమించవలెనను నుద్దేశమున్నట్టు కథా సందర్భమునుబట్టి తెలిసికొనందగు. రమాకాంతకు నిరపనిందయొకటి ఘటిల్లినది. అయ్యది దేశమంతయును బ్రాకినది. శ్రీరాముఁడు చాకితయాడిన వాక్యమును పాటిగాబట్టి సహధర్మచారిణియగు సీతను వనవాసినింజేసెను. అట్టిగతియె సీతారామరాయలభార్యకును కల్పించి తనమేధావిశేషంబున ఆచిక్కులనుండి వెడలించి యామెకందలి యపవాద సంపర్కంబును దొలగించినాఁడు. అదియెట్లుజరిగెనో యయ్యది గ్రంథసందర్భమున చదువవలసినదియె గాని మేమిచటవ్రాసిన నంతరసవంతముగనుండబోదు. వనవాసబాధలే

కుండ తనభార్యనిరపనిందనుబోఁద్రోలిన సీతారామరాయలు దయాశూన్యుఁడై భార్య నడవులపాలుచేసిన తొల్లింటి సీతారామునికన్న మిన్నయైనట్లు యీభాగముంజదివిన వారికి స్ఫురింపఁజేయుచుండు.

ఇందు యయంతి శిక్షాసందర్భమున గ్రంథకర్తచేసిన కల్పన మనుష్యప్రకృతి కతీతంబగు దివ్యప్రభావంబున ద్రౌపదీసమానసంరక్షణ మొనరించిన వ్యాసుని కల్పనావిశేషమును ద్రోసి రాజని నట్లున్నది. ఆమె తేజోప్రభావమూలముననే నిరంతరమును, తలలు దఱుగుటయే పనిగాఁగల తలవరికూడఁ దనచేఁతనున్న కొరడాక్రింద పారవైచి పాఱిపోవలసినవాఁడయ్యెను. అతికోమలంబగు తనహస్తతలంబున కొరడాకొలఁది మోదికొని రక్తప్రవాహములు వెలువలగుచుండ, జూచువారందఱును గన్నులనీరు గిరిగిరఁ దిఱుగుచుండ, యయాంతి మొగమునఁ జిఱునగవు నటనము సేయుచుండెను. జితేంద్రియత్వమలవడిన వారలకు శారీరకములగు కష్టసుఖములు లెక్కలోనికి రావనుట కిదియొక నిదర్శనము అయ్యవి యింద్రియములకు వశ్యులై మెలంగినంతవఱకుమాత్రమే తమప్రభావమును జూపుచుండును.

రమాకాంతభర్తయెడ నత్యంతానురాగముగల యువతీమణి. తనబిడ్డయందామెకుగల మమకారము మేరలేనిది. మహమ్మదీయులపేరు చెప్పిన నామె కెక్కడలేనిభయమును. భర్తనగరమునలేని సమయమున నట్టివికారమొకటి యామె మనస్సున బారినది. అప్పుడాత్మరక్షణోపాయంబునకై నగరనాయకు నింటికి రప్పించెను.

ఆమెయుద్దేశ్యమెంతమంచియుద్దేశ్యమైనను, ఆతనిని రప్పించినమార్గము సంశయాస్పదమైనది యనుటచే, నామె నందరు ననుమానించుటకు కారణంబైనది. అయ్యది యానోటనుండి యానోటికి బ్రాకి వట్టియపనింద యామెపైబడెను. తాటిచెట్టుక్రింద పాలుద్రావినను మరియొకటియే యందురు. లోకము మూయ మూఁకుడు లేదుగదా?

యయంతి దండనసమయమున రాయఁడయందలి పశుకృత్యములను గనంబరచి యామె మానభంగమును దలపెట్టినాఁడు. ఈపట్టు భారతమునందలి ద్రౌపదీమానభంగసదృశమయినదని మున్నే చెప్పంబడియె. కాని యీరెంటికిని గలభేదముమాత్రము మనమారసిచూడవలయు. వ్యాసుడు, అవ్యక్తమాహాత్మ్యమూలమున ద్రౌపదీమానమును సంరక్షణజేసినాడు. మనగ్రంథకర్త దివ్యంబై తనమేధావిశేషంబున, యయంతిని తన్మానభంగంబునుండి బయట బడవేసినాడు. ఆమేధావిశేషం బెట్టిదియో, యాకథాసందర్భమునుజదివిచూచి తెలిసికొనఁతగినదియేకాని, ఇచ్చట వివరించినంతమాత్రమున తనివితీరునదికాదు. ఆపట్టునందలి సంబోధనావాక్యములు మిగుల రసవంతములు. కరుణారస ముట్టిపడుచుండును. ఎంతటి ఱాతిగుండెగలవారికిని గుండె నీరు గాకమానదు. ఆపట్టునజరిగిన సభా

వర్ణనమును, గంగారాముని నేరము విమర్శ జరిగినప్పటి సభావర్ణనమును, పోల్చిచూచిన కవియొక్క సమయపరిజ్ఞత, ఔచిత్యవివేచన, ప్రపంచవ్యవహారదక్షత, బోధపడకమానవు.

ఈతనికి హిందువులన్నను, వారియభివృద్ధియన్నను మిక్కిలి యభిమానము. ఈ యభిమానము, వారియెడలగల మక్కువచేత గలిగినదియె గాని, అన్యమతము వారియందు గల యసూయచేత గలిగినదికాదు. ఈ రెంటికిని చాలభేదముగలదు. అనురాగము మనుజునకు స్వతస్సిద్ధమైనది. అయ్యది క్రమక్రమముగ విజృంభించిన సర్వసౌభ్రాతృభావముదయింపగలదు. అసూయ చెడుగుణము. ఇయ్యది క్రోధమునకు మూలము. అసూయలేక క్రోధముప్రజ్వరిల్లబోదు. ఈయసూయప్రాతిపదికగాగొని చేసినయేపనియును విజయము గాంచనేరదు.

మనశృంగారప్రబంధములయందు, కాముకజనప్రచారములు వర్ణించినట్లే, ఈగ్రంథమున గంగారామునకు రమయెడలగలిగిన యనురాగము బహువిధములవర్ణింపబడినది. ఆతనికుదయించిన మోహముయొక్క సూక్ష్మములగు వేరువేరవస్థలును, తదంతరములును, పరిశీలించిచూచిన కవియొక్కవిమర్శనశక్తియును, బుద్ధిపారిశుధ్యమును, వెల్లడికాగలవు. రమాసందర్శనము కట్టుపడిపోవుటతోడనే, ఆరాయబారము నడుపుమాత్రికతోనైన తనకుసమావేశముకలిగినచాలునని యనుకొను గంగారాముని మనోవ్యథావర్ణనము మిక్కిలి రసవంతము. ఆమె తనకులోనగుటయసంభవమని నిశ్చయముకలిగినపుడు, ఆతనికామెయెడగలిగినయసహనము, ఆమెనెట్టులైన నమలిమ్రింగివేయవలయునను తలంపు, తనకు మరణదండనవిధింపబడినపుడుకూడ నాదండనమువలన ననుభవించుబాధమఱచి తనకాబాధ రమవల్లనే కలిగినదని యెంచి యామెను గోళ్లతోచీల్చివేయవలెనను పగ, మున్నగుకాముకవృత్తులెన్నెన్నియో గుప్తముగ మార్దవముదప్పకుండ వర్ణించినాడు. కాముకుడు తనకార్యసాఫల్యమునకై సిగ్గుబిడియములెట్లువిసర్జించునో, నీచకార్యముల కెట్టివానికొడిగట్టునో, తాంత్రికములెట్టివెట్టివి నడుపుచుండునో, అయ్యవి గంగారాముని నేరము విచారణజరుగు సమయమున "రమను విసర్జింపుము" అని సూచించుచు, కోరినకోర్కెను బట్టియును, రమనిల్లుబయలుదేరదీయుట కాతడుపన్నిన పన్నాగములనుబట్టియును తెలిసికొనందగు. ఆమెమరణించిన సంగతితెలియక ఆమెయెడల కోర్కెచే తనమతమునుజ్జగించి, మారువేషమును ధరియించి యెదుటిబలమునగలిసి రాయలనుజంపనుంకించి తనకాప్తురాలగు సోదరివలననే జచ్చిన యాతనిమరణవ్యాపారసందర్భముగూడ ఈపైవిషయములనే దృష్టాంతీకరించుచుండును.

రాయలుచేసినదండములు నిట్టివే. మహాతపశ్శాలినిని మోహోన్మత్తతచే వస్త్రము లొలిపించి సభారంగమున జావమోదింప ప్రయత్నించెను. రాజ్యమునందలి స్త్రీలనందర

మానభంగము గావించెను. రాయలెట్టివాడు ? కేవలధర్మైకపరాయణుడు. ఆ స్త్రీప్రాణ సంరక్షణకై తనయర్థమును, ప్రాణమును నర్పింపసాహసించినసత్పురుషుడు.ధర్మరాజ్యసంస్థాపనకొరకై కంకణముగట్టుకొని, జాతిమతవిద్వేషమును నిర్మూలించి హిందువుల రాజధానికి మహమ్మదుపురమని పేరుపెట్టినవాడు. అట్టివానికి మోహాంధకారమావేశమైనది. ఇంక ప్రపంచధర్మములెట్టివో, నీతియనసెట్టిదో, ఛాయామాత్రముగనైన కనబడకుండబోయెను. గ్రంథావసానమునగల రాయల యీదుష్ప్రవర్తనముం గాంచి యీకథయందు గ్రంథారంభమున నున్నంతయభిరుచి కడపటివరకు నిలిచియుండలేదనియు, అట్టి రాయల ప్రవర్తనము చిట్టచివరకు దుష్ప్రవర్తనముగ మారుట స్వభావమునకు విరుద్ధమనియును, కొందరి పాఠకుల యభిప్రాయము. కాని యదియంత గణనీయముకాదని మా యభిప్రాయము. గ్రంథపర్యవసానము విషాదాత్మకము. విషాదాత్మకములగు గ్రంథములకు మనదేశమునం దంతగా ప్రచారములేదు. మనకథాకల్పకు లెంత విషాదాత్మకమగు కథనైనను ఏ దివ్యమాహాత్మ్యమువలననో, ప్రమోదాత్మకముగ మార్చుట కలవడియున్నారు.అందుమూలమున విషాదపర్యవసానముగల గ్రంథమునందలి కడపటిభాగమున నభిరుచితగ్గినదనిచెప్పినది యొకవింతలోనిదికాదు. రాయలవర్తనమున స్వభావమునకు విరోధమేమియును లేదు. ఏలయందురా ? రాయలప్రవర్తనమును విమర్శించిచూచినచో "అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మశుభాశుభం" అనువార్యోక్తి ననుసరించి యెయ్యది యాతని పురాకృతమున ననుభవముకాక మిగిలియుండెనో, తల్లేశమిప్పుడాతని కనుభూతంబయ్యెను. మనస్సున నే కోర్కెలుదట్టముగ బాడముచుండునో, యయ్యది వానియందంతలగ్నమగును. మఱి యితర విషయములకు చోటులేకుండబోవును. అట్లు దిట్టముగనాటుకొనిన యాకోర్కెలన్నియును అనుభవించిననేకాని నశింపనోపవు. రాయలకు మొదటినుండియును స్త్రీపై యనురాగము అభివృద్ధిగాంచినది. ఆ యనురాగము మోహముక్రిందమారినది. క్రమక్రమముగ విజృంభించి యాతనిగ్రమ్మివేసినది. ఇంక నాతని మనస్సున నే కోర్కెయును గనబడకుండ నంతరించినది. అంత మోహోన్మత్తత యారంభమైనది. ఉన్మత్తునకు చేయరానిపనులెవ్వియుండును. ఇదియే పైదానికి సమాధానము.

మోహముయొక్క వ్యక్తిభేదమే ప్రేమ. ఈప్రేమ ఎవ్వరియందు మనకు గాఢముగనుండునో, అట్టివారియందలి లోపములు యెట్టివియైనను మనకు కనపడకుండపోవును. ఎదుటవారియందలి లోటులును, తనయందలిలోటులునుకూడ కనపడనీయకుండ జేయునది మోహము. ఒక్క ఎదుటవారియందలి లోటులనుమాత్రమె కనపడనీయకుండ జేయునది ప్రేమము. ఇట్టిప్రేమము రక్తస్పర్శగలవారియెడ హెచ్చుకదా? శ్రీకిగంగా రాముని యెడ కలయనురాగమునకు ఇదియేకదా మూలకారణము. ఈయనురాగమే మరణదండన విధియింపబడిన వెనుకగూడ అతనిని బయటపడవేసినది.

ఇంకను నీ గ్రంథపఠనమున నేర్పదగినవిషయము లెన్నియేనియున్నవి. అందు మహమ్మదీయులకును హిందువులకును జాతిమతవిద్వేషములు కూడదనునది యొక్కటి. పరరాజులు దేశముపై దండెత్తివచ్చినప్పుడు, చేతబలగము తక్కువగనున్న దేశాధ్యక్షుడు ఏవియో మాయోపాయములుపన్ని సమయమువచ్చువరకును కాలక్షేపము సేయుచుండవలయుననునది యొక్కటి.

దినములు బాగుగనున్నప్పుడు ఒక్కడే పెక్కుజనులనోడింపగలుగును. అట్లు కాకున్న గంగారాముని ద్రోహబుద్ధిచే మహమ్మదుపురము తోరబుఖానునిచేత బడనున్న నాడు రాయలొక్కడు నెట్లు మహమ్మదీయసైన్యమంతయు నోడింపగలిగియుండు? దినములు మంచివిగనున్నప్పుడు వలయు నుపకరణములన్నియును తమంతటతాము వచ్చి పోగుపడును. రాయలకు కలిగిన విజయమున వలయు సాధనములన్నియు నట్లేకదా సమకూడినవి.



శ్రీ ర స్తు.

# శ్రీ సీ తా రా మ ము

## ప్ర థ మ బిం బ ము.

### కుటుంబజనముతో నున్న దినములు.

## మొదటి ప్రకరణము.

పూర్వకాలంబునఁ దూర్పుబంగాళమున భూషణం బనునొక పురంబు కలదు. ఇప్పుడు "భూష్ణో"యని పేరుచే వఱలుచున్న దదియే. మున్ను కలకత్తానగరము చిన్నపల్లెగా నుండి యందలి జానపదులు పెద్దపులుల బాధచేత జీకటిపడిన వెనుక వెలుపటికి రాలేకుండ నున్నదినములలో నీభూషణపురము, అత్యున్నతదశ నంది శోభిల్లుచుండెడిది. అచ్చట ఫౌజుదారులకొలువుకూట ముండెడిది. ఫౌజుదారుఁ డనఁగా స్థానిక ప్రభుత్వమున కధికారి. మనయిప్పటిగవర్నరువంటివాఁడు. కాని వారి యాదాయము ఇప్పటిగవర్నరులయాదాయముకంటె హెచ్చు. భూషణపురము విశేషవిస్తీర్ణమైనదేశమునకు రాజధాని. మనకథ జరుగుటకు నూటయెనుబదిసంవత్సరములకు పూర్వము, ఒకనాఁటియుదయకాలమున, కొంచెమించుమించుడుష్షకాలమనియే చెప్పవలెను. భూషణపట్టణమున నొకగల్లీలో త్రోవకడ్డముగ నొకఫకీరు పండుకొని యుండెను. అందువల్ల రహదారి కడ్డు కలిగెను. అట్టిసమయమున బాటసారియొకఁడు పాదచారియై యామార్గమునఁ బోవుచుండెను. అతఁడు తొందరగాఁ బోవలసి యుండెను. ముందుత్రోవ కట్టువడిపోయెను. అతఁడు లేచునట్లు లేదు. ఆకారణమున నాతఁ డచ్చట నిలువవలసివచ్చెను. కాని యాతని మన స్సాందోళనము నొందుచున్నది.

ఈపాదచారి హిందువుఁడు. వర్ణమున కాయస్థుఁడు. బంగాళాదేశమునందలి యుత్తరరారాదేశము కాఁపురస్థలము. అతఁడు వయ

స్సున పిన్నవాఁడు. గంగారామునకు గొప్పవిపత్తు తటస్థమయినది. తల్లి కింటివద్ద వచ్చెడుప్రాణము పోయెడుప్రాణముగ నున్నది. అతఁడు తొందరతొందరగ వైద్యునియింటికి మందు తేవలెనని పోవుచున్నాఁడు. కాని ముందు ప్రయాణ మాటంక మయి పోయినది. ఏమి చేయుటకును తోఁచకుండెను.

ఆరోజులలో మహమ్మదీయులలో ఫకీరు లనిన మిక్కిలి గౌరవము. మహమ్మదీయమతమునందు విశేషమయినయభిమానము లేని అక్బరుఫాదుషావంటివాఁడుకూడ ఫకీరులచేతిలో నుండెడివాఁడు. హిందువులు వారిని గౌరవించెడివారు. అట్టియభిమానము లేకున్నవారందఱును ఫకీరులయాగ్రహమునకు పాత్రులు కావలసివచ్చెను. ఆకారణమున గంగారాము వానిని దాఁటిపోవ సంశయించి, "సాహేబుగారూ! మీకు సలాము చేసెదను. నాకు కొంచెము దారి యిండు" అని బ్రతిమాలుకొనియెను.

షాహాసాహేబు కదలఁ డయ్యెను. ప్రత్యుత్తర మైనను చెప్పు పుణ్యము కట్టుకొన లేదు. గంగారాము రెండుచేతులను జోడించి "నీకు దైవము తోడ్పడును. నే నిప్పుడు గొప్పయాపదలో నున్నాఁడను. కొంచెము దారియిమ్ము. పోవలెను" అని మరల వేఁడుకొనియెను.

ఎంత ప్రాధేయపడినను ఫకీరు కదలలేదు గంగారాము బ్రతిమాలెను; ప్రార్థించెను. మనస్సులో నున్న బాధ యంతయు నాతనిముందర వెళ్లఁబోసెను. కాని, ఏమి చెప్పినను ఫకీరు మనస్సు కరుగలేదు. యథాప్రకారముగా, కుఁయ్యిమనక కఁయ్యిమనక యూరకుండెను. ఇంక జాగు చేయవలనుపడక గంగారా మాతనిని దాఁటి తనపనిమీఁదఁ బోయెను. అట్లు దాఁటిపోవుటలో కర్మము చాలక గంగారామునికాలు ఫకీరునకుఁ దగిలియుండును. లేదా, ఆఫకీరు చేయవలెనని కొంటెతనమున కట్లు చేసియుండును. గంగారాము మిక్కిలి తొందరలో నున్నాఁడు. అందుచేత నతనితోడ, ఉచ్చరించకుండ వైద్యునియింటికి చక్కఁబోయెను. తోడు తనే ఫకీరుకూడ లేచి ఖాజీయింటివైపుల కరిగెను.

ఇంటివద్ద వైద్యునిఁ గలిసికొని గంగారాము తనయింటికిఁ గొనిపోయెను. వైద్యుఁడతని తల్లినిచూచి నాడి పరీక్షించి, ఆశ్లోకమును

ఈశ్లోకమును చదివి కొన్నిమందులు చెప్పి తుదకు తులసివేరు సేవింప నుపదేశించెను. తులసీచరణసాన్నిధ్యంబున శ్రీహరిస్మరణ సేయుచు గంగారామునితల్లి పరలోకప్రయాణము చేసెను. తనతల్లి దహన సంస్కారమునకై గంగారాముఁడు ఇరుగుపొరుగున నున్నతనవర్ణము వారిని నలుగురిని బోగుచేసి విధ్యుక్తకర్మము నడిపెను.

ప్రేతసంస్కార మైనది. ప్రొద్దు గ్రుంకుచున్నది. గంగారాముఁడును, అతనిసోదరి శ్రీయును తదితరులును, ఇంటికి వచ్చుచుండిరి. అపుడిరువురుభటులు బల్లెములును, డాలును చేతఁబూని యాతనిని సమీపించి పట్టి బాధించిరి. ఈభటులు కడజాతివాండ్రు. వారు వచ్చి ముట్టుకొనఁగానే గంగారాముగుండె పగిలిపోయినది. మనస్సున, నలజడిపుట్టి గుండెలు తటతట కొట్టుకొనుచుండ, క్రితమురాత్రి తారసిల్లిన ఫకీరు చండాలులను వెంబడించి వచ్చుచుండెను. గంగారాము వారిని గాంచి, "నే నెచ్చటకు రావలెను? నావల్ల నేరమేమి? న న్నేల కట్టుకొని పోయెదరు" అని ప్రశ్నించెను.

ఫకీరు కేకలు వేసికొనుచు, "కాఫర్, బద్ భూఖత్, చెల్" (నడు దుర్మార్గుఁడా, పరమనాస్తికుఁడా), అని యనెను.

భటులు రమ్ము రమ్మని వాడినపదములే వాడుచుండిరి. అందొకఁడు గంగారామునిమెడఁ బట్టుకొని క్రింద పడఁద్రోయుచుండెను. రెండవవాఁ డితనినిఁ బట్టుకొని తన్నఁ జొచ్చెను. అందొకఁడు గంగారాముని భద్రముగాఁ దీసుకొనిపోవ త్రాడు తెచ్చి కట్టెను. రెండవవాఁ డితని సోదరిని పట్టి బంధింపఁ బరుగెత్తెను. గంగారామునిఁ బట్టి బంధించి దారినడుమ మోఁదుచు బాఁదుచుఁ దీసుకొనిపోయి ఖాజీయెదుటఁ బెట్టిరి. ఫకీరు వారిని వెంబడించి చనుచు దారిలో హిందువులను గూర్చియు వారిచెడునీతులను గూర్చియు నెవరికి నర్థముగాని హిందూస్థానిభాషలో నుపన్యాసముల నిచ్చుచుండెను.

గంగారామునిఁ దెచ్చి ఖాజీయెదుటఁ బెట్టఁగానే యాతఁడు విచారణ మొదలుపెట్టెను. ఫిర్యాది.షాహాసాహెబు. సాక్షి షాహాసాహెబు. తీర్పుకర్తయును షాహాసాహెబె. ఖాజీ తనపీఠమునుండి లేచి యాతనిని తనయాసనమునందె కూర్చుండఁ జేసెను. ఫకీరు తనకథ నంతయునుఁ జెప్పి

ముగించినపిమ్మటఁ కొ రానును, తన సులోచనములజోడును, ఫకీరుగారి పొడుగుపాటిగడ్డమును పూర్ణముగ పరిశీలించి పరిశీలించి గంగారాముని బ్రతికియుండఁ బాతివేయు మని తీర్పు చెప్పెను. గంగారాము తనలో "కానున్నది. కాకమానదు. నేను విచారించిన ఫలమేమి" యని విచారించి ఫకీరును మొగముమీఁద నొకతన్ను తన్నెను. ఫకీరు మొగముపై చేతు లడ్డము పెట్టుకొని "వానిపెదవుల కాల్చుఁడు కాల్చుఁ డని" భూమి కడ్డముగ వడియెను. అతని పెద్దవయసున నూడకుండ మిగిలి యున్నపండ్లు నాలుగో మూఁడో యున్నవి. గంగారము పాదస్పర్శచే నందులో కొన్నిటికి ముక్తి కలిగెను. కూడనున్నభటులు గంగారాముని వెంటఁ బడి పరుగెత్తి పట్టుకొనిరి. ఖాజీయుత్తరవుమీఁద వానిచేతులకును, కాళ్లకును సంకెలలు తగిలించి వానిని వేవిధములఁ దిట్టిపోసిరి. వాని కదియేమియు నర్థము కాలేదు. వానిపై గుద్దులు, తన్నులు, రక్కులు వర్షము కురిసినట్లు కురిపించిరి. జెయిలుఖానాకుఁ దోడ్కొనిపోయిరి. అప్పటికి సంజచీఁకటి వేళ యయ్యెను. ఆరోజున కేమి చేయుటకు ప్రొద్దు లేక పోయెను. మరునటియుదయమున నాతని, బ్రతికి యుండగనే పాతివేయుదురు.

రెండవ ప్రకరణము.

ఈసమాచార మంతయు నూ రెల్ల నిండిపోయెను. గంగారాముసినహోదరి యొకచెట్టుమొదటఁ గూర్చుండి తల విరియఁబోసుకొని నేలఁ బడి పొరలుచు రోదనము చేయుచుండెను. ఆమెతో నెవ్వరో మరునటిదిన ముదయమున గంగారాముని భూమిలో పాతిపెట్టుదు రని చెప్పిరి. అంత నామె లేచి కూర్చుండి కన్నీరు దుడుచుకొని విరియఁబోసుకొని యున్నతలవెండ్రుకలను ముడివేసికొనెను.

శ్రీ, గంగారాముని చెల్లెలు. ఆమె ప్రాయ మిరువదియైదేండ్లు. గంగారామునకు తల్లియు చెల్లెలును తప్ప ఇతరబంధువు లెవ్వరును లేరు. కడపటిరోజులలో గంగారామునితల్లి జబ్బుస్థితిలో నుండుటచే నాతనియింటియాజమాన్య మంతయును శ్రీమీఁదనే యుండెను. ఆమె వితంతువు కాదు; కాని కాలకర్మవశమున భర్తతో సాంగత్య మామెకు లేకుండ పోయెను.

హారియింటిలో సాలగ్రామ మున్నది. ఈసంపుటములకు జరుగ వలసిననిత్యపూజ యంతయును శక్తివంచన లేకుండ అవసరవిధానమున టూకీగా శ్రీ జరుపుచుండెడిది. శ్రీయును ఆమెతల్లియును, ఈసాలగ్రామ మునె, దైవముగా నమ్ముచుండిరి. చెదరిపోయినకురు లన్నియు కొప్పుగా తురిమి యీసాలగ్రామ మున్నగది గుమ్మమువద్దకు పోయి గుమ్మము దాం టకుండ వెలుపలినుండియే మనస్సున వేనవేలు విధ్యుక్తోపచారంబుల నెఱపి యనంతరము చేతులు జోడించి "ఓ నారాయణా! ఓ భగవానుండా! దీనశరణ్యా! ఆపద్బాంధవా, ఈదినమున నే నాచరింపంబోవుసాహసకా ర్యమున నన్ను కటాక్షింపుము. నే నాండుదానను. పాపకర్మురాలన నే నేమి చేయుటకు నశక్తురాలను. నీవు నాకు తోడునీడవై నాకార్య మును నా కనుకూలముగ సేయుము."

అని యీవిధమున ప్రార్థించి శ్రీ యచ్చటనుండి తరలి యిల్లు విడచిపోయెను. ఆమెకు పొరుగింట నొకముదుసలియవ్వ యున్నది. ఆమె నాపురమునందలివా రందఱును పాంచగారిజనని యని పిల్చుచుందురు శ్రీతల్లియును,ఆమెయును ఒకరికొకరు సహాయము చేసికొనుచుండువారు. గృహకృత్యమున గలచిన్న చిన్నపనులసయితము వారిరువురు కలసి మెలసి చేసికొనుటచే నీకుటుంబమువారి నిన నామెకు మిక్కిలి విశ్వాసము. శ్రీ యామెను పిలచి చెవిలో నేదియో రహస్యముగఁ జెప్పివచ్చెను. వా రిద్దఱును గలసి రహదారికి వచ్చి అనేకము లగుసందులును గొందు లును గడచి చీఁకటిచాటున చాలదూరము నడచిపోయిరి. మనకథాకాల మున రాతికట్టడములు చాల దక్కువ. ఉన్నవయినను, అక్కడ నొక టియు, నిక్కడ నొకటియు నుండెడివి. అచ్చటచ్చట నాకట్టడములలో శిల్పచాతుర్యవిశేషములును కనుపడుచుండెడివి. శ్రీయును, ఆమెసహ కారియును కలసి, వచ్చివచ్చి అట్టిబవంతి యొకదానియెదుట నిలువఁ బ డిరి. దానియెదుట నొకదిగుడుబావి యున్నది. దానిచుట్టును పావంచ లున్నవి. ఈమెట్లమీఁద కూర్చుండి కావలివాండ్రు చాలమంది లోకము లోనిసంగతులను మాటలాడుకొనుచుండిరి. ఒకఁడు గుడుగుడి తయారు చేయుచుండెను. ఒకఁడు ఈల వేయుచుండెను. ఒకఁడు నిర్వాణవిషయ మునుగూర్చి ధ్యానించుచుండెను. ఇంకొకఁడు దానినే బలపఱచి చెప్పు

చుండెను. వారిలో నొకనిని యీముదుసలి పిలచి "పండా! తాకూర్ ? భండారిని ఒక్కమాటు, ఇటు ర మ్మని చెప్పుము" అనెను.

ఆపలుకరింపఁ బడినవాఁడు "నేను పండాను కాను. మిశ్రుఁడను" అని జవాబు చెప్పెను. పాంచగారీమాత "ఆలాగుననా నాయినా, నే నె ఱుఁగను. పండాబ్రాహ్మణుఁడు తక్కువయేమి? మిశ్రబ్రాహ్మణునియెక్కువయేమి? నాయనా చెప్పు" ఆమిశ్రుఁ డీసంభాషణము విని యూఁకొట్టి "నీకు భండారీతోఁ బనియేమో చెప్పెదవా ?" అని యడిగెను.

పాంచగారీమాత.—నా కేమిపని యున్నది. మాదొడ్డిలో గుమ్మడికాయలు, ఆనపకాయలు, ఇం కేవేవియో యున్నవి. అవి నేఁడు వచ్చి పట్టుకొని వెళ్లు మని చెప్పుటకు. ఇం కేమున్నది నాయనా?

కావలివాఁడు.—మంచిది నీవు వెళ్లు. నేను చెప్పెదనులే.

పాంచ.—అది కాదు నాయినా? ఎవరియింటివద్ద నున్నవో ఎక్కడికి రావలెనో ? అతని కేట్లు తెలియును.

దర్వాన్.—ఆలాగున నైన నీపేరు చెప్పి పొమ్ము.

ముదుసలి కేకలు వేసి "ఛీ పో పెద్దమ్మవారుగా నీకుకూడా ఒకకాయ యియ్యవలె ననుకున్నాను. నే నేమి చేయను నీకర్మము, ఆలాగు న నున్నది."

అనునప్పటి కాకావలివాఁడు "స రే ఉండు. నేను పోయి భండారిని తీసుకొనివచ్చెదను" అని చెప్పెను.

అనంతర మాతఁడు ఫీలురాగముతో పాట పాడుకొనుచు లోపలికిఁబోయి "వాఁకిటిలో నొకకూరగాయల అమ్మి నీకొఱకై వేచియున్నది"యని జీవనభండారీతోఁ జెప్పెను. తనయింటి యజమానునకుఁ గొన్ని తనకుఁ గొన్నియు కూరగాయలు దొరకు ననునాశతో శీఘ్రముగ ర మ్మని యాతఁడు చెప్పివచ్చెను.

ఆయింటియజమానుఁ డగుజీవనుఁడు వయస్సు చెల్లినవాఁడు. అతనిమొలను, ఒకగుత్తి తాళపుచెవు లున్నవి. ఆతనియాకారముమాత్రము చూచినవారికి చఃఱుకైనదిగానె కనుపించును. తన కేదియో దొరుకు ననునాసతో చప్పుచప్పున నివతలకు వచ్చుసరికి వాఁకిట నిర్వురు స్త్రీలు కనుపడిరి. వారిని చూచి "ఎవ్వరు నన్ను పిలచినది?" అని యడిగెను.

పంచగారీమాత.—"అయ్యా? మాయింట కూరగాయ లున్నవి. అవి కొన్ని మీరు పుచ్చుకొని కొన్ని యీ దర్వాన్‌జీగారి కిచ్చి కొన్ని సర్కారువారికి పంపవలెను.

భండారీ.—అట్లయిన మీయి లెక్కడనో చెప్పుము. రేపుదయమున వచ్చెదను.

పంచ.—ఇచ్చట నొకయసహాయురా లగునబల యున్నది. ఆమె యిప్పు డెద్దియో దురవస్థలో నున్నది. ఆమె యే మేమియో చెప్పుకొను నంట. దయచేసి యవధరింపుఁడు.

అంత స్త్రీ తనమేలిముసుఁగు మొగముమీఁదనుండి తప్పించి గోడమెత్తున నిలువఁబడి యేమేమియో చెప్పెను. అది గాంచి జీవనభండారి ఆమెవంక చూపుల్ నిగుడించి విసుగుతో "ఈలాటిముష్టికబురులు నేను మాదొరగారికి విన్నవింపను" అని చెప్పెను.

ఆముదుసలి "అయ్యా కోపపడకుము మా కేమయినను లాభించినయెడ అందులో నీకుకూడ సగము పంచియిచ్చెదము" అనిచెప్పెను.

ఈమాటలతో జీవనం భండారిముఖము విప్పారెను.

"అమ్మాయీ! అటులయిన నది యేమో చెప్పు"మని యడిగెను.

తలయొకించుక యెత్తి మేలిముసుఁగు కొంచెము దింపి సిగ్గుచేఁ జెప్పలేక చెప్పలేక ఆమె చెప్పఁదలఁచిన రెండుముక్కలును ఎట్లో వెడలఁబుచ్చెను. కాని యీమెమాటలు సగము సగముమాత్రమె వినఁబడినవి. అందువల్ల నాయింటియజమానుని కామెచెప్పఁదలఁచిన దేమియో స్పష్టముగాఁ దెలియలేదు. అతఁడు పాంచగారీని "ఈమె ఏమిటో చెప్పుచున్నది? నాకుఁ దెలియ లేదు. నీవు చెప్పుము?" అని యడిగెను.

పాంచగారీమాత యాచిన్నది చెప్పదలచినసంగతి యంతయు నిట్లు విశదీకరించి చెప్పెను. "ఆమె నీతో చెప్పెడువిషయములన్నియు నీవు పోయి నీయజమానునితో నివేదింపవలయును. ఆయన యేమి చెప్పునో అది మరల గొనివచ్చి యీమెతోఁ జెప్పవలెను. ఆమె యిచ్చటనె యుండును."

అంతట స్త్రీ తనచెంగున ముడి వైచికొని తెచ్చినమొహిరీ యొకటి విప్పి పాంచగారీచేతిలో పెట్టి భండారిచేతిలోఁ బెట్టించెను. అతఁడు

వెంటనే యచ్చటనుండి తరలి లోపలియింటిలోనికిఁ బోయి యచ్చటను న్న దీపపు వెలుతురున నాణెమును పరిశీలించి అక్బరుపాదుషాకాలము నాఁటిమొహిరీ యని కనిపట్టెను. కాని దానిమీఁద త్రిశూలముద్ర కూడ నున్నది. అది గాంచి జీవనుఁడు " ఈమె మాయజమానునకు బిచ్చ మియ్యఁదగినది. కానియీచిన్నది బిచ్చమునకై వచ్చినది కాదు. మాగృహస్థునికడ ధనము మూల్గుచున్నది. అతని కీమొహిరీ యిచ్చినందువలన యెక్కువలాభ మేమి. ఏమయినను కానీ? యీనాణెము జీవనభండారి ఖజానాలో నున్న యెడల తళతళ మెఱసిపోవుచుండును. కాని దీనిమీఁద త్రిశూలముద్ర యొకటున్నది. నూటికి తొంబదితొమ్మిదిపాళ్లు పట్టుపడ కూడదు. ఛీ. ఛీ. నావంటి పేదవాని కిట్టిదుర్మార్గపుతలంపు లుండరాదు. కావున న్యాయముగా నిది యెవ్వరికిఁ జేరవలెనో వారికే పోవుట యుచితము" అని మార్గమున వితర్కించుకొని తనదురాశాపిశాచమును దిగఁ ద్రొక్కి అతనియజమానుని యింటికిఁ గొనిచనియెను. ఆజీవనుఁడు పోవుసరి కాయజమానుఁడు బాలీసుమీఁదఁ జేరగిలఁబడి హుక్కాపీల్చుచు సౌఖ్య మందుచుండెను. భండారీ యాతనితోడ నన్నియును వివరముగాఁ దెలియఁబల్కెను.

జీవనునియజమానునకు ముప్పదివత్సరముల ప్రాయ ముండును. అతఁడు మిగులఁ జక్కనివాఁడు. దేహము బలిష్ఠమయినది. సౌందర్యమున రెండవకుమారస్వామి యని చెప్ప నొప్పును. దీపపువెలుఁగున నాతఁడీబంగారు మొహిరీని పరిశీలించి చూచి యొక వేఁడినిట్టూర్పు పుచ్చి "దుర్గయే! ఏమిది ?" యని విస్మయ మొందెను.

జీవనుఁడు.—"ఏమి చెప్పగలవాఁడను ?" [నెవ్వ రున్నారు.

యజమానుఁడు.—ఈమొహిరీ తెచ్చినమనుష్యుని గొనిరమ్ము. కూడ

తన కిచ్చెద ననిన కూరకాయలమాట బయలుపడునేమో యను భయముచేత ఉన్నసంగతి మరుగుపఱచి కూడ నొకచేఁపలయమ్మియున్నదని చెప్పెను.

"ఆచిన్నదాని నిటకుఁ దోడ్కొనిరమ్ము. ఆమె యచ్చట నున్నప్పుడు నీవు కాని యీరెండవది కాని మాయెదుట నుండరాదు" అని యుత్తరువు చేసెను.

ఆమాటలు విని జీవనుఁడు శీఘ్రముగఁ బోయి యించుక సేపఁటిలో శ్రీసమేతుఁడై మరలి వచ్చెను.

ఆమె తలుపోరకు పోయి యచ్చట నొదిగియుండి, రావియాకువలె కంపించుచు మేలిముసుంగు వైచికొని యుండెను. ఆయింటి యాతఁడు "నేను సీతారామరాయుఁడను. నీ వెవ్వరు? నీ మొగమున ముసుఁగున్నది. నీవు మాటలాడకుంటివి. నీ వెవ్వరో తెలిసికొనుట యెట్లు?" అని యడిగెను.

శ్రీ తనమేలిముసుఁగు తీసివైచెను. అంత రాయ లెదుట అశ్రుబిందు సమాకీర్ణంబై వర్షబిందుసంపూర్ణం బగుపద్మంబువలె నొప్పుని ష్కళంక సౌందర్యరాశి యగుమనోహరవదనం బొకటి పొడఁగాంచెను. ఆమె ముఖముం గాంచి "ఏమి నీవు శ్రీవా?" యనెను.

పరివేదనాదోధూయమానమానస యగుటచేఁ గన్నీరు జలజల రాల్చి విలపింపఁజొచ్చెను.

సీతా——చిరకాలమైనది నీవు నాకంటఁబడి. ఇన్నినాళ్లకు నీ విప్పు డిటకేల వచ్చితివి? రాకరాక వచ్చి యేల యిట్లు వాపోయెదవు.

శ్రీ కన్నులనుండి కన్నీరు కాలువలై ప్రవహించుచునే యుండెను. ఆమె పలుకఁ దొడంగును కాని, నాలుక పిడచ కట్టుకొని పోయినది.

సీతా.——దూరముగా నుండెద వేల, దగ్గర రమ్ము. శ్రీ మృదుమధురస్వరంబున, "నే నిప్పు డశుచినై యున్నదానను ప్రక్క ముట్టుకొనరాదు" అనునప్పటికి సీతారాముఁ డాశ్చర్యావిష్టమనస్కుండై "అది యేమి యని అడిగెను." అంత డగ్గుత్తికఁ జెంది, కన్నుల నీరు త్రాల్చుచు మాటలు తడఁబడ "నాతల్లి పరమపదము నందినది" అని చెప్పెను.

రాయలు——ఆయాపదచేఁ బరితపించుచు నీ విచ్చటికి వచ్చి యుండనోపుదు అగునా?

శ్రీ——ఆబాధ మీకేమియును లేదు. నాతల్లి యుత్తరక్రియలకై కావలసినకార్యము లన్నియును నేనే చేసుకొనియెదను. మిమ్ముల నందులకై బాధింపఁబోను. నాకిప్పుడు పిడుగువలె మఱియొక విపత్తు వచ్చి పైఁబడినది.

రాయలు.—అది యెట్టి విపత్తు ?

శ్రీ.—నా సోదరుఁ డిప్పుడు కడతేర నున్న వాఁడు. కాజీ యాతని బ్రదికియుండఁ బాతివేయు మని శిక్షించినాఁడు. ఇప్పు డతఁడు చెఱయందున్న వాఁడు.

సీతా—ఏమది ? నీసోదరుఁ డేమి చేసినాఁడు ?

మెల్లనికంఠస్వరముతో జలజలరాలు కన్నీటితో ఆమె కని విని యెఱిఁగినదెల్ల నేకరవు పెట్టెను. ఆకథ యంతయు విని సీతారాముఁడు పెద్దనిట్టూర్పు పుచ్చి " సరి కాని ఇప్పుడు కర్తవ్య మేమి " అని యడిగెను.

శ్రీ—అది యంతయును నీతోఁడ నున్నది. ఇన్నాళ్లకు మీావద్దకు వచ్చిన పని యిది.

సీతా.—నే నేమి చేయఁగలను ?

శ్రీ.—మీారేమిచేయఁగలరా? ఇంక నెవ్వరు సేయఁగలరు? సర్వమును మీారు చక్కఁబెట్టఁగల రని నే నెఱుంగుదును.

సీతా.—ఖాజీ, ఢిల్లీ పాదుషా క్రింది యధికారి. చక్రవర్తి నెదిరింప నెవ్వరికి సామర్థ్య మున్నది?

శ్రీ.—అట్లయిన నతనికిఁ దరణోపాయమే లేదా ?

సీతా రాముఁడు విచారమగ్నమానసుండయి కొంతవడికిఁ దెప్పిరిల్లి, మౌనము వహించి "ఒక్కసాధనము కనుపడుచున్నది. నీసోదరుని నేను కాపాడెదను. అందువలన నాకుఁ బ్రాణసంకట మగును."

శ్రీ.—ఇటు వినుఁడు. దైవ మున్నాఁడు. న్యాయ మున్నది. నారాయణుఁ డున్నాఁడు. నే నిప్పుడు చెప్పినమాటయం దొక్కయబద్ధమైన లేదు. అసహాయుఁడై యున్న మనుజు నొకని మీారు కాపాడిన నీ కే కీడును బొరయదు. పైగా హిందువుని హిందువుఁడే కాపాడకున్న మఱి యెవ్వఁడు గాచును.

అన విని సీతారాముఁడు మరల యోచనాముద్రితుఁ డయ్యెను. కొండొకసేపునకు మౌనము విడచి "నీవు సరియైన మార్గమును కనిపెట్టినావు. హిందువుని హిందువుఁడుగాక మఱియెవ్వఁడు రక్షించును. గంగారామునికోసము నాయావచ్ఛక్తియును ధారవోసెదను. ఇదె నీకు నభయహస్తము నిచ్చుచున్నాఁడను" అని చెప్పెను.

శ్రీ దుఃఖభారమునుండి కొంత యుపశమనంబుఁ జెంది మరల మేలిముసుంగును సవరించుకొని చరచర నడచిపోయెను. రాయలు తన పరిజనముతోఁ దాను తలుపు తీసెడునంతకును తనను పిలువవ ద్దని చెప్పి కట్టడి చేసి యొకగదిలోఁ దలుపు వేసికొని కూర్చుండి యుండి "హిందువుని హిందువుఁడే కాక మఱియెవ్వఁడు కాచును" అనుమాట పఠించుకొనుచుండెను.

---

## తృతీయప్రకరణము.

రెండుగంటలకు పిమ్మట సీతారామరాయలు తలుపుతెఱచి జీవన భండారీని పిలచి "నీవు పోయి మృణ్మయుని దోడ్కొనిరమ్ము" అని చెప్పెను.

మృణ్మయుఁడును రాయలును, ఏకవర్ణవయస్కులు. ఇద్దఱును బంధుగులు. రాయలకాతఁడు వినయవిధేయుఁడై యత్యంతానురాగము కలిగియుండెను. పటిష్ఠమైన యీతనిశరీరసౌష్ఠవమును, అతని నిర్వక్రపరాక్రమంబును, జగజ్జేగీయమానంబుగ నుండెను. రాయలుకోరిక ప్రకారమీతఁ డెదుట నిలువఁబడి 'నన్నెందులకు కబురు పంపినారు.' అనియడిగెను. అంత వారిరువురకును నీసంభాషణము నడచెను.

రాయలు.—ఇప్పుడు అత్యవసరమైనపనియె తటస్థించినది. నాకుటుంబము నిచ్చటనుండి తరలింపవలయును.

మృణ్మయుఁడు—ఎప్పుడు ?

రాయలు.—ఈరాత్రియె. ఒకముహూర్తకాలములో నిది యంతయు ను జరుగవలెను.

మృణ్మయ—ఎచ్చటికి కొని పోవుట ?

రాయ లందును గూర్చి వలయు నుపదేశంబు లొసంగి యతివేగంబున నభ్యంతరమందిరంబున కరిగెను.

ఈ యభ్యంతరప్రదేశంబు నలు తట్లను నాలుగువసారాలును, ఆవసారాల నంటి పిల్ల యరుగులును నడుమనంతటను కాలీప్రదేశంబును కలిగి శోభాయమానంబుగ నుండెను. అం దొకయరుగుమీఁద నల్ల

ని పరిచారిక యొకర్తు కూర్చుండి యుండెను. ఆమె యాకారము భీకరముగను, కాయము స్థూలముగ నుండెను. ఆమె యొక కత్తిపీట ముందరవేసికొని కూర్చుండి పచ్చిచేఁప నొకదానిఁ జేతఁబట్టికొని యూపిరితో నున్న దాని ప్రాణము నంతమునొందింపఁ బ్రయత్నించుచుండెను. మఱియొక తట్టున పెద్దచనుకట్టు కలిగిన చక్కని పాఁడియావొకటి కాయగూరలును అరఁటియాకులును కలిపి నములుచు, అఱమూసినకన్నులతో మైమఱచి నెమరువేయుచుండెను.\ పాపనగరమున కధినాథుండగు సర్వసౌభాగ్యములఁ దులదూఁగుచుండిన ఫ్రెడరిక్కు విలియముకూడ నిట్టి యానందమును అనుభవించి యుండఁడని తలంపరాదు. అతఁ డెప్పుడును వెనుకటి సంగతుల స్మరణకుఁ దెచ్చుకొని యానందించుటకుఁ దగిన యవకాశమే లేక యుండెను. ఇంకొకచోట చారల పిల్లి యొక్కటి తోఁక నిక్కించుకొని వెనుకకాళ్లమీఁద కుంగుచున్న చేఁపల బుట్టకడఁ గూర్చుండి పనికత్తె యెప్పుడు యేమఱియుండునా, ఎప్పుడు తాను గుటుక్కుమనుపింతునా యని వలపువేసి యుండెను. వేఱొక స్థలంబున కుత్సితవృత్తి గల కుక్కయొక్కటి తలుపు తెఱచియుండు గదివంక దొంగచూపులు చూచుచుండెను. కొండొక ప్రదేశమున పిల్లలందఱు అన్నపుబంతి చుట్టును జేరి, కంచములనిండ మెక్కి ముసలియవ్వ బుజ్జగింపులచేత మరల మరల యన్నకబళముల నాశించుచుండిరి. ఒక్కయెడ నాఁడుపిల్లలును, మొగపిల్లలును, కలసి భోజనములుచేసి తమపనిపాట లన్నియును జాలించి వెన్నెలలోఁ జాపలు వేసుకొని యొకరిపై నొకరు పడి దొరలుచు యొకరి నొకరు త్రోసుకొనుచు నిముస నిముసమున కొకమాదిరి వీతెంచు మందమారుతుని చల్లఁదనంబున నానంద ముదయించుచుండ వేయిమాటలు వినిన పేదరాశి పెద్దమ్మకథ యొక్క ముసలమ్మ చెప్పుచుండ విని యానందించుచుండిరి. మఱియొక్క స్థలంబున ప్రాయంపుఁ దరుణులందఱును కూరలు దఱిగియు సంబారము లాయత్తపఱచియు మఱి యనేక విధంబుల తమ తమ గృహకృత్యంబులనెల్ల నిర్వర్తించియు, ఒకరితోనొకరు తమతమ యభీష్టములు, నాశలు, సుఖము, సౌందర్యము, అదృష్టము మున్నగు విషయములను ముచ్చటించుకొనుచుండిరి. అట్టియెడ నకాలమేఘము

వలె విహారవనంబున సంప్రాప్తంబైన వర్షాగమంబువలె విచారయోచ
నాసమయంబున సనాతుండయి యాసన్నుండయిన స్నేహితునివలె,
నిద్రపోయెడు తఱి వచ్చు వైద్యునివలె, కడుపు నిండి యున్న సమయం
బున లభించు విందుల యాహ్వానంబును బోలె, సంచిలోనున్న సొమ్ముం
తయును వెచ్చమై పోయిన వెనుక వచ్చు యాచకునిం బోలె, రాయలా
ప్రదేశమునకు వచ్చెను. వచ్చి "ఏమి ఈ గందరగోళమేమి?" అని
యడిగెను. అతని నోటనుండి యీమాటలు వినఁబడినతోడనే చేఁపలు
బాగుచేయుచున్న పనికత్తె చేతనున్న పని చాలించి అంతకు మున్ను
విగత వసనమై యున్న మొగమున మేలిముసుఁగు సవరింపసాగెను. సమ
యమునకై వేచియున్న యాపిల్లి చటాలున నొక చేఁపను నోటఁ గఱచు
కొని యచ్చట నొక సందులోనికిఁ బాఱిపోయెను. ఇంటి యాతని కంఠ
ధ్వని వినఁబడగానే మఱియొక పరిచారిక యింటి యాబిడను మీకు
కన్నులు లేవా యని నిందించుచు కన్ను లఱమోడ్చి యరఁటి యాకుల
నములుచు నెమరు వేయుచున్న గోవు పైఁబడి కావలసిన పని చేసెను.
అవ్వ బుజ్జగింపులచే మరల సన్న కబళములఁ జవిచూచుచున్న పిల్లలు
ఇంటియజమానుఁడు చటాలున వచ్చుటచేత మిక్కిలి కుతూహల
ముతోఁ దాము వినుచున్న కథ రసకందాయమున చెడఁగొట్టుకొని భో
జ్యపదార్థము లవి బాగులేవివి బాగులేవని, చెప్పుచు యొంగిలి మూతు
లతో నెక్కడివార లక్కడ లేచిపోయిరి. భోజనము ముగించి, మబ్బును
మాయయు లేకుండగ నిర్మలముగ నున్న వెన్నెలచలువను విశ్రమించి
కథలు చెప్పుకొనుచున్న బాలురు కథ కంతరాయము కలుగుటచే ముగిసిన
కథనుగూర్చి వ్యాఖ్యానములు చేయ మొదలు పెట్టిరి. కూరగాయలు
బాగుచేయుచున్న యాఁడుపడుచులు గుడ్డిదీప మొకటి ముందర నుంచుకొని
వారి పనులు వారు చేయుచునె యుండిరి. కాని తమ మేలిముసుంగుల
మాత్ర మొక కొంచెము ముందుకు లాగికొనిరి. సంబారముల దంచు
చున్న పడుచులమనస్సునకు వ్యథగా నున్నది. వారి రోఁకంటిపోటు
శ్రుతికటువుగా నుండక మానదు. ఆపని చేయక తీరదు. పని పూర్ణము
గా మానివేసి నిలుచుండినచో నింటియజమానుఁ డేమనునో, అని
కొట్టు మిట్టాడుచుండిరి. పాలు కాఁచెడువారిపని యింతకంటె అధ్వా

నముగా నున్నది. ఒక్కనిమునముగనుక వారే మఱియుండిరేని పాల కుండలోని పాలన్నియును పొంగి బోరగిలఁబడి పోవును. రాయలు వారి ని పలుకరించి మీరెవ్వరయిన గంగాస్నానమునకు వచ్చెదరా ? యని యడిగెను. ఆమాటలు విని "నాన్న ! నేను వచ్చెదను. అన్న! నేను వచ్చెదను. పిన్న బాబు ! నేను వచ్చెదను." అను కేకలు అన్ని వైపులనుం డియు వినఁబడ సాఁగెను. మూఁడు కాళ్ళ ముదుసలి మొదలు చంటి పిల్లలవఱకు జనులందఱును ఒక్కమాటుగ "నేను వచ్చెద నేను వచ్చెద" నని గగ్గోలు సేయసాగె. పచ్చిచేపలవంక నెవ్వరుచూడక యెవ్వరంతట వారే యూరకుండుటచేత కుక్కలు పిల్లులు వానికై పెనుగులాడసా గెను. ఎంతో శ్రద్ధతో బాగుచేసి తఱిగిన కూరగాయలన్నియును ఎక్కడి వక్కడ వదిలి వేయుటచేత, నచ్చట నెమరువేయుచున్న యావు నాలుక వెడలఁబెట్టి యాకూరగాయ లన్నియును నమలి వేయఁ దొడఁగెను. ఒకతె కాఁచుచున్నకుండలోని పాలన్నియును యిగిరిపోయినవి. ఒకతె తిరగఁటిబౌయి తగిలి బోరగిలఁబడెను. ఇంకొకతె పిల్ల యేడ్పులచే కల కలపుఁజెందెను. కాని ఎక్కడనేమి జరుగుచున్నదియు నొకరి వొకరికి తెలియుటలేదు. రాయలు 'ఇష్టము కలవారందఱును రావచ్చును. కాని ఆలస్యము చేయను వలనుపడదు. ఈ రాత్రి ప్రయాణమునకు మిక్కిలి మంచిది. భోజనమైన పిదప మీరందఱును బయలుదేరవలెను. ఇంక కొంచెము వ్యవధియుండగ నేమీ మీాసన్నాహముల మీాఁద నుండుఁడు" అని చెప్పి యచటనుండి పోయి యొక్కింతసేపటిలో భార్య యున్న యెడ కరిగెను. కాని ఈవిషయమున భార్యయనుమాట సమఃజస మయినది కాదు. భార్యయనిన ? ఏకవచన ద్యోతకమె యగును. రాయ లకు భార్య లిద్దఱు, అయినను బంగాళీభాషయందు ద్వివచనము లేదు. పైగా భార్యలిద్దఱును ఒక్కసారియె కనుపించిరి. ఆకారణముచేత వై యాకరుణుల కొక నమస్కారము చేసి మే మిచ్చట భార్య యనియే ప్రయోగించితిమి.

రాయలభార్య లిరువురిలో నొకయామెపేరు సత్యభామ. రెం డవయామె రుక్మిణీ. మహాభారతమునందలి ప్రశంసనీయ లగు రుక్మిణీ సత్యభామలకును, ఈ యువజనమునకును వర్తనమున పోలికయున్నదో

లేదో మేము చెప్పఁజాలము. సత్యభామ అసలుపేరు 'నంద' కాని పదుగురు నాపెను సత్యభామ యని పిలుతురు. రాయలు ముందుగా నాసత్యభామ వద్దకు వచ్చెను.

తెరమఱుఁగున నుండి నంద జరుగుచున్న సమాచారమంతయు నాలకించుచునే యుండుటచేత రాయలు కనుపడీ కనుపడక మున్నే "సరే బాగున్నది. కాని ఇప్పు డింత యడావిడిగా నీ గంగాస్నానప్రయాణ మేల వచ్చినది?" అని యడిగెను.

రాయలు పెద్దభార్యకు సదుత్తర మిచ్చినవాఁడు కాఁడు. "గంగా!", "గంగా" "అందఱును గూడ తప్పక" అని చెప్పవచ్చు మాట కడ్డమువచ్చి "అవునవును నాకుఁ దెలియును. ఆమె నెప్పుడు నా నెత్తిమీఁద దేవతఁగనేభావించుకొనుచుంటిని. ఇప్పు డింత యాకస్మికగౌరవప్రపత్తుల కేమికారణ మని యడుగుచుంటిని."

రాయలు.—ఇటు వినుము. ఇహలోకమున మీయోగక్షేమము లకు నాకెంత బాధ్యత యున్నదో పరలోకమునఁగూడ మీవిషయమున నాకంత బాధ్యతయున్నది. పర్వమొకటి చేరువకు వచ్చినది. ఆపుణ్యాజల ములకు మిమ్ము నప్పటికి స్నానమునకుఁ బంపవలదా?

నంద.—మీయొద్ద మేముండుటకంటె మాకు గంగాస్నానమువలన వచ్చుఫలము హెచ్చుగ నున్నదా? ఈప్రపంచమునందలి సర్వతీర్థ ములు మాకు మీరే. మీపాదతీర్థ మొకింత మేము సేవించితి మేని అందువలన గంగాస్నానశతములు చేసినంతఫలము మాకు లభించును.

రాయలు.—దానికేమి! నీకిష్టము లేకున్న నీవు ఇంటివద్దనె యుండ వచ్చును. ఇష్టమున్నవారిని రానిమ్ము.

నంద—ఎవ్వరెక్కడికి పోయినను సరే. నేనుమాత్ర మింటియొద్దనే యుండెదను. నే నొక్కతెనె యుండఁగలను గాని కొంచెము దయ్య ములభయ మొకటి యున్నది. ఇవియు నవియును కొంచెము సేపు అవతలనుంచి యథార్థముగా దీనికిఁ గారణమేమో తెల్పెదరా?

రాయలు—నేను దొంగమాటలఁ జెప్పువాఁడను కా నని నీ వెఱింగినది యె కద?

నంద—ఎఱుఁగుకుదును కాని, ఎఱిఁగిననేమి ? అందుచేతనే నన్ను మీరు మసి బూసి నేరేడు గాయ చేసి నమ్మించి పోవుచుందురు.

రాయలు—నే నెన్నఁడును నేరేడు కాయ కానిది నేరేడుకాయ యని చెప్పి యెఱుఁగనే ?

నంద—మీరు నిశ్చయముగ నట్లు చేయక పోవచ్చును. ఏమయిన నేమీ? తుదకు దాని ఫలిత మంతకు వచ్చును. మీరు నాయొద్ద నన్నియు మఱుఁగు పెట్టెదరు. అదియె నామనస్సును వేధించుచుండును. ఇప్పు డయినను సత్యము చెప్పుఁడు.

రాయలు.—అదె చెప్పుదును కాని యిది యందఱికిని తెలియఁదగిన విషయముకాదు.

అను నప్పటికి నందయొక్క ముఖగగనమున నకాలమేఘము లెన్నియో వచ్చి కాఱుక్రమ్మినవి. సంపూర్ణముగ వికసించిన తామర పూవున నీరు నిండినట్టు లయ్యెను. పైనంతటను ఆవిరి కమ్మిన దర్పణము వలె గానంబడియెను. డగ్గుత్తిక జెంది కంఠగతం బయిన మనోవికారం బుతో హీనస్వరంబున 'మంచిదె అది యటుండుఁడు. ఒక్కటిమాత్రము చెప్పుడు. మిమ్ముల సాయంతనపువేళఁ బిల్చిన దెవ్వరు' ?

రాయలు—సామాన్యముగా నాయొద్ద కనేకులు వచ్చుచుందురు. ఈ సాయింత్రము నదేరీతిని చాలమంది వచ్చినారు.

నంద—మిమ్ము పిలిచిన యాఁడుది యెవ్వరు ?

రాయలు—స్త్రీయా ? స్త్రీలును అనేకులు వత్తురు. కొందఱు శిస్తులు పరిష్కరించుకొనుటకు, కొందఱు బిచ్చమునకు వత్తురు. సామాన్యముగా ఆఁడవాండ్రందఱును సాయింతనమె వత్తురు.

నంద—సరె, ఈ సాయింత్ర మెంతమంది వచ్చినారు ?

రాయలు—ఒకర్తుకయె.

నంద—ఆపె యెవ్వరు ?

రాయలు—ఆమె సోదరుఁడు ప్రాణసంకటమున నున్నవాఁడు.

నంద—సరే, అదియూ నే నడిగినది. ఆమె యెవ్వరు ?

రాయలు.—నీకు మఱియొకసారి చెప్పెదనులే ?

ఆముఖదర్పణమున నున్న యావిరి యంతయును వర్షబిందువులుగా మాఱి సత్యభామ ముఖమునుండి కన్నీరు స్రవింపఁజొచ్చెను. రాయలామె చెక్కిలినొక్కి, చుబుకంబు పుణికి, వేవిధముల ముద్దులాడి యచ్చటనుండి తరలిపోయెను.

నందనువదిలి చిన్నభార్యవద్దకు వచ్చెను. ఆతఁడు వచ్చెడునరికి మోహనాకారయు, పూజ్యురాలు నగురమ నిలువుటద్దమెదుట నుంచుకొని యింద్రనీలసదృశంబు లగుకుంతలంబుల సవరించి సవరించి ముడికి తార్చుచుండెను. రమ నందకంటె వయసున చిన్నది. దేహదార్ఢ్యము నందుఁగూడ నామె యట్టిదియె. ఆకారణమున నామెవయస్సున మఱింత చిన్నదిగా కానుపించును. వర్షావసాన సమయంబునందలి గంగాతరంగిణివలె నంద సుందరమోహనాకారంబును యావనరూపంబును పరిపక్వదశం జెందెను. రమాసుందరి యాకారంబు వసంతోద్యాన శోభాయమాన విహారస్రవంతివలె నింకను ముగ్ధమై నవయావనాంకుర భావంబున నివ్వటిల్లుచుండె. కాల్చినబంగారువలె నందయొక్క ముఖవర్చస్సు ఒక్కించుక నైల్యము వహించియుండెను. | రమాముఖ సౌందర్యంబు హిమానీబిందుసందోహంబుల ప్రతిబింబించుచంద్రికవలె ప్రకాశమానమై యున్నయది. రాయ లీయువతిపరిసరంబున కరుదెంచి "రుక్మిణీ? గంగాస్నానయాత్రవిషయము నీ కేమైన తెలిసినదా?" అని యడిగెను. వా రిరువురకును నీక్రింది సంభాషణము జరిగెను.

రమ—హమ్-అవేటిమాటలు ?

రాయలు—నీవు హమ్ అనునది గంగాస్నానమా ; రుక్మిణీ నామోచ్చరణా.

రమ—ఆమె - కేవలదేవతాంశసంభూతురాలు - లక్ష్మియె. యేదోపే రుండవలెను. జ్ఞాపకము రాకుండ నున్నది.

రాయలు—నీ వనుకున్నది శిశుపాలకథ యనుకొనియెదను, ఏమనియెదవు. దాని నటుంచి యిప్పుడు గంగాయాత్రమాట చెప్పుదు ? ఆసంగతి నీకు తెలిసినదే కదా ?

రమ— తెలిసినది.

రాయలు—నీవుకూడ వచ్చెదవా ?

రమ—ఈ తలదువ్వట ముస్తాబు అంతా అందుకోసమే.

రాయలు—కాని ప్రపంచమునందలితీర్థయాత్ర లన్నిటికిని తుల్యుఁడ నయిననేను మీయొద్దనుండి యుండఁగా మీ కీయాత్ర గొడవ యేల ?

రమ—నన్ను రావద్దందురా ఏమి ? అట్లైన నేను రాను.

రాయలు—రాకపోతే ఈసన్నాహమంతయు నెందుకు ?

రమ—మీరు రమ్మన్నారని.

రాయలు—నేనెవ్వరిని రమ్మని చెప్పలేదే ? ఎవ్వరైనను వచ్చెదరా యని అడుగుచున్నాను. నీవు వచ్చెదవా యేమి ?

రమ—మీరు వెళ్లుదురా ?

రాయలు—ఆహా వెళ్లెదను.

రమ—అట్లయిన నేనును వచ్చెదను.

రాయలు—కాని నేను మీతోడ రాను. దారిలో వచ్చి కలుసుకొని యెదను.

రమ—మాతోకూడ వచ్చెడువా రెవ్వరు ?

రాయలు—మృణ్మయుఁడు కూడ వచ్చును.

రమ—సరే కాని-నాకొక్కటి చెప్పెదరా ?

రాయలు—అడ్డమేమి-ఏమి టది ?

రమ—మీ కక్కడికి పోవ పనియేమి ?

రాయలు—అంతయును నీకు చెప్పవలెనా ?

అనునప్పటకి రాయని గాఢాలింగనము చేసికొని "నాకు చెప్ప వలెను. మీకు సాహసము మిక్కిలి హెచ్చు. మీ రిప్పు డేదో దుడుకు కార్యము చేయఁ దలంచి మమ్ముల నిచ్చటినుండి తరలింప నున్నారని భయ మగుచున్నది."

రాయలు కోపమును తెచ్చుకొని రుక్మిణిజడ పట్టుకొని గల్లచపేట యొసంగువానివలె నటించి తుదకు ముక్కుపట్టి కంపించెను. "నేను దుడుకుకార్యము చేయుదు ననుమాట నిజమే కాని అందువలన భయ మేమియు లేదు."

రమ—"మీకు జడుపు లేకపోవచ్చును. నాకు భయ మగుచున్నది.

మీాభయమునకును, నాభయమునకును, ఏమైన భేదముండినఁ దె ల్పుఁడు. సరిగాని, నామాట వినుఁడు. మీాగంగాస్నానప్రయాణము కట్టువడిపోయినది. నే మిమ్మిపుడే గదిలో కట్టి చెఱపెట్టెదను" అని చెప్పుచు రుక్మిణి తలుపు దగ్గరవేసి దానికి జేరగిలఁబడి నిలుచుం డెను. "మీారు వెళ్లదలంతురేని నన్ను త్రోసికొని నాగొంతుకపై నడుగు వేసి పోవలెను. ఇప్పుడు చెప్పుఁడు. ఈ సాయంత్రపువేళ మిమ్ముల పిలచిన దెవ్వరు?" అని గ్రుచ్చి గ్రుచ్చి యడిగెను.

రాయలు—నివ్వెరపడి "మీాకు ప్రొద్దస్తమానమును యింటిచుట్టును తిరుగుటకు చారు లెవ్వరైన నున్నారా యేమి?" అని యడిగెను.

రమ—పాపము పూజ్యురాలగు భండారీకి కూరగాయలు దొరకునని యాశపడినది కాని అది విఫలమయి పోయినది ఆకారణముచేత మాకు సంగతి యావత్తును తెలిసిపోయినది. ఇంక దాపరిక మెందుకు. ఉన్న దున్నట్లు చెప్పుఁడు. ఆమె యెవ్వరు?

రాయలు—శ్రీ.

రమ—ఈమెయేనా శ్రీ. ఇప్పుడు మి మ్మెందులకు పిలచినది?

రాయలు—ఆమె ఏదియో వేఁడుకొన వచ్చినది.

రమ—దొరికినదా?

రాయలు—నీ వెప్పుడును వేఁడుకొనలేదా?

రమ—అట్లయిన దొరకినదనినమాట? ఎందుల కిచ్చినారు?

రాయలు—నే నేమియు నొసంగలేదు. ఇచ్చెద నని వాగ్దానము మాత్ర ము చేసితిని.

రమ—ఆమె కేమి యియ్యతలఁచినారో, అది నాకుకూడ చెప్పుఁడు?

రాయలు—ఇప్పుడు కాదు, ఈపాటికి తలుపు తీయుము.

రమ—అన్నియును ఫివరముగా చెప్పిన గాని నేను తలుపు తీయను.

రాయలు—అట్లయిన వినుము. ఖాజీ శ్రీసోదరుని బ్రతికియుండగనె పాతివేయుటకై శిక్ష విధించినాఁడు. శ్రీ వచ్చి యాతని నెట్లయిన బ్రతికింపుమని వేఁడుకొన్నది. అట్లే చేసెదనని వాగ్దానము చేసితిని.

రమ—అట్లయిన మే మందఱమును గంగాస్నానమునకు పోయిన మీారు

ఫౌజుదారులమనుష్యులతో స్వేచ్ఛగ యుద్ధంబు చేయవచ్చునని యీా మీాయూహ?

రాయలు—మీారు ఆఁడవాండ్రు. ఇట్టికార్యములలో మీారు జోక్యము కలుగఁజేసుకొనరాదు.

రమ—మాకు వానితో పని యేమియును లేదు గాని ఒక్కటిమాత్ర మున్నది. నేను స్నానమునకు పోవను.

అని యీావిధముగఁ జెప్పి కదలకుండ గట్టిగ తలుపు నాను కొని నిలుచుండెను. రాయలు బ్రతిమాలెను. వేఁడుకొనియెను. ప్రార్థించెను. అందుపైని రమ "అట్లయిన నాకొక వాగ్దానముసేయుఁడు. వదలిపెట్టెదను" అనెను.

రాయలు—నీ కేమి గావలెనో చెప్పుము.

రమ—మీారు శ్రీసోదరునిగూర్చి చేతనైన దెల్ల చేయుఁడు. కాని ముష్కరమునకుగాని కలహమునకుగాని, గడంగకుఁడు. ఇదె నాకోరు వరంబు. ఈ మాత్రిపుచను విండు.

రాయలు—నీవు చెప్పినదంతయు నా కంగీకారమే. కలహముగాని, ముష్కరముగాని, నాపనిగాదు, నాయంతట నే నట్టివానిలో దిగవలెనని యభిలాషకలవాఁడనుగూడ కాను. కాని నాప్రయత్నములు సఫలము లవునో కావో యని మాత్రము సంశయము పడుచున్న వాఁడను.

రమ—ఫలితమేమగు నన్నవిచారముతో ప్రసక్తిలేదు. ఆయుధ సహాయము కోర ననిమాత్రము వాగ్దానముసేయుఁడు. అంతమాత్ర ముననే నేను సంతుష్టి చెందెదను.

రాయలు కొండొక యోచించి "సరె-అట్లె బాస చేసెద నని చెప్పఁగా రమ సంతుష్టిఁ జెందెను. భర్తను విడిచి పుచ్చి "అట్లయిన మేము గంగాస్నానమునకు పోవ నక్కఱలే దనుకొనియెద" ననెను. రాయ లీవిషయమై ప్రస్తావన యిదివఱకె వచ్చియుండుటచే వెడలిన బా గని చెప్పెను.

రుక్మిణీవదనమున నసంతుష్టి యనుమేఘ మొకటి ప్రసరింపఁ జొచ్చెను. కాని యీామె మౌనము వహించి యూరకుండెను. రాయలు,

ఇంక నేమియు॥మాఱుమాటాడక యచ్చటనుండి వదల్చుకొని పోయెను. మరల నాయిల్లు త్రొక్కిచూడ లేదు.

---

## నాలవ ప్రకరణము.

రాయల కొకగురు వున్నవాఁడు. అతఁడు బ్రాహ్మణవర్ణస్థుఁడు. ఆశ్రమమును స్వీకరించినవేదాంతి. అతనినడుమున కొక పట్టుగుడ్డయును పైని శ్రీహరినామావళిచిత్రించిన యుత్తరీయమును తప్ప యింకవస్త్రమే లేదు. ఆతనిశిరసున నొకపిలకమాత్రమున్నది. తక్కినశిరోజంబులన్నియును సంస్కారంబైనవి. ఈహీనశిరోజములకు బదులుగ నాతనిబోడితలనిండ చందన మలందఁబడుచుండెను. ఫాలతలంబున మతసాంకేతకం బగు బొట్టును బ్రాహ్మణోచితములగు తదితరచిహ్నములు అతనికడ దర్శనీయము లగుచుండెను. అతనిపేరు చంద్రచూడతర్కాలంకారుఁడు. ఆతనికి రాయల యోగక్షేమమునిన పంచప్రాణములును, శిష్యుఁ డెచ్చట నుండిన గురువు కూడ వెన్నంటియుండును. అప్పటిలో నాతనియునికియును భూషణపురంబున నె. రాయ లతనికిదివ్యమందిర మొకటి వాసగృహంబుగ నేర్పఱచెను.

రమను గదిలో దిగవిడచి రాయలు తనగురుని మందిరంబున ప్రవేశించెను. ఆతనితో చాలసేపు కూర్చుండి యేమేమియో యోజించెను. వారి కేసంభాషణము జరిగెనో, వానితోడ మనకు ప్రసక్తిలేదు. ఒక్కటిమాత్రము చెప్పవలసియున్నది. చంద్రచూడున కెఱింగింపరానిది రాయల కీప్రపంచమున నెద్దియునులేదు. అదియంతయును తనయోగక్షేమముకొఱకె. శ్రీ, రమల కిద్దఱకును నాతఁ డొసంగిన వాగ్దానముల ముచ్చట సవిస్తరంబుగ రాయ లతని కెఱింగించెను. "నే నిప్పుడు రెండు చిక్కులనడుమనుఁ దగుల్కొని యిటు నటుఁ గదలలేకుండ నున్నాఁడను. నారాయణుఁ డొక్కఁడే నాకు శరణ్యుఁడు. నాకుయుద్ధములతోఁ గాని, రక్తవిక్షేపణముతోఁగాని ప్రసక్తి కలుగచేసుకొనవలెనని కించిత్తయినను తలంపులేదు. ఆకారణముచేత మృణ్మయుని పంపించివేసితిని. కాని ప్రార్థనలుగాని, బతిమాలుటకాని మనకు కార్యకారియగు నను

నమ్మకము నా కిసుమంతయును లేదు. ఏది యెట్లున్నను ఈ విషయమున సఫలీకృతమనోరథుండ నగుటకై ప్రాణత్యాగమును నైన చేయఁదలంచి తిని. పర్యవసానము తమయాశీర్వచనప్రభావంబునఁ బడయ నోపుదు. ఈప్రయత్నమున నా కపజయమె సంభవించునేని రేపటియుదయము ననె తీర్థయాత్రలు సేవింపఁబోయెదను. తమ్ము సందర్శించి సముచితోప చారంబుల నడిపిపోవ చనుదెంచితి" నని చెప్పెను.

చంద్రచూడుఁడు "ఈనిమిష మానిమిష మనక నే నెప్పుడును ఆశీర్వదించుచునేయుందును. ఈక్షణమునందు కూడ నీ కీవిషయమున జయము కలుగు ననియె నా యాశీర్వచనము. నీ విప్పు డీరాత్రి వేళనే పోయి ఖాజీతో మాట్లాడ సంకల్పించుకున్నాఁడవా? యేమి?"

రాయలు—లేదు. రేపటిరోజున సకాలముననె యాతని సముఖము నకు పోవఁదలంచితిని.

చంద్రచూడ తర్కాలంకారుఁడు సామాన్యమానవులలో పరి గణింప తగినవాఁడు కాఁడు "ఇప్పుడు నా యీ ప్రియతముండు సందిగ్ధం బునఁ బడి కొట్టుకొనుచున్నాఁడు. తనకు కలహాముల యందును, యుద్ధ ముల యందునను, తలంపు లే దని చెప్పుమాట వట్టి పిచ్చిమాట. ఈయ నర్థకష్టముల కన్నింటికిని రుక్మిణియె కారకురాలు. ఈ చిన్నదాని యుద్దే శ్యమేమి? రుక్మిణి యున్నచోట నారదుఁడు లేఁడనుకున్నదా? మహా మ్మదీయులతో పనిచేయవలసి వచ్చినపుడు అనునయమువలన నేమి ప్రయోజనము? సర్వశక్తుఁడు మహామ్మదీయుల నింకనైన నణఁచి వేయఁడా? హిందువు లీరీతి దౌర్జన్యముల కెన్నాళ్లు లోఁబడి యుండవల యునో? ఒక్కసారి యిప్పుడే రాయల పరాక్రమమును బురికొల్పి దానిని చవిచూడవలెను. శ్రీమన్నారాయణునికి మేము నిత్యమును సమర్పించు తులసీదళములు నిష్ప్రయోజనము లగునా?" అనితలపోయు చు తర్కాలంకారుఁడు "తీర్థయాత్రాప్రయాణమును మీకుటుంబ మును గంగాస్నానమునకు పంపుటయును, విపత్తులుగా భావించెదను.

రాయలు.—తమయభిప్రాయ మేమి? తమయాజ్ఞ యేమి?

చంద్ర—నేను నీక్షేమమునకై యొక యజ్ఞమును తలపెట్టితిని. ఇందు లకు వేయిరూప్యంబులు వెచ్చమగును. ఇవి యన్నియును నాకు

సమకూర్చి, దానికి వలయుసంబాములరల నాకు నాయ త్తము చేయు వా రెవ్వరు ?

రాయలు.—తమకు కావలసినసా మ్మంతయు నీనిమిషముననె తెచ్చి యిచ్చెదను. తక్కినసన్నాహముల నెవ్వరిని నియమింపు మనిన వారిని నియమించెదను.

చంద్ర—మంచిది-జీవనభండారీ సన్నాహముల సేయుటయందు చాల నేర్పరి. ఈయజ్ఞమునకై యది నాకు చేసిపెట్టవలెను. జీవనుని గొని రమ్ము ఈరామసేవకుఁడు నాసేవకుఁడు. ఈతఁడు సామాను లన్ని యును భద్రము సేయఁగలఁడు. మిక్కిలి నమ్మకమయినవాఁడు. సత్ప్రివర్తకుఁడు. కావున నీతనిచే షరాబునకు సొమ్ము పంపుమని యొకయుత్తరమును బంపుము.

అని చెప్పఁగా రాయలు కలమును కాగితమును సేకరించెను. అప్పటి వ్రాతసామానని నొకభూర్జరపత్రమును, సన్నగా పాళీ బెట్టి చెక్కినవెదురు బద్దయును, తప్ప మఱియొక్కటి యేమియును లేవు. రాయలు వేయిరూపాయలు పంపుమని షరాబున కొక యుత్తరమును జీవనభండారికి నొకయుత్తరమును వ్రాసి రామసేవకుని కిచ్చెను. అతఁ డాయుత్తరమును చేత పుచ్చుకొని శీఘ్రిమె వారల వీడ్కొని చనియెను. పిమ్మట చంద్రచూడుఁడు రాయలను పొమ్మని సర్వవిధముల మేలగుఁ గాతమని యాశీర్వదించి పంపెను. రాయలును విహితప్రణామము లొన రించి గురుని వీడ్కొని పోయెను.

ఉత్తరము చేరుటయె తడవుగా జీవనభండారీ సొమ్ము చేతఁ బట్టుకొని తర్కాలంకారునియెదుట వచ్చి విధ్యుక్తవినయోపచారంబుల నడుప నాతఁడు "జీవనుఁడా మీాయజమానున కీనగరమున బాకీదారులు నురైతులునుఎందఱోయున్నారు. వారలయిండ్లన్నియునీవెఱుంగుదువా?

జీవ—అయ్యా, అందఱిని ఎఱుంగుదును.

చంద్ర—వారి యిండ్లన్నియు నీరాత్రి నాకు చూపించెదవా.

జీవ—అట్లే చేసెదను. తమరు దయచేయుటయె తడవు. కాని యింత అర్ధ రాత్రివేళ మీారిప్పుడు వాండ్లయిండ్లకు పోవుట కర్తవ్యము కాదు.

కార్య మేమో నాకు తెలుపుఁడు. వాం డ్రందఱును మాదిగలును, మాలలును.

చంద్ర—మూఢుఁడా! అది పనిగాదు. నీయజమానుఁడై న నెప్పుడును న న్నెదిరించి మాటలాడి యెఱుంగఁడు. ఏమి యీసాహసము, ఏమి యీప్రల్లదము? చెప్పినదెల్ల చేయుము. నో రెత్తఁ బోకుము.

జీవన—చిత్తము - చిత్తము. క్షమింపుఁడు. దయచేయుఁడు. ఈసామ్మే చ్చట నుంపవలెను?

చంద్ర—అది నీయొద్దనుంచుము. ఈరాత్రి జరుగుసమాచార మావంత యేని వెలువడెనా? నీబొందిలోని ప్రాణము లుండవని నమ్ముకొనుము. నీవు కాకులకును, గద్దలకును నెర యగుదువు.

ఈమాటలు చెప్పుటతోడనే జీవనుని కొడలెల్లను కంపమెత్తిపోయి లోపలనుండి దడ యెత్త నారంభించెను. ఆకారణముచేత బ్రాహ్మణుఁడు మరల తన్నెక్కడ తిట్టిపోవునో యనుకారణమున గుక్కురుమిక్కు రన కూరకుండెను. అనంతరము స్వామినిర్మాల్యకుసుమంబుల గుప్పెడు దీసి పైనున్న నామావళి కొంగునగట్టి సొమ్ము సంచితో జీవన భండారీ వెంటరా, నచ్చటనుండి తరలి చనియెను.

కొంతదూరము పోయినవెనుక జీవనుఁడు గుడిసె యొకటి కనుపఱచెను. "ఇచ్చట తమరు సెలవిచ్చినవానియిల్లు ఒక టున్నది" అని చెప్పెను.

చంద్ర—వీనిపే రెవ్వరు ?

జీవ—వీనిపేరు యుధిష్ఠిరమండలుఁడు.

చంద్రచూడుఁడు వానిని పిలువమన జీవనుఁడు వానిని "మండలా! మండలా" అని కేకలువేసెను. ఆకేకలు విని వాఁ డిల్లువెడలి బయటికి వచ్చి యెవ్వరు వా రని యడిగెను.

చంద్ర—"రేపు గంగారామదాసును బ్రతికియుండఁగనే పాతివేయుదురు. నీ వెఱుంగుదువా !" అని యడిగెను.

యుధిష్ఠి—విన్నాను.

చంద్ర—నీవక్కడకు చూచుటకు రావా ?

యుధిష్ఠి—అది మహాత్మదీయులు చేయుమహాక్రౌర్యము. అచ్చటకు వచ్చి చూచినందువలన ఫలమేమి?

చంద్ర— లేదుకాని - లక్ష్మీనారాయణుల సెల వైనది. మీ రందఱును అచ్చటకు రావలయును. ఈయాజ్ఞ మీరు శిరసావహింపవలసిన్నదే.

అని చెప్పుచు తన కడనున్న పుష్ప మొకటి దీసి యుధిష్ఠిరున కొసంగెను. యుధిష్ఠిరుఁ డాపుష్పమును కన్నుల నద్దుకొని "తమ సెల వైనదిగనుక తప్పకవచ్చెదను" అని చెప్పెను.

చంద్ర—మీయొద్ద ఆయుధము లేవైన యున్నవా ?

యుధి—కొన్నికొన్ని యున్నవి. మాదొరగారిపనులు చేయవలసి వచ్చు నేని యప్పుడప్పుడు బల్లెములును, డాళ్లును పట్టుకొనివచ్చుచుం దుము.

చంద్ర—"మంచిది-అవియె పట్టుకొని రండు, భగవంతునియాజ్ఞ యట్లే యైనది" అని చెప్పెను. ఇదిగో చేయి పట్టుమని జీవనభండారి యొద్ద నున్న సంచిలోని రూపాయ యొకటి తీసి యాతనిచేతిలో పెట్టెను. మండలుఁడును "ఏలినవారి సెల వైనప్పుడు నేను దానినిపుచ్చుకొనక తప్పదు. తమయాజ్ఞ శిరసావహించి చేసెదను. కాని నేను ఒక్కఁడ నే రానా ?" అనుసందేహము నొందుచున్నాను.

చంద్ర—ఇంక నీతోడ వచ్చువా రెవ్వ రున్నారు ?

యుధి—ఇతఁడు ప్రసాదమండలుఁడు. ఈతఁడు దయ్యమువలె పనిచే యును. బల్లెము చేత పుచ్చుకొనెనా? వాని నెదిరించి నిలువఁబడు వా రెవ్వరును లేరు. వాఁడుకూడవచ్చిన బాగుండు ననుకొనియెదను.

చంద్రచూడుఁ డంత కొన్నిపుష్పములను, రూపాయలు తీసి యుధి ష్ఠిరునకిచ్చి నీకు కావలసి నన్ని పుచ్చుకొమ్మని చెప్పెను.

పిమ్మట మఱియొకగుడిసెకడకు పోయి అచ్చటకూడ నిట్లే పుష్ప ములను, రూపాయలను పంచిపెట్టెను. ఇట్లే తెల్లవారుదనుక నొక యింటినుండి మఱియొకయింటి కరుగుచు తనచేతనున్న రూపాయలను, పుష్పములను పంచిపెట్టుచు, ప్రభాతకాలమున నెప్పటియట్లు వచ్చి నిజ నివాసంబునఁ జేరెను.

ఆహా శ్రీ,రమ లిద్దఱును కలసి యెంతయుద్రేకమును కలిగించిరి?

---

## అ యి ద వ ప్ర క ర ణ ము.

భూషణనగరంబునకు వెలుపల నొక పెద్దబయ లున్నది. అచ్చట గంగారామును పూడ్చిపెట్టుటకై పెద్దగోయి యొకటి త్రవ్వఁబడియుండెను. చెఱనున్న వాని నింకను గొనిరాకమున్నె పురమున నున్న జనులు గుంపులు గుంపులుగవచ్చి చేరుచుండిరి. అరుణోదయ మింకను కాలేదు. అంధకారంబులకు వృక్షము లింకను శరణ్యము లయి యుండెను. నక్షత్రము లింకను చీఁకటిమఱుంగున ప్రకాశించుచునే యుండెను. అప్పటి కప్పుడె యన్ని దిక్కులనుండియును జనులు తండోపతండము లుగ బ్రతికియున్న వానిని పాతివేయుమహోత్సవమును చూడ గోరిసి పోవుచుండిరి. న్యాయస్థానమున విధింపఁబడిన మరణదండన బ్రతికియుండువారి కందఱికిని సంతోషమును, ఆనందమును కలిగించి యుత్సవప్రక్రియ నలరారుచుండెను. లేకున్న సూర్యోదయమునకు పూర్వమే యందఱుజను లచ్చట నేల పోగుపడుదురు? నగరమునందలి యన్ని రస్తాలనుండియును నెడతెఱిపి లేకుండ చీమల బారువలె ప్రజలువచ్చుచునె యుండిరి. బయలెల్లను నిండి క్రిక్కిరిసి యుండెను. బయలు మిక్కిలి పెద్దదె యయినను వచ్చుచున్న వారు బొటనవ్రేళ్లమీఁదనిలువఁబడుటకైనను చోటు దొరకుట దుర్లభముగ నుండెను. ఒక్కయెడ కొందఱు చెక్కిళ్లకొఁతులవలె తమకుకూడ తోఁకలులేకపోయెఁ గదా యని జిజ్ఞాసపడుచు కూర్చుండిరి. ఇంకొక్కయెడ గబ్బిలములవలె చెట్లకొమ్మలను బట్టుకొని వ్రేలుచుండిరి. ఈబయలునుచేరి కొన్ని పెంకుటియిండ్లున్నవి. ఆయిండ్లపై కప్పుకూడ నెడము లేకుండ నిండిపోయెను. ఈ పెంకుటియిండ్ల సందున గుడిసె లసంఖ్యాకములుగా నున్నవి. ఆగుడిసెలపైనను జనులు నిండిపోయిరి. గుడిసెలపైకి కొందరు నిచ్చెనలువేసుకొని యాసిచ్చనలనాను కొనినిలుచుండిరి. ఆప్రదేశమంతయును సముద్రమువలె నల్లనిశిరోజములు గల శిరస్సులచే నావృతమయి యెక్కడచూచినను జనసంకీర్ణంబై వేర్పరుప శక్యముగాక యుండెను. ఇంకను జనులు వచ్చుచు నెట్లో యారంగస్థలమువైపున కరిగి అందులో గలసి పోవుచుండిరి. అచ్చటి సందడి భయంకరముగ నుండెను. ఇంకను ఖైదీని దీసుకొని రారైరి. వచ్చినవారందఱికిని ఓపిక లేక యింకను తీసుకొనిరారేమి యని విసుగు

కొనుచుండిరి. గొల్లంతుసేయుచు కలవళపడుచు ఒకరినొకరు గ్రుద్దుకొను చుండిరి. హిందువులను మహమ్మదీయులును, మహమ్మదీయులను హిందువులును తిట్టుకొనసాగిరి. కొందరు అల్లా అని కేకలు వేయుచుండిరి. కొందఱు హరే హరే అని కేకలు వెట్టుచుండిరి. కొందఱు "ఇది ఈ వేళజరుగదు. రండిపోదాము" అనుకొనుచుండిరి. కొందఱు "ఇదిగో చూడండి తీసుకొని వచ్చుచున్నారు" అనుకొనసాగిరి. చెట్టుకొమ్మల పై కెక్కిన వాండ్రకు పనియేమిలేక ఊబుసు పోకకై ఆకులు, పుష్పములు, పండ్లు కోయుచు చిన్నచిన్న కొమ్మలు విఱుగఁదీయుచు క్రిందనున్న వారితలల మీఁద వేయుచుండిరి. మఱియును కొందఱు ఆటలు, కొంటెతనములును చాలక క్రిందనున్న వారిపైనినుములు వైవసాగిరి. ఈరీతిని అచ్చటనున్న చెట్లపై నన్నిటియందును ఒక్కటే మాదిరి కోలాహలము జరుగుచుండెను. అక్కడ నున్నయొక్క చెట్టుమీఁదమాత్ర మేవిధమైన గడబిడయును లేకుండ నుండెను. సముద్రమధ్యముననుండు చిన్నద్వీపమువలె నదియేమియో విజనంబై యుండె. అక్కడ ఒక్కరో యిద్దరో మాత్రము జనులు నిలుచుండిరి కాని వారేమియును సద్దు చేయుట లేదు. వారచ్చట మొద్దులవలె నిలువఁబడి యెవ్వరైనను వచ్చి యాస్థలము నాక్రమించవలె నని ప్రయత్నముచేసిన వారిని లేవఁగొట్టుచుండిరి. వారివి దీర్ఘకాయములై యుండుట చేతను, చేత బలమగు దుడ్డుకఱ్ఱలుండుట చేతను జను లెవ్వరును అచ్చటకు పోవ వెనుదీయుచున్నారు. ఈ చెట్టుమొదట నొకకొమ్మ నాను చేసుకొని ఒక స్త్రీ మొగము పైకిబెట్టుకొని, ఆపై కొమ్మపై గూర్చుండు మఱియొకనితో మాటలాడుచున్నట్లు కనుపట్టెను. ఆమె కన్నులు ముఖమును వాఁచిపోయినవి. గడచినరాత్రి తెల్లవారువరకును యేడ్చుచున్నదానివలె యామెవస్త్రమును, యొంటెనున్న బట్టలన్నియు అసహ్యముగ నుండెను. ఆమె యిప్పుడుమాత్ర మేడ్చుటలేదు. తననెత్తి పై కొమ్మమీఁద కూర్చుండియున్న వానితో నీస్త్రీ "అయ్యా! ఏమైనను కనుపడుచున్నదా?" అని యడిగెను. అతఁడు ఏమియు కనుపడుట లేదని ప్రత్యుత్తర మిచ్చెను. "అట్లయిన సర్వశక్తుఁడు మనకు బాసటయై వచ్చినట్లు కనుపట్టుచున్నది" అని చెప్పెను.

మాపాతకులందఱు, పలుకరించినది శ్రీ యనియు, ఆమె మాటలాడునాతఁడు చంద్రచూడుఁ డనియు తెలుసుకొనియె యుందురు. ఈచెట్టుకొమ్మ యాతఁడు కూర్చుండుటకు తగినప్రదేశము కాదు. కాని “మతవిషయమున జీవితమును ధారవోయువానికి పరమార్థమెటు లభివృద్ధిగాంచునో యదియెల్ల నెరవేర్చుట కర్తవ్యంబు” అని యనుకొననోపు. అత డేదినమున తెల్లవారకపూర్వమే లేచి మరణశిక్షాప్రదేశము వైపులకు వచ్చుచున్న శ్రీని యనుకొనిన యట్లె దారినడుమ కలుసుకొని ఆమెకు మార్గదర్శకుఁడై యాప్రదేశమునకుఁ గొనిపోయెను. వారిరువురును కృతపరిచయులే. దానికారణము వఱం దెఱుంగనగును.

శ్రీ ప్రస్తావించినయంశంబునకు ప్రత్యుత్తరంబుగ చంద్రచూడుఁడు “శ్రీమన్నారాయణుఁడు తప్పక మన కండయైయుండు. అట్టి యాశయె నీమనంబున నిశ్చయంబుగ పెనుపందగు. ఆవిషయమైన యలజడి పొందఁదగదు. కాని తుదకు మనకె విజయము కలుగునని చెప్పుకొనుటకు తగినచిహ్నము లింతవర కేమియు కనుపించుట లేదు. అదుగో కొందఱు యెఱ్ఱతలగుడ్డలు పెట్టుకొని యిప్పుడిప్పుడె వచ్చుచున్నారు.

శ్రీ—ఆయెఱ్ఱతలగుడ్డవలన ద్యోతకమయ్యెడి దేమి ?

చంద్ర—వారె ఫౌజుదారునిసిబ్బంది.

అప్పుడు నిశ్చయముగా గంగారాముని వెంబడించి ఫౌజుదారుని సిబ్బంది రెండువందలమంది వచ్చుచున్నారు. వారిసందర్శనమాత్రమున యాజనమంతయును నిశ్చేష్టు లగుచుండిరి. చెట్టుమీఁద కూర్చుండి ఆమందిలో జరుగుచున్న చర్యలన్నియును యెప్పటివప్పుడు తాను చూచినవి చూచినట్లు చంద్రచూడుఁ డామెకెఱింగించుచుండెను.

శ్రీ—ఇప్పుడు వచ్చినసిపాయి లెంతమంది

చంద్ర—రెండువందలు.

శ్రీ—అసహాయుఁడై యున్నవానిని మట్టుపెట్టుట కింతమందికావలెనా?

చంద్ర—ఇక్కడచేరిన జనులసంఖ్య విని ఫౌజుదారుఁడు రక్షణనిమిత్తమై పంపియుండనోపు.

శ్రీ—ఇంక కర్తవ్యమేమి ?

చంద్ర—సిపాయిలందఱును బారుగా గోతిచుట్టునునిలువఁబడి యున్నా

రు. గంగారాముఁడు వారివెనుక నున్నాఁడు. ఖాజీ యాతనివెనుక నున్నవాఁడు. వెనుక ఫౌజుదారు కాచుకొని యున్నవాఁడు.

శ్రీ—ఇప్పుడు నాయన్న యేమి చేయఁగలఁడు.

చంద్ర—ఆదుర్మార్గు లాతని సంకెలులువైచి బంధించియున్నారు.

శ్రీ—ఆతఁడు రోదనము చేయుచున్నాఁడా ?

చంద్ర—అట్టిదేమియును లేదు. అతఁడు నెమ్మదిగ నున్నాఁడు. మౌనము ద్రత వహించినాఁడు. ఆతనియాకారమిప్పుడు గంభీరమై దర్శనీయమై యొప్పుచున్నది.

శ్రీ—నే నాతని నిప్పు డొక్కసారి చూడవలెననియున్నది. ఈజన్మమున కల్లనిదియె కడచూపు.

చంద్ర—అట్లె చేయవచ్చును! ఈక్రిందికొమ్మెక్కఁగలవా ?

శ్రీ—నే నాఁడుదానను. చెట్లెక్కుట నాచేత కాదు.

చంద్ర—"బిడ్డా ? ఇదియా సిగ్గుపడుటకు తరుణము ? " ఆచెట్టునకు నేలమట్టమునుండె గజమెత్తున నొకకొమ్మయున్నది. ఆకొమ్మ పైకిఁ బోవుటకు మూఁడు సరాసరిని కొమ్మచివరంట నేలమట్టమున నొక్క యెత్తుననే బయలుదేరినది. కొంతదూరమున కాకొమ్మకు రెండుపల వలుబయలుదేరినవి. ఆకారణముచేత చేతులు వీలుగ నానుకొని యీ రెండు పలవలమీఁదను కూర్చుండియుండుట సుకరముగ నే యుండును. చంద్రచూడుఁ డీమార్గమును శ్రీకి కనపరచెను. శ్రీయును లజ్జనొత్తి గించి యాకొమ్మనెక్కయత్నించెను. ఆపత్కాలంబున స్త్రీలహృద యములనుండి లజ్జస్వభావసిద్ధముగ తానె యొత్తిగిలుచుండును.

తొలుదొల్త నీప్రయత్నముల శ్రీ విజయముగాంచలేక కన్నుల నీరుబెట్టుకొనఁజొచ్చెను. కాని తుట్టతుదకు ఆమెకు గోచరంబగు మార్గమున నెట్లో ఆకొమ్మపైకెక్క శక్తిగలిగెను. విడియున్న యీపలవల సందున తనపాదద్వందముచు చేర్చి చేతులురెంటను రెండుకొమ్మలపై నానుకొని కూర్చుండెను.

ఇందువలన నాచుట్టుపట్ల కోలాహలము బయలుదేరెను. శ్రీ కూర్చుండియుండిన ప్రదేశమున నాకొమ్మ కాకు లేమియును లేవు. అందు వలన నామె కొక్కింతయు మఱుగులేక యుండెను. ఆకారణముచే నకస్మా

త్తుగా, యాచేరినగుంపులోని జనమంతయును, నిరుపమాన మనోహ రాంగియగు నొకకామినిని శ్యామల పర్ణంబుల నడుమనుండి యాప్రదేశ ముల నలంకరించుటం గనుంగొనిరి. దేవతావిగ్రహమును బోలి యామె శరీరముచుట్టును చెట్లుయాకులును కొమ్మలును జేరి మకరతోరణము వలెనయ్యెను. ఆకు లామెశిరోజములమీఁదను పుష్పిగనున్నయామె బాహులతికలపైనను రాలెను. శీర్ణమై యామె వక్షస్థలంబున విడువడి యున్న కబరీభారంబునంగూడ పర్ణంబులు కొన్ని చిక్కుఁ బడియెను. ఆమె పాదంబుల కొక కొమ్మ యడ్డువచ్చి చూపరవీక్షణంబులకు యౌవనదేవత యటనె ట్లాసీనయయ్యెనో తెలిసికొనుట కవకాశము జిక్కక యుండె ను. ఈకొమ్మకు చేరువుగనున్న జనులగుంపు జంఝామారుత ప్రకం పిత సముద్రతరంగంబులవలె అలజడి నొందసాగెను.

కాని శ్రీ కిదేమియును కనుపించుట లేదు. తా నెట్లుకూర్చుం డెనో తనగతియేమగునో యను శంక యామె కొక్కింతయును కలుగ లేదు. ఆమె తదేకదృష్టిగా గంగారాముని వంక జూచి కన్నులనుండి కన్నీ రు కాలువలుగ నోడ్చఁజొచ్చెను. అంతచంద్రచూడుఁ డామెను పలుకరించి "చూడు, చూడు, గుఱ్ఱముపై నెక్కి దూరమునుండి ప్రవేశించుచున్న యాపురుషుని జూడుము" అనియెను.

శ్రీ వాఁడెవ్వఁడోయని యాతనివంక చూడ్కి నిగుడించెను. ఆతనివేషముఁ గనిన యోధునివలె నున్నాఁడు. కాని చేత నాయుధము లేమియునులేవు. మఱియొకవైపునుండి యీవైపునకు వచ్చుచున్న వాఁడు ఆయాశ్వికునిగుఱ్ఱము శీఘ్రగామియేగాని జనసమ్మర్దముచే నడుగు వడి వడి వేయుటకనువుపడక యుండెను.ఆయశ్వమాటలాడుచు సంచరించు చు మెడను ధనురాకారముగ మలంచుచు యెన్నియో నటనలంజేయు చుండెను గాని వేసినచోటనే మరలనడుగు వేయుచుండెను. శ్రీయాతఁ డెవ్వఁడని పరికించి చూచి సీతారామరాయలఝునట్లు కనిపెట్టెను.

ఈతరుణమున సిపాయిలు గంగారామును బట్టి గోతిలోఁ బడ ద్రోయఁబోవుచుండిరి. సీతారామరాయలు చేయియెత్తి వలదు వలదని సంజ్ఞఁ జేసెను. అందుపైని సిపాయీ లాఁగిపోయిరి. పహాసాహేబు

# ప్రథమబింబము.

‘మీరిట్లూరకుండి దిక్కులు చూచెద రేల? ఈపరమః
లోఁ బడఁద్రొబ్బుఁడు”

ఇది గాంచుటతోడనే ఖాజీ యేమియుం దోచక మన. యో యోచన సేయఁ దొడంగెను. అప్పు డచ్చటి కాతఁడు రాఁ బని లేదు. కాని యచ్చటకు పోగయిన జనుల యతీతసంఖ్యను బట్టి యందలివిశేషము లేమియో కనుగొందమని యాతఁ డచ్చటకు వచ్చెను. అతఁ డచ్చటకువచ్చియుండుటవలన, వ్యాపారభారమంతయు వానిపైఁ బడియెను. అతఁడు “సీతారామరాయలు దీని నాప ప్రయత్నించుచున్నవాఁడు. దీనికేదో గొప్పకారణ ముండియుండవలయును. లేకున్న నాతఁడు వచ్చువాఁడు కాఁడు. అతఁడు వచ్చెడువఱకును ఆపియుంచుట మంచిది” యని తెల్పెను.

ఇది పహాసాహేబున కెంతమాత్ర మిష్టము లేదు గాని యెట్టులో యొప్పికొనియెను. గంగారాముని హృదయమున నప్పటి కొక్కింత యాశ యుదయించెను.

రాయలు ఖాజీ యున్నచోటికి వచ్చి గుఱ్ఱమును దిగి ప్రప్రథమమున ఫకీరునకును పిమ్మట ఖాజీకిని సలాములు చేసెను. ఖాజీ రాయలను పలుకరించి “రావు సాహెబా? సుఖముగ నున్నవారా” యని యడిగెను. రాయలు “అల్లందావిల్లా” (భగవంతుఁడు వంద్యుఁడు). నేను మిక్కిలి యల్పుఁడను. మీయోగక్షేమమును వినఁ గుతూహల పడుచున్నాఁడను. ఖాజీలదైవ మీదాసునిపై యనుగ్రహించుటచే గప్పిరులను మీసమును నరసి యింతవయసువఱకును బ్రతికియుండి యీసమాధికడకు రా నవకాశము కలిగినది. శ్రీమంత మైనమీస్వస్థానంబున సర్వంబును జక్కఁగ జరుగుచున్నదా?

రాయ—తమవంటి కరుణాళురు. మా కండ యైయుండ మాయది పేద నిలయంబెయైనను, మాకు సర్వమును సురక్షితంబెగాక యొండేల యగు.

ఖాజీ—ఈ మీరాకకుం గతంబేమి?

రాయ—పేరును బ్రతిష్ఠయును లేని మందభాగ్యుఁడగు నీగంగారాము మావర్ణమువాఁడు. ఆతనియందుండెడు నాదరముచే భవత్సందర్శ

నూతని ప్రాణదానంబు వేడఁ జనుదెంచితిని. అనుగ్ర
ు గాక !

దియెన్నఁటి కయినను సాధ్యంబగునా ?

లు— నిగ్రహానుగ్రహసమర్థులును పాత్రాపాత్రవిచక్షణదక్షు
లు నగుమిముబోఁటి పురుషపుంగవునకు సాధ్యంబుకాని దొక్కటి
యుండునా ?

ఖాజీ—ఈవిషయ మింతకు మున్నె సర్వశక్తున యధీనంబయియున్నది
గాని నేఁ జేయవలసిన దేమియును లేదు.

రాయలు—ఆతం డిప్పుడు వేయిమొహారీల యపరాధంబియిన నిచ్చు
కొనుచు. ఆతనికి ప్రాణదానం బొసంగుఁడు.

ఖాజీ—ఫకీరునవంకచూచెను. అతఁడు వల్లపడదని తలఁ ద్రిప్పెను.

అంత ఖాజి మీావిన్నప మంగీకరింప వీల్లులేదని చెప్పి సిఫా
యీాలవంక తిరిగి యానాస్తికుని గోతిలోఁ బడఁద్రొబ్బుఁడని శాసిం
చెను.

రాయలు నేను రెండు వేల మొహారీలు చెల్లించెదను. నా రెండు చేతులు
జోడించి నమస్కరించెదను. ఇయ్యది నా మొగము చూచియైనఁ జే
యుఁడు. నా ప్రార్థన మంగీకరింపుఁడు. అని మఱిమఱి ప్రాధేయపడియె
ను. ఖాజి మరల ఫకీరునివంక దిరిగెను. మఱల నతఁడా విన్నపమంగీకరిం
పక త్రోసిపుచ్చెను. సీతారామరాయలు నాలుగు వేల మొహారీ లిచ్చెద
ననియెను. అయిదువే లిచ్చెదననియెను. ఎనిమిది వేలు పది వేలుకూడ
నిచ్చెదనని చెప్పెను. ఎంతయిచ్చెదనని నను ఫకీరునకు జాలిపుట్టినదికాదు
సీతారామరాయలంతకన్న నాస్తిపరుఁడుగాఁడు. అతఁడు మోకరించి
రెండు చేతులు జోడించి ఖిన్నకంఠుండై "ఇంతికన్న నాయొద్ద నిలవసొ
మ్మెచ్చు లేదు. నాకున్న జిరాయితీ యీనాము భూములును, జాగీరు
లును. ఇతర స్వాస్థ్యములును, వేయేల మఱి నాకడ యేమేమి యున్నవో
యవియన్నియును ఇందులకై ధారవోసెదను. వాని నంగీకరించి
దానికి ప్రత్యామ్నాయముగ నీకతఁ ప్రాణదాన మొసంగుఁడు." అని
పరిపరివిధముల ప్రాధేయపడియెను.

ఖాజీ "నీ కతఁ డెంతటియాప్తుఁడో యెంతప్రియతముండో

యెఱుంగఁజాల. వీనికై నీసర్వస్వమ్ము సర్వమ్మును ధారవోయఁ జూచుచున్నాఁడవు. ”

రాయలు.—అతనిబాంధవ్యము మాట యటుంచుఁడు. అతని రక్షించెదనని బాసఁ జేసి యుంటిని. అందుకై సర్వమును పరిత్యజించియైనను, యాప్రతిజ్ఞ నిలుపుకొనవలసి యున్నది. హిందూమతసిద్ధాంతముల నది యొక ముఖ్యసిద్ధాంతము.

ఖాజీ.—మీ హిందూమతసిద్ధాంతము లెట్టులైననుఁ గానిమ్ము. మహామ్మదీయమతము దానికన్న నుత్కృష్టమయినది. ఈతఁడు సన్యాసిసోదరవర్గంబున నొక్కని ధిక్కరించి, శిక్షాపాత్రుఁ డయినాఁడు. ఈతనికి మరణముదప్ప వేఱుదండనము లేదు. దాని కదియె ప్రాయశ్చిత్తము. అందున కించుకంతయును సంశయము లేదు. ఇట్టినేరమున కిట్టినాస్తికుని ప్రాణాపహరణమునకన్న వేఱుదండన మేమియును శిక్షాస్మృతి యందు లేదు.” అని చెప్పుపల్కుల నాలకించి; రాయలు మరల నొక్కసారి యాతనిపాదములపైఁ బడి, ఖాజీయుపరిచేలాంచలంబు తన హస్తంబునఁ బట్టుకొని, కన్నుల నీరు నించుచు గద్గదస్వరంబున “ అక్కటా! మీకు వలయునది నాస్తికునిప్రాణముగదా ? నేను నొకనాస్తికుఁడనే ? నాప్రాణము సమర్పించిన నీనేరమునకు తగినప్రాయశ్చిత్తము, కానేరదా ? ఇదె నే నిప్పుడే గోతిలో నుఱికెదను. అమన్ను నాపైఁ బోసి పూడ్చి పెట్టుఁడు. శ్రీహరిస్మరణ సేయుచు స్వర్లోకనివాసంబున కరిగెదను.” ఓ ఖాజీసాహేబుగారు? నేనిదె మిమ్ముం బహుభంగుల ప్రార్థేయపూర్వకంబుగ వేఁడుకొనుచున్నాఁడను. ఈనాప్రాణమును గైకొని యీమందభాగ్యునిప్రాణము నొసంగుఁడు. మీయల్లాయును. మాస్వర్గపురాధినాథుండు నొక్కఁడే. ధర్మమార్గంబు ననుసరింపుఁడు. నాప్రాణము నొసంగ సన్నద్ధుఁడనై యున్నవాఁడను. అందులకు ప్రత్యామ్నాయముగ నీయల్పునిప్రాణమును గాపాడుఁడు. ”

అనుచు సంభాషించువారిసంభాషణ వాక్యంబులును, తత్పరిదేవనక్రమంబును, అచ్చటి హిందువులచెవిం బడుటతోడనే వారిహృదయములు నీ రయిపోయి అపరిమితానంద ద్యోతకంబుగ శ్రీహరిసంకీర్తనంబు సేయుచు చప్పట్లు జఱచుచు “ఓ రావుసాహేబా ? యథార్థముగ

నీవు మిక్కిలి యౌదార్యవంతుఁడవు. నీకు సర్వవిధంబుల జయం బగు, ఓఖాజీసాహేబా? ఈమందభాగ్యుని వదలివేసి పుణ్యముం గట్టికొనుఁడు" అని కేకలు వేయసాగిరి.

ఈకేకల కచ్చటనుండు నితరులకేకలుకూడ వచ్చి తోడ్పడి మహాసంకులం బయి యట్టహాసంబయ్యెను. ఇదియంతయును గాంచిన ఖాజీకి యత్యద్భుతంబుగ నుండెను.

ఖాజీ రావుసాహేబును సంబోధించి "అయ్యా! నీ విప్పు డేమి చేయుచున్నాఁడవో యెఱింగి చేయుచున్నట్టు కనుపట్టదు. నీకున్నయీ వదర్థమును పైపెచ్చు నీప్రాణము నర్పించుటకు ఈతఁడు నీకెవరు? ఈతని ప్రాణరక్షణార్థై యింత సేయనగునా?

రాయలు. ఈతండు శరణార్థి యగుటచే నాసహోదరునికన్నను, నాకన్నకడుపునకన్నను ప్రియతముండు. అందులకై నే నీప్రాణ సంరక్షణంబు సేయవలసివచ్చె. తనతోడి యాతనికి యాపత్తు తటస్థమగునేని తనప్రాణమునైన యర్పించి యీతనిప్రాణసంరక్షణంబు సేయవలయును. ఇయ్యది హిందూమతసిద్ధాంతములలో నగ్రగణ్యం బయినది. మున్ను శిబిచక్రవర్తి యొక్కపావురంబునకై తనదేహంబు గోసి యిచ్చె. కాన కరుణించి నాప్రాణముం గొని యాతని విముక్తుం జేయుఁడు.

ఇట్లు ప్రార్థేయపడుసీతారాముని వాక్యంబులకు ఖాజీ యద్భుతప్రమోదమగ్నమానసుండై నిరుత్తరుం డయ్యెను. అంత ఖాజీ ఫకీరుని జనాంతికంబునకు బిలిచి యాతనితో రహస్యంబుగ "ఈతండు వెయి మొహరీలనిచ్చెద ననుచున్నాఁడు. ఈసొమ్మువలన మనఖజానా నిండిపోవును. ఈసువర్ణమును గైకొని యీయభాగ్యుని ముక్తుం జేయ నను గ్రహింపుఁడు." అనియెను.

ఫకీరు—ఈతనిని యీతనిసొమ్మునుకూడ నేకముచేసి యీగోతిలోన పోసి కప్పివేయించెద. విడుచుటయె?

ఖాజీ— "అయ్యో దైవమా! అది యేటిన్యాయము. రాయ లేమి నేరము చేసెను? ఈతఁడు మర్యాదస్థుఁడు. మిక్కిలి గొప్ప కుటుంబములోనివాఁడు. సత్ప్రవర్తకుఁడు. పెద్దమొత్తులలోనివాఁడు. అతనిఁ గూర్చి యట్లు పలుకరాదు."

ఈ నిముసముకును గంగారామునోటనుండి మాటయే లేదయ్యెను. ఎవ్వ రేమి చెప్పినను తనప్రాణము నిలువ దని యాతఁడెఱుంగును. ఖాజీకిని ఫకీరునకును జరిగినరహస్యసంభాషణ మాలకించిన పిదప, నాతనికి కొంచ మాశ యుదయించి, అతఁడు హస్తంబులు జోడించి ఖాజీ వంక తిరిగి కృపాపరిపూర్ణు లగుదేవరచిత్త మెట్లున్నదో తెఱుంగజాల. మందభాగ్యుఁడ నగునాప్రాణరక్షణంబునకై యాతఁడు విన్నవించువిషయంబున నిందఱిముందర నే నొక్కటి విన్నవించుకొనవలసియున్నది. ఒక్కనినేరమునకై మఱియొక్కనిప్రాణము దీయుట యేశిక్షాస్మృతియందునను కనుపడదు. నాప్రాణరక్షణమునకై సీతారాముని ప్రాణము పోవునేని నా కీప్రాణములపై యాశ లేదు. అట్లయ్యెనేని నే నీసంకెలలతోడ నీనడినెత్తిపై మోఁదికొని, నాజీవితము నంతంబు నొందించికొనియెదను. అని యెలుంగెత్తి చెప్పునప్పటి కామందిలో నుండి "నీసంకెలలతోడనె నీప్రాణము నంత మొందించుకొంటివేని, ఈమహామ్మదీయునిచేతిలో ప్రాణములపోవుట లేకుండపోవును." అను కేకలు వినఁబడియెను.

ఈమాటలు చంద్రచూడునివి. అతఁ డెప్పుడు దిగెనో కాని చెట్టునుండి దిగెను. అతఁ డట్లు పల్కుట యాలించి యచ్చట నున్నశిపాయిలలో నొక్కఁడు "పోనీయకుఁడు. వీనినిఁ బోనీయకుఁడు." అని కేక వేసెను. చంద్రచూడ తర్కాలంకారుని పట్టుకొనుట యంతసుకరమైన కార్యములోనిది కాదు. అతని పట్టుకొనసాహసించువారు లేరైరి.

ఇది యటుండ సంకెలలతో నెత్తి మోఁదుకొని చావు మనిచెప్పినపల్కు ఫకీరు చెవిం బడినతోడనే బ్రతికియుండగ మనుష్యుని పాతివేయుమహోత్సవము తన కెక్కడ లేకుండపోవునో యని యారాటము హెచ్చయ్యెను. ఆకారణముచేత నాతఁడు ఖాజీని పిలచి "అతనికింత కాలము సంకెలలు వైచి యేమిప్రయోజనము. అతనిసంకెలలూడఁబెఱుకుఁడు" అని చెప్పెను.

తదాజ్ఞానుసారంబుగ ఖాజీ సంకెల లూడఁదీయించెను. కమ్మరివాఁడు వచ్చి గంగారాముని ముంజేతుల నుండుసంకెల లూడఁదీసెను. దండనాకార్యనిర్వహణసమయంబునం దారంగస్థలంబున కమ్మరివానితో

డ నేమిప్రసక్తి యుండి వాని రప్పించిరందురా ? సర్కారువారిసంకెల లన్నియును, అతనియధీనమం దుండెను. ఆకారణముచేతనే ఆతఁ డచ్చటికి వచ్చినట్లు కనుపట్టుచున్నది. కాని యాంతర్యకారణముమాత్ర మది కాదు. చంద్రచూడుఁడు రాత్రి రహస్యముగా నాతనికి లంచ మిచ్చి యాతని నటకు రావించినాఁడు. ఫకీరు "ఇంక నేల యాలస్యము చేసెదవు. అతని పాతివేయ నాజ్ఞసేయుము." అని కేకలువేసెను.

కమ్మరివాఁడు ముందుకు వచ్చి కాలిసంకెలలుంచుమనెదరా ? ఊడఁదీయుమనెదరా ? దివాణముసొమ్మును సంకెలలును గూడ నూరక వ్యర్థపుచ్చెదరా ? ఈదినములలో మంచియినుము దొరుకుటయే దుర్లభముగనున్నది "దుర్వార్తకు లెక్కువయయినారు. సంకెలలు చేయుపనియందు నా కించుకంతయును తీఱిక లేకయున్నది" అనిచెప్పెను.

పిమ్మట కాలిసంకెలలుకూడ నూడఁదీయుమని ఖాజీ యుత్తరువు చేసెను. ఆయాజ్ఞానుసారంబుగ సంకెల లూడఁదీసిరి. ఈప్రతిబంధము తొలంగుటతోడనే గంగారాముఁ డటునిటు నొకసారి కలయఁజూచెను. పిమ్మట నాతఁ డత్యద్భుతం బగుకార్య మొక్కటి యొనరించెను. సీతారామురాయలు గుఱ్ఱపుకొరడా చేతఁ బుచ్చుకొని దగ్గర నిలుచుండియున్నవాఁడు. ఎవ్వరికి తెలియకుండ నీసీతారామునిచేతిలోనుండి యాకొరడాను సంగ్రహించి గుభాలున నతనిగుఱ్ఱముపై కుటిక యాకొరడాతో ఛెటేలున నొక్కదెబ్బ గొట్టెను. ఆయశ్వము ముందుకువ్రొగ్గి నోరుదెఱచుకుని చూచుజనులచే నిండియున్న యాఖనప్రదేశంబుకడ నుండి యొక్కదాఁటుదాఁటి యొకతెప్పపాటులో నచ్చటనున్న శిఫాయిల నెందఱినో పడఁద్రోసుకొని పోయి క్రిక్కిఱిసియున్న యాజనులనడుమ నుండి యదృశ్య మయ్యెను.

ఈసంగతు లన్నియును తళుక్కు మనిమెఱుపుతీఁగె మెఱయు కాలంబున జరిగెను. అచ్చట చేరియున్న జను లందఱును మఱిమఱి జప్పటులు జఱచిరి. శిపాయీలు గుఱ్ఱమువెంట పరతెంచిరి, "పోనీయకుఁడు పోనీయకుఁ" డని కేకలు వైచిరి "ఇందువల్ల గందరగోళము మఱింత యధికమయ్యెను. ఆగుఱ్ఱము యొక్క పొగరుబోతుతనమును జూచి దగ్గరనున్న వారందఱును జడిసిపోయిరి. ఆకారణముచే గంగా

రాముని ముందు ప్రయాణంబున కింతయును నాటంకము లేకుండపో యెను. శిపాయీలు మందిని చొరుచుకొనిపరుగెత్తలేక పోయిరి. గుఱ్ఱము దాటిపోవుటతోడనే జనులసందడి మఱింత హెచ్చయి సమ్మర్దము హెచ్చెను. అందువలన యెడము మిక్కిలి తక్కువయై పోవ సందు దొరక దయ్యెను. అంతట వా రాయుధసహాయమున దారి చేసికొని పోవఁ బ్రయత్నించిరి. కాని యింతలోఁ గొందఱు బలిష్ఠు లగుజనులు చేత డాలును, బల్లెములును బట్టికొని మోఁచేతులతో జనులను పాయఁద్రోసికొనుచు వారి కెదురుగ వచ్చుచుండిరి. ఇది గాంచునప్పటికి వారికి మన స్సున నుత్సాహము మందీకృతం బయ్యె. వారియాకారములఁ జూడ దేవత మూర్తీభవించి వీరిని ద్రిమ్మంగవచ్చినటు లుండెను. అంత శిపాయి దళము మఱికొంత వచ్చి చేరుకొనియెను. అచ్చటనున్న వారికి తోడుగ మఱికొందఱు హిందువులువచ్చి యాదుకొని మహమ్మదీయుల నెదుర్కొనిరి. ఆకారణము చేత హిందువులకును మహమమ్మదీయులకును పెద్దసంకులసమర మొకటి ప్రాప్తం బయ్యెను.

ఈచర్య లన్నియును చూచునప్పటికి ఖాజీకి యాగ్రహ ముద్రేకం బయ్యెను.

రాయలను బల్కరించి. "ఇదియంతయును నే"మని యడిగెను. రాయలు—"నా కేమియును తెలియ దనియెను." ఖాజీ "నీకు తెలియదు కాని నాకు తెలియుచునేయున్నది. ఇవియన్నియుచు నీచమత్కారములువలె కనుపించుచున్నవి.

రాయలు—అట్లయిన నేను నాప్రాణము నేల యిచ్చుకొన సంసిద్ధుండ నగుదును.

ఖాజీ—"ఇప్పుడె నీప్రార్థన మంగీకరించుతరుణమువచ్చును. తొందరపడకుము. ఈప్రాతరకునీవే యెర వయ్యెదవు."

అని చెప్పుచు కమ్మరవానిని పిలిచి ఖాజీ సీతారామరాయలను పట్టుకొని సంకెలలు వేయు మని శాసించెను. మఱికొందఱి శిఫాయి దళముతో ఫౌజుదారుని యాసంకుల సమరరంగంబునకు రమ్మని కబురు చేసెను. వనదేవతవలె శ్రీ చెట్టుపైనుండి యీచోద్యములన్నియుం గనుచుండెను. సీతారాముని సంకెలలు వేయుట మొదలాం చెను. కమ్మర

వాఁడు సంకెల లాతనిముంజేతికిఁ దగిలించుటఁ గని పెట్టెను. ఫౌజుదారునకు మనుష్యునిపంపుటకూడ చూచెను.

గంగారామునకు దారిలో నడ్డేమియుం దగులలేదు. కాని అతఁడు జనసమ్మర్దముచే నెంతో కష్టపడిపడి యశ్వమును మలఁపుకొనుచు పోవుచుండెను. అతఁడు గుఱ్ఱముపైఁ బడి పోవుచుండఁగా ఆజనము గుంపులో భయంకరసంకులనినాదంబు వినంబడియెను. నిమిషనిమిషంబున కాహాహారవంబు విజృంభించుచున్నట్టులయ్యెను జనులు తండోపతండములుగ వచ్చి పైఁబడుచుండిరి. అశ్వము భయప్రకంపితమగుటచే పట్ట శక్యముకాక యుండెను. గంగారాము గుఱ్ఱపుసవారున పేరు గన్నవాఁడు. ఆకారణమున నీ గుఱ్ఱమును స్వాధీనము చేసికొనుటయందె తనజవసత్త్వములన్నియును వినియోగించుచుండుటచేఁ జుట్టుపట్టుల నేమి జరుగుచున్నదియుఁ దెలిసికొనుట కాతనికి వలనుపడక యుండెను. "చంపుఁడు చంపుఁడు" అను శబ్దముమాత్ర మాతని చెవిం బడియెను.

ఎట్టకేల కతఁడాసంఘమునుండి విడివడి గుఱ్ఱముతోవచ్చి యివతలఁ బడియెను. పిమ్మట నాతఁడు గుఱ్ఱమును విడిచి యెక్కడ నేమిజరుగుచున్నదో చూతమని యచ్చటనున్న మఱ్ఱిచెట్టు చిట్టచివరకొమ్మపయి కెక్కెను. ఆతని కచ్చట మహాసంక్షోభంబుగ నున్నట్టు కనుపట్టెను. అంతకును నేకముగ నుండుజనసంఘమంతయును, రెండుపాయలుగ విడిపోయెను. ఒకవంక నందఱును హిందువులే చేరిరి. ఒకవంక మహమ్మదీయులు ప్రోగుపడిరి. మహమ్మదీయులందఱును శిపాయీల యండను చేరి యుండిరి. హిందువు లందఱును డాళ్లను బల్లెములును చేతఁ బుచ్చికొని ముందు నిలిచియున్నజనులచే సురక్షితులయియుండిరి. హిందువులందఱును పటిష్ఠులె. మహమ్మదీయులసంఖ్య యం దెచ్చుగానుండినది. హిందువులు మహమ్మదీయులను బట్టి మర్దించుచుండిరి. వారుపలాయితు లగుచుండిరి. పగతురు వెన్నంటి తఱుముచు "కొట్టుఁడు. కొట్టుఁడు. చంపుఁ" డని కేకలు వైచుచుండిరి.

ఈ శబ్దముచేఁ జుట్టుపట్టులన్నియును ప్రతిధ్వనించుచుండెను. యుద్ధమున సంబంధమున్నను లేకయున్నను, ప్రతిమనుజుని నోటినుండియును ఈమాటలే వినవచ్చుచుండెను హిందువులు నలుదిక్కులకును

చెదరిపోవుచున్నట్టు గనుపట్టెను. "చంపుఁడు చంపుఁడు" అనుశబ్దంబులతో చండికాదేవికి జయమగుగాక. చండికామాత యచ్చట ప్రత్యక్షం బయినది. చండియాజ్ఞ యయినది. "చంపుఁడు చంపుఁడు" అను శబ్దములుకూడ యాతనిశ్రవణములఁ బడుచుండెను. ఇది యాలకించునప్పటికి యాతనివిస్మయంబునకు మేరయె లేకయుండెను.

గంగారామునకు కేక లేమియు నర్థముకాక ఆశ్చర్యకరముగ నుండెను. అతఁడు తనచూడ్కులు నలువలంకుల సాగుడించి విస్తృతంబయి విజృంభమాణముగ నేచియున్న యొక్కమహావృక్షశాఖపై శ్యామలవర్ణసంకీర్ణసమాచ్ఛాదితయై చండీస్వరూపమును బోలిన సురూప యొకటి యాతనికన్నులఁ బడియెను. చండిక చెట్టుకొమ్మపై పలవల నడుము రెండుపలవలమీఁదను రెండుకాళ్లును పెట్టుకొని యెడమచేతితో మృదువుగ నున్నకొమ్మ నొకదానిని పడకుండఁ బట్టుకొని కుడిచేతితో తనమేలిముసుంగు వలువను విసరుచు "చంపుఁడు చంపుఁడు. శత్రువుల నెల్ల రూపు మాపుఁడు." అని కేకలు వేయుచుండెను. ఈ చేలాంచలము తటతటఁ గొట్టుకొనుచుండెను. ఆచ్ఛాదనచేలంబు వెల్వరించుటచేఁ జెదరియున్న కుంతలములు పయ్యెదతో నాటలాడుచుండెను. ఆమె ప్రగల్భచరణభారంబుచే ద్విధాకరింపంబడిన యాశాఖ క్రిందకును పైకిని ఊఁగిసలాడుచు తూఁగుటుయ్యలమాదిరి నూఁగుచుండెను. మనోజ్ఞ మగునామె మోహనాకారంబును ఒక్కప్పు డుప్పొంగుచు, ఒక్కప్పుడు క్రుంగుచుఁ నుండెను. సమరోత్సాహియై దుర్గామహాదేవి సింహవాహనారూఢయై క్రీడసేయుచు సాక్షాత్కరించెనో యనునట్టు లుండెను. అసురుల నంధతరూపుమాప తదేకదీక్షాపరతంత్ర యయియున్న మహిషాసురమర్దనివలె నయ్యవసరంబున పోడనూపుచు "చంపుఁడు, చంపుఁడు, మారణము సేయుఁడు." అని కేకలు వేయుచుండెను. స్త్రీకిఁ గల లజ్జయంతయును నామెకడ నీదినమునందంతరించిపోయెను. ఆమెకు నాఁడు బాహ్యవిషయపరిజ్ఞానమంతయును విడచిపోయినట్టు లయ్యెను. "చంపుఁడు చంపుఁడు. శత్రువులను చంపుఁడు. హిందువుల శత్రువులు నాకు పరమశత్రువులు శత్రువులను జంపుఁడు చంపుఁడు" అని విసుకును విరామమును లేకుండ కేకలు వేయుచుండెను. ఆమె బాహులతిలకలు మిక్కిలి మనోజ్ఞము

లయినవి. అయ్యావి యూర్ధ్వముఖంబుగ నుండెను అధరోష్ఠము ముడివడియెను. నాసికారంధ్రంబులు విస్తరిల్లెను. కన్నులు రక్తిమను జెందెను. పాలభాగంబంతటను, చెమ్మట సోనలగుచుండెను. ఆ చెమ్మట సోనల చెదరినముంగురులు జలకంబు లాడి మనోహరంబుగఁ గనుపట్టెను. హిందువులందఱు నత్యంతభక్తిపూర్వకంబుగ నామెను గనుంగొనుచుండిరి. చండీమహాదేవికి జయ్. జయ్. అని కేకలు వేయుచు, ఒడలు మరచి యుద్ధమునకు దుముకుచుండిరి. మొట్టమొదట నామెను గాంచి గంగారాముకూడ నామెను చండికయే యనుకొనియెను. కాని తేఱిపాఱఁజూడఁగా నామె శ్రీయని కనిపెట్టి విస్మితుఁడయ్యెను.

చండీసాక్షాత్కారమున నత్యుత్సాహమును జెంది హిందువులు యుద్ధమున విజయమునందిరి. ఆమెపరాక్రమము హిందువులయం దావేశమైనదో యేమో యెఱుంగము గాని మహమ్మదీయులు తమయుద్ధతికిఁ దగినట్టు పోరాడలేక చెల్లాచెదరయి పోయిరి. కొలఁదికాలముననే యుద్ధరంగ మంతయును నిర్జనప్రదేశం బయ్యెను. దీర్ఘకాయుండును బలిష్టదేహుండు నగుపురుషుం డొకఁడు రాయలును తనమూపుపయి నెక్కించుకొని శ్రీయున్న చెట్టుకడకుఁ గొనివచ్చెను. మఱియొక్క హిందువుఁడు మహాసాహేబుమస్తకము ఖండించి తల బల్లెమునకు చివర తగిలించి యాకాశపథంబున నల్లలాడించుచు వచ్చుచుండెను. ఇదియు నదియుగూడ గంగారాముకన్నులఁ బడియెను. ఈక్షణమున శ్రీయానందపారవశ్యమున యొడలు మఱచి చెట్టుపయినుండి క్రిందఁ బడియెను. గంగారాముఁడు చెట్టునుండి దిగి క్రిందకు వచ్చెను.

---

# ప్ర థ మ బిం బ ము.

## ఆఱవ ప్రకరణము.

రాజద్రోహుల నణఁచుటకై ఫౌజుదారు స్వయముగ ఫిరంగులు, బల్లెములు, మందుగుండుసామానులు నాయత్తపఱచుకొని వచ్చుచున్నాఁడని కింవదంతి యొకటి పుట్టెను. ఈమందుగుండుసామానులయెదుట ఱాళ్లును, బల్లెములును, ఏమి పనికివచ్చును. ప్రబలులై దేహపాటవము గలిగినప్రబలసైన్యమంతయును, యదృశ్యమయ్యెను. ఎన్నఁడును ఆయుధము మొగమయిన నెఱుంగనిప్రల్లదులు కొందఱు ఆయుధహస్తుల యాధిపత్యంబున ప్రవర్తించి గడచినసంకులసమరంబున విజయంబు నందిరి. ఆవిజయంబంతయును, తమవల్లనే కలిగినదని స్వోత్కర్షఁ జెప్పుకొనుచు బీరములు గొట్టినప్రేలరులు హడావడి చేయుచు "ఇట్టి పనిఁ జేయవద్దని మొట్టమొదటనే చెప్పలేదా ?" అని మరల నిటునటు చూడనైనఁ జూడక, ఒకత్రుటికాలములో నింటికిఁ బోయి తిరిగి చూచిరి. ఆయల్లరితో నేవిధమయినసంబంధము లేకుండ నుండిన నిరపరాధు లందఱును దుర్మార్గులును సన్మార్గులునుకూడ నొక్కతీరువారె యయి పోవుదు" రనుభయంబున గంగారాముని సీతారాముని, ఒక్క క్షేమాదిరిని తిట్టి పోయసాగిరి. హృదయమున నుప్పతిల్లుచున్న మనోవ్యథాభారం బతిపరుషంబుగ వారి వాక్కులనుండి బయలువెడలుచుండెను. నిప్పంటించినతోడనే తుపాకిమందు ప్రేలి యదృశ్యమగుతెన్నున తండోపతండములుగ నున్నజనబాహుళ్య మంతయును నొక్కత్రుటిలోన యదృశ్య మయ్యెను. రంగస్థలమంతయును యెప్పటివలె విజనంబయి యుండె. ఇంక నక్కడనున్న వారలెల్ల చంద్రచూడుఁడును, రాయలును గంగారామును, చెట్టుమొదట నొడలుదెలియక పడియున్న స్త్రీయును మాత్రమె.

రాయలు గంగారామును పల్కరించి "నీవు దొంగిలించి కొని పోయినగుఱ్ఱ మేమయినది? ఆగుఱ్ఱమును అమ్మివేసి సొమ్ము కడతేర్చలేదుకదా ?" అని మేల మాడెను. గంగారాము చిఱునవ్వు నవ్వి, లేదు. లేదు. గుఱ్ఱమును వదలివేసితిని. కావలసినయెడ తిరిగి పట్టుకొని తెచ్చి యొప్పగించెదను.

రాయలు.—అట్లయిన పట్టుకొమ్ము. నీవు మరల దానిపయి నెక్కిపొమ్ము.

౧౦గా.—నిన్ను విడచియేనా?
రాయలు.—నీసోదరి యే మగునో యని శంకింపకుము.
గంగా—నిన్ను విడచి పోవనేరను.
రాయలు.—శ్యామాపురము ఎఱుఁగుదువా? అచ్చటనున్న పెద్ద నదిని దాఁటిపొమ్ము.
గంగా.—అట్టులే చేసెదను.
రాయలు.—అక్కడకు శీఘ్రముగఁ బొమ్ము. న న్నచ్చటఁ గలుసుకొనఁ గలవు. ఇది నమ్ముము. నిన్ను రక్షింప నెవ్వరికిని తరముకాదు.
గంగా.—మీసాంగత్యము వీడి నే నొక్కయడుగైన నవలకు వేయు వాఁడను కాను.

రాయలు గంగారాముని యెడల కుపితుఁడయి నే నిప్పుడు ఫౌజు దారు నొద్దకు పోయెదను. నీవు కూడ నచ్చటకు నావెనువెంట వచ్చెదవా? ఏమి. రాయలవి కేవలమును మాటలుమాత్రమె యయినచో యాతఁ డంత లెక్కసేయకుండునుగాని అతనిముఖవికారము గాంచి సీతారామునకు నిశ్చయముగ తనయందు కోపము వచ్చినట్లు కనిపెట్టి గుఱ్ఱమును వెదకఁబోయెను.

ఇచ్చట నీసంభాషణము జరుగుచుండఁగా మఱియొకదిక్కున చంద్రచూడుఁడు శ్రీయొద్దఁ జేరి, యామెను మూర్ఛఁ దేర్చుటకయి తన యిచ్ఛాశక్తిచే తగినయుపచారము జేయుచుండెను. ఈ యుపచారము నకే (మెస్మరిజము) అనిపేరు. చంద్రచూడుని యుపచారమువల్లనో లేక మఱియొక కారణమువల్లనో చెప్పలేముగాని కొంతొకసేపటికి యామెకు తెలివి వచ్చి మెల్లమెల్లగ లేచి కూర్చుండెను. మేలిముసుంగు సవరించు కొని అటునిటుఁ గలయంజూచి లేచి నిలువంబడి యెవ్వరితోడను పలు కక యచ్చటనుండి పట్టణపుత్రోవఁబట్టి చనియెను.

ఆమె కొంతవడి యరిగినపిమ్మట చంద్రచూడునితో సీతారాముఁడు "ఈమెను వెంబడించి పోయి భద్రముగఁ గాపాడుప్రయత్నముల సేయుము. అంతకన్న మీకు నెక్కువగఁ జెప్పవలసిన యావశ్యకత లేదు" అనియెను.
చంద్రచూడుఁడు.—నీ వేమి చేయుదువు?

రాయలు — ఆవిషయమే నా కింకను పాలుపోవకున్నది. నీవు శ్యామపురమునకు పోవలెను. నేను బ్రతికియుండితినేని నిన్నుఁ గలుసుకొందును.

అనుమాట వినినతోడనే చంద్రచూడునకు మనస్సున మిక్కిలి ఖేదము జనించెను. అనంతరము సీతారామును వీడ్కొని శ్రీని యనుగమింపఁ బోయెను. గురుశిష్యు లిద్దఱకును పూర్ణముగ నొకరియాశయ మొకరికి బోధ యయ్యెను. ఆకారణమున చంద్రచూడుఁడు రాయలు చెప్పినదానికి ప్రతిచెప్పకుండ చక్కఁబోయెను.

ఇప్పటి కారంగస్థలమంతయును విజనప్రదేశమయినది. రాయలు లేకుండునెడల బొత్తిగ నెవ్వరు లేకుండియుందురు. ఆతఁడు మాత్ర మొంటరిగ చండికాదేవివలె శ్రీ గూర్చుండియున్న చెట్టుకొమ్మయె పట్టుకొని ఆచెట్టుమొదటనే కదలకమెదలక నిలుచుండి యుండెను. ఇట్టిసమయములె మనుష్యునకు భవిష్యత్కార్యయోచనలఁ గలిగించుతరుణములు. రాయలకు నిట్టియోచనలె మనమం దంకురించెను. అతఁడు తనలో "ఇప్పుడు జరిగినపని యేమి? దీనికిఁ గారణ మేమి? దీనినిఁ దెచ్చిపెట్టినవా రెవ్వరు? చివరకు దీన మేలు కలుగునా? ఏమియును గోచరింపకున్నయది" అని యనుకొనఁజొచ్చెను.

అతని మనోనేత్ర మేదిక్కునకరిగినను మహమ్మదీయులఘోరకృత్యములు తక్క మఱియేమియును గనుపట్టవయ్యెను. తొల్లింటి దేవాసురయుద్ధగాథ లప్పు డాతనికి స్ఫురణకు వచ్చెను. వృత్ర, శంబర, త్రిపుర, సుందోపసుంద, వాలి, ప్రహ్లాద, విరోచనప్రముఖుల రూపుమాపిన దెవ్వరు? వారు నిర్మూలం బగుటకుఁ గారణ మెద్ది? వారియుత్పత్తికిఁ గారణ మెద్ది? వారిరూపు మాయుటకు హేతు వేమి? యని యనుకొనియెను.

పిమ్మట నరులచే నిహతులయిన రాక్షసులు తలంపునఁ బారిరి. "రావణ, కుంభకర్ణ, ఇంద్రజి దలంబు స హిడింబ బక ఘటోత్కచ శిశుపాలదంతవక్ర కంస జరాసంధ దుర్యోధన ప్రముఖుల నెవ్వరు పరిమార్చిరి? వా రేల నిహతు లయిరి? నహుషుం డేల భీకరపన్నగంబు గా శపింపఁబడియె" నని యోజింపఁదొడఁగెను.

యోజించి యోజించి యనివార్యంబుగ బొంగి పొరలుచున్నతన యోజనా తరంగంబుల వెల్లువనుండి 'అద్వైత' శబ్దమునకు భగవచ్చోదితమయిన ధర్మమని యర్థము జేసికొనియెను.

పిమ్మట రాయల కింతకంటెను ప్రాముఖ్యమయినతలం పొకటి మనస్సునకు వచ్చెను. దీపముం జూచిచూచి కన్నులు మూసికొనినయెడ నప్పుడుకూడ గోచరించు సూక్ష్మతేజోరేఖలవలె ప్రప్రథమమున మహాప్రళయ సన్నిభంబై, క్రమక్రమముగ నట్టి విలయరూపంబుగ మాఱి జ్ఞానేంద్రియగోచరంబయిన తేజఃప్రసారమొక్కటి యాతని మనోనయనంబునం బొడకట్టెను. అదియె జ్ఞాన తేజస్సు. అడవిలోం జెట్లనుండి రాలుపర్ణసముదాయంబు దహించు నగ్నికణంబు తొలుదొల్త మిణుంగురుపురుగు మెఱుంగువలె సూక్ష్మముగ గనుపట్టును. ఎంత సూక్ష్మంబుగ నుండినను నది యగ్నియె. సీతారామునికది యట్టితేజస్సువలె కనుపించెను. ఆహా. ఈ తేజస్సు మనస్సున కెంత ఆనందదాయకముగ నున్నది. కేవలస్వర్గసుఖము కరతలామలక మయిన ట్లున్నది. స్వర్గసుఖం బన రాదు. దీనితోం బోల్చిచూచితిమేని స్వర్గసుఖమేపాటిది. అదికూడ నిస్సారమయి కేవల లవమాత్రంబయి చూపట్టు. ఎవ్వని మనంబునకేని యట్టితేజస్సు జన్మంబున నొక్కసారి తలంజూపెనేని యాతండు దాని నెన్నండయిన మఱువంగలుగునా ? జ్ఞానమే ప్రపంచసౌఖ్యమున కెల్ల మూలాధారము, ఆద్యంతరహితంబయిన చైతన్యంబు నెఱుంగ నదియె దిక్ప్రదర్శక యంత్రంబు.

మిణుంగురుపురుగువంటి తేజస్సొకటి సీతారామునిహృదయమున తళుక్కుమనియెను. అరణ్యమునందలి శుష్కపర్ణంబుపై ప్రబలిన యగ్నికణంబు క్రమక్రమంబుగ విజృంభించి మంట మండునట్టుల సీతారామునిహృదయమున నీజ్ఞాన తేజస్సు క్రమక్రమముగ విజృంభించి దేదీప్యమానంబుగ వెలింగెను. ఆకు లెంత విజృంభమాణముగ నంటుకొనిన, అరణ్యమునందలి చీఁకటి యంత విరళ మయిపోయెడు నట్లును, నల్లనియాకులన్నియును దమనైల్యమును వీడి స్వచ్ఛం బగుహరిత్ప్రభల నెసంగుచున్నట్లును, ఆతనిహృదయగహనం బప్పుడా తేజోలవప్రసారంబున కోటిసూర్యప్రభాభాసమానంబయి యలరె. పుష్పములును ఫల

ములును, ఆకులును పూవులును, మొదళ్లును కొమ్మలును కూడ జాజ్వ ల్యమానం బగు నీ తేజస్సుచేఁ గంపింపఁజొచ్చెను. క్రమక్రమంబుగ న య్యది బీభత్సరూపంబుఁ దాల్చి కార్చిచ్చువలె ప్రజ్వలించెను. రాయల కీమానసిక తేజస్సుయొక్క స్వరూపస్వభావములు గోచరించెను. అత నిహృదయగగనంబున నాకస్మికంబుగ నుదయంబయిన నాభాస్కరుం డనిన ధర్మప్రభుత్వసంస్థాపన యని యాతనికి ద్యోతకంబయ్యెను. ఈభా స్కరునివలన నాయంధకారమంతయును, పటాపంచ లగునని యాతఁడు కనిపట్టెను. ఈవిశ్వాస ముదయమయినతోడనే యాతనిమనంబున కారాటము జనించెను. హృదయమున నిర్మలజ్ఞాన మున్న యాతఁ డె వ్వఁడయిన సమభావముతోడ నుండఁగలఁడా? ఈయుద్రేకం బాతనికి ప్రప్రథమంబున నావేశంబయినతోడనే యాతఁడు తనభుజంబు నప్పళించి "ఓభుజమా! నీవంత బలహీనమవా? నీవు లెక్క ఖడ్గము నతిలాఘ వంబుగ నప్పళించువా రెవ్వ రున్నారు? నీముష్టిఘాతంబునకన్న బల వత్తరంబయినది మఱియొక్కటి యెద్ది యున్నది? ఓయాస్యమా! నీవు వాగ్దేవతాప్రసాదంబున వర్థిల్లుట లేదా? లోకహృదదయాకర్షణంబు నీ కొక్కలెక్కయె? హృదయమా! నీవు లౌకికకార్యపారంగతవు కావా?"

అని యనుకొనునప్పటికి నాకస్మికముగ విద్యుత్ప్రభ దేహంబున జొరంబాఱిన ట్లయ్యెను. ఆనిముసంబుననే హృదయంబునుండి జ్ఞానతే జ స్సంతరించెను.

"నే నిప్పు డేమిమాటలాడుచుంటిని? నా కేమి పిచ్చి యెత్తెనా యేమి? నే నిప్పు డేమి చేయుచున్నాను? నే నెవ్వఁడను? నే నెంతటి వాఁడను, చీమవంటివాఁడను, దోమవంటివాఁడను, సముద్రపువారనున్న యిసుకతిన్నెలోని యిసుకరేణువను. నా కింతప్రాగల్భ్యమా? సామ్రా జ్యముల నార్జించునంతటివిజ్ఞానమా నాకు? ఇది వివేకమగునా? ఛీ ఛీ యిదియేటి యవివేకము?" అని యనుకొనియెను.

రాయలు. తదేకధ్యానరతుఁడై భక్తిపూర్వకంబుగ సర్వేశ్వరునిట్లు ధ్యానింపఁజొచ్చెను.

సీ. ఎవ్వాఁడు సృష్టికి నెల్ల మూలం బగు నెవ్వాఁడు నిత్యుఁ డై యెసగు చుండు;
ఎవ్వాఁడు శాశ్వతుం డెవ్వండు ప్రాణులచైతన్యములకెల్ల జన్మభూమి
ఎవఁడు జీవులచేష్టలెల్లఁ బరీక్షించి యుచితఫలంబుల నొసఁగు చుండు
కర్మసూత్రగ్రంథికర్త యెవ్వాఁ డే; వం డైహికక్రియలప్రోత్సాహకుండు
ధర్మ మెవ్వండు శక్తులమర్మ మెవఁడు, విక్రమ మెవండు లయకాలచక్ర మెవఁడు
అట్టిపరిశుద్ధు పరమాత్ము నప్రమేయు, నవ్యయానందనిలయు నాయాత్మఁ దలఁతు.

అతనిపరిశుద్ధతయును, అతని మహిమంబును, అతని నిత్యతయును, తలంచిచూచెను. శక్తియనిన, పరాక్రమమనిన, ధర్మమనిన, నతఁడే యని యాతఁడు తెలిసికొనెను. ధర్మములేని యధికారశక్తి తుదకు బలక్షీణ మయినదని కనిపట్టెను. ధర్మమే ధర్మప్రభుత్వమునకు మూలమని యనుకొనియెను. సీతారామునిహృదయమిప్పుడు సంతుష్టింగని ప్రశాంతత నొందెను. వాత్సల్యముదయించెను. నలువలంకులఁ బరికించి చూచు నప్పటికి రంగస్థలమంతయును సైన్యముతో నిండియుండెను.



## ఏడవ ప్రకరణము.

తిరుగబాటు జరిగించినవారందఱును, మహమ్మదీయసైన్యము రాకమునుపే పాఱిపోయినట్లు ఫౌజుదారునకు తెలిసినది. సైన్యమిప్పుడు చేరినది యుద్ధము చేయుటకై కాదు. ఆ దొమ్మిలో సంబంధము కలుగఁ జేసికొనిన నేరస్థుల నందఱను చెఱఁబెట్టు నిమిత్తము సైన్యమంతయును రావింపంబడెను. కాని యుద్ధరంగమున నెవ్వరును లేకయుండుటఁ గాంచి కొంద ఱూళ్లదిక్కునకును, కొందఱు పట్టణముఖంబునకును, చెదరిపోవ నారంభించిరి. ఆ సైనికులలో నొక్కఁడు కదలక మెదలక నిలచియున్న రాయలకడకు వచ్చి ఆతనిని నీ వెవ్వ రని యడిగెను?

రాయలు—నేను మనుజుఁడను.

సైని—మనుజుఁడ వని యెఱుంగక పోలేదు. నీపే రెవ్వ రనుచున్నాను?

రాయలు—నాపేరుతో నీ కగత్యమేమి?

సైని—నీవు దుష్ప్రవర్తకుఁడవేమో?

రాయలు—ఐనఁ గావచ్చును.

సైని—దేశద్రిమ్మరివా?

రాయలు—అదియును కావచ్చును.
సైని—నీవుబందిపోటువాఁడవా ?
రాయలు—నే నెట్టులు కనుపడుచున్నాను ?
సైని—నీవు దొంగవు కావచ్చును ?
రాయలు—ఢిల్లీచక్రవర్తికన్న నెక్కుడవాఁడను
సైని—ఏ మనెదవు ?
రాయలు—నన్నేల బాధించెద వనుచున్నాను.
సైని—మంచిది నిన్నిప్పుడు చెఱఁ బెట్టెదను ?
రాయలు—అభ్యంతరమేమి ?
సైని—అట్లయిన పద ?
రాయలు—నేనెచ్చటికి రావలెను ?
సైని—కారాగృహమునకు.
రాయలు—అట్లయిన ముందునడువుము ?
నీవుగుఱ్ఱముమీఁద నున్నాఁడవు. నడచివచ్చువానికి నాకును నీకును ఎక్కడ కలియును?
సైని—అట్లయినపరుగెత్తుము సైనికుఁడు చుఱుకుగా నడచుచుఁబోయెను. సీతారామరాయలు వానిని వెంబడించెను. దారిలో నా సైనికునకు పైకారియొకఁడు కనుపించెను. వానినిపలుకరించి "ఈమనుష్యుఁడు దొంగ. ఈతనిని జైలునొద్దకు తీసుకొనిపోయి జమీందారునకొప్పగించుము" అనిచెప్పెను.

---

## ఎనిమిదవ ప్రకరణము.

ఏవిధమయిన బాధయును లేకుండ చంద్రచూడుఁడు శ్రీని పట్టణమునకుఁ గొనిపోయెను. ఈమె నేకాంతముగ నున్న నొక్కచిన్నగుడిసె యొద్దకు తీసుకొనిపోయి "నాచిన్నబిడ్డా! ఇటురమ్ము. ఇక్కడ కాళికా దేవి విగ్రహ మున్నది. కలియుగమునందు నిద్రాముఖంబై యుండు తక్కిన దేవతలవలెఁ గాక ఈమె యెల్లప్పుడును మెలకువగనె యుండును. ఈమె దర్శనముచేసి ప్రణమిల్లుదము రమ్ము. ఈమె ప్రసన్నయగును." అని చెప్పెను.

ఆతని యాజ్ఞానుసారముగా శ్రీ ఆ యింటిలోఁ బ్రవేశించెను. లోపలికి పోయి చూచునప్పటికి యాస్థలము వివిక్తమయి యుండెను. అం దొకగదిలో దేవతావిగ్రహమున్నది. ఆవిగ్రహము సగమువఱకును బిల్వదళములచేతను శ్రీ చందనములచేతను పూజాకుసుమంబులచే తను మఱుంగుపడి యుండెను. ఆగదిలో నొక్క యాఁడుదిమూర్తి మున్నది. ఆమెకు ఎనుబదియేండ్లు చేరఁబాఱినవి. ఈస్త్రీ చంద్రచూడుని చూచుటతోడనే "తండ్రి! తర్కా! నీవా వచ్చినది." అని పల్కరించెను. చంద్రచూడుఁడు "ఓయవ్వా! అమ్మవారు కాళికి పూజ బాగుగ జరుగుచున్నదా?" అని యడిగెను. ఈమెకు వయసు చెల్లియుండుటచే శ్రవణశక్తి తగ్గిపోయినది. ఆమె యీమాట "మీచెల్లెలికొడుకు బాగుగనున్నాఁడా" యని యడిగినట్లు లర్థము చేసికొనియెను. దానికి తగినట్లులామె "ఇంకను జ్వరము పోలేదు. పైగా అజీర్ణవ్యాధి యంకురించినది. అతని బ్రతుకంతయును అమ్మవారిదయమీఁద నున్నది." అని బదులు చెప్పెను.

ఈకొలది సంగ్రహసంభాషణమును బట్టియే యీయవ్వ చెవిటిగొడయని కనిపెట్టెను. చంద్రచూడుఁడు శ్రీతో ప్రస్తుతము నీ వీస్త్రీతోకూడ నుండుము. గంగారామునస్థితి కొంచము కుదట పడినతరువాత ని న్నాతనియొద్దకు తీసికొనిపోయి దిగవిడచెదను. కాని మహమ్మదీయులయలజడి హెచ్చుగా నున్నది. నీ వీయింటిలో నొక్కతె వుండుట యెట్లో తెలియకున్నది.

శ్రీ.—అయ్యా! మహమ్మదీయు లి ట్లింతకాలము ఘోరకృత్యములఁ జేయుచుందురు? శాస్త్రములలో నిందునగుఱించి యేమియుఁ జెప్పి యుండలేదా?

చంద్రచూడుఁడు.—కుమారీ? అట్టిదేమియు లేదు. దానికి శాస్త్రములతో ప్రసక్తి యేమియును లేదు. ఆపనియంతయును హిందువులదేహదార్ఢ్యములతోఁ జేరియున్నది.

శ్రీ—అయ్యా? హిందువులలో దేహబలము తక్కువగనున్నదా?

ఇప్పుడేకదా వారి బలమంతయును విశదముగఁ గనుపడినది.

ఈమాటలు చెప్పునప్పుడు శ్రీయొక్క మేను కొడమసింగపు మేని

వలెయుబ్బిపోయెను.

చంద్ర—వత్సా ! నేనెచ్చట చూచినను నేఁడు నీ పరాక్రమము తక్క మఱి యెద్దియును కనుపించుటలేదు. ఇట్టిది మఱియొక్కటి మన జన్మంబున కనుపించునా ?

ఉద్రేకించిన యాకొండమసింగ మా మాటచే సిగ్గుపడి మొగము వాంచెను. పిమ్మట కొంత సేపటికి మరల తల యెత్తి "అయ్యా ! హిందువులకేల యిట్టి దౌర్బల్యము సంభవించినది. చాలమంది వీరిలో బలవంతులుండిరని చెప్పుకొందురు." అని యడిగెను.

కుశాగ్రబుద్ధియగు చంద్రచూడుఁడు శ్రీని నఖశిఖపర్యంతమును నామె యెఱుంగకుండ పరీక్షించిచూచి తనలో "మేలు చిన్నదానా? మేలు? నీవే నామనసువచ్చినదానవు, దానిని గుఱించియే నే నాలోచించుచుంటిని" అని యనుకొనియెను.

పిమ్మట శ్రీని సంబోధించి "హిందువులలో పరాక్రమవంతులు లేక కాదు. అట్టివా రున్నమాట వాస్తవమే ; కాని వారు మహమ్మదీయుల నాశ్రయించి, వారియనుగ్రహముల వాంఛింతురు. చూడు. సీతారాముని చూడు. అతఁడు చేయలేని దే మున్నది. అతఁ డతిరాజభక్తుఁడు. ఆకారణముచేత చక్రవర్తికి ననేకోపకారములు చేసినాఁడు. తగినకారణ ముండినగాని యాతఁడు తిరుగబాటున కొప్పుకొనునా? అది యటుండ మతము నిమిత్తమై కేవలమును అభిమానించువా రెవ్వరున్నారు"

శ్రీ—కాని యిప్పు డందులకుఁ దగినకారణమే లేదా? అని మరల తల వాంచెను. కొండొకసేపు మౌనము వహించి, "నే నాఁడుదానను బలహీనురాలను. నే నీరీతిని నేల మాట లాడుచున్నానో యెఱుంగఁ జాల. తల్లి మరణించిన విచారము చేతను, సోదరుఁడు పొందుచున్న కష్టములచేతను, దుఃఖభాజన నై స్వతస్సిద్ధముగ మనస్థైర్యమంతయు చెడి, పిచ్చి యెత్తి యేమేమో వదరుచున్నదానను" అని యనియెను.

కాని చంద్రచూడు డీసమాధానము నపేక్షించలేదు. అది యాతఁడు వినిపించుకొనన్నైన లేదు. అతఁడు "ఇంతవఱకు నట్టికారణ మేమియును కనిపించలేదు. అట్టికారణము తటస్థ మయ్యెనేని యేమగునో

తెలియదు. మహమ్మదీయుల క్రౌర్యమువలన సీతారామునకు స్వాంతనష్టమేమయిన సంభవ మయిననేగాని యాతఁడు ప్రభుత్వముపయి దాడి వెడలఁడు'' అని చెప్పెను.

శ్రీ—ఈమాట విని విచారమగ్నమానస యయ్యెను. చంద్రశేఖరుఁడు మేఘముల కాంక్షచే వీక్షించు చాతకపక్షివలె శ్రీమొగమువంక నదేపనిగఁ జూడసాగెను. ఆమె యేదియో యోచనలో మునిఁగి యున్నట్లు లాతఁడు కనిపెట్టెను. ఆమెదేహమంతయు పరవశ మయి పోయినది. ఆకారణముచే నాతఁడు ''బిడ్డా! ప్రస్తుతము నీ విచ్చట నుండుము. నే కదలి పోయెదను'' అని చెప్పెను.

కాని శ్రీ అందుల కేమియు బదులు చెప్పలేదు. చంద్రచూడుని పల్కు లేమియు నామె వినిపించుకొనిన జాడ కనుపించలేదు. చంద్రచూడుఁ డామె యేమయిన పల్కునేమో యని చూచెను. అతఁడు బుద్ధి యొక్క యంతర్భేదములన్నియును పరిపూర్ణముగ నెఱింగినవాఁడు స్పష్టముగ పైకి కనుపడుచున్నను అంతరించినను నెమ్మదిగ నున్నను విజృంభించి చెలరేఁగుచున్నను దాని నాతఁడు కనిపెట్టఁగలఁడు. కొంతవడికి శ్రీవంకఁ జూచి యామెమనస్సు పూర్ణముగ గుదురు పఱచుకొనినట్లు గనిపెట్టెను. ఆమెముఖమున మందహాసమును, కన్నుల ధాళధళ్యమును వెలుంగుచుండెను. చంద్రచూడుఁడు ''మేఘము లిప్పుడు వర్షింప నున్నవి. చాతకమునకు దాహము తీరుసమయ మయినది'' అని నిశ్చయించుకొనెను.

శ్రీ—తనమేలిముసుంగు నొక్కింత సవరించుకొని అధరోష్ఠమున మందహాసము నటింప ''ఈసమయమున మన మారంగస్థలమునకు పోవ ననువుపడదా'' యని యడిగెను.

చంద్ర—ఏల? అది మిక్కిలి హానికర మయినకార్యము. ఏమూలఁ జూచినను శిఫాయీలు మూఁగియున్నవారు.

శ్రీ—కాని నేను తప్పక పోవలెను. అక్కడ నా దొకవస్తువు పడిపోయినది. మీ కిష్టము లేకుండిన నుండి పొండు. నే నొక్కతెనే పోయెదను.

చంద్ర—ఏమీ? నీ కున్నంతమాత్రము ధైర్య మయినను లేనివాఁడనా

నేను? రమ్ము నేనును నీతోడఁ గూడ వచ్చెదను.

అనంతరము శ్రీ దొమ్మి జరిగినయెడకు పోయెను. గుఱ్ఱపు దళమును కాల్బలమునుకూడ దొమ్మి జరిగించినవారిని పట్టుకొనఁ దిరుగుచుండిరి. అం దొకసిపాయి చంద్రచూడుని పట్టుకొని యెవరు నీ వని యడిగెను.

చంద్ర—నే నొకపురోహితబ్రాహ్మణుఁడ నని, కనిపించుట లేదా? మాశిష్యులయింటిలో నొకచోట నీరోజున పార్వణశ్రాద్ధమున్నది. అందుకొఱకయి గ్రామాంతరము పోవుచున్నాను. ని కేమి కావలయునో చెప్పుము. ఒక్కక్షణములో చేసెదను.

సిపాయి—మంచిది నీవు పోవచ్చును. ఈయాఁడుది నీ కేమగునో చెప్పుము.

చంద్ర—ఈమె నా కేమియును కాదు. ఈమెకును నాకును సంబంధమే లేదు.

అని చెప్పుచు చంద్రచూడుఁడు శ్రీని విడచి కొన్ని యడుగులు నడచెను. ఇప్పు డీతఁడు శ్రీయిష్టముచొప్పున పోవలసినవాఁడు కాఁడా? ఔను. ఆసంగతి అతఁడు మరువలేదు.

శ్రీని సిపాయి పిలచి "నీ వెవ్వరో చెప్పి యింటికిఁ బొమ్ము. మా కిచ్చట నొక్కతెను వినా మఱి యాఁడువాండ్ర నెవ్వరిని పట్టుకొనుట కధికారము లేదు. ఆమెకొఱకయి వెదకుచున్నాను."

శ్రీ—చెట్టుకొమ్మమీఁదఁ గూర్చుండి వ్యాకులపడుచున్నయాపె యేనా మీకు కావలసినది?

సి—ఔను. ఆపెపేరు చండి.

శ్రీ—ఆమెపే రెవ్వరయిన నీ కేమి లే. ఆనిరర్థకురా లగు స్త్రీని నేనే. అనునప్పటికి సిపాయిదేహము జలదరించెను.

సి—మంచిది నీ వే మనెదవు?

శ్రీ—అనుట కే మున్నది? ఆ మందభాగ్యురాలను నేనే యనుచున్నాను.

సి—అయ్యో దైవమా? అ ట్లనఁబోకమ్మా? ఇంటికి పోవమ్మా?

శ్రీ—దైవము నిన్ను రక్షించుఁగాక. ఇదే నే నింటికి పోవుచున్నాను

అను నంతలో నింకొకసిపాయి వచ్చి ఈయాఁడుదాని నేల పట్టుకొనియెదవు? అని యడిగెను. మొదటిసిపాయికి ప్రాణసంకటము వచ్చెను. రెండవసిపాయి ఆమెతోడ మాట్లాడెనా? ఆయాఁడుది యంతయును నొప్పుకొనును. తనకు చిక్కువచ్చు నని కనిపెట్టెను. ముఖ్యముగ పట్టుకొనవలసినద్రోహిని పట్టుకొనక వదిలిపెట్టె నను యభియోగము వచ్చినను రాఁగలదు. అని యెంచి, కరుణాళుం డగు నాసిపాయి తనమిత్రునిప్రశ్నమునకు మనము వెదుకవచ్చిన స్త్రీ యీమెయే. అని సమాధానము చెప్పెను.

రెండవసిపాయి—“అల్లాహెూ అగ్బర్ రా! రా! హుజూరువారిదర్శనమునకుఁ గొనిపోవుదము రమ్ము. మన కిద్దఱకును కావలసినంత బహుమానము దొరకును.” అని యనియెను.

మొదటిసిపాయి—“ఈమెను వెంబడించి నీవు పొమ్ము. నాకు మఱియొక్కచోట. మఱికొంచెము పనియున్నది. అనునాపలుకులకు నాయగ్గిరాయఁడు మఱింత యుబ్బి పోయి శ్రీని ముందునకొక్క త్రోపుఁ ద్రోసెను. అది చూచుటతోడనే మొదటివానిమనస్సున కెంతో వ్యసనము కలిగెను. ఈసిపాయిల కిద్దఱకును పేర్లుండవలదా? మొదటివానిపేరు ఖైరాహి. రెండవవానిపేరు పీరుభక్షు.

సిపాయి త్రోసినత్రోపుతో శ్రీ ముందునకు తూలి, పడిపోయి మందహాసము చేయుచు చంద్రచూడుని బిగ్గరగఁ బిలచి, “అయ్యా! నీకు నాపతి కనిపెంచెనేని అతఁనికి నన్ను జూచుట విధి యని చెప్పవలెను” అని చెప్పెను.

ఈమాటలు చెవినిఁ బడుటతోడనే చంద్రచూడునికన్నుల బాష్పోద్గమం బును చెక్కులనుండి స్రవించెను. ఏడ్చుచు నాతఁడు “బిడ్డా? నీచరిత్రఁ జూడ నాకు మిక్కిలి వింతఁ గొలుపుచున్నయది” అనెను.



## తొమ్మిదవ ప్రకరణము.

సిపాయిలు ద్రోహులను మందలుమందలుగాఁ దీసుకొని రాసాగిరి. అల్లరిలో నున్నవా రందఱును హాయిగ నింటియొద్దఁ గూర్చుం

డిరి. నిర్దోషుల నందఱిని సిపాయిలు పట్టి బంధించి వేధించు చుండఁజూచి కేరింత లాడుచుండిరి. సిపాయిలను ద్రోహుల చేతఁబట్టు మని చెప్పిరి. దానిం బట్టి వా రడ్డము వచ్చినవారినెల్ల పట్టుకొనఁ జొచ్చిరి. నేరస్థు లందఱుఁ దగినజాగరూకతతో నుండియుండుటచే వారు పట్టువడ లేదు. ఏమియు నెఱుఁగనివారు తమ కేమిభయ మనుకొని లక్ష్యము లేక మెలఁగిరి. అందువలన వారే ముందుగ పట్టువడిరి. వారు కొందఱు సిఫాయిలను చూచుటతోనే నిశ్చేష్టు లయి వెఱ్ఱిచూపులు చూడ సాగిరి. అట్టివా రెంతటి కయినను సాహసు లని పట్టుకొనిరి. కొందఱు సైనికుని మొగము కనుపించుటతోడనె పాఱిపోయిరి. నిజ మయిన నేరస్థు లగుటచేతనే వారు పాఱి పోవుచున్నా రని వారిని పట్టుకొనిరి. కొందఱు సిఫాయిల ప్రశ్నములకు వడివడిగ జవాబులు చెప్పిరి. తుంటరులును ముష్కరులును గాని అట్టి జవాబులు చెప్పఁబోవ రని వారిని పట్టుకొనిరి. కొంద ఱడిగినదానికి సదుత్తరము లీయలేక పోయిరి. నేరస్థులు సహజముగా నోరు మూసుకొని యూరకుండ రనుకారణమున వారిని పట్టుకొనిరి. లేమి యెన్ని నేరము లయిన చేయించు ననుకారణమున పేద వాండ్రను పట్టుకొనిరి. శ్రీమంతులు లేనిదే యింతమందిచేఱ రనియును, వారె తక్కినవారి నందఱిని డబ్బిచ్చి రప్పింతు రనియుఁ జెప్పి కొందఱి సంపన్నులను చెఱపెట్టిరి. చెట్టుమీఁదఁ గూర్చుండి చంపుచంపు మని కేకలువేయుచు జనుల నల్లరికి వృద్ధికొల్పిన యాఁడుదానినిఁ బట్టికొ మ్మనిరి. అందుచేత నొక తెకు వందమందిని బట్టి లాగుకొని వచ్చిరి. ఆసిపాయిలలో నొకఁడు పట్టుకొనవలసిన యాఁడుది వితంతు వని విని కనపడ్డ వితంతువుల నెల్ల పట్టుకొనియెను. పట్టవలసిన స్త్రీ సుందరాంగియని చెప్పుటచే చక్కగ కనుపడిన స్త్రీనెల్ల పట్టుకొనిరి. పట్టుకొనవలసిన స్త్రీ కొమరుఁ బ్రాయపుస్త్రీ యని తెలిసి కంటికిఁ గనఁబడిన యావనవతుల నందఱిఁ బట్టుకొని కౌఁగిలించుకొనసాగిరి. మఱికొంద ఱా చెట్టు మీఁద నున్న జవ్వని తల విరియఁబోసుకొని యున్న దని విని, ఏమాత్రమున కురులు వీడియున్నను అట్టి స్త్రీ నెల్ల పట్టితెచ్చి యధికారుల ముందరఁ బెట్టిరి.

ఈరీతిని స్త్రీపురుషుల నెందఱినో బందిఖానా ఖాళీ లేకుండఁగ

పట్టి తెచ్చి ఇంక యెడము లేకపోవుటచే ఆరోజునకు జైలుతలుపులు మూసివేసిరి. మరునటి యుదయమున వారివారిపురాకృతములకొలఁది వారు శిక్షలు పొందవలసి యుండెను. వీరితోపాటు సీతారామరాయలుకూడ నా జైలులోఁ ద్రోయఁబడియెను.

అక్కడి యధికారులలో సీతారాము నెఱుఁగనివా రెవ్వరును లేరు. అతని కిష్టముండినయెడల నీమూఁకతోఁ గలసి జైలులో బాధఁబడకుండఁగఁ దగిన యేర్పాటులు చేసికొని యుండఁగలఁడు. చూడవలెననిన ఫౌజుదారునే చూచి యుండును. కాని అతఁ డట్టిప్రయత్నము లెవ్వియును చేసియె యెఱుఁగఁడు. పైపెచ్చాతని నెఱింగినవా రెవ్వరయినను, కనుపించి యాతని నానవాలు పట్టి పలుకరించిన యెడ వారిని తనను గూర్చి యితరు లెవ్వరితోడను జెప్పవల దని చెప్పసాగెను. "ఈజనుల నిందఱి నీమట్టుకు వారికర్మము వారిది యని వదిలివేసి పోయినయెడ వారి కీబంధవిమోచన మెన్నటికిని కానేరదు." అని మనస్సులోననుకొనియెను.

అస్తమయ మయినది. ఆబందిఖానా కొక్కతలుపున్నది. ఆతలుపు కట్టుదిట్టముగ మూసిరి. వెలుపట కాపుదల యుంచిరి.

లోపల నున్నవారికి తినుట కేమియును లేదు. పండుకొనుట కాస్తరణ యయినను లేదు. చీఁకటి పడినతోడనే యెవ్వరిపై నున్నగుడ్డ వారు పఱచుకొని పండుకొనవలసినదే. సీతారాముఁ డీసమయము గనిపెట్టి అందున్న ఖైదీల నొక్కరొక్కరుగఁ బిలచి "మీరు బ్రదుకఁదలంచితిరేని నిద్దుర పోవకుఁడు" అని చెప్పెను.

ఈపలుకు లచట నున్న ఖయిదీలచెవులఁ బడియున్నవి గాని వారి కెవ్వరికిని యందులయర్థము గోచరించినది కాదు; కాని యం దెవ్వరు దానింగూర్చి యడిగినవారు లేరయిరి. ఒక్కఁడును నిద్ర పోవలెనను ప్రయత్నము చేయలేదు. ఆఁకటిబాధచే మలమల మాడుచు దిగులుపడి యున్నవారికి నిద్ర యెచ్చటనుండి వచ్చును? ప్రథమయామి[illegible]కుని కావలికాల మయ్యెను. నగార వాయించువాండ్రు కర్ణరసాయనంబుగ జాలి కాంభోజిరాగమునఁ దమ సొన్నాయిపాటలచేఁ గారాగృహవాసుల నెల్లఁ దనిపి వారును భోజనంబున కరిగిరి. అట్టిసమయంబు

గారాగృహమునం దొకకొందఱు బందీలు చేరి యేడ్చు చున్నట్లు యేడ్పులు వినఁ బడియెను. వారియేడ్పు లాలించి యొక్కఁడు "ఓసాధువులారా? ఈ యేడ్పులతోడను పెడబొబ్బలతోడను ఏమి ప్రయోజనము. మీా కందఱకును ఇష్ట మయ్యోనేని యిప్పుడే యిందుండి తప్పించుకొనునుపాయము చెప్పెదను. ఏమనెద" రని యడిగెను. అం దొకడు (ఖైది) "మనము తప్పించుకొనుట కుపాయ మే మున్నది." అని ప్రశ్నించెను.

రాయలు——ఏమి? మన మీాతలుపు బ్రద్దలు కొట్టలేమా?

ఇం కొకఁడు "నీ కేమయిన పిచ్చి యెత్తైనాయేమి?

రాయలు——ఓసాధుశిరోమణీ? ఒక్కటి చెప్పుము. మీా రిచ్చట నెంత మంది యున్న వారు?

ఒకఁడు——అయిదాఱువంద లున్నారు?

రాయలు——అయిదాఱువందలమంది కలిసి, ఒక్క తలుపు బద్దలు కొట్టలే రనియే మీాయభిప్రాయమా?

ఈమాటలు వినునప్పటి కందులో నున్న వారి కందఱకును నవ్వు వచ్చెను. అందులో నొక్కండు "గుమ్మము యినుపగుమ్మ మన్నమాట యెఱుఁగవా?" అనియెను.

రాయలు——మనుజుఁడు మెత్తనిమంటిముద్ద యనుకొన్నావా? లేక చెఱుకుగడముక్క యనుకొన్నావా?

మఱియొక్కఁడు——ఔనుకాని అయిదువందల మంది తలాయొకగుద్దు గుద్దికాని పండ్లతోఁ బీఁకిగాని, గోళ్లతో రక్కిగాని పారి చేయవచ్చునను కొనుటకు యినుపగుమ్మమల్లు సాధ్యపడునా? అయిదువందల మంది అయిదువందల తన్నులు తన్నితే తలుపు బ్రద్దలే కాదా? సంఘీభవించి చేసిన పర్వతములు బ్రద్దలు గొట్టవచ్చును. సముద్రమును గట్టవచ్చును. ఉడుతలు సేతువును గట్టెననుమాట వినలేదా? అందొకపురుషుఁ డీమాటలు విని "ఈతఁడు చెప్పినమాట బాగుగనే యున్నది. అని చెప్పి సీతారామునితో "అయ్యా! ఎట్లో కష్టించి తలుపు బ్రద్దలు గొట్టెద మనుకొనుము. వెలుపల నున్న శిపాయిలమాట యెట్లు?

రాయలు—మంచిది అవతల నున్న సిపాయి లెందఱు ?

పురు—ఇద్దఱో ముగ్గురో.

రాయలు—"ఈ, అయిదాఱువందలును నలుగురైదుగురిని చంపనే లేరా ?

ఇంకొకపురుషుఁడు—"సిపాయిలయొద్ద నాయుధము లున్నవి? మనకోళ్లను, కాళ్లును, పండ్లును, వానియొద్ద నేమిపనిఁ జేయును ?

రాయలు—అట్లయిన నీ కాయుధములే సమకూర్చెదను.

పురు—నీవా? ఎచ్చటనుండి తెచ్చి యిచ్చెదవు ?

రాయలు—నేను రాయలను. ఈపలుకు చెవులఁ బడునప్పటికి ఇంతకు మున్ను పరిహాసములు చేయువారందఱికిని గద్గదస్వరము పుట్టినది. అంతట నెవఁడంతట వాఁడు దూరదూరముగఁ బోవసాగెను. "అందొకఁడు" బోధపడినది. నీవు మారక్షణకే ఈజైలులోఁ బడితివి ? నేను మాత్రము కన్నులు మూసికొని తను రేమి చెప్పిన నదియెల్ల చేసెదను.

ఈమాటలె లోపల సీతారామునితో మాటలాడుచు నున్నవారందఱును చెప్పిరి. మిగిలినవారియొద్దకు పోయి ఇదేరీతిగా వారితో కూడ మాటలాడి వారినందఱను కూడ నొప్పించెను. అందఱు నాతఁడు చెప్పినట్లు నడచుకొనుటకు బద్ధులయిరి. అందులకుం దగినసన్నాహము చేయుదుమని మనస్ఫూర్తిగ చెప్పిరి. ఇట్లు దించుకొనిపోవుచున్న వారి యుత్సాహమును సీతారాముఁడు నిలువఁబెట్టుటయేకాక, తననిరుపమానబుద్ధికుశలతచేతను, నేటయినలౌకికనీతివలనను అసమానవక్తృత్వశక్తిచేతను వారినందఱిని ప్రాణములనైన నర్పించుటకు సన్నద్ధులం జేసెను.

అనంతరము వారి నందఱ లేచి నిలువఁబడుమని నియమించెను. వారందఱు నట్లు చేసిరి. వారి నందఱ వరుసలువరుసలుగ నిలువుం డని చెప్పెను. మొదటివరుస గుమ్మమున కెదురుగను, రెండవది దానివెనుక, మూఁడవది దానివెనుక, ఉండవలె నని చెప్పుచు వరుసకు ముగ్గురికన్న నెక్కువ యుండరా దని శాసించెను. ఆనిలుచుండుటలో మనుష్యునకును మనుష్యునకును మధ్య, ఒక్కొకమనుష్యునకు సం దుండునట్లు

గాను వెనుకవరుసలోనివాఁడు సందున కెదురుగా నుండులాగునను ఆవెనుకటివాఁడు మఱి మనకు రావలసివచ్చునపుడు ఇంచుకంతయును, వరుసలు చెదరకుండులాగునను, నిలుచుండఁ జేసెను.

ఈయేర్పాటులలో రెండవయామముకూడ గడచినది. "దషరా నగరా గరగరి" అనునగారయవ్యక్తధ్వని పలువిధములుగ వినంబడుచుండెను. అంత దానితో లయనెఱపి బేహాగ్ రాగమున శ్రావ్యంబుగ నొక్కపాటఁ బాడి, రాత్రి నిశ్శబ్దముగను, భయావహ మయినదిగను చేయుసానాయ్ని పాట విననయ్యెను. సీతారామున కిదియే మంచితరుణముగ కనుపట్టెను. కావలిఁ గాచుచున్న సిపాయిలుతక్క తక్కినవాఱందఱును గాఢముగ నిద్రించుచుండిరి. పైసరదారులందఱును నిద్రాపారవశ్యమున మైమఱచి యుండిరి. అంత నాతఁడు గుమ్మమున కెదురు నిలిచి యున్న మొదటివరుసమనుజులఁబిలచి మీరు మీశక్తికొలఁది ఒక్కొక్క తన్ను తన్నుఁడు. ఒక్కొక్కఁడు మూఁడుమూఁడు తన్నులకన్న నెక్కువ తన్నరాదు. అట్లు తన్ని వెనుకకుఁ బోవుఁడు. కాని, ఒక్కటిమాత్రము భద్రము. మూఁడుతన్నులు, ఒక్కమాటే పడవలయును. లేకున్న చేసినపని యంతయు వ్యర్థ మగును. కాని తలుపు వైశాల్యము మూఁడడుగులకన్న నెచ్చు లేదు. అందుచేతనే మిమ్ములను ముగ్గురేసిచొప్పున నిలవఁబెట్టితిని. అట్లు తన్ని "లక్ష్మీనారాయణకి జే" అని చప్పటులు చఱవుఁడు. అని శాసించెను.

బందీలందఱకు నీయుపాయ మర్థ మయినది. లక్ష్మీనారాయణస్మరణఁ జేయుచు నందఱును, ఒక్కసారిగ నినుపగుమ్మమును దన్న సాగిరి.

కారాగృహమునకు వెలుపల నలుగురు కావలివాండ్రు నిద్ర వ్రోవుచుండిరి. పిడుగువంటిధ్వని యొకటి వినవచ్చి వారి కలజడి పుట్టించెను. అది యెచ్చటనుండి వచ్చినదియును అది యేమయినదియును తెలియక అటునిటుఁ జూడసాగిరి.

వారిలోపల మొదటిముగ్గురు నిట్లు చేసినవెనుక వారు వెనుకకు నడచిరి. వారిస్థానమునకు మఱిముగ్గురు వచ్చి నిలువంబడిరి. తన్ను లెన్నయినను దన్నిరికాని అందులో చాలభాగము చప్పుడగుటతక్క యెక్కు

వపని చేసినవికావు. కాని యాచప్పుడుమాత్రము భయంకరముగా నుండెను. అది చూచి యొక కావలివాఁడు "ఏమి యీసద్దు." అని కేకలు వేసెను.

కాని దానికి ప్రత్యుత్తరము "లక్ష్మీనారాయణకీ జే" అను లోపలనున్న బందీలశబ్దము తప్ప మఱి వేఱులేదయ్యెను.

రెండవసిపాయి—వీరందఱును తలుపు బ్రద్దలుకొట్టవలెనని ప్రయత్నించుచున్నట్టు లున్నది, అనియెను.

మూఁడవసిపాయి—ఏదీ? చూతము. కొట్టుమనుము. బంగాళీవాఁడేమిటి? తలుపు బ్రద్దలు కొట్టడమేమిటి?

నాలవసిపాయి—వాండ్రయిష్టము వచ్చినట్టు యేడువనిండు. కొంచెము సేపు గుద్దువఱకు వాండ్రచేతులు నొప్పులెత్తి వాండ్రే యూరకుందురు. ఈవల రండు. అనియెను.

కాని ఈసంభాషణ యెద్దియును బందీలచెవినిఁ బడలేదు. గాలివానపట్టునప్పుడదేపనిగ నుఱుములుఱుము. ఇనుపగుమ్మముమీఁదఁ దన్నినతన్నులు భయంకరసినాదంబు చేయుచుండెను. ఆచప్పుడులో మఱియే యితరశబ్దమును వినఁబడదయ్యెను. ఖయిదీల కుద్రేక మెక్కువ యయ్యెను. కాని వా రలసటఁ జెందకుండ నుండునట్లు చూచుచు వారిచిత్తమువచ్చినట్లు త్రోసుకొని పోవనీయఁ డయ్యెను. ఎవ్వరున్న స్థానమున వారిని కదలకుండ నిలిపియుంచెను. ఆకారణమున బందిఖానాలో నేవిధమైన కలవరములు గాని అలజడిగాని లేకుండ నుండెను. మొట్టమొదటఁ గావలిఁ గాచుచున్న సిపాయిలకది గాంచిన నవ్వులాటగనే యున్నదిగాని వారిప్రయత్నముజరుగునని నమ్మికతో పూని చేయునవి యని యనుకొనరైరి. కొంచెముసేపటిలో నంతయును స్తిమిత పడుననియెంచిరి. కాని కొంతవఱకయ్యేడి సరికి సంగతియంతయును దెలిసిపోయినది. ఖయిదీలందఱునుక్రమక్రమముగ ప్రబలులై విజృంభించుచున్నట్టు కనిపెట్టిరి, ఆకారణముచేత వారిని కొంచె మదవు చేయనవసర మని తలంచిరి. అందులో ముగ్గురు తలుపుతీసి కారలోనికి పోయి చిత్తమువచ్చినట్లు వారిని కాళ్లను వ్రేళ్లను మోఁదిన బాగుండునని తలంచిరి.

నలువురు ఆవలిముగ్గురితోఁడ నేకీభవింపరైరి. అలీఖానుఁడు

వారందఱిలోను పెద్దవాఁడు. ఆతనినడుమంతయును పోయినది. అతఁడు మీరందఱు పసివాండ్రు. ఈఖయిదీలందఱు నుద్రేకమును జెంది యుండి తప్పించుకొనిపోవ నిశ్చయమె చేసికొనియుండిరేని వారి నణంచుట మననలుగురికిని సాధ్య మగునా? మనము తలుపు తెఱచితిమా? క్షణములో వారందఱును త్రోసుకొని వచ్చి తప్పించుకొని పోయెదరు. వారు పాఱిపోవుచుఁ బోవుచు మనలను కూడ నలిపి చంపి మఱి పోవుదురు. అప్పుడు మనము చేయఁగలిగిన దేమి? ఈసంగతి యంతయును జమీాదారు నొద్దకు పోయి చెప్పుట మంచిదిగాఁ గనుపించు చున్నది.

రెండవవాఁడు—జమీాదారునితో చెప్పుట యెందుకయ్యా? వీరలుతలుపుఁ బ్రద్దలు గొట్టుదురనుజడు పెవ్వరికిని లేదు. ఏదో వారు అల్లరి చేయుచున్నారు. నాకుఁ జూడఁగా జమీాదారును లేపవలసినంత అవసరమేమియును కనుపించలేదు. ఈరాత్రికి వారిచిత్తమువచ్చినట్లు చేయనిండు. తెల్లవారినవెనుక వారికి తగినశాస్తి కాఁగలదు. అది నిశ్చయము.

కావలివారి యీయభిప్రాయము పై యాతనిసహచరులకందఱకును యథాస్థితి కేమియును భంగము కలుగనీయనందున యిప్పటికి మనస్సునఁ గొంతయొప్పిదమె కనుపించెను. ఈబంగాళీవాండ్రు ఈయినుపతలుపుఁ బ్రద్దలుకొట్టనెంచుట చూడ మూఁగవాఁడు పాటఁబాడఁ బ్రయత్నించిన ట్లున్నది. అని యనుకొనసాగిరి.

సందేహమేమి? ఇనుపగుమ్మ మంతసులువుగాఁ బ్రద్దలు కాదు. గోడయంటినయెడల బ్రద్దలు కావచ్చును. కాని చివరకదియె జరిగినది. ఈయినుపతలుపు చట్రము గోడలో నమర్పఁబడియున్నది. కొంచెముగ పయికి వెన్నెలవెల్తురున అల్లియారుఖాను చూచునప్పటికి వర్షమువలెఁ గురియుచున్న సీకాలితాఁపులకు ద్వార మమర్పఁబడినపార్శ్వము బ్రద్దలయినట్టు గనుపట్టెను. అంత నాతఁడు చూచినారా. ఇప్పటికి నదియు నైనది. జమీాదారునొద్దకు పోయి చెప్పఁడు. అతఁడుచితజ్ఞుఁడు. ఇందున కేమాత్ర మాలస్యమయినను, గుమ్మము పగిలిపోవును. అట్లు పోవకున్న నన్ను తలఁ దరుగుఁడు. అని చెప్పి వారిని దొందరపెట్టెను.

అంత సిపాయి యొకఁ డీసమాచారమును జమీాదారునకు విన్న

వింప వడివడిఁ బోయెను. తక్కినవా రందఱును నిలచినచోట నుండి కదలక తదేకవీక్షణముగ గుమ్మమువంకఁ జూచుచుండిరి. గుమ్మము కట్టంతయు చెదరి యూడి పడి పోవుటకు సిద్ధముగా నుండెను.

క్రమక్రమముగా గోడబీట పెద్దదయినట్లు కనుపట్టుచుండెను. కట్టినయిటికలు కట్టుచెదరి బిగిసడలి ద్వారమును విడక యుండెను. ధ్వని క్రమక్రమముగ విజృంభించెను. ధ్వని విజృంభించినకొలఁది తలుపుల పటుత్వమును వృద్ధిగాఁ జొచ్చెను. తుట్టతుదకు ఆవరణ మంతయును భయంకర మైన ధ్వని యగుచు గుమ్మము గుభాలునఁ గ్రిందఁ గూలెను. వారిలో నుండి విడివడివచ్చిన ఖయిదీలయొక్క "లక్ష్మినారాయణ్ జీకి జయ జయ" యను కేకలు ఆకాశపథంబు నంటుచు ప్రపంచమంతయుఁ బ్రద్దలగు నట్లుండెను.

కావలి కాచుచున్న మొద్దుముండ కొడుకులు మొద్దులవలె నిలువంబడి అది యేమగునో చూతమని పడిపోవుచున్న గుమ్మము దగ్గర నుండి లేవనైన లేవక చూచుచుండిరి. కాని అది పోవునప్పటికి బుద్ధివచ్చి తమప్రాణములను దక్కించుకొన పాఱిపోయిరి. అందులో ఇద్దఱుమాత్రము, ఏవిధమయిన దెబ్బలును తగలకుండ తప్పించుకొనిరి. ఒక్కనికి కాలు చితికిపోయి భూమిమీఁదఁ జాపచుట్టుగాఁ బడిపోయెను. గట్టు తెగి పడినగండియలోనుండి నీరు దొళదొళఁ బ్రవహించునట్లు గృహమునం దున్న ఖయిదీ లందఱును ఒకరిని గా దని యొకరు త్రోసికొని వచ్చి పడిపోయి యున్న యాకావలివాని పచ్చడిపచ్చడిక్రింద త్రొక్కివేసిరి. మొట్టమొదట వెలుపలకు వచ్చినవాఁడు రాయలు. తోలుదొత్తనాతఁడు దెబ్బలు తగిలి పడియున్న కావలివానిచేత నున్న కటారియును, డాలును లాగుకొనియెను. మృత్యుదేవత బంటువలె నాతఁడు నాకటారి చేతఁ గొని తక్కినవారిపయిం బడియెను. ఆనిముసమునం దాతనియాకారము మిక్కిలి బీభత్సముగ నున్నయది. తలఁచుకొనిన గుండె లదరిపోవును. అతనిచేత కావలివాండ్రకు చావుదెబ్బలు తగిలినవి. ఆకారణమున ఆదెబ్బలు మనవారి పలాయన మతిసౌకర్యమయి ఖయిదీలందఱును చెట్టు కొక్కపిట్టగ నెగిరిపోయిరి. జమాదా రింకను రాలేదు.

కారాగృహవాసులందఱును శ్రీహరిస్మరణఁ జేయుచు పఱచిరి.

వెనుకనుంచి యోఱదూసినకత్తి చేతఁ బట్టుకొని యొకస్థలమందు నిలువంబడి రాయలు కాచియుండెను. బందిఖానానుండి యందఱు పాఱిపోయినవెనుక తాను మరల నొకసారి లోనికి పోయి చూచెను. అంతకుము న్నతఁడు, ఆపాదమస్తకమును ముసుఁగు పెట్టుకొని యొక్కమూల నొక్కఁ డెవ్వఁడో పండుకొనియుండఁగాఁ జూచినజ్ఞాపక మున్నది. ఆబండ యింక నచ్చటనే యుండెనో లేక తర్లిపోయెనో చూత మనుతలంపుతో ఆకారాగృహము మరల ప్రవేశించెను. అతఁడు పోయినప్పటికి ఆ ఖైదీ యచ్చటనే యుండెను.

రాయులు ఖయిదీని పలకరించి "అందఱును లేచిపోయినారు. నీ వేల ఇచ్చట నుండెదవు." అని చెప్పెను.

ఆఖయిదీ యామాటలు విని న న్నేమిచేయు మనెద వని యడిగెను. ఆహా! ఆకంఠము స్త్రీకంఠముగ రాయలు అదివఱకు వినినదాని వలె నుండెను. ఆకారణముచేత ఆత్రతతో నీ వెవ్వ రని యడిగెను ఆఖైదీ నేను శ్రీ నని ప్రత్యుత్తరము చెప్పెను.



## పదియవ ప్రకరణము.

సీతారామరాయలు.—శ్రీని జూచి, నీ విచ్చటి కెట్లు వచ్చితివి?

శ్రీ—సిపాయీలు నన్ను చెఱఁగొని వచ్చినారు.

రాయలు—నీవుకూడ నీయల్లరి చేసినా వనియా?

ఔనౌను. ఈమనుష్యులకు జ్ఞానము పూర్ణముగ నశించినది. పైగాఁ గ్రమక్రమముగ దుర్మార్గు లగుచున్నారు. దైవసంఘటనవలన మా ము మరల బయటఁ బడఁ గలిగితిమి. నీ విచ్చట నేల యుండెదనీయింటికిఁ బోయి యుండుట మంచిది.

శ్రీ—నాయింట నెవ్వ రున్నారు. నన్ను బట్టి తెఱుముచున్నారు ది క్కెవ్వ రున్నారు.?

రాయలు—అట్లని యిక్కడనే యుండెద ననుచున్నావా? ఖానా యనుమాట మఱచితివా? ఈస్థలము నీకు ? కాదు.

శ్రీ—ఎందుచేత. న న్నిచ్చట నెవ్వ రేమి చేయుదురు.

రాయలు—నీవును అల్లరిమూఁకలో చేరినదానవే యని ఫౌజుదారుఁడు నిన్నురిఁ దీయించి, చంపఁగలఁడు. మఱి యేది తోఁచిన నది సేయఁగలఁడు.

శ్రీ—అయిన కానిమ్ము.

రాయలు—నే నిప్పుడు శ్యామపురమునకు పోవుచున్నవాఁడను. నీసోదరుఁడును అచ్చటికే పోవును. పదిపాళ్లు అతని కచ్చట నిలువ నీడ య్యేవరు ? నీవును అచ్చటకు శీఘ్రముగఁ బొమ్ము. అచ్చట నీయిచ్చవచ్చినచోట నుండవచ్చును.

శ్రీ—నాతోఁడఁ గూడ వచ్చువా రెవ్వరు ?

రాయలు—నీ కెవ్వరినైన జత యిచ్చి పంపెదను లే ?

శ్రీ—ఈమహమ్మదీయుల క్రౌర్యమునుండి కాపాడఁగలవారి నెవ్వరి నిచ్చెదరు?

రాయలు—కొంచె మాలోచనలో పడియెను. కొండొక యోచించి మా నముద్ర వీడి "రమ్ము నీవెంట నేనే వచ్చెదను" అని చెప్పెను.

అంత శ్రీ లేచి కూర్చుండెను. కన్నులు పైకెత్తి నెమ్మదిగ నిశ్చలముగ రాయలముఖమువంక తేటిపాటుఁ జూచెను. చూచి యామె "ఇన్నాళ్ల కిప్పటికి మీ కీయుద్దేశ్య మేల పుట్టినది."

రాయలు—దానికి తగినసమాధానము చెప్పుట కష్టము, చెప్పినందువలన నీకుఁ గలుగఁబోయెడు లాభ మే మున్నది ?

శ్రీ—మీరు చెప్పినగాని నేను మీవెంట రాను. మీరు విడిచిపెట్టనే పెట్టితిరి. మీవెంట నే నెందులకు రావలెను ? అట్టులే వచ్చెదను. కాని ఈదినమునమాత్రమె నన్నుసంరక్షింపఁ దలంతు రేని ప్రాణ సంరక్షణకయి జాలిఁ జెంది నన్నునుగమింపుఁడు. కాని ·కసికరముతోఁడ నాయెడఁ బనిచేయవద్దు. నేను మీకు ధర్మప · మీపూర్ణదయకు పాత్రురాలను. మీ కున్నదియెల్ల నే నను · హక్కు గలదానను. మీదయతోఁడ నాకు ప్రసక్తి యే · అయ్యది బాధ్యత లేనివారియొద్ద చెప్పకొనవలసినమాద్దు. నాథా ! మీ రొంటరిఁగనే పొండు. నేను రాను. ·ండి మీసాహచర్యము లేకుండ నెట్లు కాలక్షేపము

చేసితినో, నేఁడును అక్లే యిచ్చటనుండి కదలిపోయెదను.

రాయలు—ఆసంగతి నంతయును చెప్పెదను. రమ్ము.

శ్రీ—ఎవరికి కావలె నది. నేను మీభార్యను. అందఱిలోనను అగ్రేస రురాలను. నంద రెండవభార్య. నన్ను యథావిధిగ వివాహ మాడి తిరి. నేను గుడిసివేటును కాను. బహిష్కృతను కాను. వివాహమ యిన కొలఁదికాలములోపలనే నాయెడ నేమియు తప్పు లేకుండఁ గనే నన్ను విసర్జించితిరి. నన్ను విసర్జించుటకు తగిన కారణమయి నను నాకు చెప్పకపోయితిరి. నే నెంతప్రయత్నించినను నాకు దా నికి తగుకారణ మేమియో తెలిసినది కాదు. ఆనేరమునకై ఆత్మ హత్య చేసుకొనవలె నని యెన్నియోసార్లు నిశ్చయించు కొంటిని. ఈవిధముగ యీబంధముక్తిఁ గలిగించి నేనె తగుప్రాయశ్చిత్తము చేసికొన నెంచియుంటిని. ఆకారణముచే నేఁడు నా కీసమాచార మేమియో చెప్పినఁగాని నే నిచ్చటనుండి కదలి రాను.

రాయలు—ఇదె రమ్ము. అంతయును చెప్పెదను. నే నన్నియును నీకు చెప్పినవెనుక నన్ను వదలిపెట్టి పోదు నని మాత్రము బాస చేయుము.

శ్రీ—నేను మిమ్ము వదలిపెట్టి పోవుటయా?

రాయలు—నాకు కావలసిన దట్టిబాసయె?

శ్రీ—ఆవిషయ మంతకఠిన మయినదా? అట్లయిన నే నది వినకుండనే యెట్లు బాసఁ జేయఁగలను?

రాయలు—వినుచున్నావా? సిపాయిలగుండ్ల చప్పుడు, నీచెవిం బఁ చున్నదా? ఈపలాయితుల నందఱిని వారు పట్టఁ బ్రయత్నించచ న్నారు. ఇప్పుడయినను నీవు నన్ననుసరించి వచ్చితివా, ఈనగ వెలుపటివఱకు ని న్ననుగమించి రాఁగలను. ఇంకొక్కనిముస స్యముచేసితివా? మన యుభయులపనియుంగూడ సున్నయె.

శ్రీ అంతట లేచి సీతారాము ననుగమించెను.

---

పదునొకండవ ప్రకరణము.

ఎవ్వరివల్లను ఏవిధమయుననిర్బంధము లేకుండ గుమ్మము దాఁటి నదీతీరముం జేరెను. అచ్చటి కేఁగి

తిచే విశ్రాంతిగ గనుపట్టు నొకయిసుకతిన్నెపయిం గూర్చుండి శ్రీని గూడ వచ్చి తనప్రక్కను గూర్చుండు మనియెను. శ్రీ వచ్చి కూర్చుండి నయనంతర మాతనిపూర్వోక్త వాగ్దానవిషయము నిట్లు వివరింపఁగడంగెను. "నీవు వినవలయునని కుతూహలపడుచున్న విషయము వినుము. చెప్పెదను. కాని అది నీచెవినిఁబడకుండుటయె యుత్తమ మని తలంచెదను. వ్యాపార మాదినుండియును వినఁదలంతువేని మనము మనపరిణయకాలమునాఁటికి పోయి చూడవలెను. అప్పుడు మాతండ్రి నీజాతకము జూడఁదలంచినాఁడు. జాతకము లేకపోయెను. అందుచే మాయయ్య మన వివాహసంబంధమున కొడంబడినవాఁడు కాడు. కాని నీసౌందర్య మతిమనోహరం బయియుంటచే నాతల్లి పట్టుఁ బట్టినది. ఆకారణమున వివాహము జరిగినది. ఒకమాస మయినపిమ్మట పేరుమోసిన జ్యోతిష్కుఁ డొకఁడు మాయింటికి వచ్చినాఁడు. మాతండ్రి కాయనపాండిత్యముఁ గనినతోడనె యత్యంతసంతోష మయినది. అతఁడు నష్టజాతకములను వ్రాయ సమర్థుఁడు. మాతండ్రి నీజాతకమును వ్రాయుమని కోరెను.

అతం డట్టిజాతక మొకటి వ్రాసి తెచ్చి మాతండ్రికి చదివి వినిపించెను. అదిమొదలు నీమొగము నాకు చూడఁగూడనిది యయ్యెను.

శ్రీ—ఎందుచేత?

రాయలు—నీజాతకమునుబట్టి చంద్రుఁడు స్వస్థానమున నుచ్చయం దున్నవాఁడు చంద్రగ్రహము కర్కాటకలగ్నమం దున్నది. శనిగ్రహము
నకు రెండింట నున్నవాఁడు.

అట్లుండినందువలన ననర్థమేమయినఁ గలదా యేమి?

—స్త్రీజాతకమునం దట్లున్నయెడల ప్రియావియోగము సూ
ను. వివాహిత యగు స్త్రీకి పతికన్న నెక్కువప్రియు లెవ్వ
రుకదా? నీజాతకమువలన పతిమరణము ద్యోతక మయినది.
న నీవు పరిత్యజింపఁబడవలసినదాన వయితివి
చు నొక్కింతసేపు మాట లేకుండ నుండెను. పిమ్మట
చి ఆజ్యోతిష్కుఁడు మాతండ్రిగారితో "నీకోడలిని పరి
నకు రెండవవివాహప్రయత్నము సేయుము. భార్యకు

భర్తయె ప్రాణప్రియుఁడయినప్పటికిని భార్య భర్తను తా ప్రేమించకుండునేని యీయరిష్టమితరులగునాప్తులను గొట్టికొనిపోవును. ఈవధూవరులిద్దఱకును సమావేశమె సంఘటిల్లకుండుటచే వారియుభయులకు ననురాగ ముదయింపఁబోదు. ఆఁడుదానికి పురుషునియం దనురాగము కలుగకుండినయెడల ఆమె యాతనిమరణమునకు కారణము కానేరదు. ఆ కారణమున నీకుమారుఁడును, కోడలును, ఏకశయ్యాగతులు కాకుండ నుండురేని నీకుమారునిమనం బామెపై పోవనేరదు. కావున వారిరువురకును నెడబాటగునుపాయముం జేయుఁడు'' అని చెప్పెను. ఈయుపదేశము యుక్తియుక్తముగ నుండుటచే మాతండ్రి యందులకు సమ్మతించి యాదినముననె నిన్ను నీపుట్టినింటి కంపివేసెను. నన్నెన్నఁటికి నీతోడ పొందు సేయవలదని శాసించినాఁడు, "మనముభయులమును, దాంపత్యసౌఖ్యము ననుభవింపరాదని కట్టడి చేసెను. ఇదియె నీకును నాకును వియోగకారణము" అని చెప్పెను.

ఈమాటలు విని శ్రీ నిలువఁబడియెను. ఆమె యెద్దియో చెప్పఁబోయెను. కాని రాయ లామెను మరల కూర్చుండు మని నిర్బంధించెను. అతఁడు నే నింకను చెప్పవలసినది యవశేష మున్నది. "మాతండ్రిగారు సజీవు లయి యుండినన్నాళ్లును నేనాయనయాజ్ఞల మెలంగినాఁడను. ఆయన చెప్పుచేఁతలలో నున్నవాఁడను. ఆయనచేయుమనినది యెల్ల కావించినాఁడను.'' అని చెప్పెను.

శ్రీ—ఆయన యిప్పుడు స్వర్గస్థు లయినా రని యిప్పు డాయనయాజ్ఞ నుల్లంఘింపఁదలంచినారా యేమి?

రాయలు—తల్లిదండ్రులయాజ్ఞ లెప్పుడప్పుడనక, బ్రతికియుండినను గతసులయినను, అనుసరింపఁదగినవి; కాని తండ్రిగారియాజ్ఞ యధర్మమయినచో నాయాజ్ఞ ననుసరింపఁదగునా? తగదు॥ చెప్పినపుడు తండ్రి చెప్పినను, తల్లి చెప్పినను, ఆచార్యుఁడ ననుసరింపం జెల్లదు; అప్పట్టున తండ్రికి తండ్రియును యును, ఆచార్యున కాచార్యుండు నగునాతనిశాసన వలసివచ్చును. భార్య నామెయెడల నేవిధమయిన కుండ పరిత్యజించుట ధర్మబాహ్యంబు. మాతం

సావహించుటచే నీయపరాధం బొనరించినవాఁడ నగుచున్నాఁడను. ఈవిషయ మింతకుముందు చెప్పియుండునుకాని.—

శ్రీ మరల తనచరణములపై నిలువఁబడి "ఉపదేశపురస్సరంబుగ మొహిరి యొక్కటి పంపి నా కెప్పుడయిన విపత్తు సంఘటిల్లెనేని దానిని తమసముఖమునకు బంపుమని చెప్పి యుపదేశించియుంటిరి. ఈ మొహిరీ నా యొద్ద లేకుండిన నాసోదరునిప్రాణ మీపాటికిపోయియుండును. నేనుమీకు దూరస్థనయియుండినను నాయెడ మీ రెంతయో యనుగ్రహంబు సేసి తిరి. ఇయ్యది స్వతస్సిద్ధంబుగ మీయందుండు సద్గుణంబులఁ జూపుచున్న యది. ఇంకముం దెన్నండును నాయెడల నట్టివాత్సల్య ముంచఁబోకుఁడు. ఇంకముం దెన్నండును నేను మీకంటఁ బడనోపను. నావిషయ మగుస మాచార మేమియును మీరు విననుత్సహింపవలదు. పూజ్యుం డగునా జ్యోతిష్కుం డేమి చెప్పినను ఆఁడుదానకి పతికన్న ప్రాణప్రియుండు ప్రపంచమున మఱియొకండు లేఁడు అతనితోడ నేకశయ్యాగతు రాలై యుండినను లేకుండినను నతిప్రేమైకస్థానము రతియె. నాకు మీ రె ప్పటికిని ప్రేమైకనిలయులె? ఈవిషయ మొక కన్ను మూసినగంత కా దు. ఇంతటినుండి మీకును నాకును శతసహస్రక్రోశపరిమితదూర మగును.

అని చెప్పి యానదీసైకతస్థలి నా మొహిరీ విసరివైచి రాయల కెడ మయి పోయెను. ఆమె యంతలో నదృశ్య యయ్యె. ఎచ్చటి కేఁగె ° రాయల కెఱుకపడదయ్యెను.



పం డ్రెం డ వ ప్ర క ర ణ ము.

మిది? ఈవిషయము సీతారామునకు ంలుదొల్త స్ఫురించిన ము? లేదులేదు. నిన్నటిరోజున శ్రీ తనసమ్ముఖమ్మునకువచ్చి పుడు స్ఫురించినది. ఇన్నినాళ్లకు మొట్టమొదట నిన్న జ్ఞప్తికి వచ్చినది? అపును అటులె కనుపించుచున్నది. రా యున్నపరిచయ మెట్టిదో పట్టి చూతము. ఆవధూవరు లి సములు మాత్రమే కలసి యుండిరి. ఆహా! ఆసమావేశ

మెట్టి సమావేశము? స్త్రీ యప్పుడు చిన్నబాలిక. అప్పటినుండియు నామె మాటమైన నాతని చెవిం బడలేదు. ఒకప్పుడు స్త్రీ కేవ్రా చిక్కులు వచ్చినట్లు రాయలకు తెలియవచ్చి ఆమెకు కొంతసొమ్మును ఈమొహిరీయును పంచెను. దానితోకూడ నామె కెప్పుడయిన యిబ్బంది తటస్థమయ్యేనేని యెవ్వరిచేతనైనను, తనకడకు పంపుమని చెప్పి యంపెను. ఆమొహిరీ తెచ్చినయాతఁ డేమడిగిన నదియెల్ల నాతఁడు తత్క్షణమే యిచ్చువాఁడు. కాని స్త్రీ యెప్పుడు నట్టికోరిక కోరి యెఱుఁగదు. సోదరుని ప్రాణసంరక్షణ మొక్కటియె యామె కోరినది.

ఔను. అదియంతయును యథార్థమె? కాని స్త్రీని జ్ఞాపకముంచుకొనుట రాయలకు విధ్యుక్తధర్మము కాదా? మనము మఱచిపోయెడువిధ్యుక్త ధర్మము లెన్ని లేవు? తగిన కారణముండినగాని మనుజులు తమమనంబు దానిపైఁ ద్రిప్పనోపరు. ప్రతిదినమును ద్రవ్యసంపాదన గలమనుజునకు నెప్పుడయిన నొకపావలా అఱరూపాయ పోయిన దానికొఱకయి జిజ్ఞాసపడనోపఁడు. ఒకవంక నందయు, ఒకవైపున రామయు నుండి సమస్తపరిచర్యలును సేయుచుండ యెవ్వతెయో యొకస్త్రీపై కాతనిదృష్టి యెట్లు పోవును? జాహ్నవి యొకపార్శ్వమునను, యమున యొకవంకను ప్రవహించుచుండ, ఎన్నఁడో యంతర్వాహిని యై శుష్కీభవించియున్న సరస్వతికొఱకయి వనసిధి యంతపరితపించుచుండునా? చంద్రకాంతి దక్షిణ భాగమునను, చిత్రానక్షత్రకాంతి వామభాగంబునను, ప్రసరించియుండ ఆఱిపోయినకొవ్వువత్తికొఱకయి యెవ్వఁడు శ్రమపడఁగలండు. రమతోడిది సౌఖ్యము. నందతోడిది క్షేమము. స్త్రీతోడిపొందు విపత్తు. అట్టి యోగక్షేమములపొందొనగూడియున్నయాతఁ డేల విపత్తులం గోరి తెచ్చుకొనవలెను.

కాని శీతాంశుబింబంబువలె మనోహరం బగుస్త్రీయొక్క ముఖనైగనిగ్యంబు పొడగాంచి ఆమె సుందరనయనద్వంద్వంబు నీక్షించి రాయల హృదయంబు గాఢానురాగచిహ్నితం బయ్యెను. బాష్పసంపూరితంబులయి సంతతసముత్తీర్ణం బగుమృదుతరగ్లానిచే శోభాయమానంబు లయి యొప్పుకన్నులు. అశ్రుధారాప్రవాహినులై అంతర్యంబు గ్రహించునంతటనే హృదయము ప్రక్షాళించునట్టికన్నులు రాయల

మోహితుం జేసెనా? ఛీ! ఛీ! అట్టిదేదియును జరుగలేదు. ఆమెమంజుల తయు, ఆమెదుఃఖపరంపరలును, ఆమె యపరాధములును, కలిసి పని చేసి యాతని హృదయమునం దట్టిగాఢపరిణామమును కలిగించియుం డును. ఏది యయినను గానిమ్ము. ఈవిషమపదంబున కెద్దియో యొకతృప్తికరమయిన సమాధానము కావలసియుండెను. విశ్రాంతి చేసికొని నెమ్మదిమీఁద మంచి చెడుగులను ధర్మాధర్మములను, గురుముఖముననో ఆచార్య సహాయంబుననో సముచితంబుగ యోచనఁజేసి తండ్రిగారి యాజ్ఞల నెట్టులయిన నిగ్రహించుటకు తగినయుపాయంబుల నన్వేషించి మనోరథంబు సఫలీకృతంబు గావించుటకు తగినయేర్పాటులు చేయవలసియుండెను. కాని సింహవాహనారూఢ యగునామహాకాళివిగ్రహము అకటా! అకటా! మరలఁ గనఁబడదు.

రాయలపక్షమునుండి న్యాయముగ మనమొక్కటి చెప్పుకొనవలసియున్నది. ఈపత్నీపరిత్యాగ మధర్మమని యాతనిమనస్సున నాఁటికొన చేసినది కేవల మావిగ్రహదర్శనమే కాదు. అయ్యది నాఁటికొనుట కదియె తొలిసారియా; కాదు కాదు. గడచినరాత్రి శ్రీ యాతనిసమ్ముఖంబునకు వచ్చి యాతని సందర్శించినప్పుడె రాయలు తండ్రిగారియాజ్ఞనె శిరసా వహించియుండునెడల నాతఁ డీలోకంబున మహాఘోరపాపంబు గావించియుండు. పరశురామునిగండ్రగొడ్డలి యాతనిమనోనయనంబునకు గోచరించెను. శ్రీ సోదరుని రక్షించినవెనుక రుక్మిణీసత్యభామలకోపంబు చల్లార్చినవెనుక పూజ్యుఁ డగుచంద్రచూడునితో చర్చించినవెనుక, నాతఁడీధర్మమును నిర్వర్తింపనిశ్చయించుకొనియెను. కాని మరుచటిదినమున జరిగినసంగతిసందర్భములఁబట్టి యానిశ్చితంబు నెరవేఱ వీలు చిక్కినదికాదు. అయ్యది క్రిందువట్టినది. పునరుద్భవంబయినకాముకచింత నలయుద్రేకంపుపెల్లున యాయిసుకకట్టయంతయును కొట్టుకొనిపోయినది. రుక్మిణీసత్యభామలును, చంద్రచూడుఁడును, ఏమయినారో? వారి మాట యటుంచుము. శ్రీ ఇప్పు డెచ్చట నున్నది?

రాయలు కూర్చుండియుండినచోటనుండి లేచి తనదృష్టిపథంబునుండి శ్రీ యదృశ్య యయి అరణ్యపార్శ్వమున కరిగెను. కాని యామెజాడ యగుపడదయ్యెను. ఆమహాగహనమధ్యంబున అంధకారంబు

కుప్పతిప్పలుగ వచ్చి చేరినట్టు కనుపట్టెను. ఒక్కయెడ చెట్లకొమ్మలు కొన్ని కొట్టియుండుటచేతనో అందు కొన్నిటికిఁ గలధావళ్యంబు చేతనో కొంత తెలుపిగ నున్నట్లు కానుపించెను. రాయ లచ్చటకు బఱతెంచెను. కాని శ్రీ యచ్చట లేదు. పిమ్మట నాతఁ డామెను పేరుపెట్టి కేకలువే యసాగెను. ఆకేకలవలనఁ గలిగినప్రతిధ్వని శ్రీ ప్రత్యుత్తర మిచ్చుచున్న ట్లయ్యెను. ఆకారణమున నాతఁ డావైపుల కుఱికెను. మరల పిలచిచూ చెను. మరల నట్టిధ్వనియె బయలుదేరెను. మరల రాయ లావంకకు పాఱెను. కాని, అక్కటా! శ్రీ యచ్చటఁగూడ కానరాదయ్యెను. ఈ రీతిని రాయలు శ్రీ శ్రీ శ్రీ యనిపిలుచుచుండఁగనే తెల్లవారి పోయెను కాని శ్రీ రాదయ్యెను.

ఏమిది? అంతటి యాశతో పిలుచుచున్న నామె ఏల యెప్ప టికిని కనుపడకున్నది? మన మత్యాశతో కోరుచున్న పదార్థ మెద్దియు ను మనకు లభించదు. ఒక్కసారి సంప్రాప్తం బయినవస్తువును మనము పోఁగొట్టుకొంటిమేని మరల మన కది యెన్నిఁటికిని తటస్థింపదు. చూడఁ గా చూడఁగా నెప్పటికైన నది దొరకవచ్చుంగాని అయ్యది మ ఱల నెన్నినాళ్లకో? ప్రపంచమంతయును, గాఢాంధకారమయంబు గను, మనకన్నులు లేనట్లును, అన్వేషణమార్గంబు మనకు మృ గ్యం బైనట్లును కానుపించును. అట్లయిన చేయవలసిన దేమి? మ రల నన్వేషించుటయె కర్తవ్యము. మన కీలోకంబున యదృశ్యం బగుప దార్థంబె ప్రియతమంబైనది. వెల్తురు పోయి చీఁకటి వచ్చినది. రాయల హృదయమున శ్రీ రాజ్యము చేయుచున్నది. ఆమెయె ప్రియతమం బైనప దార్థమైనది. సర్వాతిరిక్తంబగు శ్రీసమ్మోహనమాధిపత్యంబు రాయ లహృదయసదనంబున నలుతట్లను వ్యాపించెను. అదికారణంబుగా నా తని యోచనలన్నియును, ఆమెసౌశీల్యసంభావనలచే నిండి పో యెను. ఇప్పుడాతఁడు సామ్రాజ్యసంస్థాపన సేయ నున్నవాఁడుకదా? అతనికర్హంబగు పట్టమహిషి యెచ్చట నున్నది "సింహాసనము రుక్మిణీ సత్యభామలు అధిష్టింపనర్హురాండ్రా? భగవతి మహిషాసురమర్దిని వలె చెట్టుకొమ్మమీఁదఁ గూర్చుండి తనచేలాంచలసంచలనంబున యు

ధ్వవిజయంబు గావించినయాసుందరి యర్థ్వాయా? శ్రీసహాయంబున రాయ లేమి చేయను సమర్థుఁడు కాఁడు.

అంత నాకస్మికమున రాయలమనస్సున నొకయాశ తలసూపెను. శ్రీసోదరుఁడగు గంగారాముని నదిని దాఁటి శ్యామపురంబునకు పొమ్మని యాజ్ఞాపించి యున్నవాఁడు. గంగారాముఁ డచ్చటికి పోయి యుండును. ఆకారణమున రాయల కావైపులకు పోవ మనసుకొలిపెను. శ్యామపురమునకు చేరుటతోడనే కాచియున్నగంగారాముఁడు రాయలకుఁగనుపట్టెను. అతఁడు గంగారాముని తొలుదొల్త "గంగారామా? నీసోదరి యే" దని ప్రశ్నించెను.

గంగారాముఁ డద్భుతపడి "మీ రామెను చంద్రచూడుని కొప్పగించినపుడు చూచుట తక్క నే నామెను గూర్చినవిషయమే యెఱుంగను" అని యుత్తర మిచ్చెను.

రాయలు—"దిక్కుమాలినపని. ఆమె పూజ్యుఁడగు నాసాధుని సాంగత్యము వదలినది. ఆమెయీవైపులకు రానే లేదా?"

గంగా—లేదు రాలేదు.

రాయలు—"అట్లయిన నీవీ నిముషముననే ఆమెను వెదుకఁబొమ్ము. పూర్ణముగ నామెను వెదకిననేగాని మరలి రాకుము. నేనిచ్చటఁ గొంతకాల ముండఁ దలంచితిని. ఇచ్చటనే యుండెదను. నీవు పోరానిస్థలము లేవైన నుండినయెడల మఱియెవ్వరినైన నందులకు నియమించి యాపని చక్కఁబెట్టుము. ఈసొమ్ము నీపయనపు కర్చుల కుంచుకొనుము." అని చెప్పెను.

దారిబత్తెమునకు కావలసినసొమ్ముల నందుకొని గంగారాము సోదరి నన్వేషింపఁబోయెను. వారముదినములవఱకును, మిక్కిలి జాగరూకతతో నామె నన్వేషించెను. అంతయును నిష్ఫలమాయెను. అతండు విఫలప్రయత్నుండై మరలివచ్చి రాయలకు సమాచార మాద్యంతము నెఱింగించెను.

---

## ప్ర థ మ బిం బ ము.

### పదుమూఁడవ ప్రకరణము.



శ్యామపురమునొద్ద చేరినపిమ్మట రాయలు తనమనస్సున స్థిమితపడియెను. ఒకనాఁడు తాను భార్యలనిద్దరను వెంటఁబెట్టుకొని దేవతాదర్శనార్థమయి లక్ష్మీనారాయణస్వామి దేవాలయమునకుఁ బోయెను.

ఆవిగ్రహములు గలదేవాలయ మప్పుడు సమీపారణ్యమున భూమిలోఁ బూడిపోయియుండెను. రాయల యాజ్ఞచొప్పున నాస్థలమంతయును త్రవ్విరి. ఆలక్ష్మీనారాయణులజీర్ణవిగ్రహములు బయటఁ బడియెను. రాయలు ఆస్వామిని సందర్శింపఁబోయినప్రథమదివస మిదియె. ఆతనిననుసరించి నందయును, రమయును, పల్లకు లెక్కి వచ్చిరి.

పర్వతప్రాంతమునకు వచ్చి చేరుటతోడనే ముగ్గురును తమసవ్వారీలనుండి దిగిరి. మార్గదర్శకు నొకని వెంటఁబెట్టుకొని ఆ యరణ్యాంబునకుఁ బోయిరి. అనన్య సామాన్యమయిన యాప్రదేశ రామణీయకము పొడఁగనినతోడనె వారల కొకవిధమైన యుత్సాహ ముదయించెను. శ్యామలపత్రిసంచయంబునడుమఁ బుష్పలగుత్తు లెన్నెన్నియో దర్శనీయముగఁ గన్పట్టెను. అప్పుడపుడె వికసించిన తెల్లనిపూవులును, పచ్చనిపూవులును, నీలంపు సుమములును, ఊదారంగుపుష్పంబులును, హరితశ్యామలనీలధవళకుసుమంబులును, ఎన్నెన్నియో యొకదానిపై నొకటి తండోపతండములుగ వికసించుచుఁ దమసహజపరిమళంబులచే వాతావరణ మంతయు మనోహరంబుగ నొనర్చుచుండెను. తన్మధ్యభాగంబున మఱుంగువడి యంతర్హితంబులై వివిధవర్ణంబులఁ బక్షిజాతు లెన్నెన్నియో వివిధస్వరంబుల నానందగీతంబులఁ బాడుచు కేరింతలాడుచున్నవి. మార్గము మిక్కిలి యిఱుకుగానుండెను. లోపలికి పోవలెనన్న ఆకులును గొమ్మలును, ఒత్తిగించుకొని పోవలెను. ఒకయెడ రమానందల చేలాంచలములు కంటకపీడితం బగుచుండెను. ఒక్కచో పుష్పమంజరులు వచ్చి వారి చెక్కుల ముద్దిడుకొని పోవుచుండెను. వేఱొక్కయెడ, కొమ్మకదలుటచే నందు నానందించు చిత్రవర్ణభ్రమరంబు వారి ముఖపద్మంబుల ననుసరించి తిరుగుచుండెను. ఇంకొక్కయెడ పవ్వళించియున్న హరిశాబకంబు వారియడుగుల చప్పుడుచేఁ బెదరి తన

యనస్థానంబు విడచి పఱతెంచుచుండెను. పర్ణములు వ్రాలెను. పుష్పము లురలెను. పక్షు లెగిరిపోయెను. లేళ్లు క్రేళ్లురికెను. ఇట్టి మార్గ సంచారంబు గాంచి రాయలు భార్యాసమేతుండై దేవాలయపరిసర మునకుఁ బోయెను. అచ్చట మార్గదర్శకునికి సెల విచ్చి పంపెను.

దేవాలయంబంతయును భూగర్భితంబై యుండెను. వెలుపటనుండిచూచువారికి శిఖర మొక్కటియె కనుపించుచున్నది. రాయలయానతి ద్వారమునొద్దకుపోవుటకు మెట్లు కట్టిరి. లోపలనున్న చీకటులు పాయుటకై దీప మొకటి వెలిఁగించిరి. అతఁడు భార్యాసమేతుండై దేవతాదర్శనముచేయఁదలంచి యుండుటచే సేవకు లెవ్వరి నందు లేకుండఁ జేసెను.

ఆద్వారము నొద్దకు పోవునప్పటి కత్యద్భుతముగా నావిగ్రహ సమీపముననున్న మహమ్మదీయమతస్థుఁ డగుఫకీరొకఁడు కానుపించెను. రాయ లాశ్చర్యముఁ జెంది "ఓసాధుశీలుఁడా! నీవెవ్వరు?" అనియడిగెను.

మహమ్మదీయుఁడు—నేను సన్యాసిని.

రాయలు—సన్యాసివా?

ఫకీరు—నిశ్చయముగ మహమ్మదీయుఁడనె?

రాయలు—రామ. రామ. దిక్కుమాలినకాలము.

ఫకీరు—నీవుగొప్పజమీందారుఁడవు. దిక్కుమాలినకాల మేల వచ్చినది?

రాయలు—గర్భాలయమున మహమ్మదీయుఁడుండుటచే?

ఫకీరు—ఉండిన నేమి? కుమారా? అందువల్ల విగ్రహాము మైలఁ బడినదనియా నీ యూహ.

రాయలు—అందునకు సందేహ మేమి? చూడఁగా నీకు వేదాంతము ముదిరిపోయిన ట్లున్నది.

ఫకీరు—దాని కేమిగాని అయ్యా! ఈవిగ్రహ మేమి చేయునయ్యా?

రాయలు—ఇతఁడు సర్వశక్తుఁడు. సృష్టిస్థితిలయకారణభూతుఁడు.

ఫకీరు—నిన్నుం బుట్టించినవాఁ డెవ్వఁడు?

రాయలు—అతఁడే.

ఫకీరు—నన్నుఁ బుట్టించిన దెవ్వఁడు?

రాయలు—నిన్నుఁ బుట్టించినదియు నతఁడె. అందఱను బుట్టించినదియు నాదైవమె.

ఫకీరు—మహమ్మదీయుని పుట్టించినందువలన నాతఁ డపవిత్రుండుకాక మహమ్మదీయుఁ డాతని యాగ్ని యద్వారమునొద్దఁ గూర్చుండుటచేతనే నా యాతఁ డపవిత్రుఁడైనది? బిడ్డా! హిందూరాజ్యము సంస్థాపింపవలెనని వచ్చిన నీజ్ఞానమిదియా? ఇంక నొక్కమాట యున్నది. ఈ నీ దైవ మెచ్చట యధివసించును. దైవము ఈసృష్టిస్థితిలయము లెల్ల నీయాలయమునుండియే చేయుననియా లేక యాతనికి నెచ్చటనైన వసతి యున్నదనియా? నీయూహ.

రాయలు—అతఁడు సర్వవ్యాపి. ఆతఁ డెల్లచోటులను నుండును.

ఫకీరు—అట్లయిన నాలోపలగూడ నుండియుండవలెను.

సీతా—నిశ్చయముగా! అట్లయిన మీ రేల యీవిషయమున కొప్పుకొనరు?

ఫకీరు—అతఁడు రాత్రిందివములు నాలోనుండి యపవిత్రుండు కాలేదు నే నీదేవాలయసాన్నిధ్యమున నున్నంతమాత్రమున నపవిత్రుఁడై నాఁ డందువా?

హిందూతార్కికసిద్ధాంతముల నెఱింగినవాఁ డెవ్వండైన నప్పుడు చెంత నుండియుండెనా? తృప్తికరమైన ప్రత్యుత్తరము వచ్చియుండును. గాని రాయలకు తర్కము రాదు. అతనికిఁ దగినయుత్తరము చెప్పలేక చిన్నవోయెను. మా దేశాచారమిదియని గొణుగుకొనియెను.

ఫకీరు—కుమారా! నీవిచ్చట హిందూరాజ్య మొకటి స్థాపించవలెనని సంకల్పించుకొని నాఁడవఁట, దేశాచారమని చెప్పి యట్టి యాచారమునకు నీవింత దాసుఁడవై యుండు నెడల నీవీకార్యమున విజయము నొందఁగలవా? ఇప్పు డీదేశమున హిందువులును, మహమ్మదీయులును కూడ నధివసించుచున్నారు. వారి యుభయులను నీవు సమబుద్ధితోడఁ జూడకుండిన నీకు కార్యానుకూలము కాఁగలదా? నీయధికారము ధర్మమార్గము ననుసరించుటకు మారుగ నీ వధర్మపథంబునఁ బడిపోవా? హిందువులను, మహమ్మదీయులనుకూడ సృజించిన దొక్కఁడె. హిందువుఁడై పుట్టినవాఁడును, మహమ్మదీయుఁడై పుట్టినవాఁడునుకూడ నాతనిపుత్రుఁడె. ఉభయులునుకూడ నాతని బిడ్డలు. వా రుభయులును నీపాలనము నందలి ప్రజ ల

గుదురు. నీవు దేశాచారమునకు దాసుఁడవై యెన్నఁటికిని భేదభావముఁ గల్పింపకుము. జాతిభేదము గల్పించుట కేవల మధర్మము. అధర్మరాజ్యము విశేషకాల ముండఁబోదు.

రాయలు—మహమ్మదీయప్రభువు లట్టిభేదమును గల్పించుట లేదా?

ఫకీరు—వారట్లు చేయుచున్నారు. అందువలననే వారి సామ్రాజ్యము ముక్కలై పోవుచున్నది. ఈయన్యాయముచేతనే వారిరాజ్యమంతయును, నశించుచున్నది. నీ విప్పుడు వారిని చేపట్టఁగలవేని మేలు. లేకుండిన మఱియొక్కనిచేతఁ బడును. హిందువులును, మహమ్మదీయులును కూడ భగవంతునికి పుత్రులె. అని చెప్ప యొప్పుకొనుచు భేదము నేల కల్పింపఁ జూచెదవు. కాని యిప్పుడు నీవు దేవతారాధనఁ జేయ వచ్చినట్లున్నావు. అది కానిమ్ము. కావలయు నెడల నేను మరల వచ్చి నిన్నాశీర్వదించి మఱి పోయెదను.

రాయలు—మీరు మహాజ్ఞానులవలెఁ గనుపట్టుచున్నారు. తాము మరల దర్శనమీయ ననుగ్రహింతురు గాక మనస్ఫూర్తిగ వేఁడుకొనుచున్నాఁడను.

అంత ఫకీరు చనియెను. రాయలు స్వామిదర్శనము చేసుకొని పూజలు గావించి మరలవచ్చి యీతనితో చాలసేపు సంభాషించెను. రాయలాతఁడు మహాజ్ఞాని యని కనిపెట్టెను. ఫరిషియను భాషయును, అరబ్బీ భాషయును, అతఁడు పూర్ణముగఁ జదివినవాఁడు. సంస్కృతపాండిత్యము సంపాదించి హిందువుల మతసిద్ధాంతములంగూడ తరిచిచూచినాఁడు. అతఁడు వయస్సున పెద్దవాఁడై ప్రాపంచిక సంబంధమగు ననుబంధములన్నియు పూర్ణముగ వదలినవాఁడు వలె కన్పట్టినాఁడు, అతఁడు సన్యాసియై సర్వస్థలములయందును సర్వపదార్థములనుసమభావముతోఁ జూడఁదలఁచి యుండెను. అతం డట్టి సచ్చరిత్రుం డగుటచే రమా నందలిరువురును సిగ్గు వదలి యొక్కింతదూరమున సుఖాసీనలై అర్థవంతమైనయాతనిసంభాషణమును వివేకముతోడ నాలకించిరి. వారిరువురును కూడ వివేకవతులె.

రాయలు ఫకీరుని వీడ్కొనుసమయమున "మీ రిప్పుడు నా కొసంగినయుపదేశంబు మిక్కిలి హేతుయుక్తంబై యున్నది. చేతనై

నంతవఱకు దాని ననుసరించెదను. మీరు వచ్చి మారాజధానిలో వస తి నేర్పఱుచుకొని యచ్చట నధివసింపుఁడు. తమయుపదేశంబుల నేమైన నేను గడిదాఁటి పోవుచుంటినేని వానిని నాకుఁజూపి లోటుపాటుల సవ రింపవచ్చును. తమవంటివారిజ్ఞానోపదేశంబులు నారాజ్యాభివృద్ధికి క్షేమంకరములు.

ఫకీరు—అట్లయిన నీ ప్రక్క వాగ్దానము చేయవలెను. నేను నీకోరికఁజె ల్లించెదను. నీరాజధాని కేమని పేరిడియెదవు.

రాయలు—దానిప్రస్తుతనామము శ్యామపురము ఆపేరుననే యది యింకముందును వఱలుచుండును.

ఫకీరు—నీవు దానికి మహమ్మదు పురమని పేరు పెట్టితివేని నేను నీకోరిక ను చెల్లింతును.

రాయలు—అట్టి పే రేల పెట్టు మనియెదవు.

ఫకీరు—అట్టిపేరు పెట్టినయెడల నీవు హిందువులను మహమ్మదీయులను స మబుద్ధితోడఁ జూడఁగలవని నాకు నమ్మకము కలుగును.

సీతారాముఁ డొక్కింత యోచించి యందులకు సమ్మతించెను. స న్యాసియును నందుపయిని " నేను ఫకీరును. నే నెచ్చట నుండినదియు నీకు తెలియ పఱచుచుండెదను. నీచిత్తము వచ్చినపుడు నాతోడ ముచ్చటిం ప వచ్చును.

అని వారి ముగ్గురిని నాశీర్వదించి పీఁట్క ని రాయలను "వాంఛిత ఫలసిద్ధి రస్తు" అని దీవించెను. నందను చూచి నీవు పట్టమహిషివి కానోపు దువు. నీవు పట్టమహిషిధర్మంబుల నవలంబింపుము. ఇంక నీసామా న్యధర్మములను మార్చి మీశాస్త్రములయం దెట్లు విధింపఁబడియెనో అట్లు నడచుకొనుము. పొమ్ము. నీకు శుభమ్మగు." రమనుగూర్చి "కు మారీ నీవు స్వభావముచే భీరురాలివలెఁ గన్పట్టుచున్నావు. ఈఫకీరుని వాక్యముల స్మరించుకొనుము. ఆపద వచ్చినపుడు భయపడ వలదు. భయమువలన ననర్థము లెన్నియో పుట్టుచుండును. పట్టమహిషియగు కాంతకు జడుపు తగినది కాదు. అని యుపదేశించెను.

అంత వారు ముగ్గురును పట్టణముదారిం బోయిరి.



## ప దు నా ల్గ వ ప్ర క ర ణ ము.



శ్యామాపురము మధుమతీతీరమందున్నది. అయ్యది పల్లెటూరు గాని పట్టణముగాదు. రాయలపిత్రార్జితమయిన ఆస్తి అదియే. ఇప్పు డాతఁ డచ్చటఁ జేరినాఁడు. బందిఖానానుండి తప్పించుకొని వారంద ఱును ఫౌజులదారుని యాగ్రహమునకు వెఱచి భూషణపురమును త త్పరిసర గ్రామములును పరిత్యజించి శ్యామపురమునకె నలసలువచ్చి రాయలయండను జేరిరి. ఆరోజున జరిగిన యల్లరిలోఁ జేరినవారంద ఱును తమతమనేరములను తా మెఱింగియున్నవా రగుటచే ఫౌజుదా రునివలన తప్పక తమకు శిక్షయగునని యెంచి రాయల శరణుజొచ్చి యచ్చట మేడలును మిద్దెలును గట్టికొనిరి. రాయలు తనయాశ్రితులను, అప్పుల వాండ్రను యెచ్చటెచ్చట నున్నవారి నందఱిని పిలిపించి శ్యామ పురమున వసతివాడ లేర్పఱచెను. ఇట్లు మిక్కిలి చిన్నపల్లెయయినశ్యా మాపురము కొలఁదిరోజులలోపలనె జనసంకులంబయిన బస్తీయయ్యెను. రాయ లందుకుఁ దగినట్లు పురమును నిర్మింప శ్రద్ధాళువయ్యెను. జన సంకీర్ణంబయిన ప్రదేశంబుల నింగ్లాల్ల వర్తకము ప్రబలమగుట సహ జము. ఆకారణమున దుకాణదారులును, వర్తకులును, పనిబాగుల వాండ్రును, బేరగాండ్రును, ఋణదాతలును, మఱియు నితరులగు రకరకంబుల మనుష్యులందఱును, శ్యామపురముప్రవేశించిరి. రా యలు వారి కందఱకును వసతివాడ లేర్పఱచెను. ఈరీతి నాపట్ట ణమున బజారులు, దుకాణములు, బందరులు, గంజులు మొద లగు సౌకర్యంబు లన్నియు నేర్పడియెను. రాయలకు పిత్రార్జితమగు ద్రవ్యమాతనియింట సంచులకొలఁది మూలుగుచున్నదని వాఁడుక. ఆ సొమ్మంతయును, తన నూతనరాజధాని సంస్థాపనకై వెచ్చపెట్టెను. ఈమూలమున వ్యవసాయదారు లెచ్చగుటచే నాతనికి భూములమీఁద నమరకములు గూడ హెచ్చయి యాతని రాబడి వృద్ధియయ్యెను. హిం దూరాజ్య మొక్కటి స్థాపనయైనదని వినుటతోడనే దేశము నలుతట్ల నుండియు జనులు తండోపతండములుగ వచ్చి చేరిరి. కొందఱు మహమ్మ దీయులదాడికి నోరువలేక పాఱివచ్చిరి. కొందఱు దేశశాసనము నతిక్ర

మించినందువలన శిక్షలఁ బడుదు మను భయముచేత చనుదెంచిరి. కొంద ఱుహిందూరాజుల రాజ్యములను చేరిన తమ మత స్వాతంత్ర్యముల నిచ్ఛానువృత్తిని నిలిపికొనవచ్చు నను నుద్దేశముతోడఁ జనుదెంచిరి. రాయలరాబడి కాధారములు మిక్కిలి వృద్ధియయినవి. నూతనముగా పెంపొందుచున్న యీనగరమున కలంకారముగా నుండు నిమిత్తమయి వనవాసభవనముగ దివ్యమందిర మొక్కటి నిర్మించెను. అంబరము నొరయుగోపురంబులతో దేవాలయములు గట్టించెను. పట్టణంబంతటను వలయుచోటుల చక్కని విహారసరోవరంబుల నేర్పఱచి వానిచుట్టును చక్కని పానంచాలను గట్టించెను. పెద్దపెద్ద రాచబాట లేర్పఱచెను. ప్రజలందఱు నీరాష్ట్ర నిర్మాణమునకై అరుగ కుండగనే తెచ్చి ధనమిచ్చి రాజునకు సాయపడిరి. సొమ్ములేని వారందఱును రాజధాని నిర్మాణమునకును రాష్ట్రసంరక్షణమునకును, తమశరీరముల నర్పణము జేసిరి.

రాయలచాతుర్యమువలనను హిందూరాజ్యము సంస్థాపితమగుననఁగనె యుత్సాహముదయించి ప్రజలుచేసిన సాయమువలనను యవియన్నియును కొలఁదికాలములలోఁ బరిపక్వదశ నొందెను. కాని యీతఁడు రాజపట్టము నొందినవాఁడు కాఁడు. అందులకు డిల్లిచక్రవర్తియొద్దనుండి సనదుసంపాదనకావలసియుండెను. లేకుండిన మహమ్మదీయుల కానెపంబున నీతనినాశనముచేయుటకు సందు దొరకును. ఈక్షణమువఱకు నీతఁడు విప్లవకారకుఁడని యనుమానించుట కీతనివలన నేరమేమియుఁ గనుపడుట లేదు. గంగారాముని విముక్తిసమయమునఁ జరిగినకలహమున నీతఁడు కర్తయె జరిగించిన కార్యమేమియు లేదని ఫౌజుదారుఁ డెఱుంగును.అందుచేతనే ఆతఁ డేవిధమయిన ఆయుధమును చేఁబట్టలేదని ఆతఁ డనుకొనెను. బందిఖానలోనుండి ఖైదీలు తప్పించుకొనుటలో నీతనిసంబంధమేమియును లేనట్టు మహమ్మదీయులకు నమ్మకము కలిగియుండెను.అతనిని పట్టుకొనినట్టయినను ఫౌజుదారునకుఁ దెలియదు. ఆకారణమున నాతని ద్రోహియనిచెప్పుకొనుటకుఁ గారణమేమియును గనుపించుట లేదు.అదిగాక ఈతఁడు రాజపట్టము నంగీకరింపనయిన లేదు. ఢిల్లీచక్రవర్తియే తనకు సర్వాధికారియని యంగీకరించి యున్న వాఁడు. దివాణమునకు చెల్లవలసినపన్నులన్నియును, సకాలమునఁ జెల్లించుచుండెను. మహమ్మదీయులందఱితో

డను స్నేహభావము నెరపుచున్నవాఁడు. వీని యన్నింటివలనను నాతని నిర్దోషత్వము బలపడుచుండెను. తనపురమునకు మహమ్మదుపురమను పేరు పెట్టుటయే గాక హిందువులకును మహమ్మదీయులకును సామరస్యము నెఱపి పాలకులకును, పాలితులకును, స్నేహభావము హత్తుకొనఁ జేయుచుండెను. పునాదిగట్టఁబడకమున్ను మహమ్మదీయులతో నేమాత్రము పేచీలు పెట్టుకొనినను అయ్యది తనవినాశనమునకు కారణమని యాఁతఁడు పూర్ణముగ నెఱుఁగును. తనకుఁ దగిన బలముచేఁ జిక్కుదనుక ప్రభువులతో మంచితనముగ నుండవలెనని నిశ్చయించుకొనెను.

అయినను అతనిరాజ్యమునందలి ప్రజ దినదినాభివృద్ధి గాంచుటయును, అతనికి లభ్యమగుచున్న ప్రజావశ్యతయుఁ గీర్తియు సర్వథా యాతనికిఁ గలుఁగుచున్న యోగక్షేమములును ఫౌజుదారుఁడగు తోరబుఖానునకు అలజడి జనింపఁజేసెను. ఏమాత్రము సందుదొరకినను మహమ్మదుపురమును కొల్లగొట్టి రాయలను నాశనము జేయవలెనని యాతఁడు కృతనిశ్చయుండయి యుండెను. నెపములు దొరకకపోవునా? పలాయితులను దుష్టవర్తకులను బట్టియిమ్మని యొకసారి తోరబుఖాను రాయలకు వర్తమానమంపెను. అందులకు ప్రత్యుత్తరముగా నాతఁ డెవరెవరిని పంపవలెనో పేరులు చెప్పిన పంపెదనని వ్రాసెను. ఫౌజుదారు కొన్ని పేరులు పంపెను. కాని పలాయితులందఱిదివఱకె మారుపేరులు పెట్టుకొని యుండిరి. ఇంక ఫౌజుదారు వ్రాసిన పేరులు కలవారెట్లు చిక్కుదురు? అందుచే రాయలు అట్టిపేరులు కలవారెవ్వరును తనపురమున లేరని వ్రాసియంపెను.

ఈవిధమున నా రెండు రాష్ట్రములును, పెనుగులాడుచుండెను. అందువలన నొకరియుద్దేశ్య మొకరికి తెలిసిపోయెను. తోరబుఖాను రాయలను నాశనము చేయుటకయి సేనలఁ బ్రోగు చేయుచుండెను. ఆత్మసంరక్షణ కొఱకయి రాయలు పట్టణము చుట్టును కోటఁ గట్ట నారంభించెను. తనప్రజల కందఱకును తాలింఖానాలు పెట్టి కుస్తీలు నేర్పియు యుద్ధకార్యముల వ్యూహక్రియల నేర్పియు, ఆయుధములఁ బ్రోగుచేసియు సురంగ పర్వతమార్గములగుండ మందుసామానులు తెప్పించియు సమరసన్నాహములఁ గట్టిపఱచుచుండెను.

ఈకార్యము లన్నియును, నెరవేర్చుట యందాతనికి ముగ్గురు పు

రుషులు సాయము సేయుచుండిరి. వారు ముచ్చెరుంగూడ నందులకుఁ దగినవారైయై యుండిరి. ఆకారణమున నీకార్యములన్నియు నడిచవ్వుడు లేకుండ నెరవేరి పోయెను. చంద్రచూడతర్కాలంకారుఁడు మొదటి వాఁడు. మృణ్మయుఁడు రెండవవాఁడు. గంగారాము మూఁడవవాఁడు. గట్టి యోచన కావలసి వచ్చినపుడు చంద్రచూడుని బుద్ధిబల ముపయో గపడు చుండెను. సాహస బలములు వలయు నెడల మృణ్మయుఁడు పై కి వచ్చుచుండెను. చుఱుకుఁదనముతోఁ బనిఁజేయ వలసి వచ్చెనేని గం గారాముఁడు పనికి వచ్చుచుండెను. గంగారాముఁ డప్పుడు మహమ్మదు పురముననే నివసించి యుండెను. రాయల కాతఁడు శరణార్థియును, స హాయకారుఁడును కూడ నయ్యెను. ఫకీ రప్పుడప్పుడు వచ్చి దర్శనమిచ్చి పోవుచుండెను. అడిగినప్పుడెల్ల మంచిమంచి యుపదేశముల సేయుచు కలహము లేమియు రాకుండ వెనుకకు లాగుచు నాతఁడు పనిచేసినాఁడు. ఇట్లు కొంతకాలము సర్వమును చల్లగ నడచి పోయెను.

---

## పదునైదవ ప్రకరణము.

రాయలకు సహాయముచేయుటకై పై ముచ్చెరును నుపచరిం చుచుండిరి. అతనియున్నతకార్యములకును, మహల్లాభములకును, నాత నిచిన్నభార్య రమ ప్రక్కలోనిబల్లెమయ్యెను.

ఈమెకు కలహమని వినఁబడినంతనే, ఎక్కడలేనిభయమును వచ్చి యామెను చుట్టుకొనుచుండెను. రాయలధైర్యమె ఈమెభయమున కు మూలకారణమయ్యెను. మహమ్మదీయులు దేశమునఁ బ్రభువులై యుండుటచే వారితోడ నేమాత్రము కలహమువచ్చినదనినను, ఆభయము నకుమితియేలేకపోవఁజొచ్చెను. పైగా నొకనాఁటిరాత్రి రమ కొకదుస్స్వ ప్నమువచ్చెను. ఆస్వప్నమున మహమ్మదీయులు యుద్ధమున విజయమునం ది రాయలనుఁ దననుఁబట్టి బంధించి చేయరాని పనులేమేమియో చేసిన ట్లు కనఁబడియెను. వందలకొలఁదిమహమ్మదీయులభయంకరముఖములనుఁ తళతళమెఱయు వారలవాడికోఁఱలును, పెద్దపెద్దగడ్డములును, నామెకుగ న్నులఁగట్టినట్టులుండెను. వారిమోట కేకలు చెవులగింగిఱుమనుచు నెయుం

డెను. రమ రాయలు మహమ్మదీయప్రభువుల యొద్దకుఁ బోయికన్నులనీరు వెట్టుకొని వారిపాదములఁ బట్టుకొనినయెడల సర్వమును భద్రముగ నుండుననియు, మహమ్మదీయులు కనికరింతురనియును చెప్పియట్లుఁ జేయుమని యాతని కోసి పెట్టుచుండెను. మహమ్మదీయులకు వ్యతిరేకముగా తాను చేసినది లేదనియును వారికాగ్రహము వచ్చుటకు కారణము లేదనియును రాయ లెన్నియోవిధముల నచ్చచెప్పుచుండెను. అది యామెకడ నేమియును పనిచేయుటలేదు. ఎన్ని చెప్పినను శ్రావణమాసములోని ఏఱుల వలె రమగండస్థలమునుండి సంతతధారావృష్టిగఁ గన్నీరు కాలువలు గట్టుచునేయుండెను. ఆమెవ్యవహారమునకు రోసి రాయ లామెశయనాగారంబున కరుగుటయే మానివేసెను. ఈకార్యము ప్రథమభార్యయయిన నంద కుపకారకమయ్యెను. మనమిచ్చట శ్రీని రెండవభార్యగా సంభావింపవలెను.

ఈస్థితిగతులన్నియును, చిన్నతనపుచేష్టలుగలరమకు మఱింతవ్యసనమును కలిగించుచు మహమ్మదీయులతోడఁ గలిగెడుకలహమున తనకు తప్పక ముప్పు వాటిల్లు నను నుద్దేశ్యము ధృఢమగుచున్నది. అందువలన నామె రాయలను వెంటాడించి పట్టి పీడించుచుండెను. కనఁబడినప్పుడెల్ల నేడుపులునుఁ బెడబొబ్బలునుగానుండినను బ్రతిమాలుటలును ప్రార్థనలును మొగము నేలఁబెట్టి మోఁదుకొనుటలును ప్రారంభమయ్యెను. ఈకారణముచేత రమ యుండెడివైపులకైనను రాయలరుగుట మానివేసినాఁడు. ఇదికనిపెట్టి రాయలు నందశయనాగారంబునకుఁ బోయెదుఁత్రోవలో ముసుఁగుబెట్టుకొని పండుకొనఁ బ్రారంభించెను. సమయము చిక్కినపుడెల్ల నాతనిపైఁబడి పట్టుకొని తనయంతఃపురమునకు గొనిపోవుచుండెడిది. పిమ్మట నెప్పటి యేడ్పులును బెడ బొబ్బలును, నెప్పటి బ్రతిమాలుటలును, సంప్రార్థనములును, నెత్తిమోఁదుకొనుటలును, మూలుగులును, ఆక్రందనములును, నాటకమువలె జరుగుచుండెను. ఒకప్పుడు కన్నీరు సంతతధారావృష్టిగఁ గురియుచుండును. ఒకప్పుడు జడులుజడులుగా పడుచుండును. ఒకప్పుడు విశాఖవృష్టిగా నుండును. ఒకప్పుడు ఉత్తర వానలుగా నుండును. అంతకును గారణ మొక్కటియె. పొండు కన్నుల నీరుబెట్టుకొని మహమ్మదీయప్రభునిపాదమ్ములఁ

బట్టుకొనుఁడు. లేకున్న నేమికష్టములు వచ్చునో అనితలపోయుచుం డును. ఈమాటలు వినినతోడనే కాచిన సీసముఁదెచ్చి, అతని శరీరము నందలి యెమ్ముక యెమ్ముకకును బోసినట్లుండెను.

పోనుపోను మహామ్మదుపురము వృద్ధియగుటయును, అందలిజన సంఖ్య భూషణపురంబున కన్నవృద్ధి యగుటయు, కోటలు, బురుజులు, అగడ్తలు, బారులు తీర్చిపెట్టిన ఫిరంగులు ఫిరంగిగుండ్లును కేపులును తుపాకులును తదితరములగు నాయుధములును, కలిగి చెలంగునాయుధ శాలలును వగ్గిల్లుటలును, తండోపతండములుగ జనులు పదాతివర్గమున జేరి తయారగుచుండుటయును గనుంగొని యామె మనోవ్యథపాలై మంచముఁ బట్టెను. భగవంతునారాధింపఁ బోయినపుడు ప్రతిదిన మామె తనయిష్ట దైవతమునకు చేమోడ్చి "ఓదేవా ఈమహామ్మదుపురము పేరు లేకుండ నశింపవలయు. మాప్రపంచసౌఖ్యములకేమియును భంగము లేకుండ మేము మహామ్మదీయ ప్రభువులక్రింద సుఖముగ కాలము వెళ్లఁబుచ్చవలయు. ఇప్పుడే మాపై బడనున్న చెఱుగు లన్నియును దొలఁగించి రక్షింపుఁడు" అని ప్రార్థించుచుండెను.

రాయల సన్నిధిని కూడ యామె యట్టులె యించుకయైన సంశయంబులేక ప్రార్థించుచుండెను.

రాయలకు నందయందుకన్న ఈమెయందే మోహమెక్కుడని మాపాఠకు లెఱింగియె యుందురు. రమ ప్రవర్తించుచున్న యిప్పటి ప్రవర్తనవలన నామె సిప్పుడాతనికి చూచుటకయినను మనసు కొల్పక యుండెను. ఈసంగతిఁ దెలుపనవసరము లేదు. అతఁ డప్పుడు మనంబున "ఇట్టి సమయంబున శ్రీయె సమ్ముఖముననుండెనా? ఎంత బాగుండి యుండునో? అనుకొనఁ జొచ్చెను. ఆనిమిషనయనంబున కెట్టయెదుట నెప్పుడును శ్రీ గోచరించుచునె యుండెను. నందగాని రమగాని శ్రీకి సమానులు కారు. ఆమెయాకారము మనస్సునందంత గట్టిగ నాటుకొని పోయినది. అతఁడు తాను మనస్సులోఁ బొందుచున్న యారాటమును, నందకుగాని రమకుగాని, వారిమనంబుల కాయాసకరంబుగ నుండి పోవునని చెప్పినవాఁడు కాఁడు. ఒక్కసారి మాత్రము రమ యసంతుష్టి ప్రవర్తనకు విసుకుఁజెంది తప్పఁ బారి చెప్పరాదనుమాట మరచి

"అకటా, అట్టి శ్రీపోయి యిట్టిరమ సంఘటిల్లెనే యని" అనుకొని యెను.

ఈమాటలు వినునప్పటికి రమ కన్నుల నీరు తుడిచికొని "అట్లయిన శ్రీని మరల గనుఁగొనరాదా? ఎవ్వరాటంక పెట్టినారు?" అని చెప్పెను.

రాయ లంత పెద్దనిట్టూర్పు విడిచి "ఆమెను నేను మరల నెచ్చటఁ గనుఁగొనఁ గలను" అని వలపోసెను.

ఈమాటలు రమహృదయమున ములుకులవలె నాఁటుకొనినవి. రమయొక్క లోటుపాటు లెట్టివైనను ఆమె తనభర్తయందునను, కుమారుని యందునను, మిక్కిలి యనురాగము కలిగియుండెను. వారి కెప్పుడేమియాపద వాటిల్లునోయని మిగుల నాతురతతోఁ గనుఁగలిగి మెలఁగుచుండెను. ఈవిషయము రాయలు కనిపెట్టకపోలేదు. కాని యామెయెడ నాతఁడసంతుష్టాంతరంగుఁడై యుండక తీరినదికాదు. ఆమె యేడ్పులును, ఆమె సణుగులును, ఆమెవల్ల నాతనికిఁ గలుఁగుచున్న యంతరాయములును, అందుమూలమున నాతనిమనస్సున కొదవెడు పరితాపమును మితిమీఱియుండెను. దాంపత్యసౌఖ్యము భార్యాభర్తల పరస్పరానురాగ మొక్కదానితో సరిపోవునది కాదు. వారి యుభయులమనస్సులును, ఒక్కమాదిరి నుండవలెను. హృదయము లైక్యము నొందవలెను. రమ "నావలన నేవిధములయినలోపము లేకుండఁగనే నాపతి నాయెడ ననురాగశూన్యుఁ డయినాఁడే" యని యనుకొనఁ జొచ్చెను.

రాయలు——"ఓపరమగురూ! రమయెడ నాకుఁ గల యనురాగము వీడిపోకుండఁ బట్టి కాపాడుము" అని ప్రార్థించెను. రమయెడఁ గలుగుచున్న యీమనోదౌర్బల్యమువలన రాయలహృదయమున గాఢముగ నాఁటుకొనిన యాసుందరవిగ్రహము, ఆదినమున కాదినము మఱింత తేజోవిరాజితమయి ప్రకాశింప నారంభించెను. రాయ లెటులయినఁ దనమానప్రాణములనెల్ల ధారవోసి హిందూరాజ్యసంస్థానమును చేయవలెనని నిశ్చయించుకొనియున్నవాఁడు కాని, ఇట్టి సమయమున శ్రీ, ఆతనిహృదయపీఠమున నావరించియుండెను. శ్రీ

# ప్రథమబింబము.

మొదట తా నొనరించిన నేరమునకే భగవంతుఁడు తన కీరమా
మగుశిక్ష నొనర్చుచున్నాఁ డని యాతఁడు సంభావించెను.
దీనికి మఱియొక ప్రాయశ్చిత్తము లేదు. కాని ఈహ్యాదయాలఁ
ఆవిగ్రహమును ప్రతిష్ఠింప రమ యొక్కతయే కారకురా లఁ
యథార్థము కాదు. నందకూడ ఈమాదిరిసిగాకున్న మఱి
మాదిరిసి దీక్షకిఁ దోడ్పడుచు వచ్చెను. మహమ్మదీయులనిన
భయము లేదు. రాయలు ధైర్యస్థైర్యములు కలవాఁ డగు
పయమయిన భయ మేమియును నామె పొందవలసిన
లేదు. తనభర్త తాను చేయవలసినపనులెల్ల వివేకముతో
యుక్తముగ యోచించి చేయఁగలఁడని యామె నిశ్చయ
యుండెను. ఆకారణముచే నాతఁడు యుక్తమని యెంచి
మున కామె కడ్డుఁ జెప్ప నవసరమే కనుపడదయ్యెను.
యోచనలన్నియును నంద తనమనంబునుండి పాఱద్రోలి
మంతయును భర్తృశుశ్రూషకయి వినియోగించుచుం
నారాయణస్వామి దేవాలయములో ఫకీరు తన కొసం
ప్రకారము నడుచుకొనవలెనని యామె తన శక్తికొలఁది
చుచుండెను. మాతృవాత్సల్యమును, పుత్రికా మము
చారికా సేవనమును, రాయలు నందవలన పొందఁగ
యతనియర్థాంగి యెచ్చటనున్నది. ఆతనిమనోభీష్టము
గాక యనికోరుచున్నట్టియును, ఆతని మనోరథంబు
నునట్టియును, కష్టకాలమునందు జడుపుఁ దీర్చి చేం
నిల్చునట్టియు, అవసరమైనపుడెల్ల మంత్రివలె యో
ట్టియు, విపత్పరంపరలచే వెలిపోక మనోవ్యసనములపా
పుడు మానసోత్సాహ మొనరించునట్టియు, విజ
డు తనతోడ కూడి సుఖించునట్టియు, నాపె యి
నున్నది? ఆశ్రీ మహాలక్ష్మి స్వర్గలోకంబున నుండఁ

ఇప్పుడు దండయాత్ర సంప్రాప్తమైనది. ఆసింప
తము కావలయు. ఆమె యిప్పు డెట నున్నదియో? నంద

నురాగాధిక్యమో యాతనికి మనంబున మరల శ్రీపైఁ దలంపుఁ గలి
ం. అడుగడుగునకు నామెమాటలె తలంపునకు వచ్చుచుండెను.
రాహామంతయు నుద్రేకించి యున్నప్పుడు వారలకందఱకు మార్గ
మై "చంపుఁడు చంపుఁడు. శత్రుకులం దునుమాడుఁడు. దేశ
శత్రువులు. హిందువులకు శత్రువులు. నాకు శత్రువులు. వీరి
జంపుఁడు. చంపుఁడు" అనునామెయుత్సాహవాక్యములు ప్రతి
ము నాతనిమనస్సునకు వచ్చుచుండెను. నాఁ డెంతయౌదార్యము
యెదుటఁ గనుపట్టెనో, అట్టి సింహవాహనారూఢ యగురూ
ప్పుడు రాయలు మానసికముగ నారాధింపఁ జొచ్చెను.
ృంగారక్రీడ లన నెట్టివో నే నెఱుంగ. అట్టివి నాయెడ సముప్ర
బయినవి. నన్నున్మత్తుం జేయుచున్నవి. ముందు వెనుక లార
సున్నవి. వేయేల. ఇట్టి దావాగ్ని యింత విపులమయినది
న మఱియొక్కయెడ నెచ్చట నుండనోఁపదు. శృంగారవిలాస
థములమాత్రము జదివితి. ప్రపంచవ్యవహారంబున నయ్యవి
ందునను, అనురాగమునందునను మాత్రము కనుపట్టును.
ందు వర్ణింపఁబడిన శృంగారచేష్టలన్నియును యౌవనపురుషు
ంపుజవరాండ్రను సంతోషపెట్టుటకయి కవులును చిత్రప్ర
ు తమతమబుద్ధికుశలతకొలఁది కల్పించినవికాని నిజమయి
ెవ్వనిసాంగత్యమున చాలకాలము సుఖముగ కాలక్షేపము
సుఖముల రెండింటనుకూడ నెవ్వరు కలసి మెలసి యుం
అనుకూలదినములందును ప్రతికూలదినములందునుకూడ
ంభావమున మెలంగుదురో ? అట్టివారియందే పురుషుల
మును ప్రేమయును కుదురును. కాని మఱియొక్కరియం
భావమునకు విరుద్ధము. క్రొత్తవారియెడ కూడ నొక
ం మంచిగౌరవము కుదురును. వారివర్తనము కొన్ని
సద్వర్తనముగ గనుపడును. వారియం దేవియో సుగుణ
్వు. వారియం దుండెడి నిశ్చయమయిన సుగుణములెవ్వో
ంగము. పైచిహ్నములనుబట్టి యట్టివి యిట్టివి యనుకొ
తఱచిచూచినగుణములు స్వల్పముగ నుండును. తఱ

చిచూడక కేవలమును, ఊహాలనుబట్టియె గుణనిర్ణయము జరుగు చుండును. ఆ నిర్ణయము మనుజునిమనోమార్గమును బట్టియుండును. అందువలనఁ గ్రొత్తవారియందు కనుపడుగుణములు సద్గుణము లుగాఁ గనుపించును. క్రొత్తవారనిన నపేక్ష యెక్కువగుటకుఁగూడ నదియె కారణము. దీనిని మోహ మందువా? యనుము. అట్టిది ప్రపంచమునందు లేకపోలేదు. అట్టిమోహము నిశ్చయముగ నొక్కొక్కప్పుడు పిచ్చికూడ నెత్తించును. అయ్యది కేవల మపరిచయుల యెడమాత్రమె. కృతపరిచయుల కందున నిలువనీడయె దొరకదు. రాయలకు శ్రీ యపరిచయురాలు. రాయలహృదయమున నట్టిమోహావ్యస్తవికార మొకటి యుపస్థితం బయినది. ఆప్రవాహవేగమున రుక్మిణీసత్యభామ లిరువురునుఁ గూడఁ గొట్టుకొనిపోయినారు.

అకటా! ఓ నవీనమా నీ వొక్కతవె చక్కనిదానవా? అట్టి చక్కఁదనము ప్రాఁతదానికిఁగూడ నున్నదా? కాని యోనవీనమా? నీవుమాత్ర మామనంతమగుదానిలోని భాగమవు కావా? అనంతమున మే మెఱింగినది బహుస్వల్పము. ఆకాసంతయును పూర్వమునుండి వచ్చు చున్నదే. మిగిలినదంతయుఁ మాకుఁ గ్రొత్తదియె. మా కెఱుఁగరాని యనంతముకూడ ననంతమెగాని మఱియొక్కటియా? ఆకారణముచే నోయపరిచయమా? నీవుకూడ నాయనంతములోనిదానవె కాని వేఱు కానేరవు. అందుమూలముననే నీ వాతచిత్తరంజకముగా నుండి హృద యోద్రేకమును కలిగించుచున్నావు. రాయలకు శ్రీ యిప్పు డనంతము లోనియొకభాగముగాఁ గనుపట్టెను.

అకటా? నీవును నేనునుఁగూడ నొకరికొకరము క్రొత్త లగు చుండమా? నీకును నాకును శ్రీ లభింపదా? మనకంతయును కృతపరి చయమయినదిగనె యుండి యున్ననాఁడు మనకు మరల నెద్దియైన క్రొత్తది యనునది దొరకునా? మన మప్పు డాయనంతమున కభిముఖుల మయి నిలువవలయు. మనకన్నులు మూఁతవడియెనేని శ్రీ మనకు లభిం చును. అంతవఱకును ధైర్య మవలంబించి హరినామస్మరణ సేయుదము. హరినామస్మరణయె మన కనంతత్వమును ప్రసాదించును.



## ప దు నా ఱ వ ప్ర క ర ణ ము.



"నే నిప్పుడు వైతరణియొద్ద నున్నదానను. దీనినిగనుక దాఁటితినా? నాకష్టము లన్నియును గట్టెక్కినందురు. నాకష్టముల కెప్పటికయినను, అంత ముండునా?" అని అతితీవ్రగామి యగువైతరణీతీరము నందలిసైకతస్థలమున నిలువఁబడి శ్రీ యేడ్చెను. ఆమెకు వెనుకటిభాగమున నల్లమబ్బులవలె నీలగిరిశిఖరములు, ముందువంక వక్రపథగామియయి విశాలభూభాగంబున విస్తీర్ణమయినచలువతాచట్టువలె నుండుతరంగిణి, దాని కవ్వల సప్తమాతృక దేవాలయము. ఆదేవాలయము మిట్టమీఁదనున్నది. ఎక్కుటకు ఱాతిమెట్లు లున్నవి. విగ్రహములన్నియు ఆలయములోపలనే యున్నవి, కాని యెక్కింత దృష్టిగోచర మగుచుండెను. పట్టమహిషీవైభవంబున వెలయుసింద్రాణి సుకుమారముగ హృదయరంజకముగావించు వైష్ణవి. కౌమారి. బ్రహ్మాణి, భయంకరరూపమునఁ జెలంగుచుండుమృత్యుదేవత, ఛాయ, వివిధాలంకారశోభితయు, మనోహరప్రభావిభాసిత కరచరణాద్యవయవ శరీరసౌష్టవవిరాజితయు, శంఖసదృశవళీవిరాజితగళయు, నగువారాహి, రత్నహారాలంకృతవక్షోభాగయు, లంబోదరయు, చీనిచీనాంబరాచ్ఛాదితమనోహరాంగియు, వరాహముఖసదృశవక్త్రియు, నగువరాహభయంకరాకారయు, అస్థిపంజరసదృశశుష్కశరీరయు, కేవలచర్మాంబరధారియు, శిరోభాగవిరాజమానకేవలసితకేశయు, విగతవసనయు, కృత్తికలాపాలంకృతహస్తపద్మయు, నగుచాముండ, బిల్వదళములు, మంచిగంధములు పుష్పరాసియు, నావిగ్రహముపై గుట్టలు మెట్టలు క్రిందఁబడి కడు భారముగ నున్నట్లు లుండెను. దానివెనుక గగనభాగంబుతో వియ్యమందఁ గోరుశిఖరంబులతో నొప్పు విష్ణ్వాలయం బొకటి, పిమ్మట నీలశిలాస్తంభశిరోభాగనివాస్తవ్యండై వెలయుపక్షిరాట్టు గరుత్మంతుఁడు. దిఙ్మండలంబున చాలదూరంబున ఉదయగిరి లలితగిరిశిఖరంబులు. ఇవియన్నియును కన్నుల గనఁబడుటతోడనె శ్రీ యిట్లని ప్రశంసించెను.

"అక్కటా, ఇచ్చట నావైతరణి యున్నది. ఈనదిని దాఁటిన నాకష్టములు గట్టెక్కవా?" "నీ విప్పుడు ప్రశంసించు వైతరణి మృత్యుముఖ

ద్వారమున నున్న అత్యుష్ణవైతరణియా? అందులకు నీవు ముందుగా మృత్యుముఖద్వారసందర్శనంబు సేయవలయు. అప్పుడే, ఆవైతరణి నీకు దృష్టిగోచరం బగును." అని వెనుకనుండి యెవ్వరో ప్రతివచనం బిచ్చిరి. శ్రీ వెనుకకుఁ దిరిగి చూచెను. భైరవి కనుపడియెను. అంత శ్రీ "ఏ మిది నాకు కేవలభైరవియె ప్రత్యక్ష మయ్యెను. అవును గాని తల్లీ! మృతనివాసము వైతరణి కీవల నున్నదో ఆవల నున్నదో తెల్పెదవా?" అని యడిగెను.

భైరవి మొగమున చిరునగ వంకురించెను. మృత్యునిలయంబు చేరఁదలంచిన వైతరణి దాఁటి పోవలయు. బిడ్డా! నీవేల? ఇట్టి ప్రశ్న వేయుచున్నావు. ఈవైపులనున్నను నీవు మృత్యుబాధ నొందుచుంటివా యేమి?

శ్రీ—ఆబాధ యిరుప్రక్కలనుకూడ నున్నదనుకొనుచున్నాను.

భైరవి బిడ్డా! అట్లు కాదు. ఆబాధ యంతయును నీవైపుననె యున్నది. నీవు వినుచుండెడి మృత్యుబాధలన్నియును మన మీవైపుల నుండియె అవతలకు తెలిసికొని పోవుచుందుము.

ఈజన్మమున మన మార్జించుకొనిన పాపము లన్నియును మూటఁ గట్టికొని వైతరణీనదిని దాటించు పడవమీఁద డబ్బియ్య నక్కరలేకుండ దాఁటించుకొని పోవుదుము. మనము మృత్యునిలయంబు చేరిన పిదప మనము నెమ్మదిగ మనముల్లెలన్నియు విప్పుదుము. మనంతట మనమె వానినొక్కొక్కటిగ విచ్చి చూతుము.

శ్రీ—చెలీ! మంచిదిగాని, ఆమూట నీవైపులనె దించి పోవుటకుఁ దగిన సదుపాయ మేమియును లేదా? ఉన్నచో వీనినన్నిటిని, ఇచ్చటనే విసర్జించి ప్రొద్దుగ్రుంకకుండగనే, అవతలవైపులకు దాఁటిపోయెదను. మనము చీఁకటికి చేఁజిక్కిన ప్రయోజనము లేదు.

భైరవి—బిడ్డా నీ కీతొందర యేల కలిగినది? నీ కిప్పుడు మధ్యాహ్నమయినను, తిరుగ లేదె.

శ్రీ—ప్రొద్దు పైఁబడినకొలది యెదయిన పెద్దగాలి దుమ్ము రావచ్చును. భైరవియును పరిణతవయస్విని కాదు. ఆమె కీదుమ్ముగాలి భయము లెదేమి? అందువల్లనె శ్రీ యామె నడుగ సాహసించినది. భైరవి

యును దానికిఁ దగినట్లుగ "నీకు గాలివాన భయ మగుచున్నదా యే మి? నీపడవ నడుపుటకుఁ దగినమాలిమికాఁడు లేఁడా?

శ్రీ—ఉన్నాఁడు కాని, అతనిపడవ నాకు వలదని విసర్జించితిని, అతనిపడ వకు నే నేల భారము కావలయు?

భై—అట్లయిన వైతరణీతీరము చేరువఱకును నీవే వెనుకులాడుచు వ చ్చినావు.

శ్రీ—తెలివిగల కర్ణధారకుని వెదకవలయు నని వచ్చినాను. శ్రీ క్షేత్ర మున కలంకారభూతుం డగునాతఁడు జనులను, అవతల గొడ్డు నకు చేర్చు నని చెప్పుకొందురు.

భై—నేనును పడవవాని కొఱకె యన్వేషించుచున్నాను. మనమిద్దర మును, ఏక కార్యార్థులమె. మనమిద్దరమును కలిసి పోయిన హాని యేమున్నది? నీవు నేఁ డేల యొంటరిగా బయలుదేరితివి? మొన్న నిన్ను నే సువర్ణరేఖాతీరమున చూచినప్పుడు నీతోడ జనులు చాల మంది యున్నవారే? ఇప్పుడు నిన్ను వారందఱు నొంటరిగ నేల ది గవిడచి పోయినారు?

శ్రీ—నన్ను ఈలోకమున కాచి రక్షించెడి వారు లేరు. ఎవ్వరును లేనివారికి యనేకు లున్నవారని యర్థము. మనఃపూర్వకముగ నేను సర్వమును పరిత్యజించితిని. శ్రీ క్షేత్రతీర్థయాత్ర సేవించుట కయి అనేకు లగు యాత్రికులతోడఁ గూడి పోవుచున్నాను. కాని మనకు మార్గదర్శకుఁడుగా నుండుపండా తనమోహాన్మత్తతచే మన కపాయము చేయఁదలంచినట్లు లున్నవాఁడు. అతనితోడ నుం డిన చిక్కు వచ్చునని యెంచి రాత్రివేళ తప్పించుకొని వచ్చితిని.

భైరవి—ఇప్పుడో?

శ్రీ—రెండుమాఱ్లల దాఁటవలయు నని యిప్పు డాలోచించుచున్నను. ఒక్కమాటు దాఁటుటయె లెస్స యనిపించుచున్నది. నీరు చాల లోఁతుగనున్నది.

భైరవి—ఆవిషయమున మనమిద్దఱము కొంచెము చర్చింపవలసియు న్నది. ఆచర్చలో తేలిన పర్యవసానమునుబట్టి నీవు నడచుకొందువా?

వా? నీవు చేరువకు వచ్చినావని వైతరణి నిన్నుఁ జూచిభయపడదు. నీ విప్పు డేమి చేసెదవు. నావెంట వచ్చెదవా?

శ్రీకి మతి స్తిమితము చెడినది. ఆమెకడ నిప్పుడు కానిడబ్బైనను లేదు. ఆయాత్రికులనందఱ వదలివచ్చినది మొదలు క్షుద్బాధనివారణ కొఱకయినను, ఏమియును లేకపోయినది. భిక్షాటనమో మృత్యువో యీరెండే యున్నమార్గము లని కనిపెట్టినది. ఇప్పుడు భైరవి సాంగత్య మలభ్య మయినది. మూఁడవమార్గ మేదయినను కనుపడవచ్చును. అదియైన సుసందిగ్ధముగానె యున్నది.

శ్రీ—నే నిన్ను ఒకప్రశ్న యడుగవచ్చునా? నీజీవనాధార మేమి?

భైరవి—భిక్షాటనము.

శ్రీ—నే నావృత్తి యవలంబించవలెను. అంతకన్న యమసాన్నిధ్యమే మేలుగా కనుపడుచున్నది.

భైరవి—నీవు భిక్షాటనమునకై కష్టపడలేనియెడ నీకయి యాపని నేనొనరించెదను.

శ్రీ—ఇంతటిపిన్నదానవు నీవా?

నాకంటెకూడ పిన్నదాన వనుకొనియెదను. ఇంతనిరుపమానసౌందర్యవంతురాలవు. అట్టిపనికి నీ వెట్లు సాహసించెదవు? భైరవి పరిపూర్ణ సౌందర్యరాశి. శ్రీకన్నకూడ అత్యంతశోభావంతురా లనవచ్చును. కాని యామెయవయవశోభ కప్పిపుచ్చుటకై మేనెల్ల దళముగ బూదిఁ బూసుకొనియెను. కాని యాపూఁతవలన నాచక్కఁదనము కప్పవడినది కాదు. కాచగోళమున అత్యధికశోభావంతంబుగ ప్రతిబింబితంబగు తేజోరేఖవలె మనోహరం బగునామెయవయవశోభ మఱింత హృదయంగమం బయ్యెను. శ్రీ పల్కినపల్కులకు ప్రత్యుత్తరముగ భైరవి "మేము సన్యాసినులము. ప్రపంచమునం దేవియును మమ్ము భ్రమప్రమాదములకు లోను చేయనేరవు. మా కేభయమును లేదు. మా కెప్పుడును దైవసాహాయ్యము తోడు నీడయై యుండును.

శ్రీ—నిశ్చయముగ నీయం దట్టిమహిమయే యున్నట్టుఁ గన్పట్టుచున్నది. నివు సన్యాసినివగుటచే నీకుభయాస్పదం బగువస్తు వెద్దియు లేదు. కాని నేను నిన్ననుసరించి వచ్చుటెట్లు? బిల్వదళమున గూఁ

డుకట్టిన సీతాలోక చిలుకవలె పరిభ్రమించు నాయట్టిదానిని నీయొ ద్దనుంచుకొని జనులతో నన్ను గూర్చి యేమని పలికెదవు ? ఈచి లుక నీకడకు పాఱివచ్చినదని తెల్పుదువా? అనిపల్కినప్పటికి భైరవి ముఖమున మృదుమధురంబగు మందహాసం బుదయించెను. ఆమనో హారం బగునామెయధరోష్ఠముపై నాడునాహాసము హృదయాకర్షక యంత్రంబై దట్టముగ మొయిలు గ్రమ్మియున్న ఆకసమునఁ దళుక్కు మనువిద్యుల్లత ననుకరించెను.

శ్రీ—తనలో "ఇప్పట్టున పురుషుం డెవ్వాఁడైన చెంతనుండినచో తప్పక, ఈమె భైరవియవతారమనియే యెంచుకొనును"

భైరవి—ఈకాషాయవస్త్రములను నీవు మాత్రము ధరియింపరాదా ? అనునప్పటికి శ్రీ భయప్రకంపిత యయి నేను భైరవినగుట కధికార ముండవలదా ?

భైరవి—అదియంతయును మనస్సుననే యున్నది. నేనుమాత్రము య థార్థమగు సన్యాసి నగుదునా? నీకు ప్రపంచమునం గలసంబంధ మం తయును వదలిపోయినదంటివి? మనస్సున పాపలేశ మేదైన నున్న ఇంకను అంటిపెట్టుకొని యుండినను సన్యాసిని వైనందువలన ప్రత్యు వాయమేమియును లేదు. దానిమాట యటుంచుము. నీవిప్పుడు య థాశాస్త్రీయమగు సన్యాసినివి యైనను కాకుండినను నిన్నెవ్వరును గుఱుతుపట్టకుండ మాఱురూపమున మెలంగుటకై ఈ కాషాయవ స్త్రముల ధరియించిన భయమేమియును లేదు.

శ్రీ—అట్లయిన? నేను శిరోజముల నుంచుకొనుటకు నలను పడదేమో? నేను సభర్తృక ననుమాఁట నెఱుఁగుదువుకదా ?

భైరవి—ఏమి యీపిచ్చి ? నన్నుఁ జూచుట లేదా ? నాకు శిరోజములు లేవా ?

శ్రీ—నీశిరోజములు జడలు కట్టుకొనిపోయినవి.

భైరవి—కొన్నిదినములు తగినసంస్కారములు లేకుండిన నీవియు నట్లే జడలు కట్టుకొనిపోవును.

శ్రీ— నీశిరోజములు సంస్కారహైన్యముచేతనేకాఁబోలు పాముపడ గలవలెనుంగరములు జుట్టుకొని పోయినవి. వానినిఁ జూచినప్పుడెల్ల

నూనియ రాచి దువ్వి చక్కఁగ ముడివేయుదునా యని నాకు బుద్ధి వొడముచుండును.

భైరవి.—నాకు భవిష్యజ్జన్మముగూడ మనుష్యజన్మమే సంప్రాప్తమగుచో, నది యప్పుడు చేయవచ్చునులే. దానికేమి గాని నీసన్యాసి నీరూపముమాట ఏమిచెప్పెదవు ?

శ్రీ—అది యెంతసేపు ఇంత బూడిదెఁ బూసికొని కాషాయవస్త్రమును కట్టుకొనుటయే కదా ?

భైరవి— కాషాయవస్త్రము, రుద్రాక్షలు, వెలిబూడిదమున్నగు తత్సంబంధ మగుసర్వపరికరములును గావలయు. అవన్నియు నిప్పుడునా యీయెఱ్ఱసంచిలో నున్నవి. అన్నియు నొసంగెదను.

శ్రీ కొండొక సంశయించి యెట్టకేల కియ్యకొనియెను. పిమ్మట వారిరువురును రహస్యంబుగ నున్న నొకచెట్టు మొదటికిఁ బోయిరి. ఒక్కింతసేపటిలో శ్రీ మనోహరం బగుసన్యాసి నీరూపం బలవరించుకొని వెలువడియెను. ఆమెశిరోజములనిండ బూదిఁ బ్రామికొనియెను. కాషాయవస్త్రమును ధరించెను. చేతులను మెడలను రుద్రాక్షమాల లలంకరించుకొనియెను. దేహమంతటను భస్మము ధరించెను. ఈవేషమంతయును శ్రీ యలవరించుకొనినవెనుక భైరవి రక్తచందనముతో నామె లలాటమున బొట్టుఁ బెట్టెను. అంత వారిరువురును జైత్రయాత్ర వెడలిన మధువసంతులోయన బయలువెడలి వైతరణి దాఁటి తత్పరిసరమున నున్నయొకదేవతామందిరమున నారాత్రిఁ గడపిరి.



పదునేడవ ప్రకరణము.

మరుచేటిదిన ముదయమున వారిరువురును నిదురనుండి లేచిరి ఖరస్రోత నదీజలంబుల ప్రాతఃకాల్యంబులఁదీర్చి మరల యథారూపంబు ధరించి భస్మధారు లయి మూర్తీభవించిన తేజోరాసులో యన ఉత్కళదేశంబునకుఁ బోవుమహారథ్యనుపడి పోవుచుండిరి. ఆప్రాంతములవారు యాత్రికుల ననేకవిధముల వారిని జూచుచుండిరి. అందువలన సన్యాసులఁ జూచుట వారి కొకవింత కాదు. కాని ఈయత్యద్భుత తేజోరాసులం

గాంచిన వారికిఁగూడ మహాద్భుత ముదయించెను. కొందఱ తీయప్సరస లెచ్చటికో పోవుచుండి రని యనుకొనుచుండిరి. కొందఱు వీ రెవ్వరో దేవత లనుకొనుచుండిరి. కొందఱు వీరుభయులకును సాష్టాంగపడుచుం డిరి. కొందఱు చేతులఁ గట్టుకొని తమకాయురారోగ్యము లొసంగుమని ప్రార్థించుచుండిరి. పండితంమన్యులు కొందఱువచ్చి జనులనందఱ వారి జోలికిఁ బోవలదని వారించి వారుభయులును రుక్మిణీసత్యభామలనియును తమ సహజరూపంబుల నిజవల్లభుని సందర్శించుటకయి యరుగుచుండిర నియును, నుపదేశింపసాగిరి. మఱికొందఱు రుక్మిణీసత్యభామ లాతుణ మున శ్రీక్షేత్రమునసే యుండిరనియును, వీరు శ్రీరాధికా చంద్రావళు లుగాని రుక్మిణీసత్యభామలు గారనియును, వీరిరువురును గోపికలగుటచే, ఇట్లు లీలాసంచారము చేయుచున్నారనియును, జెప్పికొనసాగిరి. ఈయభి ప్రాయ మందఱేకగ్రీవముగా నంగీకరింప చెడిపెయగునొకపడతుక "ఉండు ఉండు. అదిగో అచ్చట సుభద్ర యున్నది. నీతాళము పట్టునులే" అని యఱవసాగెను.

రాధికా చంద్రావళు లిరువురును, ఈమాట లేమియు విని పించుకొనకుండనే తమలో తామేమియో ముచ్చటించుకొనుచుఁదమ దారిని పోవుచుండిరి. భైరవి నిశ్చలమగువిరాగిణి ఆమెకు ప్రపం చానుబంధ మేమియునులేదు. చాలకాలమునుంచి యామెకెవ్వరు జత యేలేదు. క్రొత్తగ నిప్పుడొకయాపురాలు సమావేశమగుటచే మును పటికంటె యామెమనస్సు, ఒక్కింత యుల్లాసముగనుండెను. శ్రీకిఁ గలిగిన కడగండ్లును, దుఃఖములును, ఈమెకు, అనుభూతంబులు కాకుండుటచే, ఈమెజీవితతరంగ మింకను శుష్కీభూతంబు కాదయ్యెను. సన్యాసులు ప్రపంచమునందలి యాశయంతయు వదలి తదతీతులు గావలయును. వా రుభయులకును నడుచుచుండినసంభాషణ యొక్కింత మాపాఠకమహా శయు లాలకింతురు గాక.

భైరవి—నీభర్త సజీవుఁడయియున్న వాఁ డంటివి. నీతోడ దాంపత్యసుఖ మనుభవింప సిద్ధుఁడయి యున్న వాఁడంటివి. అట్లయ్యును ఏల నీవు నీ సంసారమును పరిత్యజించితివో, అడుగవచ్చునా? పోనిమ్ము. నీ సంసారసంబంధమగు సంగతులతోఁ బ్రశంస నాకేల? కాని, ఒక్క

టిమాత్రము చెప్పుము. నీకు మరల సంసారము చేయవలెనని యిచ్ఛ యున్న దా?

శ్రీ—నీకు సాముద్రికము తెలియునా?

భైరవి—అందులకయి సాముద్రికము చూడవలె నందువా?

శ్రీ—నాచేతిలోని రేఖలన్నియును నీవు పరిశోధించినవెనుక నీయనుజ్ఞ గాని నీ వడిగినవిషయము నే నిప్పుడు స్థిరపఱచుకొనవలయును.

భైరవి—నాకు సాముద్రికము రాదు. కాని యీశాస్త్రమును, తక్కుం గల యితరశాస్త్రముల నానుపూర్వకముగ నెఱింగిన ఒకవిద్యా వంతునికడకు నిన్నుఁ గొనిపోఁగలను.

శ్రీ—ఆతనియునికి యెచ్చట?

భైరవి—లలితగిరి యను పర్వతంబున హస్తికుంభ యనుగుహాలో నొక్క సన్యాసికలఁడు. నే నిప్పు డాతనిఁగూర్చియే ముచ్చటించుచున్నాను.

శ్రీ—లలితగిరి యొక్కడ ?

భైరవి—నడువఁగలిగితి మేని ప్రొద్దుగ్రుంకులోపల నచ్చటఁ జేరవచ్చును?

శ్రీ—అట్లయిన పోవుదము లెమ్ము. అని వారిరువురును జరచర పోవ సాగిరి. అచ్చట అప్పుడు సిద్ధాంతులెవ్వరయిన నుండిన గురుశుక్రులి రువురు నాక్షణమున, ఏక రాశిగతులయి యుందురనియును, అదియే వీరి గమనమునకు శీఘ్రగతిఁ గలిగించెనని చెప్పియుందురు.



## పదునెనిమిదవ ప్రకరణము.

చిఱుతరంగమాలికచే డోలాందోళికయగు విరూప యుదయ గిరి లలితగిరుల నడుమనుండి సంచారము జేయుచు సముద్రగామిని యగు చుండెను. ఈపర్వతోపరి భాగములపయి నుండి చూచు ప్రేక్షకులకు క్రిందిభాగము నందు శోభాయమానముగనున్న వేనవేలు తాళవృక్షము లును, ముక్కారున బండి భూదేవికిప్రణమిల్లునో నాఁగ వంగి శోభిల్లుచున్న వరిచేలును కన్నులపండువు సేయుచుండెను. తల్లిభుజముపై నడయాడు చిన్నబిడ్డపై నుండి హృదయంగమంబుగ తనతల్లి రామణీయకముం గాంచియెల్లపుడు నానందించు చుండునట్లు, ఈపర్వతోపరిభాగముపై

నుండి క్రిందివంకc జూచు కన్నులకు భూదేవి, సర్వాతిరిక్త రామణీయ కము నేత్రానంద మగుచుండును. ఉదయగిరి వివిధతరుసంశోభితము. లలితగిరియో యేచెట్టును చేమయును లేక కేవలమును పాషాణమయ ముగ నుండును, ఒకప్పు డీకొండశిఖరములపై బౌద్ధదేవాలయము లును, శిల్పవిద్యావిశేషములును, మిన్నంది వెలుగుచుండెను. ఇ ప్పు డచ్చట కొన్ని మంచిగంధపుతరువులు మాత్రమున్నవి. త్రాళ్లును, ఇటుకలును, అపరిమితములు. శిథిలమయిపోయిన దేవాలయముల త్రా ళ్లు; పెటికిపారవైచిన శిలావిగ్రహములు; భూమిలో పూడిపోయి యు న్నవి. కలకత్తా నగరమునందలి దివ్యభవనంబు లని పేరుపొందిన, మంది రముల కీ త్రాళ్లుకొన్ని చేరిన నెంతయలంకారముగ నుండును? నిశ్చయ ముగ ప్రాసాదనగరమని పేరొందిన, ఈపట్టణమునకు వన్నెయును వాసి యును వచ్చునని నానమ్మకము. అకటా! అట్టిహిందువులు పరిశ్రామిక పాఠశాలలో బొమ్మలు చెక్కుట నేర్చుకొన వలసి వచ్చెఁగా! కుమార సంభవమును, పఠించుట మాని "స్విన్‌బరను" గ్రంథములను, "భగ వద్గీతలు" విడచి "మిల్లు" వ్రాసిన గ్రంథములను, ఉత్కలదేశంబున మున్ను విజృంభించి యున్న శిల్పములను విస్మరించి, అయిరోపాఖండ మునుండి దిగుమతియగుచుండినచైనాదేశపుమట్టిబొమ్మలను పరికింప నాయెగా? ఇంక మనస్థితిగతు లెంతవఱకు రానయియుండెనో?

నాకన్నులారc గాంచినది కాగితమున కెక్కించుచుంటిని. లలిత గిరిప్రాశస్త్యము నామనస్సున దృఢముగ నాటుకొనినది. ఈకొండకు నలుతట్టులను క్రోశముల కొలఁది దూరమువఱకు వరిచేలు వ్యాపించి భూదేవికి పీతాంబరమువలె నలంకార మగుచున్నవి. వేనవేలు తాళవృ క్షములు బారులు తీర్చి యొకదానివెంబడి నొకటి నూటిగనిలచి శృం గారపత్ర సంశోభితముగ నామె మేనఁదాల్చిన సొమ్ములువలెనలరుచుం డును. ఈవరిచేల నడుమనుండి విరూపప్రవహించుచు గట్లదరిని ఊదా రంగు పూవులును, పచ్చరంగు పూవులును గలిగి శోభిల్లుచుండును. ఈప్రదేశముం గాంచిన పచ్చనితివాచి పయిన చక్కని జలప్రవాహ మొకటి యుద్దేశపూర్వకముగc జిత్రించినట్టుc గన్పట్టు చుండు వాని మాట యటుండ, చిరకాలము క్రిందట పరమపదమునందిన పురాణపురు

షులు తమపేరు శాశ్వతముగ భూలోకమున నిలిచిపోవ నెఱపిన వింత వింత నిర్మాణము లెన్నియో దానిచుట్టును గన్పట్టు. అంతనున్నగ స్తంభముల నుంచిన యామనుజులు మనవంటి హిందువు లేనా? ఏవిధమగు సంబంధమును గనపడకుండ వానివానికిని లంకెలవైచినదియు మనయట్టి హిందువులేనా? ఈశిలావిగ్రహము లెవ్వరు చెక్కినారు? ఇందు పౌరుషోచితమగుదార్ఢ్యమును మనోహరసౌందర్యమును నైక్యసంధానమయి మూర్తీభవించినట్లు గనుపట్టుచున్నవి. అట దివ్యకుసుమంబు లలంకారములుగ శోభిల్లుచున్నవి? జలకణమ్ముల విరజిమ్ము నాకుసుమాంచలము లాపూలసాబగునకు మఱింతవన్నియ పెట్టుచుండెను. ఏమి? ఈసర్వాంగసౌందర్యము. ఈచిత్తరువుల మలచిన దెవ్వరంటిరి? మనవంటి హిందువులేనా? ఈ స్త్రీవిగ్రహము లెవ్వరు నిర్మించిరో? ఏమి? ఈయధరోష్ఠములు! కోపము, వలపు, గర్వము, భాగ్యచిహ్నములు, ఇన్నియు నొక్కసారిగ నందు విశద మగుచున్న వె?

హారాంబట్టు పుట్టములు శంఖసదృశకంధరము క్రిందినుండి చుట్టు దిరిగి పయిట చెఱగుచేర తన కాంతుల నెగరఁ జిమ్ముచు నవయౌవనప్రాదుర్భావభారమున తనూవల్లిక జవజవలాడ నామనోహర విగ్రహమునకు వన్నియ వెట్టు చుండెను.

తే. గీ. అచ్చరలమేలిరూపంబు లచ్చుపడెడు
2 నసదృశంబుగ నలమినయౌవనంబు
3 మించివరలెడు పరువంబు లెంచఁదరమె?
4 పలువరుస ముత్తెములకోవపగిదిఁ దనరు
5 నధరములు దొండపండులే యనఁగ నగును
6 కణుఁదురీఁగల నణుమధ్యగరిమఁ దెగడు
7 బెదరుచూపులు లేళ్లను బెగడుపఱచు
8 నార పాక్కలిగాంభీర్య మనుపమంబు.

ఈదివ్యమంగళ విగ్రహములఁజెక్కిన దెవ్వరు? వీరును మనవంటిహిందువులేనా? అది గాంచునప్పటికి హిందువు లన నెట్టివారో? తలంపునకు వచ్చినది. ఉపనిషత్తులు, గీతలు, రామాయణ మహాభారతములు, కుమారసంభవము, శాకుంతల, పాణిని కాత్యాయనము, సాంఖ్యము,

పాతంజలి వేదాంతము, వైశేషికము మున్నగు శాశ్వత బ్రహ్మకల్పము లగు సర్వమును హిందువులు విరచించినవేనా? వీనితో పోల్చి చూచు నప్పుడు తక్కిన బిచ్చపుగ్రంథము లేపాటివి? నేను జన్మమెత్తునాఁటికి నిట్టి ప్రతిభావంతులగు హిందువు లందఱును ముక్తి గాంచిరని యెన్నికొంటిని.

ఈలలితగిరిక్రిందితట్టున హస్తికుంభ మనుగుహ యుండెడిది. ఏమిది? ఇచ్చట భూతకాలము పడినది. మనుష్యులకువలె పర్వతావయవములకు కూడ నాశనమున్నదా? ఏమి? లేకేమి? నాశన మన్నిటికిని యున్నది. కాలవశమున నన్నియును లయము నొందునా? ఆగుహ యిప్పుడు కనుపట్టుడు. దాని పైభాగము కూలిపోయినది. స్తంభము లు పడిపోయినవి. లోపలి భాగమంతయు గడ్డిమొలచి పోయినది. సర్వమును నాశనమయినది. కాని ఈగుహానష్టమయినదని విచారించిన ప్రయోజనము లేదు?

దానిరోజులలో నాగుహ మిక్కిలి చక్కగనుండెడిది. పర్వత పార్శ్వమున నా స్తంభములును గోడలును మలచిరి. అవి గాంచిన నెంతయో మనోహరముగ నుండెడివి. ఆప్రదేశమంతయును చక్కని రాతివిగ్రహములచే శోభిల్లుచుండెడిది. అందుఁ గొన్ని యిప్పటికిని నిలచి యున్నవి. కాని యవియన్నియును చెమ్మగిలి యున్నవి. వానిరంగులన్నియును నశించినవి.అం దొకదానిముక్కు చెక్కలయినది.ఒకదానికిచెయి విఱిగినది. ఒకదానికి కాలు విరిగినది. వేయేల? ఈనాఁటి హిందువ్రులందఱు నెట్లున్నవారో, అట్లే ఆవిగ్రహములు వికలాంగములయి యున్నవి.

ఈగుహయిప్పటి కీస్థితియందున్నది.ఈకథాసందర్భము నాఁటికిట్లు లేదు. అప్పటికి సర్వమును చక్కగనే యున్నది. దానియంతరమున యోగులలో నెల్ల నుత్తముండగు గంగాధరస్వామి తపస్సు చేసుకొనుచుండెడివాఁడు. ఈయన మహాత్ముండు.

సకాలమున భైరవి శ్రీసమేత యయి యాదివ్యస్థలసందర్శనము గావించెను. ఆమె వచ్చునప్పటికి గంగాధరస్వామి యోగ నిమగ్నుండై తదేకధ్యానమున నున్నవాఁడు. ఆతనికి కార్యభంగము గాకుండ,ఆగుహలో నొక్కమూల పన్నుండి యారాత్రి గడపిరి.

మరుచటిదినమున,ఉషఃకాలమున లేచి గంగాధరస్వామిని విరూప

# ప్ర థ మ బిం బ ము.

నదీసలిలంబుల స్నాన మాచరించి ప్రాతరుచితకృత్యంబులఁ దీర్చి హాలో మరల ప్రవేశింపఁ బోవునప్పటికి భైరవి సాష్టాంగనమస్కా బు గావించి, ఆతనిపాదధూళిఁ గన్నుల నద్దుకొనియెను. శ్రీయు న యొనరించెను.

గంగాధరస్వామి శ్రీని పలుకరింపలేదు. భైరవి నైన, ఆమె రనియడుగలేదు. భైరవితో మాత్రము మాట్లాడెను. ఆసంభా మంతయును సంస్కృతమున నడచుటచే పాపము శ్రీకి, అం దొ ముక్కైనను దెలిసినది కాదు. అయినను, ఆసంభాషణమున మా కులకుఁ దెలియదగిన విషయముల మాత్రము మేమిాభాషను విశ చుచున్నాము.

గంగాధరస్వామి—ఈ స్త్రీ యెవ్వరు ?

భైరవి—ఒక బాటసారి ?

గంగా—ఇచ్చటి కేల వచ్చినది ?

భైరవి—ఈమె కర్మవిపాకమున నొక్కింత మన స్తిమితము చెడి ఇట నది. దాని సంగతిసందర్భముల మనమతసిద్ధాంతములనుబట్టి కెఱుంగఁ జేయ నవధరింపుఁడు.

శ్రీ.—స్వామిచరణసాంగత్యమునకు వచ్చెను. పునఃపునః ప్రణామ నాచరించెను. అంత స్వామి శ్రీవంక తేరిపాఱఁజూచి హిందీభ ఇట్లు జెప్పెను. "నీజన్మలగ్నము కర్కటలగ్నము కాదా ? చం పుష్యమీానక్షత్రగతుఁడైయున్న వేళ నీజననము " అని చెప్ప శ్రీ నివ్వెరపడి చూచెను.

స్వామి—నీహ స్తరేఖలను పరీక్షించెదను వెలుపలికి రమ్ము? అనే త గుహనుండి వారందఱును వెలుపటికివచ్చిరి. స్వామి యామె మునందలి రేఖలను తక్కుంగల సాముద్రిక చిహ్నంబులును చూచెను. అంతగుణించిచూచి యామె జననకాలతిథివారన లన్నియును క్రమముగ గుణించి జాతకచక్ర మొకటి లిఖించి ముల నాయా రాసుల నిలిపి తాళప త్రి లిఖితమైయున్న చాంగ మొకటి తనగుహనుండి తీసి శ్రీ కిట్లు జెప్పెను. "నీజన్మ చంద్రుఁడు స్వస్థానమున నున్నాఁడు. శుభగ్రహములు వ

ఏడింట నున్నారు. కుమారీ! రాజ్ఞీపదమున నుండవలసిన నీవు ఇట్లు సన్యాసినీరూపమున నుంటివేమి ?

-నాభర్త పట్టభద్రుడయినాడని వింటినికాని యాతఁడాయున్నత పదవి నొందుట నేఁ గనలేదు.

ు—జౌనౌను నీవు, అతని నష్టస్థానమునఁ జూడఁబోవవు. ఏడింట ుచస్థితి నున్నాఁడు. శుభ గ్రహములు, అశుభస్థానమున నుండుటచే. ువియును,అట్టి ఫలమునే ఇచ్చును. నీకు కిరీటధారణ యోగ్యతలేదు.

శ్రీకి, అదియంతయు అయోమయముగ నుండెను. కొంతవ మిన్నకుండి యుండి "అయ్యో, ఇంక నేమైన ననర్థములం జూ ం? "

ు—చంద్రుఁడు శనికి, ఒక్కరాసి ఎడమున నున్నాఁడు.

దాని ఫలమేమి ?

—నీవు నీప్రాణనాయకుని మరణమునకు కారకురాల వగుదువు. ెడు సరికి శ్రీగుభాలున లేచి శరవేగమునఁ బోవఁ జొచ్చెను. స్వా ఆమెను వెనుకకుఁ బిలచి "ఒక్కనిమిష మోపిక వెట్టుము. నీకు ుపవిత్రమయిన కార్యసిద్ధి యొకటి యున్నది. కాని సమయ మిం ు రాలేదు. తరుణమువచ్చినప్పుడు పోయి నీభర్తను చూడుము."

ుది యెంతకాలమునకు.

—"అది యిప్పుడు నేను చెప్ప లేను. దానికి చాలగణితము చేయ ు యున్నది. ఆకాలమయినను అంత చేరువుగ లేదు. నీవిపు డెక్క ానున్నావు ?"

నిప్పుడు జగన్నాధమునకుఁ బోవనున్నాను.

-పోయిరమ్ము. ఒక సంవత్సరము దాఁటినతరువాత ఒక్కసారి ువేని ఆకాలము లెక్కవేసి నీకుఁ జెప్పఁగలను. అనిచెప్పి భైర ుడ పలుకరించి "నీవు కూడ రావలెను సుమా?" అనియెను. ట నాతఁడు తనగుహలోనికిఁ బోయి యథాప్రకారము జ్ఞాన ధిని ప్రవేశించెను. ఈభైరవు లిరువురును ఆతనికి కృత ప్రణా ు గుహనుండి వెడలిపోయిరి.



# ప్రథమబింబము.

## పందొమ్మిదవ ప్రకరణము.

భైరవులిరువురును జగన్నాథయాత్రకయి బయలుదేరిరి. ఆ
సంచారముచే, ఉత్కలదేశమునకుఁ బోయెడు పెద్దబాట దేదీప్యమ
ముగ వెలుంగుచుండెను. ఆత్రోవ కిరుప్రక్కలనుండు ఉరియాదేశస్థు
నోరుఁదెఱచుకొని తదేకధ్యానముగ వారివంకఁజూచుచు నద్భుతా
ర్ణవ మగ్నమానసులగు చుండిరి. అందొకఁడు ముందునకువచ్చి వా
రణసరోజములకు సాష్టాంగ మెఱఁగి "అమ్మా! కరుణించి మీచ
ద్మంబుల నాశిరోభాగంబు నలంకరింపుఁడు" అనియెను. ఇంకొకఁడు
చేసి యొక్కనిముస మిందు నిలచి నాదుఃఖగాథల నాలింపుఁడు
యెను. తగిన ప్రత్యుత్తరంబుల వారల నాదరించి సౌందర్యరాసు
నాయువతీద్వితయము తమదారిం బోవుచుండిరి.

శ్రీ మిగుల శీఘ్రగామినియై వడివడిగ నడువఁజొచ్చెను. భైరవి
మనమునకు మాంద్యంబు గల్పింప "అక్కా! కొంచెము నెమ్మది
వుము. చప్పుచప్పున గొడ్లనుకాసిన ప్రొద్దుగ్రుంకునా? కర్మవిపాకవ
దియె." ఈమృదువచనమున శ్రీ యొక్కింత, ఉపశమనముఁ జెంద
రెండుదినములనుండియును శ్రీ, భైరవిసాంగత్యమున సంచరించుట
యందీమెకు, ఒకవిధమైన ప్రేమ యంకురించినది. వా రుభయ
వినయ పూర్వకంబగు వచనంబుల సంభాషణము నడుచుచుండె
భైరవి యనిన, నెంతో ప్రపత్తి. ఆమెను దైవమువలె నెంచు
భైరవి యిప్పుడు శ్రీని సంబోధించిన వాక్యములఁబట్టి ఆమెకుఁ గ
యందొక్కించుక, ఇష్టము కుదిరినట్టు తలంచి శ్రీ తనగమనము
మందముగావించెను.

భైరవి—ఇంక మనయుభయులకును, వినయవిధులును, తద్రూ
సంభాషణలును బనికిరావు. ఇద్దఱము, ఒక్కయూడు వాండ్ర
చెల్లెండ్రవలె మెలంగవలయు.

శ్రీ—నీవును నావలె నవిలంఘ్యంబగు కష్టములచేతనే సం
విడచితివా ఏమి?

రవి—నాకు సుఖమును లేదు. దుఃఖమును లేదు. నాకర్మపరిపాకమ
ట్టిది. నీకష్టగాథల వినవలయునని యున్నది. అయినను ప్రస్తుతము దా
నిమాట యటుంచుము. ఇంతవఱకు నేను నీపేరైనను తెలుసుకొన
లేదు. నిన్ను నేనేమని పిలువవలెను.

—నాపేరు శ్రీ. నీనామకరణ మెద్ది? మొన్నను నీవు ముచ్చటించుట
లో నీవయినను యథాశాస్త్రీయముగా సన్యాసినివి గానంటివి.
నీవెవ్వరవు?

వి—నేనువైష్ణవిని. కాని శిరోముండనముఁ గావించు "సీరా" తెగలో
నానఁ గాను.

—నీకు భగవంతుఁడనిన నంతతాత్పర్యమున్నదే. అతనిసమావేశము
కెన్నిసారులయినది?

పంతి—అతనిని నేను దివారాత్రములు ధ్యానించుచునే యుం
ను.

—చిన్ననాఁడు నన్నెప్పుడో ఆతఁడు విసర్జించినది మొదలు నేనును,
లెనే, అహోరాత్రము లాతని ధ్యానించుచు నుంటిని.

అనునప్పటికి యయంతి మొగమున అద్భుతరస మావేశించెను.
మేమిరువురమును సాంసారికానుబంధములఁ గలసి మెలసి యుండి
గో, ఆతనియెడ నా కట్టిభక్తి లేకపోయి యుండునేమో? మను
యందు పుణ్యపాపములు రెండునుకూడ నుండును. ఆతనియందు
డ కొన్నిదుర్గుణములు నుండియుండును. అట్టి దుర్గుణము లున్నను
న్నను నాయందుగల లోపములను బట్టి యాతనియందు కూడ
న్న లోపములను కనిపెట్టుటకై ప్రయత్నములు జరిగియుండును.
నువలన, ఉభయులకును మాట అ త్తకుండపోయి మనస్సునకు
ల్యము కలిగి చివరకు శాంతిలేకుండ పోవును. భగ్నమనోరథ
బచే, ఇంత యుద్రేకముగ ప్రజ్వలించుచున్న నాప్రేమాత్ము
బకూడ, ఇంత తీవ్రముగ లేకుండియుండును. ఇన్ని వత్సర
నుండి యాతని సుగుణముల నారాధించుచు దైవముఁగ నెన్ను
చుంటిని. మంచిగంధముఁదీసి గోడలకుఁ జాసి యదియంతయు,
మేననలంకరించినట్లుఁగా భావనఁజేసి కొనుచున్నదాదను. పూ

లతోఁటల కరిగి యత్యంత శ్రద్ధాభక్తులతోఁ బువులఁగోసి యన్ని పను లు మానుకొని వింతవింతరకములఁదండలను గ్రుచ్చి పుష్పసంపూర్ణం బగుచెట్లకొమ్మల నాదండ లలంకరించి యీమాలిక లాతనికంఠ ము నలంకరించినట్లుగా భావించికొనుచు, మనశ్శాంతి కలిగించు కొనుచున్న దానను. నాకున్న యలంకారముల నన్నియు నమ్మి యాసొ మ్ముతోఁ బంచభక్ష్య పరమాన్నముల నాయత్తముఁజేసి యవియ న్నియును నదీతరంగముల పీసరబుచ్చియు ఆతనికి విందారగింపఁ జేసి నట్లుగనె తలంచి సంతుష్టి నొందుచున్న దానను. నేనేదేవాలయమున కుఁ బోయి సాష్టాంగ మెఱఁగినను నాశిరస్సాతని చరణకమలముల క డనె జేరినట్లెంచితినిగాని మఱి యేదైవమునకును, మ్రొక్కినట్లు క లంచి యెఱుఁగను.

ఇన్నియు నైన వెనుక నాతనిపరిత్యజించి వచ్చితిని. ఆతఁడున బిలచినను, బలుకక బఱతెంచివచ్చి, ఆతని కెడమయితిని.

అటుపయిన శ్రీనోటనుండి మాటరాక మోము పైఁటచెఱఁగ జేర్చి వెక్కి వెక్కి యేడ్వసాగెను. దానితో నామెమనస్సునకు కొ యూరటకలిగెను. యయంతికనుఁగొలకులఁగూడ కన్నీటిబిందువుఁ ళతళ మెఱసెను. ఈసన్యాసినియు సన్యాసినియేనా?





# శ్రీ సీతారామము

## ద్వితీయబింబము.



### మొదటి ప్రకరణము.

### సాయంకాలము.

### భైరవి.

సీతారామరాయల కిప్పుడు హిందూరాజ్యము స్థాపించుట కష్ట
్యముగఁ గన్పట్టుచున్నది. ఆతని మనస్సంతయును దానియందుననే
ుయుండలేదు. తదేకలగ్నమైయున్న యెడల నాతండు తనప్రయత్న
ు విజయము నందియుండు. అంకురప్రాయముగ ప్రారంభమై శ్రీయం
మోహ మాతనిహృదయపీఠమునంతయు నాక్రమించెను. ఆమెసాం
మే యాతనికి లభించియుండి, ఆమె యాతనికి పట్టమహిషియై రాజ
్నిర్వహణంబున మంత్రిసత్తమునివలె నాతనికి తోడునీడయై యుం
ుడ పట్టభద్రునిహృదయపీఠంబున మెలఁగు ప్రేమాస్పదురాలగు
ుహిషికన్న నెక్కుడుగ నామె యాతనిమనంబును చూరగొనియుం
ఆమెవియోగమే యొకవిపత్తు. పైపెచ్చు ఆమె విసర్జింపఁబడినది.
డామె యే ఆశ్రమవాసినియో యై యుండనోపు. అట్లు గాకున్న
ము నిలపెట్టుకొనుటకై యామె బిచ్చమెత్తుకొను చుండుటయో
ోకయాత్రఁ జాలించుటయో సంభవించియుండు. రాయలమనస్సు
కూర్చినయిట్టిదురంతచింతలతో నిండియుండెను. శ్రీనిగూర్చినవల
ుంతదట్టముగ నున్నపుడు ఆతనిమనంబున హిందూరాజ్యసంస్థా
వలయునాలోచనకు చోటెచ్చట నున్నది? సామ్రాజ్యసంస్థాపన
ుకరమైనకార్యమా? ఆతని కయ్యది యెంతయో దుర్ఘటప్రయ
ది. శ్రీవియోగముచే రాయలమనస్సు సర్వసుఖములకును వెలి
ఆతని కిప్పుడు కిరీటసంపాదన మనిన నాశ లేకున్నది. రాజ్యసం

స్థాపన యొకసుఖ మనుపించుట లేదు. అట్టిస్థితిలో రాజ్య సంస్థాపన దుష్కరముగాక సుకర మెట్లగును?

ప్రప్రథమమున రాయలు శ్రీ పోయినజాడ తెలిసికొనవలె నను ప్రయత్నములలో మునిఁగి తేలెను. దినములు గడచెను. నెలలు నడచెను. ఏండ్లుజరిగెను. రాయలు తనప్రయత్నములు మాత్రము విడువలేదు. పట్టణములు వెదకించెను. పల్లె లన్వేషణము సేయించెను. అడవులఁ ద్రిప్పె ను. గుళ్లు మఠములు మున్నగునవి యన్నియును చూపించెను. ప్రయ త్నములన్నియును నిష్ఫలములయినవి. ఇతరు లెవ్వరికిని శ్రీని తెలుసు కొనుటకుఁ దగినయవకాశము లేదు. అందువలన వెదకియు ప్రయోజ నము లేదు. రాయల కీసంశయ మొక్కటి బాధించి, గంగారాము కుద్యోగమునుండి సెల విచ్చి యీకార్యమునకై నియోగించెను. గం రాముఁడును సర్వదేశములును దిరిగి సర్వవిధములఁ బ్రయత్నించె. కాని యాతండును భగ్నమనోరథుండై యింటికి మరలి వచ్చెను.

రాయలు ఇంక రాజ్య మేమయిపోయినను సరే యని నిశ్చిం చుకొని, తాను స్వయముగ తీర్థయాత్రలకని బయలుదేరి ప్రతిస్థలమ తిరిగి చూడవలెనని సంకల్పించుకొనెను. శ్రీ మరల కంటఁబడిన తి నాతఁడు రాజ్యభారము పూనును. లేకున్న ప్రపంచసంబంధము వది కొని సన్యాసి యగును. ఇదియే యాతనిసంకల్పము. "నామనస్సున శాంతి లేదు. నే నిప్పుడు రాజ్యధర్మముల నిర్వహించుట కసమర్థుఁ ఇట్టిస్థితిలో నేను తత్పదవి నభిలషించుట ప్రజల బాధఁబెట్టుటకయి సుఖపెట్టుటకు గాదు. నందాగర్భసంభూతుం డగు నాపుత్రున క కము గావించి, రాజ్యము చంద్రచూడునకును, నందకు నప్పగించి ప్రపంచమును విడచిపోయెదను" అని యనుకొనఁ జొచ్చెను.

చంద్రచూడుఁడు ఈయోచనల హృదయస్థము గావించ నాఁడేకాని పైకెవ్వరికిని దెలియనిచ్చినాఁడు కాఁడు. శ్రీని గూర్చి న్వేషణగూడ రహస్యముగ జరగినదె. ఆకార్యమునకై నియోగింప యే నలుగురైదుగురికో కాని అట్టియన్వేషణ జరిగినట్లే తెలియఁ

ఈసంగతులు ఇతరులకు తెలియవచ్చును. తెలియకపోవఁ ఆతఁడు వివశుఁడై యున్నాఁ డనుసంగతిమాత్రము రమానంద

రుని కనిపెట్టిరి. నంద తనభర్తహృదయము కనిపెట్టి యాతనినెట్టుల
యిన నందుండి మరలింపవలెనని పట్టమహిషి చేయవలసిన కృత్యముల
న్నియు నిర్వహించుచు చాలమట్టు కందు విజయము నందుచువచ్చెను.
రమమాత్ర మట్టిదికాదు. భర్త తనయెడఁ జూపిన నిరాదరణకును,
నిర్లక్ష్యమునకు నెంతయు పరితాపము నొందుచు మొగము ముడుచు
కొని యుండెడిది. ఇయ్యది రాయలమనస్సునకు మఱింత యాయా
సకరముగ నుండెను. రమ తనమనస్సున "ఏమి చెప్పుమా, నానా
థుఁడు నన్నీనడుమ నాదరించుట మానినాఁడు" అని విలపింపఁ
జొచ్చెను. నందయు "అతఁడు నాయెడ ననురాగముననుండ నీ లేకుం
). దైవమునావిధ్యుక్తధర్మముల నేనప్రమత్తనై మెలంగ ననుగ్రహిం
ఁగాక. అదియె నాకు సర్వసుఖములును" అని యనుకొనఁజొచ్చెను.
రాయలు ఎట్టకేలకు తనభార్యలకును, చంద్రచూడుఁడు మున్న
ప్రభాసదులకును, ఢిల్లీచక్రవర్తి తనకు ఫర్మానా యొసంగ లేదనియును,
వచ్చిననే గాని తనకు రాజబిరుదము లభింపదనియును, అందుల
) తాను ఢిల్లీనగరమునకు పోవ సంకల్పించుకొన్నాననియును,
'యఁ బల్కెను.

ఆసమయము బొత్తిగ బాగున్నదికాదు. మహమ్మదుపురమున
రులయధికారము నిరాటంకముగ స్థిరపడియున్నదనుమాట వాస్త
'. కేవలము పగయే ప్రధానముగాఁగలిగిన తోరబుఖానువంటివాఁడు
; యెదిరింప డీకొనలేదు. అందునకు గారణము లేకపోలేదు.
ళరాష్ట్రము మూర్షదుకూలీఖానునియధీనమం దున్నది. అతఁడు
) హిందువులలోఁ జేరినవాఁడయినను, అంతకఠినాత్ముఁడు మహమ్మ
లలోఁగూడ నుండియుండఁడు. బంగాళ మింకను ఢిల్లీచక్రవర్తి
రాజ్యముక్రిందనే యుండియున్నది. తోరబుఖాను చక్రవర్తితరపు
ధి. చక్రవర్తికి నీతనిమాటయన్న నెక్కువగుటి. కాని సుజే
ఏకిమాత్ర మీతఁడన్న గిట్టదు. రాయల నాశనముఁ జేసిన సుజే
ను ఏమిచేయఁగలఁ డందురా? ఏమిచేసినఁ జేయఁగలఁడు? చే
కేమి? 'పాపము రాయలయెడ నేదోషమును లేదు. ఆతఁ
) చెల్లించవలసినసుంకము నప్పుడు చెల్లించుచున్నాఁడు. ఆతనినే

తుదకు 'బాధఁబెట్టవలెను' అని యాతఁడు చెప్పఁగలఁడు. మూర్షదు కూలీఖానుఁ డామాటపట్టుకొని ఫౌజుదారుని చిక్కులలోనికిఁ దేవచ్చును. సుబేదారుని యుద్దేశ్యము గనుఁగొనుటకయి రాయలప్రచారములను వివరముగఁ దెలుపుచు ఫౌజుదారునకు తోరబుఖానుఁడు సమాచారము పంపెను. మూర్షదుకూలీ మిక్కిలి జిత్తులమారి. ఇది యదయదనని యాతఁడు తోరబుఖానుని అధికారపరిచ్యుతునిఁ గావింపఁదలఁచియుండెను. తోరబుఖాను రాయలనణఁగఁ ద్రొక్కనా నిర్దోషి నిల్లలచేసితివని యడుగఁగలఁడు. అట్లు చేయక యూరకుండిన ఇట్టి తిరుగబాటుకొయ్యను శిక్షయొనర్పక యేలయూరకుంటివని యనిన ననఁగలఁడు. అందువలన ఫౌజుదారుఁడు ఏమియును చేయక యూరకుండెను. మూర్షదుకూలీ తోరబును త్తరమునకు జవాబియ్యలేదు. తోరబునకును ఏమిచేయుటకును దోఁచకుండెను.

ఈకృత్రిమశాంతి యెంతకాలమువఱకు దాఁగియుండును ? హిందూమతము ఆరోజునకారోజు అభివృద్ధిఁ గాంచుచుండెను. మహామ్మదీయుల కంతకన్న నసహిష్ణుత గలకార్యమేమియుండును ? మహామ్మదుపురమున పెద్దపెద్ద హిందూదేవాలయములు బయలుదేరినవి. అవి బయలుదేరినతోడనే ఆప్రాంతములనుండు హిందువులమనంబుల కుద్రేకము గలిగినది. కేవలదారుణకర్ముండును, పాపిష్ఠుఁడు, నగుమూర్షదు కూలీఖాను రాష్ట్రాధిపత్యమున కధినాథుండయి బంగాళదేశమునందలి తదితరప్రదేశములలోఁ గలిగించుచున్న సంక్షోభమునకు మేర లేకుండెను. అట్టిక్రూరకృత్యములు దేశచరిత్రముల నిఁక నెచ్చటను గానరావు. మూర్షదుకూలీకి హిందువు లన్ని దేశములందును దుమ్ముఁగొట్టుకొని పోయినారని వినవచ్చెను. మహామ్మదుపుర మొక్కటె యభివృద్ధిలో నున్నది. ఆకారణమున రాయల మట్టుపెట్టుమని హుకుము సాదరు చేసెను.

భూషణపురమున సీతారామునివినాశమునకయి తగినప్రయత్నము జరుగుచున్నది. హుకుము చేరినతోడనే పనిజరుపుటకు తగిన సావకాశము చిక్కినదికాదు. మూర్షదుకూలీఖాను హుకుము పంపినాఁడే కాని సైన్యము పంపలేదు. తోరబుఖానుఁడు, సుబేదారుఁడీపట్టున

నాక్రమముచేసినాఁడని యనుకొనలేదు. ఏమన? మహామ్మదీయులయెడ నాతఁ డెప్పుడును అన్యాయము తలపెట్టనే లేదు. ఆకాలమున ప్రజల నెమ్మదిని, నిలుపుటకయి జరుగవలసినపను లన్నియును ఫౌజుదారు సొంత వెచ్చమున జరుగవలసియుండెను. తగిన కారణ ముండిననేగాని నవాబుసైన్యము సహాయమునకు వచ్చువాడుక లేదు. జమీందారుని నొకని శిక్షించుట యనిన ప్రజలనెమ్మదిని సంరక్షించు కార్యములలోఁ బరిగణింపఁబడుటచే నవాబుసైన్యమంప లేదు. రాయలు తనరాజ్యమునందలి వయసు వచ్చిన పురుషులనందఱిని యుద్ధశాస్త్రాభిజ్ఞులం జేసినట్లు లెక్కింగి యున్నవాఁడు. అందుచేత తన చేతనున్న కొలఁదిమంది సిపాయిలతో మహామ్మదుపురమును ముట్టడించుట యవివేకమని యట్లుచేయలేదు. అందులకై యాతఁడు సైన్య సన్నాహములను చేయుచుండెను. అదియొకటిరెండురోజులలో సమకూరునదికాదు. ఆతఁడు దూరదేశమునుండి వచ్చినమహామ్మదీయుఁడు. బంగాళీయుల యుద్ధక్రియాసామర్థ్యమునిన నాతనికి నమ్మిక లేకయుండెను. అందువలన తనసైన్యమునకై యుద్ధక్రియాకుశలు లగు రాజపుత్రులను, బీహారులను, ప్రోగుచేయ ప్రయత్నములు చేయుచుండెను. ఇదియంత యును సన్నద్ధమయిననేగాని రాయలపై దండెత్తిపోయి ప్రయోజనము లేదు. అందువలన నాలస్యమయినది. కార్యములన్నియును నెప్పటి యట్లు నడచిపోవుచుండెను.

తోరబుఖానుఁ డీప్రయత్నములన్నియు నతిరహస్యముగఁ జేయుచుండెను. రాయల కిది యేమియుం దెలియకుండఁ జేసి యేమఱుపాటున పట్టుకొందమని యాతనియూహ. కాని ఈమహావత్ప్రయత్నములును, రాయలకు దెలిసిపోయెను. మంత్రి చంద్రచూడుఁడు గూఢ చారులు లేక రాజ్యపరిపాలన చక్కఁగ నడుచుట పొసంగదనియెఱుంగును. శ్రీరామచంద్రునకు దుర్ముఖుఁ డను గూఢచారుఁడు లేఁడా? అట్లే చంద్రచూడునకును భూషణపురంబుననే యొకగూఢచారి కలఁడు. మూర్షిడాబాదునుండి రాయల పట్టణమును నశింపఁజేయుమనిహుకుము రా వేగమే చంద్రచూడునకీవార్త తెలిసెను. చంద్రచూడున కెప్పుడు తెలిసెనో రాయలకప్పుడు తెలియకుండ నుండునా? దురదృష్టవశమున

రాయ లిట్టిసమయమున ఢిల్లీకిఁ బోవసంకల్పించెను.

ఆముహూర్త మెంతదుర్ముహూర్తమయినను చంద్రచూడుఁడు మాత్రము రాయల సంకల్పములకు వికల్పము గావింపలేదు. "జయాపజయములు భగవదధీనములు, మనమందఱమును ప్రాణములకు తెగించి ఫౌజుదారు నోడింతుమనుఁడు. అంతమాత్రముననే మనకు సురక్షు గల్గునా? ఫౌజుదారుఁ డోడిపోయిన సుబేదారుఁడు రాఁడా? ఆతఁడును ఓడిన చక్రవర్తి రాఁడా? అదిగాన యుద్ధము పొసంగుట కార్యము కాదు. మూర్షదాబాదు నవాబునుగాని, ఢిల్లీచక్రవర్తినిగాని, మనము జయింతుమనుట కేవలము కల్ల. చక్రవర్తి ఫర్మానాయే దీనికి యుక్తమగు ప్రతిక్రియ. చక్రవర్తి యీపరగణాలకు నీకు శాశ్వతపుఁబట్టా యొసంగునేని యీఫౌజుదారుఁడుగాని, ఈనవాబులుగాని యెవ్వరును ఏమియును చేయలేరు. హిందూరాజ్యసంస్థాపన యనిన ఒక్కరోజులోఁగాని, ఒక్కతరములోఁగాని, జరుగునదియా? మొగలాయిరాజ్యసంస్థాపనముమాత్ర మొక్కనాఁడు జరిగినదా? పునాది వేసినది యిప్పుడే గదా? బంగాళా సుబేదారునితోఁగాని, ఢిల్లీచక్రవర్తితోఁగాని, పోరుఁబెట్టుకొనుట క్షేమకరమా? మనప్రవర్తనయంతయును, కడు జాగరూకతగలిగి, యుండవలయును. సార్వభౌమికపరిపాలనము కడనుండి మనము ఫర్మానా సంపాదించుటయే ప్రతిక్రియ, నీవు సూటిగ ఢిల్లీ కరుగుము. ఒక్కింతరొక్కము వెచ్చబడియైనేని సర్వకార్యములును సమకూరఁగలవు. చక్రవర్తియును ఇప్పుడు ఢిల్లీలో నున్న హుమ్రావులందఱును తమగౌరవమును సొమ్మున కమ్ముచున్నారు. నీవంటి నిపుణమతి యచ్చటికిఁ బోయెనేని యన్నియు ననుకూలముగ జరుగును. మహమ్మదీయు లీనడుమనే దండెత్తి వత్తురేని, మృణ్మయుఁ డిచ్చటనుండనె యున్నాఁడు. అతఁడు వారితో సమముగఁ దలపడఁగలఁడు. ఈమాత్రపుధైర్యసాహసము లీతనికడ నుండకుండఁ బోవు. మృణ్మయుఁడు సైన్యకార్యముల సమర్థుఁడును ధైర్యసాహసము లున్నవాఁడు నని నానమ్మకము. కేవల మాతనిధైర్యసాహసములనే నమ్మి విడిచిపొమ్మని చెప్పఁబోను. ఏదో యొకరీతిని మహమ్మదీయులను, నీవు వచ్చునంతకు నేనాపఁగలనని నాకు గట్టినమ్మకమున్నది. రెండుమాసములపఱకును, ఏవిధమయినయులజడి నొందకుం

డ నీవు నాపయి నీభారమును నిలుపవచ్చును రాజ్యతంత్రపరిజ్ఞానము నాకును చాలవఱకు కలదు అని చంద్రచూడుఁడు రాయలతోఁ బలుక రాయ లెంతయును ప్రమోదితస్వాంతుండయి తగినబొక్కసమును, నిలవసైన్యమును చేర్చి ఢిల్లీకి ప్రయాణమయిపోయెను. ఆతఁడు ఢిల్లీకిబోవు చున్నాఁడనియే, అందఱు ననుకొనిరి. ఆతఁడు నిశ్చయముగ నెచ్చటి కేఁగునో, ఆతని కొక్కనికే తెలియును.

రాయల ప్రయాణసమయమున తనరాజ్య నిర్వహణ భారమంతయును, చంద్రచూడ, మృణ్మయ, గంగారాములపయిఁ బెట్టిపోయెను. మంత్రాంగ విషయములును, రాజకీయ సర్వస్వవిషయములును, చంద్రచూడునకు నొప్పగించెను. అతఃపుర వ్యాపారముల కన్నిటికిని, నందను నియోగించెను. ఏడ్పులును, పెడబొబ్బలును వినలేక రమకడ కేఁగి, రాయ లామెతో చెప్పి పోలేదు. నిశ్చయముగ రమ తన కన్నీటి ధారలచే దేశమంతయును ముంచియుత్తెను.

---

## రెండవ ప్రకరణము.

రమ విలపించి విలపించి కొంత సేపటికి చెదరియున్న తనమనస్సు కూడఁదీసుకొని ప్రస్తుతావస్థను గూర్చి బాగుగ యోచించిచూడఁ దొడఁగెను. ఎంతకలవరముఁ జెందిన మనస్సుతో, నెంతపిచ్చియెత్తిన దానివలె నుండినను, రాయలప్పట్టున ఢిల్లీకి పయనమయి పోవుటయే యుక్తమని యామెకును తట్టెను. మహామ్మదీయులు మహామ్మదు పురమును ముట్టడించుటయు, అం దందఱును మడియుటయును, సంభవించు నెడ తనరాయ లొక్కఁడయినను, సురక్షితముగ నుండునని యామె యపేక్ష. అందువలన నామెకుఁ గలిగిన ముఖ్యమయిన భయకారణము తొలఁగిపోయెను. తాను చచ్చెదనన్నను నామె కంత లెక్కలోనిది కాదు. కాని యామెకు భర్తప్రాణమన్న నెంతయో పామరత్వము. వారు తనను బల్లెములతోఁ బొడచిన పొడువనిమ్ము. ముక్కల క్రిందఁ గోసినఁ గోయనిమ్ము. పేల్చినఁ బేలువనిమ్ము. గాలమునకుఁ గ్రుచ్చి సిరి యాడిన యాడనిమ్ము. అగ్నిపాతముఁ గావించినఁ గావింపనిమ్ము. "నాకేమి జరిగినను లెక్కలేదు. రాయలు ఢిల్లీలో బ్రతికి బాగుండును. అ

దియె నాకు కావలసినది.'' రాఁగాపోఁగా నా కాతనితోడ మరల న మావేశము సంఘటిల్లదు. అది యొక్కటియె కొఱంత. "నన్ను ఉఱిఁదీసినను సరే. ఆయన నీలోకమునఁ గాకున్న మఱియొక లోకమునఁ గలిసికొందును. అట్లే, యిప్పుడు మహామ్మదుపురమున మాత్ర మెన్నిసంఘటిల్లుట లేదు. ఆతనిప్రాణము బాగున్నంతమట్టుకు నేను దేనికిని లెక్కఁజేయను.'' అని యనుకొనెను. ఈతలంపులు రమకు సంవత్సరము క్రితమైనచో బాగుండియుండును. కాని యామె జన్మ స్తిమితమయిన జన్మ కాదు. సంవత్సరము క్రిందట నామె కొక బిడ్డపుట్టినది. ఆబిడ్డమూఁడుమూర్తుల సీతారామరాయలనే పోలియుండును. ఆబిడ్డను చూచుకొని రాయలనిననొక్కింత యలక్ష్యముగ నున్నది. తొలుఁదొల్త రాయలనుఁ గూర్చిపరితపించి, మరల ధైర్యము తెచ్చుకొని భయము దిగఁద్రోసెను. పిమ్మట తనప్రాణమును గూర్చియే భయముగల్గి చావునకు సన్నద్ధయై కూర్చుండెను. తల్లిప్రాణమును, తండ్రిప్రాణమును, కూర్చిన భయము వదలినది. ఇంక బిడ్డమాట యున్నదే. అది యెట్లు? "నేను చచ్చెదను. లేదా వారు నన్ను చంపెదరు. ఏదియో యొకటియగును. నాబిడ్డను పెంచువా రెవ్వరు? దాని కేమిలే. బిడ్డను నాసవతి కొప్పగించెదను. కాని సవతిబిడ్డను సవతితల్లి బాగుఁగఁ జూచుట యెచ్చటనయినను కలదా? చూచునే యనుకొందము. నన్నుఁ జంపిన మహామ్మదీయులు, ఆమెను మాత్రము విడుతు రనుట యెట్లు? ఆమెమాత్రము వారి కేమి నెత్తిమీఁద దేవతయా? నాగతియె ఆమెకును పట్టును. ఇంతమట్టునకు నిశ్చయము. నాబిడ్డ నెవ్వరికి నప్పగింపవలయునో పాలు బోవకున్నది. అని అనుకొనెను. ఇట్లు విలపించుచుండ రమకు మనస్సున నాపరాని వికార ముదయించెను. ఆవికారముతో మనస్సంతయు తేళ్లును, జెఱ్ఱులును, ప్రాఁకినట్లు లయ్యెను. మహామ్మదీయులీ బిడ్డను మాత్రము నిలుపుదురనుట యెచ్చట? మాలదైవమా? రమ యింతవఱకును దేనినిగుఱించి పరితపించుచున్నది. ఇప్పు డేమి చేయుచున్నది? మహామ్మదీయులు పశువులు. దోపిడిగాండ్రు. గోమాంసభక్షకులు. అట్టివాండ్రు శిశుహంతకులగుట యేమివింత? అబ్బ! అబ్బ! రాయలు ఢిల్లీ కేల పోయెను? ఈప్రాణసంకటమును మాన్పువా రెవ్వరు? ఇప్పుడేది యెట్లు జరుగునో

విశదీకరించి చెప్పుకొనుటకును యెవ్వరును కనుపడరు. ఇంతటి సంధిగ్ధ భావమున మన స్వాందోళనము నొందుచుండఁగా శరీర మేమిపని చేయఁ గలదు? ఎచ్చటికిఁ బోఁగలదు? ఎట్లో కష్టించి కష్టించి యాకళేబరమును నందకడఁ జేర్చెను. ఆమె నీసంశయముల నివారింపు మని యడుగవలెనని యూహ. వారు భయులకును, ఈ క్రింది సంభాషణము జరిగెను.

రమ—అక్కా! నామనస్సు మిక్కిలి యారాటము నొందుచున్నది. రాయ లిప్పుడు ఢిల్లీ కేల పోయినారు?

నంద—రాజధర్మములు రాజులకే తెలియును. గాని మన కెట్లు తెలియును.

రమ—మహమ్మదీయు లిప్పు డీపట్టణముపైఁ బడిన మనయంతఃపురము ల సంరక్షించువా రెవ్వరు?

నంద—భగవంతుఁడే. ఆతనికి దయ లేకుండినచో నెవ్వ రేమి చేయఁ గలరు.

రమ—అక్కా! మహమ్మదీయులు యుక్తాయుక్తములు లేక అందఱిని నఱికివేయుదురఁట. నిజమేనా?

నంద—ఓసిపిచ్చిదానా? శత్రువులు లాటివారిని చంపక ముద్దుపెట్టు కొనెదరా?

రమ—చంపిన మనలను చంపుదురుగాక. బిడ్డలయెడనైన కొంచెము కనికరము చూపరా?

నంద—"అంతమందభాగ్యత సంభవించునప్పుడు సగముదూరమున నాఁ గిపోవునా? దైవము మనకేమి వ్రాసిపెట్టినాఁడో యది యగును. ఆవ్రాలు మంచిదియే యైనయెడల తప్పక మంచియే ఘటించును. మనమెప్పుడును ఏపాపమును జేసియెఱుంగము. మనయెడ విధి యేల యన్యథాకరించు. ఇట్టిలేనిపోనియాందోళనము పెట్టుకొని మనస్సు నేల యాయాసపెట్టెదవు? సొగటాల నాఁడుకొందము రమ్ము. నీముం గెర యోడించెదను" అని చెప్పుచు నంద, రమదృష్టిని మఱియొక దానిపై మరల్ప సొగటాల సంపాదించెను. నందయొద్ద తప్పించుకొ నలేక రమ యెట్లో ఒకయాట నాఁడెను. కాని యామెమనస్సునందు పూర్ణముగ ప్రవేశపెట్టలేక పోయెను. నంద గెలుపు రమకేయిచ్చె

ను.తత్కారణమున నామెముంగెర నిలచినది.ఆయాట ముగియుటతో డనె రమ లేచినది. నంద తనకుఁ గావలసిన ప్రశ్నల కుత్తర మియ్య కపోవుటచే రమ యింక ఆటాడలేక పోయినది. తనగదిలోనికిపో యి వయసుచెల్లినపరిచారిక నొకర్తుకఁ బిలిచి "ఓముదుసలి! మహ మ్మదీయులు పిల్లలనందఱను చంపివేయుదురఁట నిజమేనా ?

ముదుసలి—"వారు చంపని దెవ్వరిని ? వారు నమాజుచేయుచు గొ డ్లను కోసుకొని తిందురు. అట్టివారు పిల్లలను వదిలివేయుదురా? " అనునప్పటికి రమగుండెలు తటతట కొట్టుకొనసాగెను. అంతటనుండి కనఁబడినవారినెల్ల అదియే ప్రశ్న యడుగసాగెను. మహమ్మదీయుల నిన అందఱికిని భయమే. వారిని నిష్పక్షపాతదృష్టితో చూచినవా రెవ్వరును లేరు. ఈమూఁడుకాళ్లముసలి చెప్పినచొప్పుననే వారును చెప్పిరి. అంతట రమ బిడ్డను ప్రక్కలోవేసుకొని పండుకొని య త్యంతదుఃఖాకులమనంబున రోదనము సేయసాగెను.

—ooo—

## మూఁడవ ప్రకరణము.

ఇంతలో రాయలు మహమ్మదుపురమును విడచి ఢిల్లీకిపోయిన ట్లు ఘోరబుఖానునకు సమాచారము వచ్చెను. ఖానుఁడు నిదియే యదనని యోచించెను. మహమ్మదుపురమును తా నిప్పుడు దుమ్ము చేయవచ్చునని యాతనియూహ. అందులకై దండయాత్ర సన్నాహములు ప్రారం భించెను.

మహమ్మదుపురమున ఈసమాచార మంతయును తెలిసి కలవ రము ప్రారంభమాయెను. కొందఱు గృహస్థులు బందుగులిండ్లకు, కొం దఱుతండ్రిబందుగులిండ్లకు, కొందఱు అత్తమామలయిండ్లకు, కొందఱు అల్లుండ్రయిండ్లకు,కొందఱు కూఁతుండ్రచుట్టాలయిండ్లకు, కొందఱు బా వమఱుదులయిండ్లకు, ఇట్లు నఖముఖముల తలాయొకతెన్నున తమసా మానంతయును తరలించుకొని చెల్లాచెదరుగఁ బోయిరి. వర్తకులు దు కాణముల వీడిరి. ధనపతులు తమగల్లాపెట్టెల విసర్జించిరి. సేద్యగాండ్రు పొలముల నుజ్జగించిరి. పనిబాగులవాండ్రందఱును తమతమపనిముట్లు

జంకను పెట్టుకొని పాఱిపోయిరి. పట్టణమున నేమూలఁ జూచినను గం దరగోళమే.

గంగారామదాసు ఆపట్టణమునకధికారి. చంద్రచూడునియుపదేశ మాసింపఁబోయి " స్వామీ! ఏమి తెన్ను? పట్టణమంతయును పటాపంచ లయి పోవుచున్నది.''

చంద్ర— స్త్రీబాలవృద్ధులు పాఱిపోయినఁ బోవనిమ్ము. వారి నాఁపవ లదు. వారు పోవుటయే మంచిది. తోరబుఖానుఁడు కోటను ముట్టడిం పవచ్చునప్పటి కెంతజనము తక్కువగనున్న అంతమంచిది. తినుబం డారములు తేలేము. ఉన్న వానితో మఱికొంతకాలము నిలిచియుండ వచ్చు. యుద్ధ క్రియానైపుణ్యమున ఆఱితేరిన వారిని పోనీయవలదు. అట్టివారెవరైన పాఱిపోవ నెంచిన బ్రతికియుండఁగనే కాల్పింపుము. ఆయుధ మొక్కటియైన బీరువోనీయకుము. గుప్పెడు బియ్యమైనను ఊరుదాఁటిపోరాదు.

పిమ్మట సైన్యాధిపతి యగు మృణ్మయుని పిలపించెను. ఆతఁడును పూజ్యుండగు చంద్రచూడునకు నమస్కరించి " స్వామీ ! చావు నిశ్చయ మని యెఱిఁగియుండియు మన మిచ్చట నేల యుడికి చావవలయు. ? తోరబుఖానుఁడు వచ్చుచున్న మాటయే నిజమైనయెడ మనము దారిలోనే ఆ తనిని ఏల అడ్డఁగొట్టి ఆతనిని హతమార్పరాదు. '' అని యడిగెను.

చంద్ర—ప్రబలముగనున్న యిచ్చటి బలమంతయును, విడచి మార్గమ ధ్యమునకు పోయి దుర్బలులమై ఏల వినాశ మొందుట? కోటముం దుపరిక్కను కొన్ని ఫిరంగులు నిల్పుకొని ధృఢముగ నిల్చియుంటిమేని మనల నెవ్వరేమి సేయఁగలరు? ఈనదిని దాఁట శక్తి యెవ్వరికున్నది? మహమ్మదీయబల మీనది నెచ్చటదాఁటుదురో కనిపెట్టి అచ్చటికిఁ బోయి యెదుర్కొనుఁడు. అట్లైన వారికి తరణోపాయమే కలు గదు. సర్వము నాయత్తము సేయుఁడు. నాతో చెప్పకుండ నే పని సేయకుఁడు ?

చంద్రచూడుఁడు తనగూఢచారునిరాకకయి ప్రతీక్షించుచుండె ను. ఆతఁడు వచ్చిన మహమ్మదీయసైన్య మెచ్చట నానదిని దాఁటునో.

యీాగడ తెలియుననియును, పిమ్మట కర్తవ్యము యోచింప వచ్చునని యును తలంచియుండెను.

ఈసమాచార మంతయును ఎట్లో అంతఃపురమునకుఁ బ్రాఁకెను. తోరబుఖానుఁడు సైన్యముతో వచ్చుచున్నాఁడనియును, మహమ్మదుపురమును కొల్లఁగొని మట్టముసేయ నున్నాఁడనియును, తెలియవచ్చెను. అంతఃపురములలోని కరుగుసమాచారము సామాన్యముఁగ నున్నది యున్నయట్లుండదు. అనేకములగువికృతరూపములఁ బొందుచుండును. పురుషులు ప్రయత్నముచేయ నున్నారని చెప్పుమాటకు, వచ్చుచున్నారని యెట్లు వాడుక చేయుదురో, అట్లే ఆఁడువాండ్రామాటకు వచ్చిపడినారని యర్థము సేయుదురు. ఆకారణమున పట్టణమంతయును ఆలగోడుఁ బాలగోడుచు నయ్యెను. నందకు హెచ్చుపని కలిగెను. జన్మముచే నబల. ఆపై నసహాయ. అట్టిచో నెల్లఆహూరార్చుపనిఁగూడ వచ్చి మీాఁదఁబడినచో నెట్లోపనగు? క్షణక్షణమును రమ మూర్ఛిల్లుచుండెను. నంద రమనుఁగూర్చి యోచింపుచు "సవతినిఁ గూర్చియిట్టిమాటలాడరాదుగాని, ఈమె బ్రతికియుండుటయెనాకు ప్రక్కలోనిబల్లెముగ నున్నది. కాని నానాథుఁడీగృహకృత్యవ్యాపారమంతయును నాకొప్పగించి పోయినాఁడు. ఎట్లో నాప్రాణమైన అడ్డము వేసి ఆమె ప్రాణమును నిలుపవలయు" అని యనుకొనుచు రమాప్రాణరక్షణోపాయమే యన్నిపనులకన్న ముందుపనిగ నెన్నుకొనియెను. తరణోపాయ మేమి యని యడుగ నింటిలోనున్న ఆఁడువాండ్రందఱును నందచుట్టును మూఁగిరి. "తల్లీ! నీవొక్కపనిఁ జేసిన మాయందఱిప్రాణములునుదక్కును. కయ్యమునకుఁ గాలుద్రవ్వక రాజ్యము మహమ్మదీయుల యధీనముచేసి, ప్రజలప్రాణమును కాపాడుమనివారిని వేఁడుము. మేమందఱమును, బంగాళాదేశస్థులమే. మాకు కయ్యములతోడను, కలహముతోడను ప్రసక్తి యేమున్నది? బ్రతికియున్న బలుసాకేరికొని తినవచ్చును. ప్రజలప్రాణము లన్నియు నీచేతిలో నున్నవి. నీకును నీయబ్బకును పదివేలవందనములు. నీవు ఏమి చేయుమన్న నది చేయుదుము అని పరిపరివిధముల బ్రతిమాలఁ జొచ్చిరి.

నంద—అమ్మా! ధైర్యము సడలనీయకుఁడు. పురుషులకంటె మనము హెచ్చుగ బుద్ధి కలవారము కాము. వారందఱును వచ్చి మీాకేమి

యు భయము లేదని యభయహస్తమునిచ్చుచుండ వట్టియడియాసపడె దరేల? వారికిమాత్రము ప్రాణములపై తీపిలేదా? వారిప్రాణములు బోయిన పిమ్మటఁగదా మనప్రాణములు బోవుట." అని పల్కెను. ఈసంభాషణ జరిగినపిమ్మట రమకు మరల మూర్ఛరాలేదు. ఆమె లేచి కూర్చుండి, యొక్కింత ధైర్యమున మెలంగెను. ఆమెధైర్యాపాదనకు కారణము ముందుప్రకరణమున ముచ్చటింపఁ బడును.

---

## నాలవప్రకరణము.

గంగారాము మహమ్మదునగరమునకు నగరనాథుండని మున్ను చెప్పియుంటిమికదా? ఆతనిపనియిప్పుడు రాత్రులు గస్తీతిరుగుటక్రింద నైనది. వెనుకటిప్రకరణములో నిరంగము పగటిపూంట జరిగినది. ఆరాత్రి గంగారామదాసు పట్టణముయొక్క వాస్తవస్థితి యెట్లున్నదో యరయవలెనను నుద్దేశ్యముతో వికారవేషమున పాదచారియై సంచరింపసాగెను. తిరిగితిరిగి తెల్లవారుసమయమున ఇంటిదారిపట్టి పోవుచుండఁగా వెనుక నుండి యెవ్వరో యాతనిఁ బట్టుకొని లాగినట్లుఁ గనఁబడెను.

వెనుకకు తిరిగిచూచునప్పటికి ఆతని కొక స్త్రీ విగ్రహము గన్పట్టెను. రాత్రి చీఁకటి గాఢాంధకారముగనున్నది. అలుక్కుమనుపిట్టనను గన్పట్టుటలేదు. ఈ స్త్రీ యిటుల సంచరింప నేమికారణమో? అంతచీఁకటిగనున్నను ఆకారమును బట్టియును, బట్టకట్టును బట్టియును, గంగారాము ఆమెను స్త్రీయనిమాత్రము గ్రహింపఁగలిగెను. కాని యామె యెవ్వరోమాత్రము గుర్తింపలేక పోయెను. గంగారాము నీ వెవ్వరని యడిగెను. ?

స్త్రీ—"నేనెవ్వరనియడుగఁ బనిలేదు. నాకేమి కావలయునో అడుగుము" అనిపల్కు-కంఠస్వరమును బట్టి గంగారాము తనసహచారిణి విశేషముగఁ గాలము గడిచినది కాదని కనిపెట్టెను. మాటలఘోరశేమాత్రము ఝూంకారముగ నున్నది. అప్పుడు వారిద్దఱికిని, ఈక్రింది సంభాషణము నడచెను.

గంగారాముఁడు—నీ వెవ్వరో నీయిష్టమువచ్చినట్లు చెప్పవచ్చును. ఇంత

యర్ధరాత్రి యీడుదానవు నీ వొంటరిగ నిట్లీల గ్రుమ్మరుచుంటివో ముందుచెప్పుము? ఇప్పుడు రోజులు మంచివి కావని యెఱుఁగవా?

స్త్రీ—ఈయర్ధరాత్రివేళ నొంటరిగ నేనెవ్వరికోసము పరిభ్రమించుట లేదు. నీకోసమే.

గంగా—అది వట్టిపిచ్చిమాట. ముందు నే నెవ్వరో నీ వెఱుఁగవే.

స్త్రీ—ఎఱుఁగకేమి? నీ వీనగర మేలునగరనాయకుఁడవు. పూజ్యుఁడగు గంగారామ దాసువు.

గంగా—సరే నే నెవ్వరో నీ వెఱుఁగుదువు. నీ వీస్థలమున నన్నిపుడు కలుసుకొందునని నీకు నమ్మక మెట్లు? ఈసమయమున నీ గల్లీలో నికి వత్తునని నేనే యెఱుఁగనే.

స్త్రీ—చాలసేపటి నుండి నీకోసము వెతకుచుంటిని, మీయింటికి కూడ పోయిచూచితిని.

గంగా—ఎందుకు?

స్త్రీ—అదియే ముందుగ నడిగిన బాగుండునే. నీ విప్పుడొకసాహసకార్యము చేయవలెను. చేయుదువా?

గంగా—ఏమది? సముద్రము త్రాగుమనెదవా? సూర్యుని జల్లార్పుమనెదవా?

స్త్రీ—ఈరెంటికంటెనుగూడ ముఖ్యమైనదే నే నిప్పుడు నిన్నెచ్చటికిఁ గొనిపోయిన నచ్చటికి వచ్చెదవా?

గంగా—నీవెవ్వరు? నేనెచ్చటికి రావలెను?

స్త్రీ—అది నీవడుగను రాదు. నేను చెప్పనురాదు. కాని నీకు పౌరుషమున్నదా?

గంగా—సరే. అది నీవు చెప్పనక్కరలేదు. నీపేరెవ్వరో నీవెవ్వరో నీ వృత్తియేమో నావలన నీకేమికావలయునో? అదియైనం జెప్పుము.

స్త్రీ—నాపేరు మురళి. ఇంక నీకు నేనేమియునుఁ జెప్పను. నీకు పౌరుషము వెల్తియగునేని నీదానిని బోమ్ము. కాని యింతపిరికిపందవు మహమ్మదీయుల బారినుండి యీపురము నెట్లు సంరక్షించెదవు. ఈ వాగాడంబరము లేకుండ నాతోడఁగూడ ఎందునకు రారాదు? నేనాఁడుదాననే.

గంగారాముఁడు ఎదురు చెప్పలేక మురళ ననుసరించి పోయెను. గంగారామును, మురళయును, అడుగులోనడుగునిడుకొనుచు పోయిరి. కొంతదూరము పోయెడుసరికి వారి కెదుట పెద్దమందిర మొక్కటి కనఁబడెను. అతఁ డామందిరమునుగుర్తించి "ఏమిది ? నీవిప్పుడీమందిరములోనికి రమ్మందువా ఏమి ?

మురళ—ప్రత్యవాయ మేమి ?

గంగా—బహిర్ద్వారమునసే గిన ప్రత్యవాయమేమియును లేదు. కాని నీవు పాణిద్వారము ద్రోవఁబట్టితివే. నన్నంతఃపురములోనికిఁ గొని పోవుదువా ఏమి ?

మురళ—నీకు ధైర్యము చాలదా ?

గంగా—చాలదనుమాటసత్యము. ఇది నాప్రభుని యంతఃపురము. వారి యాజ్ఞ లేక నే నిందు అడుగిడ రాదు.

మురళ—నీ కెవరియాజ్ఞ గావలెను ?

గంగా—రాజునాజ్ఞ.

మురళ—ఇప్పు డాతఁ డూర లేఁడే. రాణిగారియాజ్ఞ చాలదా ?

గంగా—చాల కేమి ? చాలును.

మురళ—అట్లయిన రమ్ము. రాణిగారియాజ్ఞ సమకూర్చెదను.

గంగా—కావలివాఁడు న న్నెట్లు లోనికి రానిచ్చును ?

మురళ—తప్పనిసరిగనుక.

గంగా—ఆతఁడు నన్ను గుర్తింపకున్న లోపలికి రానీయఁడే. ఈప్రస్తుతవేషమున నన్నాతఁడు గుర్తింప నిష్టములేదు.

మురళ—నేను వెంటఁబెట్టుకొని పోవుచుండఁగ నీగుర్తు లెవ్వరికిఁ గావలెను?

అప్పుడు పహరామీఁద నొకయామికుఁ డున్నవాఁడు. మురళ యాతనివద్దకు వచ్చి "ఓయి పాండ్యా ! తలుపు తాళము వేసియున్నదా? తీసియున్నదా ?

యామికుఁడు—తీసియే యున్నది. కాని యాతఁ డెవ్వఁడు ?

మురళ—నాసోదరుఁడు.

యామి—పురుషు లీగడప దాఁటుటకు హుకుము లేదే ?

మురళి—రౌద్రరూపము దాల్చి మాటలు తడఁబడ "ఏమి? నీకు హక్కును గావలెనుగా? దరిద్రుఁడా! ఎవరిహక్కును గావలెను? నాహక్కుజాలదా నీకు నాచీఁపురుకట్టఁ బుచ్చుకొని జాడించిన నీగర్వము పూర్ణముగ నాశన మగుననుమాట మరచితివా?" అనునప్పటికి యామికుఁడు గడగడవణంకుచు, నిశ్చేష్టుఁడై యూరకుండెను. అనంతరము అప్రతిహతంబుగ మురళి గంగారాముని వెంటఁబెట్టుకొని మందిరమునఁ బ్రవేశించెను. లోపలికిఁ బోయి రెండవయంతస్తుపైకెక్కి అందొకద్వారము గంగారామునికిఁ జూపి "ఈగదిలోనికిఁ బొమ్ము? నేనిచ్చటనె యుండెదను. నేను లోపలికిమాత్రము రాను" అని చెప్పెను.

గంగారాముని కీదియంతయు నత్యాశ్చర్యముగ నుండెను. కాని యీచిత్రమేమో చూతమని యెంచి లోపలఁ బ్రవేశించెను. అందుపస్థితంబయినసామానులన్నియును అపూర్వములు అమూల్యములు, అందొకపడకుకోళ్లపట్టెమంచముపై తన్వంగియొకర్తు కూర్చుండియుండెను. అసహాయయై యొంటరిగ నాగదిలో నేమియో ఏకతమున విచారించుచుఁ గూర్చున్నది. అట్టి సౌందర్యరాశిని గంగారాముఁ డెన్నఁడును జూచి యెఱుంగఁడు. అట్టిది లోకమున జన్మించియుండుననియు నాతఁడు తలంపఁడు. ఈరమణి యెవ్వరు? రమ.



ఐదవ ప్రకరణము.

గంగారా మింతకమున్ను రాయల యంతఃపురమునఁ నడుగువెట్టి యెఱుఁగఁడు. రమానందల నిదివఱ కాతఁడు కనినవాఁడు కాఁడు. ఆగది అమూల్య సౌందర్యమునుబట్టి, అందాసీనయైయున్న తరుణి రమయను కొనెంగాని మున్ను జూచి యుండుటచేతఁ గాదు. రాజుగారి భార్యాద్వితయమున, మనోహరాకారముచే రమ పేరు మ్రోసియున్నది. అందువలన ఆతన్వి స్వతస్సిద్ధముగ చిన్నభార్య యని తలంచెను.

గంగా—అమ్మగారిసెలవైనదఁట నిజమేనా?

రమ యులికిపడి లేచి గంగారామునికి నమస్కరించెను. "నీవు

నాకు సోదరుఁడవు. అందును పెద్దవాఁడవు. నీవు శ్రీ నె ట్లాదరింతువో నన్నుఁగూడ నట్లే యాదరింపుము. ఇట్టి వేళ రావించితినని అన్యధా భావింపకుము."

గంగా—మీరు ప్రభువులు ఎప్పుడు రమ్మని హుకుము చేసిన నప్పుడు వచ్చుటకు బద్ధుఁడను.

రమ—"నీవు బహిరంగముగ నిచ్చటకు రారాదని మురళి చెప్పుచున్నది. ఈసిగ్గుమాలినది ఇంక నేమేమియో నిన్నుఁగూర్చి వేయిసంగతులు చెప్పినది. అవన్నియు నీకడఁ బలుకరాదు. నీవు పూజ్యుఁడవు. సోదరసముండవు. అత్యంత భయకంపితస్వాంతనై నిన్నిటకు రావింపవలసె. ఇయ్యది సాహసకార్యమే యగును. నన్నుఁ గాచి కాపాడుము." అని పల్కుచు వెక్కి వెక్కి యేడ్వసాగెను. ఆమె కన్నులనీరుఁ జూచునప్పటికి గంగారామునిహృదయము చలించెను. "అమ్మా ఏమి సమాచారము? ఏమి చేయుమనెదరు?"

రమ—సమాచారమేమియో నీ వెఱుఁగనే యెఱుఁగవా? మహమ్మదీయు లీపురమును కొల్లగొని ధ్వంసము సేయ వచ్చుచున్నారు. మమ్మునందఱిఁ జంపి పురముఁ దగులఁబెట్టి పోవుదురు.

గంగా.—మిమ్మింత భయపెట్టినవా రెవ్వరు? మహమ్మదీయులు మీరనినట్లు పురముపైఁబడి దీనిని ధ్వంసముచేయవత్తురేని మే మేమగుదుము? మాజీవనము లెందుకు? నిరంతరమును డబ్బిచ్చి మమ్ములసంరక్షించుట యెందునకు? ఇట్టిపనులకుఁగాక మ్రాబతు కేల కాల్పనా?

రమ.—పురుషులు చాల తెగుదారులు. మీరు సంగతు లున్నవి యున్నట్లు గ్రహింపరు. మీరు మమ్ముఁ గాపాడలేనిచో మాగతి యేమి? అనిమఃరల రోదనము సేయసాగెను.

గంగా.—మాచేతనైనంతవఱకు మిమ్ముఁ గాచి కాపాడుదుము. అనవసరముగ భయపడవలదు.

రమ.—మీరు కాపాడఁగలరని నాకును ధైర్యమేకాని కాపాడలేకుండినచో?

గంగా.—అట్లైన మాప్రాణములనే కోల్పోయెదము.

రమ.—అట్లు చేయవలదు? నామాట వినుము. ఈదినము నందవద్ద కూరందఱును వచ్చి యొకమొఱబెట్టుకొనిరి. అది వినుము. మహమ్మదీయులనందఱ నాహూయముఁజేసి మనరాజ్యము వారి కిచ్చివేయుటయు, మనప్రాణముల వారు గాపాడుటయు, పరతు లేర్పఱచి వాని నములుజరుపుమని చెప్పుకొనిరి. వా రెవరినిఁ జంపకుండ వాగ్దానము చేసినఁ జాలును. వారందులక నుమతింతు రేని, పట్టణము నీయధీనమున నే యున్నదికదా? రహస్యముగ వారినిఁ గొంపోయి కోట వారిచేతిలోఁ బెట్టి రమ్ము. ఈపనిఁ జేసిన అందఱు సురక్షితముగ నుందురు. ఈమాటలు వినునప్పటికి గంగారాముని కొడలు కంపించెను.

గంగా.—దేవీ! తాము నాతో నేమిచెప్పిన చెప్పితిరి గాక. ఈమాటలు మాత్రము మఱియొకనికడ చెప్పఁబోకుఁడు. అట్టిపనియేమి? నేనేమి చేయుటయేమి? నాప్రాణ మట్లు తెగిపడిపోవనున్నను నేనందుల కియ్యకొనఁగలనా? అట్టిపని కితరు లెవరైన పూనుకొనిన వానితల నేనే తఱిఁగించెదను.

రమయాశ నిరాశయైనది. ఏమిచేయుటకునుదోఁచక వెక్కి వెక్కి యేడ్వసాగెను. "నాముద్దులబిడ్డనిపని యేమగునో?" యను పలువరింపుతక్క ఆమెకు మఱియొకధ్యానము లేకుండఁబోయెను. గంగారాముకలవరముఁజెంది 'పైని భగవంతుఁడున్నాఁడు. అమ్మా! ఊరటఁజెందుము. ఈ ఏడ్పు లెవ్వరికైన వినఁబడిన మనయుభయులకును ప్రాణము మీఁదికి వచ్చును. నీకందరగోళమంతయును నీబిడ్డనుగూర్చియేకదా? ఆబిడ్డసంరక్షణ కేదోయొక యుపాయమాలోచించెదను. మీరిందుండి మఱియొకచోటునకు తరలుట కనుగ్రహింతురా?"

రమ.—మాతండ్రిగారియింటికి తీసుకొనిపోయెదవేని వచ్చెదను. కాని నాసవతియు, పూజ్యుఁడగుచంద్రచూడుఁడును, న న్నిటనుండి కదలనీయరు.

గంగా.—అట్లయిన నీవు రహస్యముగ తరలిపోవలయును. దానికైన నిప్పుడు తొందరలేదు. అట్టివిపత్తే తటస్థమయ్యెనేని, నేను మిమ్ము స్వయముగ వచ్చి పిలచి మి మ్మచ్చట దిగవిడచి వచ్చెదను.

రమ.—నీవర్తమానము నాకు చేరుట యెట్లు?

గంగా.—మురళిను నాయొద్దకుఁ బంపుము. అది యతిరహస్యముగ నాకడకు వచ్చును.

ఈమాటలు చెవినిఁబడ్డవి. రమ కొక్కింతయూరట గలిగినది. గద్గదికతో “నీవు నాకు ప్రాణదానము సేసితివి. ఇంతటనుండి నే నిన్ను దైవముగఁ బూజించుచుండెదను. భగవంతుఁడు నిన్ననుగ్రహించుఁగాక.’ అని యాశీర్వదించి రమ గంగారాముని వీడ్కొల్పెను. మురళి యాతని యథాప్రకారముగఁ గొనిచని వెలుపల దిగవిడచెను.

అంతవఱకు వారుభయులమనంబుల నీషత్తైన నేవిధమగు దురాలోచనయు లేదు. కాని జరిగిన చర్యమాత్ర మయుక్తముగ నున్నది. అయ్యది యుభయులునుగూడ కనిపెట్టిరి. గంగారాము “నాయెడఁ ద ప్పేమున్నది?” అని యనుకొనెను. రమ “ప్రాణరక్షణోపాయ మేమియును గనఁబడనప్పుడు వేఱు శరణ్యా మేమి యున్నది?” అని యనుకొనెను. మురళిమాత్రము సంతసించెను.

గంగారాముని కేమాత్రము వివేకమున్నను ఆతనిమనోనయనమున కింతకన్న స్వచ్ఛమగుదృష్టి యుదయించియుండును. ఆతఁడు తెరమఱుఁగున మఱియొక్కఁడున్నాఁ డని కనిపెట్టలేకపోయెను. ఆతఁడు మనుష్యమాత్రుఁడు గాఁడు. మనుజున కెవ్వరి కేమికావలసినను దయచేయుచుండెడిది భగవంతుఁడే.

పూజ్యుఁడగుచంద్రచూడుఁడు తోరబుఖానున కొకరాయభారమంపెను. తమరాజ్యమును, ఆయుధాగారములును, మందుకొట్టములును, మహమ్మదీయుల కమ్మివేయుదుమనియును, అందులకు వా రేమిమూల్యమిత్తురో తెలిసికొని రమ్మనియును, వార్తాహరితో చెప్పిపంపెను. ఆసాధువర్తనుఁడు, ఏదోకొంతసొమ్మిచ్చిన రాజ్యము నిలుపబడుచుండఁగ యుద్ధముచేయుటవలన ఫలములేదని, స్పష్టముగఁ దెలియఁజేసెను.

ఈ సంగతి మృణ్మయగంగారాములకు నివేదింపఁగా మృణ్మయుఁడు నివ్వెరపడి “ఇది యేమి? నీకు పిచ్చియెత్తినదా? ఇంత తెగువ చేయుచున్నావు?” అని యడిగెను.

చంద్రచూడుఁడు.—“పిచ్చి యెత్తినది నాకు కాదు. నీకు. ఈబేరము

పరిష్కారముగుసరికి రెండుమాసములు పట్టును. ఇంతలో రాజు మరల రాఁగలఁడు." అని ప్రత్యుత్తర మిచ్చెను. గంగారాము ఏమి యోచించు కొనుచుండెనో యెవ్వరికిని తెలియదు. ఏది యోచించు చున్న వాఁడు. వెలువరించ లేదు.



ఆ ఱ వ ప్ర క ర ణ ము.

గంగారామున కాదినము పనులన్నియును గట్టువడి పోయినవి. ఎల్లప్పుడును రమ సర్వాతిరిక్తరామణీయకశోభయే ఆతనియెట్టయెదుటఁ దాండవ మాడఁ జొచ్చెను. ఎప్పుడు జూచిన నాతలంపులే మనస్సున పొరలి పొంగుచుండెను. "ఏమి చెప్పుమా? ఆముఖమున కంతవింత సౌందర్యము. దీపపు వెల్తురున చూచుటచేతనా యేమి? అట్లైన రాత్రిందివములు స్త్రీలను దీపములముందర నే నిలుపవచ్చునే. నీలములను గేలిసేయు. ఏమి యాకుంతలముల నైగనగ్యము? ఏమి? ఆ వదనసౌందర్యము? ఆకనుబొమలు? ఆకన్నులు? బింబఫలమును తిరస్కరించు నాయధరోష్ఠము? ఏమి? ఆ కారము?" దేనిపై కేఁగినను గంగారాముని మనస్సు మరలి రాకున్నది? ఏయొప్పు జూచినను హృదయంగమంబై అచ్చరప్రాయాంద్రఁ దిరస్కరించుచుండె. "మనుష్యాంగనలయం దిట్టిచక్కఁదనము తలంచుకొనుటకేని యవకాశము లేదు. ఆమనోహర రూపము నయనానందముగ నొక్కసారి సందర్శింపఁ గల్గుటచే నాజన్మము ధన్యతనొందినది. ఇంక నే బ్రతికియున్నన్నినాళ్లును తలఁచితలఁచి యానందించుట కాసందర్శనము చాలదే." అని మనసున గంగారాముఁ డానందపడసాగెను.

ఏమి యీ వెఱ్ఱి? ఒక్కసారి చూచి తనివి నొందుట సాధ్యమా? ప్రథమసందర్శన సమయమున విభ్రాంతుఁడైనవాఁడు మఱియొక్క సందర్శనమున కాసింపకుండ నుండఁగలఁడా? ఆదినము మధ్యాహ్న సమయమున గంగారాము "ఆప్రథమసందర్శన స్మరణచే నింక నాబ్రతుకంతయును సౌఖ్యముగ వెళ్లఁబుచ్చెదను." అని యనుకొనెను. సాయంతనమగునప్పటి కాయుద్దేశ్యము మాఱి "మరల నొక్కసారి సందర్శించిన నెట్లుండునో?" యనుకొనెను. "దీపములు పెట్టినతరువాత మురళ వచ్చి

యీరాత్రి నన్ను మరలఁ బిలచిన నెంత బాగుండును?" అని యనుకొని యెను. రాత్రి తొమ్మిదిగంటలయినది. ఆతనిసంకల్పానుసారముగ మరల మురళియే యొకరహస్యస్థలమున సాక్షాత్కరించినది.

గంగారాము—ఏమి సమాచారము?

మురళి—నీవ్యాపార మెట్లున్నది?

గంగా—మీ కేమివ్యాపారము కావలెను?

మురళి—తండ్రిగారియింటికిఁ బోవువ్యాపారము.

గంగా—అట్టి యవసర ముండదు. రాజ్యము సురక్షితముగ నుండును.

మురళి—అది నిశ్చయ మెట్లు? దేనినిఁబట్టి చెప్పెదవు?

గంగా—అవియన్నియు నీకడ విప్పి చెప్పుటకు వీలులేదు.

మురళి—ఈసంగతులు పోయి యామెకు చెప్పవచ్చునా?

గంగా—ఆహా పోయి చెప్పుము.

మురళి—ఆమె మరలఁ బంపిననో?

గంగా—రాత్రి నీవు నన్నెక్కడఁ గలుసుకొంటివో అచ్చటనే దొరికెదను.

ఆపలుకులు చెవినివేసుకొని మురళి రమకడ కేఁగి యావార్త యామెకు నివేదించెను. గంగారాముఁ డేమియు విస్పష్టముగఁ జెప్పలేదు. మురళి తెచ్చినవర్తమానముతో ఆమె కేమియు సంతుష్టి కాలేదు. అందువలన రమకు మనస్సునందు గల సంకోచ మేమియు విడిపోలేదు. మఱింత మనసున కాందోళనము కల్గెను. తత్కారణమున తెల్లవారు సమయమున రమాసమ్ముఖమునకు గంగారాముని మురళి మరల గొనిరావలసివచ్చెను. గడచినరాత్రి కావలికాచిన భటుఁడే మరల కావలికాచుచుండెను. మహమ్మదుపురనగరనాయకుఁడు మురళి సోదరుఁ డనుమిషచే అంతఃపురమునఁ బ్రవేశించెను.

గంగారాము రమాసమ్ముఖమునకు నరిగి తనకును, రమకునుగూడ నర్థముగాని యవ్యక్తసంభాషణఁ గొంత జరిగించెను. ఆతనికి మతి చలించినది. ఆయసమసాయకుని విషమశర మొక్కటి ఆతని మనంబునఁ దగుల్కొనియెను. గంగారాము గ్రుడ్లు రెండును నప్పళించి చూచుచు నూరకుండెను. ఈసారి చూపులు తన్మనోహర రామణీయ

చెప్పి పోయెను. సింహముగుహలోనికి వచ్చినవాఁ డెవ్వఁడు రక్కులు తినకుండఁబోవును? రమాగంగారాముల ఈసందర్శనములు తఱచైనవి. నలుగురియెదుటను ఇవి జరుగుచుండినచో అంతమోస మేమియును లేదు. తాటిచెట్టుక్రిందఁ బాలుద్రావినను మఱియొకటియే యందురు. అమ్మలక్కలందఱకును సందుదొరకినది. రమాకాంతహృదయము కేవలమునిష్కళంకమైనది. శషభిష లేమియును నెఱుఁగనిది. రాత్రి మూఁడవయామమున గూఢప్రచారములన్నిటికిని ఈగడులుదీయుసమయమున నిట్టిసందర్శనము సంఘటిల్లుట లేనిపోని అనుమానములకు కారణముకాదా? అందువల్ల ఇతరానర్థము లేమియును లేవే అనుకొందము. నిశ్చయముగ ఒక్కింతమార్దవరాహిత్యము, సంభాషణమున నించుక పలుచఁదనము, మాటలలో నొక్కింతవెలితి, మనస్సు లటునిటు నూఁగిసలాడుట.—ఇంతమాత్రము లేకుండఁ బోవునా? అట్టిస్థితియే పట్టినది. రమాకాంత తొలుదొల్త దీనినిఁగనిపెట్టలేదు. ఒక్కసారి మురళి చూచుచుండఁగ నేదోఒక్కమాట యన్నది. అయ్యది దేవదూతవాక్యమువలె మనస్సునఁ దట్టినది. మురళి యొకనాఁడు కావలివానితో ఈవిషయమునుగూర్చి ముచ్చటించినది. ఆజానపదుఁడు "ఏమే యిది నీసోదరుఁడు చాలతఱుచుగవచ్చిపోవుచున్నాఁడు." అనెను. మురళి నీవు కుచ్ఛితుఁడవు. నీ కెందులకిది? చీఁపురుకట్టభయము పోయినదా యేమి?

కావలివాఁడు—పోవుటయేమి? ఉన్నది. నా ప్రాణము గడగడ వణఁకుచున్నది.

మురళి—నీ కెన్ని ప్రాణము లున్నవి? నీప్రాణములు నాచేతనున్నవే.

కావలి—నీవు వదలిపెట్టిన ప్రాణము పోదు. ఒక్కసారి ప్రాణము తీసిన అంతయు నయోమయముగనుండును. ఇంక నీసోదరుని లోపలికి రానీయను.

మురళి—నీయిష్టము వచ్చినట్లు జేయుము. ఇంక నాజోక్యము నీ కక్కర లేదు, ఏమనెదవు?

కావలి—ఇటుజూడు. అవచ్చెడువాఁడు నీసోదరుఁడు కాఁడు. అతఁడెవ్వఁడో యొకపేరుమోసినపురుషుఁడు. ఆతని కిచ్చట పనియేమో నాకు తెలియదు. తెలిసికొనవలసిన అవసరము నాకు లేదు. కాని ఆతఁ

డిచ్చట అంతఃపురముపై తణిఖీకి వచ్చినాఁడేమో నాకు తెలియదు.
ఆతఁ డింతరహస్యముగ వచ్చుచు పోవు చున్నప్పుడు మనకేమైన
నియ్యనక్కరలేదా ? నీకేదో కొంతబహుమానము దొరికియుండు
ను. అందులో నాకు సగ మిచ్చితివేని నీయిష్టముప్రకారము
చేసెదను.

మురళి—నాకింకను అతఁ డేమియు నివ్వలేదు. ఏదైనను దొరకినప్పుడు
తప్పక నీకుఁగూడ పాలుపెట్టెదను.

కావలి—మనకిద్దఱకును చెరిసగము పాలుసుమీ ?

మురళి—అందున కభ్యంతరమేమి ? అని చెప్పెను.

రాణియొద్దనుండి మురళి యేవస్తురూపకముగనో, వస్త్రరూపక
ముగనో, కొంతబహుమతి యిదివఱకే పొందియున్నది. గంగారాము
మాత్ర మింకను ఇయ్యలేదు. అందులకై తన తెలివి తేటలన్నియును విని
యోగించి యాపాండ్యాతో "సరేకాని ఈమాటాతఁడు వచ్చినప్పుడు
లోపలికి రానీయకు. నేనాతనిపక్షమున నే చెప్పెదను. అప్పుడుగాని
యాతఁడు మనము చెప్పినట్లు రాఁడు." అని బోధించెను.

ఆయుపదేశానుసారముగ గంగారాము మఱల అంతఃపురమునకు
వచ్చునపుడు కావలివాఁడు రానీయలేదు. మురళి తిట్టెను. బ్రతిమాలె
ను. ప్రాథేయపడెను. ఏమియును ఫలితము లేకపోయెను. గంగారాము
మురళితో సంప్రతించి చూచెను. తాను నగరనాయకుఁడ నని చెప్పు
కొని నిజవృత్తాంతము బయలఁబెట్టుకొనినచో తన కంతఃపురప్రవేశము
కలుగునని యెంచెను. కాని మురళి అందువలన మఱింత ప్రతికూల మగు
నేమో అని చెప్పెను. "ఆతఁ డభ్యంతరపెట్టఁడుగాని, ఇతరులతోడఁ
జెప్పును. నాసోదరుని రాకపోకలు బహిరంగ మగునేని నీ కేమి ? నాకు
ముప్పు వచ్చును ?" అనిచెప్పెను.

గంగారాము అందులవివేకము గనిపెట్టెను. కావలివానినిఁ గడ
తేర్పసమకట్టెను. ఆపైన మఱింత యల్లరియగునేమో అని యూహిం
చెను. ఒకవేళ పునస్సందర్శనము లేకుండ దారిపూర్ణముగఁ గట్టువడిపో
వునేమో ? అందువలన నాయుద్దేశ్యమును, నెఱవేర్పలేదు. ఎన్ని జెప్పి
నను కావలివాఁడు లక్ష్యపెట్టలేదు. అందువలన ఆరాత్రి యాతఁడు

వచ్చినవాఁడు వచ్చినట్లుగ నింటికిమరలి పోవలసివచ్చెను.

మురళి—యొంటరిగ మరల రాణియొద్దకు వచ్చినప్పుడు "అతఁ డీరాత్రి రాఁడా?" అని రాణి యడిగెను.

మురళి—వచ్చినాఁడు కాని, కావలివాఁడు రానీయలేదు.

రాణి—ఏల? ఇంతకమున్ను ఏల రానిచ్చినాఁడు?

మురళి—అతని కేదో అనుమానము తట్టినది.

రాణి—ఎందునఁగూర్చిన అనుమాన మది?

మురళి—తమ రది తెలిసికొనినందువలన ప్రయోజనములేదు. అట్టిసంగతులన్నియును, మేము మీస్ఫురణకు తీసికొనిరాఁగూడదు. అతని కేదో కొంతయిచ్చి రహస్యవిఘ్నము గాకుండ నుండునుపాయ మాలోచించెదను.

ఈమాటలు వినెడుసరికి రమాకాంతకు దేహ మాపాదమస్తకము చెమట పట్టిపోయెను. దేహము చెమర్చుటయూ, కంపించుటయూ, కాళ్లు తేలిపోవుటయూ, ఎన్నియవలక్షణములు, ఎంతభయము, ఎంత వణఁకు, ఎంతమైమఱపు, అన్నియు నొక్కసారిగ వచ్చి యావేశించెను. ఎట్లో వచ్చి ప్రక్కమీఁదఁ బడెను. కన్నులు మూసుకొనెను. వివశ యయ్యెను. అట్టియోచన యామెకు మనస్సున నంకురింపనైనలేదు. ఇతరప్రకృతి గలవారిమాట యెట్లుండినను నుండనిమ్ము ఆమెమనస్సున భయముతో జవజవలాడిపోయెను. ఆమె నడిగినప్రశ్నమునుగూర్చి తలంపనైనఁ దలంపలేకపోయెను. ఆవార్త యామెహృదయమున పిడుగువలె వచ్చి పడెను. తా నెంతయవ్యక్తపుఁబనిఁ చేసెనో యయ్యది యిప్పటి కామెకు గుర్తు తెలిసెను. ఎంత శపభిషలు తెలియనిదైనను ఆమెమాత్ర మాఁడుదికాదా? అందున హిందూయువతి. ఇట్టియుద్దేశ్య మొకటి మనస్సునఁ దట్టిన, సర్వవిషయములును గోచరము కాకుండునా? అప్పుడు వారు భయులకును, జరిగినసంభాషణను జ్ఞప్తికి తెచ్చుకొనెను. తనతెలివిలేమి యంతయును, కన్నులఁ గట్టినట్లయ్యెను. విషమో పుచ్చుకొనుటయో? కుత్తుకఁ గోసికొని చచ్చుటయో? శరణ్యమని యెన్నుకొనియెను. బాగుగ యోచించిచూచి చూచి కంఠమున కుఱ్ఱఁబెట్టుకొని చచ్చిపోవుటయుక్తమని తలంచెను. దానితో మహమ్మదీయులవలన భయము

ను, ఈదృశం బగుననర్థములును అన్నియును అడుగంటిపోవును. కాని ఆచిన్నబిడ్డనిమాటలేమి? రమ కడపటియోచన రాజు మరలి వచ్చువఱకు వేచియుండి, అప్పుడు కుత్తుకఁ గోసికొని చచ్చుటకు సంకల్పించుకొనియెను. ఆపైన పిల్లవాని సంరక్షణకుఁ దగినయేర్పాటు లన్నియును, బాగుగ జరుగును. ఇవి యన్నియును మహమ్మదీయుల బారినుండి బ్రతికిబైట బడునప్పుడుకద. అట్టి యదృష్టమే తక్కువ. ఐనను గంగారాముని పిలుచుటగాని, ఆతనియొద్దకు ఎవరినైనఁ బంపుటగాని, జరిగించలేదు. తానెవ్వరినైనఁ బంపలేదు సరిగదా? మురళి పిలుచుకొని వచ్చుటకునైన ననుమతింపలేదు.

రమ పిలువనంపుటగాని, మురళి వచ్చుట గాని, కట్టువడిపోవుట తోడనే గంగారామునికి మనస్సున నుద్రేకమెక్కువైనది. ఆతఁడు నిద్రాహారములు విసర్జించినాఁడు. మురళి నన్వేషింప బయలుదేరినాఁడు. మురళి అంతఃపురపరిచారిక. అందఱికిని బహిరంగముగఁ గంటఁబడునది యా? రాణియాజ్ఞయైనదికాఁబట్టి ఆమె గంగారాముని వెదకికొనుచు వచ్చినది. ఈతనికి నామె వాసస్థాన మెచ్చటనో కూడ తెలియదు. ఈదూత్రికారాయభారమునకై మఱియొక స్త్రీని కుదిర్చి ఆమెను మురళను గొని రమ్మని పనిచెను. ఆతని బ్రతుకుతో రమాకాంతకడకీమెను పంపఁగలఁడా! మురళి పిమ్మట గంగారామునికడకు వచ్చెను. "న న్నేల రావించితిరి" అని మురళి అడిగెను.

గంగా— పిమ్మట సమాచారమునకు.

మురళి— అడిగినను విప్పి చెప్పుటకు తమకు దయలేకపోయినది. మాయందు తమకు నమ్మకమేది?

గంగా—ఔనౌను మే మాసమాచారమును స్వయముగనే తీసుకొని పోవలెను.

మురళి—ఆమె కిప్పు డాతిక్క తిరిగినది. భగవంతునకు వేవేలవందనములు సమర్పించుచున్నది.

గంగా—ఏమది? అదేమో నాకేమియు నర్థము కాలేదు.

మురళి—ఏమున్నది. ఆమెకు తిక్క తిరిగిన దంటిని.

గంగా—ఆమెకు అదివఱ కున్నతిక్క యేమి? ఇప్పుడు తిరిగిన దేమి?

మురళి—ఆమెతిక్క నీ వెఱుంగనే యెఱుంగవా?

గంగా—తెలియదు.

మురళి—ఆమె కొకవిధమైనపిచ్చి యున్నదని కనిపెట్టలేదా?

గంగా—అది యేమో నాకు తెలియదు.

మురళి—లేకున్న నీవంటివానికి అంతఃపురప్రవేశము కలుగునా?

గంగా—ఎందుచేతఁ గలుగరాదు? చెప్పు చెప్పు విందుము.

మురళి—నీవట్టిస్థానమునకు తగవు గనుక.

గంగా—ఇంక నే నేస్థానమున కర్హుఁడను?

మురళి—నావంటి చింపిగుడ్డలదానితో నుండుటకు. "నీవెక్కడికైన పెద్ద యిండ్లకు బోఁదలఁచి నప్పుడు నన్నుఁ గూడ వెంటబెట్టుకొని పొమ్ము. మాది, కైవర్తకులము. మావర్ణమువారు ఎన్నిమాఱులఁ బెండ్లియాడినఁ దప్పు లేదు. నాకింతకమునుపు రెండున్నరమాఱు పెండ్లిండ్లు అయినవి. నీకభ్యంతరము లేదేని ఇంకొకసారిగూడ నా కేయభ్యంతరమును లేదు." అని మందహాసము సేయుచు అతనిపట్టునుండి తప్పించుకొని ఒక్కదాఁటున నవతలికి పోయెను.

గంగారాముఁ డింక నప్పట్టున నాశ యేమియు లేదని నిస్పృహఁ జేసికొనెను. ఆశ యేమియు లేదనుకొని నంతమాత్రము చేతనే సంతుష్టి జెందునా?

ఒక్కసారి మనుష్యుఁడు పాపకార్యములలోఁ బ్రవేశించెనా? ఆతని కెన్నిబుద్ధులో యుప్పతిల్లును. ఎన్ని ఆశలైనఁ బుట్టుచుండును. గంగారాము "నాఈప్రాణమును రమకవమునకేని గట్టి పెట్టెదను. అట్లుచేయకున్న నేను గంగారాముఁడ కాను" అనికృతనిశ్చయుండై స్వతస్సిద్ధమగుతనదారుణప్రకృతి వెలికురక, అచ్చటనుండి కదలి యింటికి చనియెను. ఆరాత్రి యింటికడఁ గూర్చుండి యేవియో లేనిపోని తంత్రములు కొన్ని పన్ని రమా సీతారామరాయల నాశనమునకై వ్యూహ మొకటి వేసెను.



ఎనిమిదవప్రకరణము.

శ్రీ యయంతు లిరువురును మనకగపడి చాలతడవైనది. ఇప్పుడెచ్చట నున్నవారో? దేశములెల్లఁ గ్రుమ్మరి విహారపాతటమున నున్నలలి

తగిరి శృంగమున కిప్పుడే వచ్చిచేరిరి. కొంతకాలమైన పిమ్మట మఱల వచ్చి తన్ను సందర్శింపుమని యాయోగి చెప్పిన మాట మఱచితిరా ఏమి? ఒక్కసారి మఱల నాసంగతులు జ్ఞప్తికి దెచ్చుకొనుఁడు.

యోగియయంతినొక్కతనే తనను సందర్శింపనానతిచ్చెను. శ్రీని రానీయలేదు. యయంతి హస్తికుంభమున ప్రవేశించెను. ఈనడుమవిరూపానదీపరిసరముల శ్రీ విహరింపఁజొచ్చెను. ఒకసారిశృంగాగ్రమునకు బోయి యచ్చటనున్న చందనతరుచ్ఛాయల విహరించి యచ్చటనుండి నదీతీరమున నొత్తుగనున్న తాళవృక్షముల మహోన్నతిని తద్రామణీయకమును నేత్రపర్వముగఁ గాంచి యానందించుచుండెను. ఇంతలోయయంతియు గుహాంతరముననుండి వెలువడివచ్చెను. యోగి యేమి శాసించెనని శ్రీయడుగకుండఁగనే "ఆహా! ఏమి ? అవ్యక్తమధురమగు నీశకుంతకలస్వనము ? శ్రవణానందముగ నున్నది.

యయంతి—ఈమధురనిస్వనము నీనాథుని కంఠనిస్వనమువలె నున్నదా?

శ్రీ—ఈసెలయేటి చిఱుతరంగముల మాధుర్యమువలె నున్నది.

యయంతి—ఈమాధుర్య మాకంఠ మధురిమతో నెనయగునా?

శ్రీ—నానాథుని కంఠస్వనము విని చాలకాలమైనది. జ్ఞప్తికి వచ్చుట లేదు.

పాపము. ఏమిరాయలదుర్మతి? ఈసంగతి యయంతికిదివఱకే యెఱుకఁబడియెను. శ్రీహృదయమును మఱలనావైపునకు మరల్చుట కియ్యది మఱల యుచ్చరించినది. "ఇప్పుడు మఱల నీనాథుని కంఠస్వనమువిందువనుకొందము. ఇంతమధురముగ నుండునా?" అని మఱల నడిగెను.

శ్రీ మౌనముద్రయై యూరకుండెను. ఒక్కింతమిన్నకుండి వినమ్రమై వదనముపైకెత్తి యయంతిముఖమువంక తేఱిపాఱఁజూచి "గ్రుచ్చి గ్రుచ్చియడుగుచున్నావు? యోగి నానాథుని సందర్శింపఁబొమ్మనెనాఏమి?

యయంతి—పొమ్మనినది నిన్నొక్కతినేగాదు. నన్నుఁగూడ నిన్నను గమింప మనినాఁడు.

శ్రీ.—కారణమేమి ?

యయంతి.—నాకు మేలేమి ? కీడేమి ?

శ్రీ.—అక్కా! ఇందున కీడును, మేలునుంగూడ నున్నదా?

యయంతి.—శ్రీ! ఇంతమాత్రముకూడ తెలియదా? దీనికింకను అర్థ వివరము గావలెనా?

శ్రీ.—నీ అర్థమేమో నాకు తెలియలేదు విప్పి చెప్పుము.

యయంతి.—ఆతఁడు నీయోగక్షేమ మొక్కటియేగోరి చెప్పినయెడల పూజ్యుఁడగు గురువరుండు నాకెప్పుడు నట్లానతిచ్చియుండఁడు. స్వప్రయోజనమునకై యాతఁడెవ్వరి నేకార్యమునకు నియోగింపఁడు. నీతో సంబంధించినంతవఱకు మేలును గీడునుగూడ లేదు.

శ్రీ—అవునవును. ఇప్పుడు తెలిసినది. ఇయ్యది యిప్పుడు నానాథుని క్షేమముం గూర్చియై యుండును.

యయంతి—అతఁడెప్పుడును అంతవిస్పష్టముగ చెప్పఁడు. మనతో నంత విశేషముగ మాట్లాడుటకుఁ గూడనిచ్చయింపఁడు. ఆతఁడు చెప్పిన దానిగూఢార్థమిదిగా భావించితిని. ఇంతవఱకు నావల్ల నీవు వినిన దానినిఁబట్టియు, నేర్చినదానినిఁబట్టియు, నీకుకూడ విదితమయి యుండును.

శ్రీ—నీవేల వచ్చెదవు.

యయంతి—ఆతఁడు కారణము చెప్పలేదని చెప్పితిఁగా? ఆతని యాజ్ఞయైనది గనుక బయలుదేరు చున్నాను. నావృత్తి దేశాటనమేకదా? ఎటనున్న నేమి? నేనెందులకు రారాదు? నీవిప్పుడు సంసిద్ధురాలవై యున్నావా?

శ్రీ—అదియే యోచించుచున్నాను.

యయంతి—ఏల యోచన? నీకు భర్తృవధావిషయమగు స్మరణయేమైనఁ గలిగెనా ఏమి?

శ్రీ—అదికాదు. నాహృదయమున భయమను వికారమే యంతరించినది.

యయంతి—ఏల యంతరించినది. ముందుకారణము చెప్పుము? నేరావలెనో అక్కరలేదో తరువాత చెప్పెదను.

శ్రీ—సోదరీ! ఒకమనుజుఁ డింకొకమనుజుని వధింపఁగలుగుననుట వట్టికల్ల. జననమరణము లొక్కనియధీనముననున్నవి. ఎవ్వని కెప్పుడు మరణము ప్రాప్తమో దానినప్పుడు పరిపక్వము సేయుచుండును. ప్రతిమ

నుజుఁడు నెప్పుడో యొకప్పుడు చావవలసినదే. నామూలముననో మఱి యొకరి మూలముననో, ఎప్పుడో యొకనాఁడు, ఆతనికి మరణమాసన్నముగాక మానునా? ఉద్దేశ్యపూర్వకముగ నేనాతని నెప్పుడును చంపఁబోవుదునని చెప్పుట సరికాదు. నావలననే యాతనికి మృత్యువాసన్నమయి ప్రపంచయాతనలనుండి యాతనికి విముక్తిగలుగుట విధిలిఖితమయినయెడల దానినిఁ దప్పింప నెవ్వరికగు ? వనములసంచరించినను, జలనిధిదాఁటిపోయినను, దైవాజ్ఞ లుల్లంఘింప శక్తులగుదుమా? ధర్మమార్గానుసారముగ, భక్తిపూర్వకముగ, నెట్లు ప్రవర్తింపవలయునో అట్లు నడచికొనియెదను. అందువలన నాతనికి కీడే వాటిల్లినను, నే నందులకై విచారింపవలసినపని లేదు.

కటకటా ? సీతారామరాయలా ? నీ విట్టి యాపెకోసమా తహతహపడుచుంటివి ?

యయంతి యామాటలనువిని యత్యంతము మనంబున సంతోషించెను. విద్యార్థియెడ గురు వెట్టిగారవము గనుపఱచునో యట్టిగారవమునే శ్రీవాక్యములయెడ యయంతి కనుపఱచెను. ఆమెను మఱల పలుకరించి ? "నీ వింకను ఏల యనిశ్చితముగ నుంటివి ?" అని భైరవి యడిగెను.

శ్రీ:—తనను విడచిపోవ నాతఁ డనుమతింపకుండిన నేమని యోచించుచున్నాను.

యయంతి:—జాతకఫలమువలనఁ గలుగఁబోయెడు ప్రత్యవాయములనిన నీకంత భయములేనప్పుడు నీవాతనియొద్ద నుండిపోయినమాత్రమేమి భయము ?

శ్రీ:—ఇంక నే నారాజుకడ నుండుట కనర్హురాలను.

యయంతి:—మునుపటికంటె వేయిమడుంగులు నీకెక్కువ యర్హత గలదు. సువర్ణరేఖాతీరమున, వైతరణీతటమున, నిన్ను నేను గనినప్పుడు నీయందున్న మనోజ్ఞతకన్న నిప్పుడెంతమనోహరత్వము నీయెడ అధికమయ్యెనో నీ వెఱుఁగకున్నావు.

శ్రీ:—ఊరకుండుము. ఊరకుండుము.

యయంతి:—నీసుగుణము లెంతవృద్ధియయ్యెనో యవియు నీవెఱుఁగవు

ఆవిషయమునఁ బ్రపంచమునఁ గలయేరాణి నీకు సమ యగును ?

శ్రీ:—నాభావము నిట్లా నీవు కనిపెట్టితివి. నీమనస్సును, నామనస్సును గలుపుటకు నీ వేర్పఱచినమార్గమేది ? నేనిప్పుడు దానిఁగూర్చి యా ప్రశంసించితిని ? ఆతఁడు తనతోడఁగూడియుండుటకై పరిపరి విధములఁ బ్రార్థించిన యాశ్రీ యీశ్రీ గాదని చెప్పితిని. నీశుశ్రూషచే నామె కిప్పుడు ప్రాపంచికసౌఖ్యములపై మనసు బోవుటలేదు. ఆపేరుగల స్త్రీ నీపాదములకడ శుశ్రూషచేసి బ్రతుకుచున్నది. నీ పాదసేవాసాంగత్యము నభిలషించు నీమెకు మహారాజాధిరాజగు రాయలకడఁ గాని, ఆమహారాజాధిరాజునకు నీశిష్యురాలికడఁ గాని, ఏమైనసౌఖ్యముండునని యెంచెదవా ? రాజ్ఞీపదమునం దభిషిక్త యగుటకు నీశిష్యురాలు తగదు.

యయాతి:—అట్లైన నాశిష్యురాలు సుఖదుఃఖములకు గుఱి యయ్యెనా ? అట్టి విద్యార్థినీదశ సిగ్గులచేటు.

నాశిష్యురాలా రాలనునప్పుడు యయంతి అధరోష్ఠముల మందహాసద్యుతి నటనము సేయుచుండెను.

శ్రీ:—నే నట్టిదానను గాకపోవచ్చును గాని ఆతఁడుమాత్ర మట్టివాఁడు కాఁడు. ఆతని శ్రీ, యిహలోకయాత్ర చాలించినదనియు, భైరవీసంసేవనమున మాత్రమిప్పుడు జీవయాత్ర నడుపుచున్నదనియును వినినచో ఆతఁడు మనంబున నత్యంతము పరితపింపకమానునా?

యయంతి:—పరితపింపవచ్చును. పరితపింపక పోవచ్చును. ఆచర్చలతో నిప్పుడు పని లేదు. శ్రీకృష్ణభగవానునిచరణకమలములపై నీమనసిప్పుడు నిశ్చలముగ నిలిపి యుంచిన, నీమనస్సున నింక నేమియుఁ జొరనీకుండును. సర్వమును సరసముగ నడచి పోవును. మనముపకారముచేయవలసినది, నీభర్తకానీ, మఱియితరుఁడుకానీ మనమిప్పుడు బయలుదేరిపోవలయును.

అని వారుభయలును పర్వతశిఖరమునుండి దిగి విరూపానదీతీరమునందు మార్గముపట్టి గంగానదివైపులకుఁ బోయిరి. ఆమార్గము దరి నున్న వనమునఁ బువ్వులు కొన్ని కోసి, అందలి ఱేకులు, కేసర

ములు, తొడిమలు, మున్నగాఁ గలిగినవన్నియు, వేఱు జేసి పరీక్షించి చూచుచు తమదారిని బోయిరి. వారిలో నెవ్వరుగాని రాయలపేరైన నుచ్చరింపరైరి. ఈనిర్ధకులకు, ఇంతయవ్వనమును, ఇంతసౌందర్యమును, సర్వశక్తుఁ డేల యొసంగెనో, ఆతని కొక్కనికే ఎఱుక. శ్రీకొఱకై, సంచులు, గొందులును సర్వమును వెతకినయాచంచలచిత్తునకు రాయలకేమైన కొంచెము తెలియునేమో? పాఠకులును, గ్రంథకర్తవలెనే వీరిరువురి నొక్కవిధమగుధాకినులుగ సంభావింతు రేమో?

---

## తొమ్మిదవప్రకరణము.

తాను చిక్కువడినవిపత్తులనుండి రమ యెట్లో తప్పించుకొనెను? గంగారామమాత్రము చిక్కుపడిపోయినాఁడు. అతనికి మనోవ్యథ హెచ్చినది. రుగ్మత ప్రారంభమైనది. మంచముమీఁదనుండి లేవలేకుండఁ గూడ పోయినాఁడు. ఆతఁడు నిర్వహింపవలసిన రాజకార్య వ్యవహారములుకూడ జెడినవి. రమతలంచినట్లే యాతఁడు. విషముపుచ్చుకొని యాత్మహత్యచేసుకొన నిశ్చయించుకొనినాఁడు. కాని యామెవలెనే యాతఁడు తత్కార్యము నిర్వహింపలేకపోయినాఁడు. అట్టిస్థితిలో పట్టణమును కాపాడవలసినగంగారాము తననియతకృత్యముల నెల్ల నుజ్జగించి, ప్రమత్తుండై యుండుటఁ బూజ్యుఁడగుచంద్రచూడునకుగూడ విదితమయినది. నగరనాయకుఁడు జబ్బుపడినాఁడనియును, మంచముమీఁద నుండి లేవలేనిస్థితిలో నున్నాఁడనియును, ఆతనికి తెలియవచ్చినది. ఆతని యారోగ్యస్థితినిగూర్చి చంద్రచూడుఁడు విచారించెను. గంగారాము "నాకు గొన్నిదినంబులుసెలవియ్యవలెను. ఆరోగ్యము చెడినది. ఇప్పు డేపనిచేయుటకును, అశక్తుఁడను." అని చంద్రచూడునితో చెప్పెను.

చంద్రచూడుఁడు:—నీదేహస్థితియం దేవిధమైనజబ్బును గనుపట్టుటలేదు. ఏదియో మనోవ్యథచే బాధఁబడుచున్నట్టులున్నావు. నీచిన్నెలట్లున్నవి?

గంగారాము మంచముమీఁదఁ బండుకొనెను. ఆతనిదేహమంతయును అగ్నిహోత్రజ్వాలలు దహించునట్లయ్యెను. వ్యాపారవిరహితుం

డగునాతని కెప్పుడును అంతస్తాపము హెచ్చు. అట్టియాతఁడు వ్యాపారమొకటి గల్పించుకొనినఁ దప్ప ఆమనోవ్యథను మాన్ప మఱి మందు లేదు.

మంచముమీఁద పండుకొని గంగారాముఁడు ఏవేవియో కొన్ని నిశ్చయములు చేసికొనెను. "ఏపన్నాగమో పన్ని రమను చేపట్టవలెను. లేదా చావవలెను."—"అవును నే చచ్చిన లో ఎవరికి? లోటు లేదుగాని రమను చేపట్టక, యీప్రాణములు విడువవలెను. వేయేల రమను ఎట్లైన చేపట్టుటకే బ్రతుకవలెను. ఆమెను సరియైనమార్గమున చేపట్టుట కవకాశము కనుపడదు.— కుచ్ఛితతంత్రములే శరణ్యములుగ నున్నవి. ఏయుపాయమైననేమి? కార్యసాధనము ప్రయోజనము. ఉపాయములేనివానిని ఊరనుండి వెడలఁగొట్టవలెను." సామాన్యముగ దుర్మార్గులందఱును గంగారామునివలె నిట్టియుపాయములే శరణ్యములుగ నెన్నుకొందురు. అట్టివారలెప్పుడును ధర్మమార్గానుసరణము తమకు కార్యకారి కాదని యెంచుకొనుచు దుష్కృతములకు బాల్పడియెదరు. ధర్మమార్గమున చరించ నెంచువారల కది సుకరముగనే యుండును. దుర్మార్గు లందులకు ప్రయత్నములే చేయరు. అట్టిచో వారికామార్గమెట్లుపట్టుపడును? గంగారాము తనలో నిట్లు వితర్కించుకొనియెను. 'దుస్తంత్రములకు బోక తప్పనిసరియైనది. అట్లయినమాత్రము కార్యసాధన మెట్లు? ఐనను రమను చేపట్టుట యంతదుర్ఘటమైన కార్యము కాదనుకొనియెను. మహమ్మదీయులు రేపు వచ్చి పట్టణమును ముట్టడింతురని వర్తమానము పంపెదను. తత్క్షణమే యామె నాకడకు రాఁగలదు. అప్పుడు నే నేమిచెప్పిన నందులకెల్ల యొడఁబడితీరవలయును. కాని నేనీమెను ఎక్కడికి గొనిపోవుట? రాయలరాజ్యపుసరిహద్దులలో ఒక్కని ముఖమైన నుండరాదు. ఆతఁడు వచ్చువఱకైనను నిలువరాదు. ఈసంగతి తెలిసిన, ఉత్తరక్షణముననే, చంద్రచూడుఁడు నాతలఁ దఱిగించుటకు హుకుము సేయును. మృణ్మయుఁ డాహుకుమును అమలు జరుపును. రాయలసరిహద్దుదాఁటి యాతనికందకుండ నుండుస్థలములకుఁ బోవలయు. ఆస్థలములన్నియు నిప్పుడు మహమ్మదీయుల యధీనమునందున్నవి. వారికి నే ననిన సవతితల్లిప్రేమ. మొన్న మొన్న నేకదా

వారిహుకుము నుల్లంఘించి జెయిలుఖానాలో నుండి తప్పించుకొ ని వచ్చితిని. వారిరాజ్యమున నడుగుపెట్టుటయే తడవుగ నన్ను బట్టి బంధించి బ్రతికియుండఁగనే నాచర్మ మొలిచివేయుదురు. తోరబు ఖానుని నాశ్రయించుట యొక్కటియే శరణ్యముగ నున్నది. ఆతని యనుగ్రహము సంపాదనయయ్యె నేని రమను చేపట్టుటయును, ప్రాణము దక్కించుకొనుటయుకూడ చేకూరును. ఔనౌను. ఇదియే మంచియుపా యము. దీని నెట్లైన నిర్వర్తించెదను."



పదియవ ప్రకరణము.

భూషణపురంబున హీనజాతిమహమ్మదీయులలో బందే అల్లీ అను వాఁడొకఁడు కలఁడు. ఆతఁడు గౌరవముగ పెద్దకుటుంబములోఁ జేరిన స్త్రీని చెఱిచి తనక్రిందనుంపుడుకత్తెగ నుంచుకొనియెను. భర్త భార్యను తిరుగగొంపోవఁ బ్రయత్నింపఁగా బందే అల్లీ రావణుఁడు సీతను గొం పోయినట్లు బలవంతముగ నామెను గొనితెచ్చెను. ఇప్పు డాతఁడు మ హమ్మదుపురమునకు వచ్చి భార్యతోఁ గాఁపురమున్నవాఁడు. ఈసంగతి గంగారాముఁ డెఱుఁగును. ఆతనికి రాయలసైన్యమున నీతఁ డుద్యోగ మి ప్పించెను. గంగారాముని కాతఁడనిన ఎంతో నమ్మకము. ఇప్పు డాత నిని తోరబుఖానుని యొద్దకు వేగునఁపఁ బంపెను. ఆతనిపరిముఖమున గంగారాము చంద్రచూడుఁడు మోసగాఁడని ఫౌజుదారునికి చెప్పిపం పెను. ఫౌజుదారునకుఁ దాను మహమ్మదుపురము స్వాధీనము చేయుదు నని చంద్రచూడుఁడు చెప్పినది వట్టిదగామాట యనిచెప్పిపంపెను. రాయలు వచ్చువఱకు తాను కాలము గడుపవలెనని చంద్రచూడుని యు ద్దేశ్యమనియును, రాజధాని చంద్రచూడున కీయవలెనని యున్నను అట్టిపని యాతనిచేతఁ గాదనియును, చెప్పెను. రాయలుగూడ అట్టిపని చేయలేఁడు. పట్టణము స్వాధీనము గావలెననిన గంగారాముఁ డొక్కఁ డు మాత్రమె చేయఁగలఁడు. అందులకుఁ గావలసినషరతులన్నియును తనతోడనే మాట్లాడుకొనవలయును. తాను స్వయముగ వచ్చి ఫౌజు దారునితో సమ్ముఖమున మాట్లాడఁగలఁడు. కాని కొలఁదికాలముక్రింద

టనే తాను మహమ్మదీయులపై తిరుగబాటు చేసినందున ఫౌజుదారునెదు టికి బోవ జంకుచున్నాఁడు. ఫౌజుదారుఁడు అభయహస్త మిచ్చిన యెడ తానే స్వయముగఁ బోవును.

ఈసంగతులన్నియును, బందే అల్లీకి బోధించి లిఖితపూర్వకమైన ప్రత్యుత్తరము గొని రమ్మనిపంపెను. "నాకు లిఖితమిచ్చుటకు ఫౌజు దారునికి నాయందు నమ్మకమేది?" అని బందే అల్లీ చెప్పెను.

గంగా.—"నాకు ఉత్తరము వ్రాయుటకు ధైర్యము చాలకున్నది. నాయీముద్రిక నీతోడఁ గొనిపొమ్ము? నాముద్ర నీయొద్దఁజూచె నేని ఆతఁడు నీమాటలు నమ్మును."

బందే అల్లీ గంగారాముని ముద్ర చేతఁబట్టుకొని భూషణపురము నకరిగెను. ఫౌజుదారుని కొలువులోఁ గొంద అతనికి పరిచయస్థు లున్నా రు. ఫౌజుదారు కచ్చేరీలో కార్కూన్ శాఖలో భక్షీయుద్యోగమున నున్న, చరగల్లీ ఇతనికి స్నేహితుఁడు. ఆభక్షీని తానుస్వయముగఁ గొ న్నిసంగతులు మాట్లాడు కొనవలసి యున్నదనియును, ఫౌజుదారు దర్శ నము చేయింపుమనియును వేఁడుకొనియెను. భక్షీ కార్కూనులు ఫే ష్కారుని వేఁడుకొనిరి. సందర్శనము లభించినది.

బందే అల్లీ తనదౌత్యమును విశ్వాసయోగ్యముగ నెఱవేర్చి వ్రాఁతపూర్వకమగు ఉత్తరువిమ్మని యడిగెను. శోరబుఖాను కొండొక యోచించి గంగారాము తనచేతిలోఁజిక్కి పాఱిపోయిన వాఁడయ్యును ఆతని కూరకయే క్షమార్పణ యొసంగుటవలన ప్రత్యవాయ మేమియు లేదని తలంచెను. అంత తనస్వదస్తూరీని "నిన్ను క్షమించితిమి. రేపు రాత్రి నీవు మాకడకు రావచ్చును." అని లేఖయొకటి వ్రాసియిచ్చెను.

బందే అల్లీ భూషణపురము విడచివచ్చెను. లక్ష్మీనారాయణస్వా మి దేవాలయమున మాపాఠకులు చ్చాందపహాయను ఫకీరు నొకని గనియుండిరి. ఆతఁడును బందే అల్లీయును, ఇద్దఱును ఒక్కపడవలోనే దాఁటిరి. ఫకీరును, బందే అల్లీని సంభాషణకు దిగిచి నీవెచ్చటికి బోయి తివి అని యడుగ భూషణపురంబున కని యాతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. అంత ఫకీరు భూషణపురంబులోని వార్తలడిగెను. ఫౌజుదారునితో తా ను స్వయముగ మాట్లాడివచ్చుటచే బందే అల్లీ కొక ప్రసిద్ధివచ్చెను.

భూషణపురసమాచారములు మాట్లాడుటలో ఆతఁడు తన తలకుమించిన సమాచారములఁదెచ్చి కొత్వాల్, భక్షి, మున్షి, కార్కూన్, ఫేష్కార్, మున్నగువారినిగూర్చియే గాక, ఫౌజుదారునికూడ గూర్చి ముచ్చటించెను. ఫకీరు నివ్వెరపడసాగెను. ఆతఁడు రాయలక్షేమము గోరినవాఁడు. అందువల్ల నీతనికడనుండి ధైర్యమైన కొంత యీగడ దీయవలెనని నిశ్చయించుకొనెను.

---

## పదునొకటవ ప్రకరణము.

గంగారామునకు ఫౌజుదారుని రహస్యసందర్శనము సంఘటిల్లెను. ఫౌజుదారుఁ డాతని నేవిధముగను భయపెట్టిన వాఁడుకాఁడు. తత్కారణమున ప్రాముఖ్యమైన విషయములన్నియును ఫలప్కారమైనవి. ఫౌజుదారు కోటముందటవచ్చి విడియఁగనే గంగారాము కోట స్వాధీనము సేయుట కొడంబడియెను. ఫౌజుదారుఁడు "కోటగుమ్మమువ ఱకును, మేము మాభుజబలంబునఁ ద్రోసికొని వచ్చినప్పుడు ఆకోట లోనికి మాకు నీవు ప్రవేశము గలిగింపవలయు మృణ్మయుఁడు సైన్యాధిపతి తొంబదితొమ్మిదిపాళ్లు మేము నది దాఁటకుండఁగనే యాతఁడు మమ్ము అడ్డుకొట్టఁగలఁడు. అప్పుడు యుద్ధముగాక తప్పదు. జయమో అపజయమో కలుగకమానదు. విజయమే చేకురునేని నీసహాయము మక్కరలేకయే కోట మాకు వశమగును. అపజయము కలిగిన కోట మాకు స్వాధీనపడియు ప్రయోజనము లేదు. దీని కేమందువు?"

గంగారాము—భూషణపురమునుండి మహమ్మదుపురమునకు రెండు దారులున్నవి. ఉత్తరద్వార మొకటి, దక్షిణద్వార మొకటి. దక్షిణద్వారము వెంబడి నొకచోటుకు వచ్చిన అచ్చట నదినిదాఁటవలెను. అచ్చటనుండి మఱికొంతదూరమునకుఁ బోయినగాని కోట కనుపడదు. ఉత్తరద్వారమునుండి వచ్చిన కోటగుమ్మము వద్దకే రావచ్చును. మహమ్మదుపురముపై దండెత్తు సామాన్యముగ దక్షిణద్వారమున వత్తురు. కోటకెదురుగ నదినిదాటుట కష్టమని యెంచి మీరు దక్షిణముఖమున వత్తురనిన మృణ్మయుఁడు దక్షిణముఖద్వా

రమున సేనలను నిలువుకొని మీకొఱకై యెదురుతెన్నులఁ జూచుచుండును. అప్పటికి కోటలో నిలువ సైన్యమేమియునుండదు. మీరు రెండవ మార్గమున అనాయాసముగఁ గోటలోఁ బ్రవేశింపవచ్చును.

ఫౌజుదారు—ఆతఁడు దక్షిణద్వారమున వచ్చుచుండ నీసంగతి యాతని చెవినిబడినచో తనసైన్యములను, రెండవప్రక్కకు మరలింపఁడా?

గంగారాము—అట్లైన వారు పనికట్టకుండ సగముసైన్యము ఈతట్టు నుండియు, సగముసైన్యమాతట్టునుండియుఁ గొనిరారాదా? సైన్యమంతయును, రాత్రి బయలుదేరఁదీసి దూరముగ నెక్కడనో పొదలమాటున సైన్యమును డాఁచియుంచిన మఱియు మేలు. మృణ్మయుఁడు తనసైన్యములఁగొని కొంత మేఱఁ జనియెనేని మీపని సుకరముగ సమకూరును. ఆకల్పకమున మృణ్మయుని సైన్యము నడుమ జిక్కుకొనుటచే సులభముగ నపజయము నొందును. ఫౌజుదారుని కీయుపదేశము చక్కగ నచ్చినది. అందుల కంగీకరించి సంతోషమునఁ జనియెను.

ఫౌజుదారు—సరి. తెలిసినది. నీవు మామేలుకోరియే పని చేయుచుంటివి. మావలన నేదియేని మోహనతు నొందవలయునని నీతలంపయి యుండును. నీ కేమి కావలయునో కోరుము.

గంగా—నల్దిపరగణా నాకు జాగీరుగ దయ సేయుఁడు.

ఫౌజు—హిందువుల చేతిలో ఇంత నేల నుండనీయము. నీకువలయు నెడల నిన్ను (సిఫాహస్ లార్) సైన్యనాయకునిగ నియమించి మూఁడూళ్లు పన్ను లేకుండ ననుభవింప నిత్తుము. ఇంకేమైన సొమ్ము కావలయునేని కోరుము? ఇచ్చెదము.

గంగా—ఇదియే పదివేలు. కాని నాకింకొక కోరికయున్నది. రాయల కిద్దఱు భార్యలున్నారు.

ఫౌజు—వారు నీదాఁకవత్తురా? నవాబుగారి భోగమునకు వలదా?

గంగా—పెద్దయాపెను మూర్షడాబాదునకుఁ బంపవచ్చును. చిన్నయాపెను ఈసేవకుని కొసంగుఁడు.

ఫౌజు—పరిహాసద్యోతకముగ రాయలభార్యజోలి నీ కేల ? రాయలు యుద్ధమున అపజయము నొందుననుకొందము. హిందువులలో పునర్వివాహము లేదే. నీవు మహమ్మదీయుఁడ వైనచో ఆమెను "నిక్కా" చేసికొనవచ్చునే.

గంగారాముని కీయుపదేశము చక్కఁగాఁ గనఁబడినది. తాను మహమ్మదీయమతము పుచ్చుకొని ఫౌజుదారుని సహాయమున రమకు గూడ ఆమతమిప్పించి ఆమెను పెండ్లియాడినయెడల రాయలు బ్రతికియున్నను, ఆతని బాధ ఏవిధముగను లేకుండఁబోవును. ఏయంత రాయము లేకుండ నామెతోఁగూడి సుఖమును చూఱఁగొనవచ్చును.

గంగా—నిశ్చయముగ నా కీనడుమ మహమ్మదీయ మతమసిన గొంచెము నచ్చుచున్నది. కాని రమ నాకు లభ్యమగు వఱకును, నేనా మతమును పుచ్చుకొనఁ జాలను.

ఫౌజుదారుఁడు మందహాసము సేయుచు "సరిగాని ఈ రమ ఎవ్వరు ? రాయలచిన్న భార్యయా ? ఆమెదొరకినఁగాని నీకుముక్తి లేని యెడల ఆమెనుతప్పక సికొసంగెదము లే? అందులకయి నీవు విశేషముగ ఆత్రపడఁబోకుము. ఇంకొకటి చెప్పుము. రాయలకడ విశేషముగ ద్రవ్యమున్నదఁట. దానినిఁ బూడ్చి పెట్టినారఁట. నీ వెఱుఁగుదువా ?

గంగా—అట్లే చెప్పుకొందురు.

ఫౌజు—నీవాని క్షేపము మాకు చూపలేవా ?

గంగా—నేను స్థలనిర్దేశము చేయలేను.

ఫౌజు—ఈలోపల దర్యాప్తుఁ జేయుము.

గంగా—ఇప్పుడు నేను దర్యాప్తుఁ బ్రారంభించితినేని నాయందు వారి కుండెడు నమ్మకము చెడును.

ఇంక ఫౌజుదారేమియును చెప్పలేదు. గంగారామునకు మనస్సునందు ఆయాసమంతయునుపశమిల్లెను. తిన్నగ బయలుదేరి మహమ్మదుపురమునకు వచ్చెను.

చాందషహాఫకీరు గంగారాముని పోకడఁబసిగట్టి తిరుగుచున్నాఁడేమో యని ఆతని కిసుమంతయును దెలియదు. మరుచటి యుదయమున చంద్రచూడుఁడును, షహాఫకీరును, రహస్యముగ సమావేశమైరి.

ఫకీరు—నేనిప్పుడు నీకొక శుభవర్తమానమును దెల్పెదను. మహమ్మదీయులు విజయముం గాంతురు.

చాందపహా హిందువులను మహమ్మదీయులను సమభావముతో జూచునని చంద్రచూడుం డెఱుంగును. ఆతండు జాతిభేదము పాటించువాండుకాండు. న్యాయపక్షమే యాతని కనుసరణీయము. రాయలనిన నాతని కనుగ్రహము. ఫకీరుని భావము చంద్రచూడునకు బోధయైనది కాదు.

చంద్ర—మీమాటలు నాకు బోధపడుట లేదు.

పహా—బోధపడుట కే మున్నది. హిందువులుకూడ మహమ్మదీయులకే సహాయ మొనరించుచున్నారు.

చంద్ర—కొందఱు మహమ్మదీయులు చేయుచున్నారను మాట నిశ్చయము.

పహా—మహమ్మదీయులుగారు మీలో మీరే.

చంద్ర—మీమాటలు నాకేమియు నర్థమగుట లేదు.

పహా—మీరనిన మీరే స్వయముగం జేయనక్కర లేదు. గంగారాముం డెవ్వండు? మీనగరనాయకుండు కాండా?

చంద్ర—గంగారాము స్వచ్ఛమైన హిందువుండు. రాజుగారి కాతని యెడ మంచి నమ్మకముగూడ నున్నది.

పహా—అందుననే కాంబోలు రాత్రి భూషణపురమున కేంగి తోరబుఖానుని సందర్శించి వచ్చినాండు.

చంద్ర—ఏమీ? నీకెవ్వరు చెప్పినారో కాని అది నేను నమ్మను.

పహా—“నేను భూషణపురమునకు ఆతని వెన్నంటిపోయి వచ్చినాను. నమ్ముదువా?”

అనిచెప్పుచు చందాపహా యదృశ్యుం డయ్యెను. చంద్రచూడున కేమియును దోంచక కన్నులు తెలతెలవైచుచు చూడసాగెను. ఆతని బుద్ధివైశద్యమంతయును, ఒక్కుమ్మడి యంతరించెను.

---

## పంద్రెండవ ప్రకరణము.

చంద్రచూడునకు కొంతసేపటికా నిశ్చేష్టతనుండి మఱల యప్పటి వివేకము బయలుపడ నాతఁడు దానికి ప్రతిక్రియ యేమని విచారింపసాగెను. గంగారాముని యధికారపరిచ్యుతుంగావించుటయో, ఆతనిఁ బట్టి బంధించుటయో, తప్ప యెందు వెరవుఁ గానఁబడదయ్యెను. దీనినిఁ గావించుట యెట్లు? ఆతఁడు తిరుగఁబడిన నేమిగతి? నగర సైన్యమంతయును ఆతని యధీనమందుండుటచే ఆతఁడే యీతని బందిగమునఁ ద్రోయునేమో? మృణ్మయుని సహాయ మపేక్షింపక గంగారామునిఁ బట్టుకొనఁ బ్రయత్నించుట నిష్ప్రయోజనము. అట్టి గంగారాముఁడే రాజవిద్రోహమున కొడఁగట్టినాఁడె. మృణ్మయునిమాత్రము నమ్ముటెట్లు? జాగ్రత్తగనున్నవాని కెప్పుడును, చెరుపులేదు. ముందువెనుక లాలోచించుటయె యుక్తము. అంతకును మించి విపత్తువచ్చిపడియెనా ఆపైని శ్రీమన్నారాయణుండున్నవాఁడు. తొలుదొల్త గంగారాముని యుద్దేశ్యమేమియో కనిపెట్టవలయు? ఈ యుద్దేశ్యము మనసునఁ బెట్టుకొని చంద్రచూడుఁడు తగిన వారలనందఱను సమావేశము చేసెను. ప్రొద్దుఁగ్రుంకునప్పటి కాతని గూఢచారివచ్చి ఫౌజుదారుని సైన్యము మహమ్మదుపురముపైకి దక్షిణద్వారమున వచ్చుచున్నదని చెప్పెను.

చంద్రచూడుఁడు మృణ్మయ గంగారాములకు వర్తమానమంపెను. వారురావేగమే యుద్ధక్రియాయోజనల కొకసభ యేర్పడెను. మృణ్మయుఁడీరాత్రి సైన్యములఁగొని దక్షిణమార్గమునఁబోయి మహమ్మదీయుల బలము నదినిదాఁటకుండ వలయుప్రయత్నము చేయుటకై నిశ్చయింపఁబడెను.

చంద్రచూడుఁడు—"గంగారాముఁడుగూడ మృణ్మయునికి తోడయిపోయిన బాగుండునేమో?" అనెను.

ఆమాటకు గంగారాము నిరుత్తరుఁడయి మృణ్మయుఁ డేమిచెప్పునోయని అతని మొగమువంక చూడసాగెను.

ఈమాటకు మృణ్మయున కొక్కింత కష్టముగానుండెను, "గంగారాము లేకుండ నేనొక్కఁడను నిల్చిపోరలేనా? మంచిది అతనినొక్కనినే బోవనిండు" అని మృణ్మయుఁడు పల్కెను.

గంగా—నేనుబోయిన కోటఁ గాచువా రెవ్వరు ?

చంద్ర—అందులకు సమర్థుఁ డగు వాని నొకని మృణ్మయుఁ డేర్పఱ చునులే ?

గంగా—నగరముగాచుబాధ్యత నాపైనున్నది. కోట నే విడువనోప.

చంద్ర—అట్లైన కోటను నేను స్వయముగనే సంరక్షించెదను, పొమ్ము.

గంగా—నీవు సంరక్షింపఁగలవు గాని నాకొప్పగించిన పనినె నే చేయ వలెను.

అందుపై చంద్రచూడున కనుమానము హెచ్చి నీచిత్తము వచ్చినట్లు చేయుమని చెప్పెను.

యుద్ధమునకు సన్నాహములు ప్రారంభమయ్యెను. మృణ్మయుఁడు సైన్యములతో సమరాయత్తుఁడయ్యెను. అతఁడు తత్క్షణమె దక్షిణ మార్గమున సైన్యసమేతుఁడై యరిగెను. కోటఁగాచుటకుమాత్రము కొందఱిని దిగవిడిచి పోయెను. ఈదిగబడ్డ సైన్యములుమాత్రము గంగా రామునియధీనమున నున్నవి.

ఈ యుద్రేకసమయమున పాఠకులు రమ యెట్లున్నదో, యొక్కింతఁగనుఁగొనియెదరా ? శత్రుసైన్యము దండెత్తి వచ్చుచున్నదను సమాచారమందఱిచే వినఁబడినట్లె యామె చెవినిఁగూడఁబడినది.

మురళి.— " అమ్మా ! మీతండ్రిగారి పంచకుఁబోయి ప్రాణము నిలుపు కొనఁ బ్రయత్నపడుఁడు." అని చెప్పెను.

రమ.— " అప్రతిష్ఠపాలగుటకన్న చచ్చిన నిచ్చటనే చచ్చుటమేలు. నీవొక్కసారి గంగారామునికడకుఁ బొమ్ము. ఆతఁడు నాబిడ్డనుగాచి కాపాడెద నని యభయహస్తమిచ్చియున్నాఁడు.అతని కీ వాగ్దానము జ్ఞాపకముచేసి, సమయమునకువచ్చి, బిడ్డను గాపాడుమని చెప్పుము.ఆయు నూత్రైనను నూఱ్ఱైనను ఆతని మొగము మాత్రము నేను జూడ ననికూడ చెప్పుము. " అని మురళికు నియోగించి కలవరము జెంది యున్న తనమనమును శాంతింపఁజేసికొన రమనంద గృహమున కరి గెను. ఆరాత్రి కోటలోనివా రెవ్వరును పక్కలు పరువ లేదు.

ము. గంగారాముని వెదకికొనుచు బోయెను. గంగారాముఁడు తనగదిలో నొంటరిగనుండి యేదియో గాఢముగ నాలోచించుచుండెను. రత్నములు దొరుకునను నాశతో నాతఁడిప్పుడు సముద్రమునకు ఛాలునను కొనుచున్నాఁడు. మరలగట్టునకు నీదుకొని రాఁగలఁడా? ఎంత గట్టిమనసువాఁడైనను, తన కార్యసాధనముకుపాయము గనిపెట్టలేకపోయెను. అట్టి స్థితియందున్నవారందఱును గూడ భగవంతునిపై భారము వైచి సర్వము నాతనికే విడచెదరు. గంగారాము అదికూడ చేసినాఁడు కాఁడు. దుర్మార్గకృత్యముల నిర్వహణములకు భగవంతుఁ డెప్పుడు తోడు పడఁడని యాతఁ డెఱుంగును. అట్టిదుర్మార్గునకు జగత్పిత పరమశత్రువని యును నాతఁడెఱుఁగును. అందువలన గంగారాము మతిచెడి యేమియో యోచించుచుఁ గూర్చుండెను.

మురళి గంగారామునికడకుపోయిన తరుణ మిది? పోయి యా వార్త నివేదించెను.

గంగారాము:—ఆమె సెలవయ్యేనేని, ఈక్షణముననేనేపోయి యాబిడ్డను గొనివత్తును.

మురళి:—అదికాదు. మహమ్మదీయ బలము కోటబట్టుకొనిరేని, ఆసమయమునవచ్చినీవు బిడ్డనుసంరక్షింతువని యామెయూహ.

గంగా:—అప్పుడేమి కానున్నదో యెవరు చెప్పఁగలరు? ఆమెబిడ్డసురక్షితముగానుండవలయునను కోరికే ఆమెకుండెనేని, ఆబిడ్డను ఇప్పుడే నా కొప్పగింపుము.

మురళి.—బిడ్డను ఇప్పుడుస్వాయి నేను తెచ్చి నీకొప్పగింతునా?

గంగా.—నేనుపోయి ఆమెతో నెన్నియో మాట్లాడవలయును.

మురళి—ఆమాటలు తరువాత మాట్లాడవచ్చులే.

అని చెప్పి మురళి యాతనిని వెక్కిరించుచు అందుండి తరలి పోయెను. గంగారాముని నివాసమువిడచి రాజవీధిలోనికిఁ బోయినది. ఆమె మందహాసమంతయు నొక్కసారి యదృశ్యమయ్యెను. భయమను కాఱుమేఘ మొకటివచ్చి యామెవదనము నాక్రమించెను. ఆమె యెట్టయెదుట కరముల త్రిశూలములు ధరించి అగ్నిజ్వాలవలె దేహమంతయును గ్రమ్మియున్న తేజఃపుంజముతో నొప్పు భైరవీరూపములు

రెండు ఆమెకంటఁ బడినవి. మురళి వారిని శాంకరీసహచారిణులుగ భావించి కరకమలములు జోడించి వారికి సాష్టాంగనమస్కారములఁ జేసి వారి యెట్టయెదుట మాటలేకుండ నిలువఁబడియెను.

అందొక భైరవి. "నీవెవ్వరు?" అనియడిగెను. మురళి అతిభక్తితో నేను మురళి నని చెప్పెను.

భైరవి—మురళి యనిన మాకు తెలియదు. నీ వెవ్వరు.

మురళి—రాజుగారి చిన్న భార్యకడ దాసిని.

భైరవి—ఇట్టి యపరరాత్రివేళ నగరనాయకునియింటికడ నీవేమిపనికిఁ బోతివి ?

మురళి.—మహారాణి నన్నంపినది.

భైరవి.—దూరముగ నొకదేవాలయమున్నది. కనపడుచున్నదా ?

మురళి.—ఆ కనుపడుచున్నది.

భైరవి.—అందాఁక మాతోఁగూడ రమ్ము.

మురళి.—మహాప్రసాదము.

పిమ్మట భైరవులిరువురును చేరి యొకప్రక్కనుండి మురళను దేవాలయమునకుఁ గొనిచనిరి.

---

## పదునాఱవప్రకరణము.

చంద్రచూడున కారాత్రి నిద్దురయే లేదు. ఆరాత్రి నగరమంతయును తిరిగినాఁడు. పుర మరక్షితమై యున్నయది. గంగారాముని ఇదియేమని యడుగ పట్టరానికోపోద్రేకమున నాతఁడు ప్రతివచనం బిచ్చెను. అందుపై గంగారాముని నేల బంధింపకపోయితిననియును, ఈవిపత్తు తానే తెచ్చిపెట్టితిననియును, పరితపించుచు దర్భాసనమునఁ గూర్చుండి సర్వరక్షకుఁడును, సర్వానర్థనివారకుఁడును, క్రూరదైత్యసంహారకుఁడు నగులోకపాలునిగూర్చి ధ్యానింపఁజొచ్చెను. ఒకక్షణము సైనికులఁ గొందఱఁ బ్రోగుచేసి గంగారామునిఁబట్టి బంధించి నగరరక్షణకు నింకొకనిని నియోగించిన బాగుండు నని యనుకొనును. ఆయుత్తరక్షణముననే "ఏమిచేయను సైన్య మాతని యధీనముననున్నది. ఆవిధమగు ప్రయత్నమేదియును, ఫలింపదు. మృణ్మ

యునకు సైన్యమందఱును స్వాధీనులు. ఆతఁడుండిన కొంతవఱకు లాభ కారియై యుండును. మృణ్మయునిపనుచుటవలనకూడ కొంతయనర్థము వచ్చెను" అనుకొనును. అందులకు తానే కారకుడఁనని, పరితపింపఁజొచ్చెను. అందువలన మనస్సంతయును, వికలతనొంది యేయోచనయును దోఁచక అసురాంతకుండగు నా శ్రీహరినిఁగూర్చి ధ్యానించుచు తదేకనిష్ఠం బ్రబణమిల్లెను. ఆగంతుకముగ నత్యంత తేజోమూర్తియగు భైరవి యొక ర్తుక చేత త్రిశూలమునుదాల్చి యాతనియెదుట వచ్చినిలచెను. అద్భుతప్రవిష్టుఁడై చంద్రచూడుఁడు "జననీ ! నీవెవ్వరు" అని యడిగెను.?

భైరవి.—వత్సా ! శత్రువులు ద్వారముకడ నున్నారు. కోటఁగాచున్నావాము లేమియు గన్పడవు. ఏమిపాపమిది ?

శ్రీ మురళితో ముచ్చటించెను. యయంతి చంద్రచూడునికడకువచ్చెను. చంద్రచూడుని యాశ్చర్యము మఱింత హెచ్చయ్యెను.

చంద్ర—తల్లీ ! నీవీ రాజ్యమును సంరక్షింపవచ్చిన దేవదూతవలెనున్నావు, నిజమేనా ? అనియడిగెను.

యయంతి—ఆమాటయటుంచుము. నా ప్రశ్నకు త్తరమిమ్ము లేకున్న సర్వమును చెడిపోవును.

చంద్ర—తల్లీ ! నాకు నడుము గ్రుంగిపోయినది. నగరరక్షణము రాజు నగరనాయకునియందు పెట్టి పోయినాఁడు.ఆతఁడు తనవిధ్యుక్తధర్మముల విస్మరించినాఁడు. సైనికులు నన్ను లక్ష్యపెట్టరు. నీవేమిచేయుమన్న నదియెల్లఁ జేసెదను.

యయంతి—ఆతనిప్రచారము లేవియు నీ వెఱుఁగవా ? ఆతనిరాజవిద్రోహము నీకెఱుకపడలేదా ?

చంద్ర.—ఆఁతడు శోరబుఖానుని యొద్దకు పోయినాఁడనియును బహుశః కోట నాతనికి స్వాధీనము జేయునఁ యును మాత్రము విన్నాను. అవ్యక్తుఁడనై ముంను కావు కాచుకొనలేకపోయినాను. తల్లీ ! నిన్నీ రాజ్యమునకు ఇష్టదేవతగ సంభావించుచున్నాఁడను. అత్యంత కటాక్షమున నీసేవకునికడ సుప్రసన్నవైతివి. నాదేహమునందలి ఈ తేజస్సు అంతరింపకుండఁ జేసి,తల్లీ! నీరాజ్యమును నీవు కాపాడుకొను

ము. అని యత్యంతభక్తి తాత్పర్యములు నెలకొన చంద్రచూడుఁడు హస్తపద్మముల జోడించి యయంతికి సాష్టాంగపడియెను.

అంత యయంతి "ఈరాజ్యమును నేనే స్వయముగఁ గాచెదను. భయపడకుము" అని చంద్రచూడునకు ధైర్యము చెప్పి యచ్చటినుండి తరలిపోయెను. యయంతికి కూడ నెక్కువధైర్యమువచ్చెను. శ్రీ వెలుపటఁ గాచి యున్నది. వారిరువురును గలసి గంగారాముని నివాసమునకుఁ బోయిరి.

---

## పదునాలవ ప్రకరణము.

మురళి వచ్చిపోయినవెనుక గంగారామునిస్థితి మఱింతదుస్థితిలోనికి వచ్చినది. ఎవరినిమిత్తమై తాను విపదంబుధిలో మునుఁగనున్నాఁడో, ఆమెకు తనయందు మోహము లేనట్లు కనుపట్టెను. ఆతఁడిప్పుడు కన్నులు మూసికొని సముద్రమున మునుఁగుచున్నాఁడు. అందు రత్నములున్నవో, నత్తలున్నవో, తెలియదుగాని, ఈతఁడు మునిఁగిపోవుట నిశ్చయము. సర్వము నంధకారమయముగఁ దోచుచున్నది. ఇప్పు డాతని రక్షించువారెవ్వరు?

ఇట్లుండఁగ గంగారాముఁ డులికిపడెను. తనగుమ్మముకడ చేత త్రిశూలమొకటి ధరించి దేహమంతట తేజఃపుంజములు గ్రమ్మికొన భైరవి యొకర్తు ఆతనికంటఁబడెను. ఆమె దేహమున నాక్రమించిన తేజఃపుంజము గదిలో వెలుంగుచున్న దీపపుఁగాంతిని అధఃకరించెను. ఆమెను భవానీదేవతఁగ నెంచి గంగారాము సాష్టాంగపడి, మురళిపుస్తకమునుండి యొక యాకునుదీసి నమస్కరించెను. లేచినిలువఁబడి కరకమలములు జోడించి "తల్లీ! ఈసేవకుని కేమి యనుజ్ఞ?

యయంతి—వత్సా! నిన్ను నేనొక వరమడుగ వచ్చితిని.

గంగా—జననీ! భవదిచ్ఛ శీఘ్రముగ నెఱవేరఁగలదు. ఆజ్ఞయైనం జాలును.

యయంతి—ఒక బండి గుండ్లును, మందును, ఒకతుపాకియు నొసంగవలయు.

ఈమె యెవ్వరో గంగారామునికి బోధపడినదికాదు. ఏమిచేయుటకునుగూడ గంగారామునికి దోఁచకుండెను.

గంగా—తల్లీ! ఈగుండ్లును మందును నీకేమి ప్రయోజనము?

యయంతి—అమ్మగారియాజ్ఞ యయినది. దేవతలకు వానితో పనివచ్చినది.

గంగారామున కనుమానము హెచ్చయ్యెను. ఆమె నిజముగ దేవతయే యైనయెడల, మందుగుండు సామానులతో ప్రసక్తియేమి? మనుష్య కాంతయేయైన, తా నామె కట్టి మందుగుండు సామానులియ్యనవసరమేమి? ఈతరుణిగూడ చారిణియేమో యెవ్వరికెఱుక, అని యనుకొనుచు గంగారాము వితర్కించుకొని "దేవీ! నీవెవ్వరు? అనియడిగెను.

యయంతి—నేనెవ్వరయిన నీకెందులకు? రమను గూర్చిన యావద్వృత్తాంతమును, నాకు విదితమైనది. నీవు భూషణపురమునకు పోయివచ్చినదికూడ నాకు తెలిసినది. నాకుఁగావలసిన దెల్లయిచ్చెదవా? లేక ఈత్రిశూలముతో నిన్ను పొడిచి చంపనా?

అని భైరవి యత్యుత్సాహంబున త్రిశూలంబును త్రిప్పుచు గంగారామునిపై నప్పళింపఁ దొడఁగెను.

గంగారాముని ధైర్యము సడలెను. "నాతోడఁగూడరమ్ము. నీకు గావలసినదెల్ల యిచ్చెదను." అనిచెప్పి భైరవిని ఆయుధాగారమునకుఁగొని చనియెను. ఆమెకు గావలసినదెల్ల ఇచ్చి, పేరీలాల్ అను శాతఘ్నికు నొకనికూడ ఇచ్చెను. ఇట్లు యయంతిని బంపివేసి గంగారాము కోటలో నెవ్వరును తనయనుమతిలేక ప్రవేశింపకుండ కోటతలుపు వేయించెను.

మందు సామానులు, ఫిరంగివానినిఁగూడ తీసుకొని భైరవులిరువుఱును కోటగుమ్మముదాఁటి, రాజమందిరమున కెదుట నదిలో స్నానఘట్టమునఁ జేరిరి. అచ్చట నొక స్ఫురద్రూపియగు పొడుగుపాటి యౌవనపురుషుఁడు తారసిల్లెను.

ఈ ఇరువుఱు భైరవులలో నొకయామె దూరమున మందుసామానుతోడను, ఫిరంగివానితోడను, వచ్చుచుండెను. రెండవయామె, యా తరుణవయస్కుని సమీపించి యాతనిపలుకరించి నీవెవ్వరని యడిగెను.

వయసుకాఁడు:—నేనెవ్వ రయిననేమి? నీవెర్వరవు?

యయంతి—నీవు వీరుఁడవే యైనచో మందును గుండ్లును ఇచ్చెదము. కోట సంరక్షింపుము.

అందుల కాతరుణవయస్కుఁ డెంతయుని వ్వెరపడి యామె నొక్క దేవతఁగా సంభావించి నమస్కరించెను. అంత నొక్కింతసేపు కన్నులుమూసికొని తదేకధ్యానతత్పరుండై నిట్టూర్పు పుచ్చి యేమియుపయోగ మని యడిగెను.

యయంతి—నీకేమి కావలెను?

పురుషుఁడు—ఈకోటను సంరక్షించుటవలన, నామనోరథఫలము నాకు లభించునా?

యయంతి—ఆ! తప్పక లభించును.

పురుషుఁడు:—ఎక్కడ లభించును. నీవెవ్వరో దేవతవలె నున్నావు, అందువలన నడుగుచున్నాను. ఆపదార్థ మెచ్చట నున్నది? ఈకోట లోనేనా?

యయంతి—ఈకోటలోపలనే నీకు తత్సమావేశముకలుగును.

పురుషుఁడు—ఎప్పుడు?

యయంతి—"కొలఁదికాలములోపలనే" అని యాతని దృష్టిపథంబు నడుండి యంతర్ధాన మయ్యెను.



పదునైదవ ప్రకరణము.

ఆరాత్రి చంద్రచూడునకు కంటిమీఁద ఱెప్పపడలేదని యిదివఱకే చెప్పియుంటిమి. పొద్దుపొడుపునకు పూర్వమే పడకనుండిలేచి యాతఁ డొక మేడపైనెక్కి, చుట్టు నేమి జరుగుచున్నదో యనిచూచెను. ఏటికవ్వలిగట్టున, తానున్న స్థలమునకెదురుగ పడవలుగొన్ని కట్టివేసియున్నవి. గట్టుమీఁద చాలమందిజనులుగుంపుగఁజేరి యుండిరి. ఇంకను వెల్తురు బాగుగ రాలేదు. చంద్రచూడున కచ్చటఁజేరిన జనులెవ్వరో బోధపడినదికాదు. గంగారాముసికొఱకై వర్తమాన మంపెను.

గంగారాము చంద్రచూడుని మేడమీఁదనుండఁగఁ గలుసుకొనెను.

చంద్ర—అద్దరిని అన్ని పడవలున్నవి కారణమేమి?

గంగారా మటు పరికించిచూచి నాకును తెలియదని చెప్పెను.

చంద్ర—ఆగట్టున చాలమందిజనులుకూడ నున్నారు. అన్నిపడవలును, అంతమంది జనమును చేరుటకుఁ గారణమేమో?

గంగా—నేను చెప్పలేను.

ఇట్టిసంభాషణ జరుగుచుండఁగా వెలుతురు బాగుగ వచ్చినది. ఆ చేరిన జనులందఱును సైన్యమని తెలిసెను.

చంద్ర—కొంపమునిఁగినది. మనగూఢచారి మనల మోసపుచ్చియుండవ లెను. లేదా? ఆతఁడే మోసపోయి యుండవలెను. మనసైన్యమును దక్షిణపథమునఁ బంపితిమి. ఫౌజుదారుసైన్య మీమార్గమున వచ్చె ను. మనము పూర్ణముగ నాశనమైతిమి. నాశనమునకన్న నేమున్నది? ఈతరుణమున కోట గాపాడువా రెవ్వరు?

గంగా—ఇంక నేనున్న దెందులకు?

చంద్ర—నీచేతనున్నవారందఱు నెందఱు? భగవంతుఁడు మనకిప్పుడు ప్రతికూలముగ నున్నాఁడు. పైఁగా నీకిప్పుడు కోట రక్షణయనిన; అలక్ష్యముగ నున్నది? మేము నిన్ననీ కీయది స్మరణకు తేఁగా నె మాపైగ్రు డ్లెట్లజేసితివి. ఇప్పు డీవిపత్తున కుత్తరవాదు లెవ్వరు?

గంగా—నీవంతగా జడియఁబోకుము. సైన్యమంత హెచ్చుగా లేదు. ఆపడవలమీఁద నెంతమంది దాఁటగలరు? నేనిప్పుడేపోయి నాబలముతో నేటిగట్టున నిల్చెదను. వారు ఈవలకు వచ్చిన తోడనే తుత్తునుము రు జేసెదను.

సిపాయిలతో కోట గుమ్మము వెలుపలికి పోవ గంగారాము నిశ్చయించుకొనెను

ఫౌజుదారు సైన్యము నిరాతంకముగ దాఁటివచ్చిన పిమ్మట, కోటనుండి వెడలిపోయి మహమ్మదీయులకు కోట సుకరముగ చిక్కుమార్గముచూపవలెనని, యాతని యూహ. వారినెదిరించు ప్రయత్నమీష త్తైనను లేదు. నిన్నరాత్రి యాతనికి కనుపించినది యేదైన భూతమా ఏమి? అప్పటినుండియు మరలఁ గనుపింపలేదే.

చంద్రచూడుఁ డిదియంతయుఁ గనిపెట్టెను. కాని తనకిది తెలిసిన ట్లు మాత్రము నటింపఁడయ్యెను.

చంద్ర—అట్లైన శీఘ్రముగఁబొమ్ము. ఆసైన్యపుఁ బడవలన్నియును లంగరు దీసి బయలువెడలుచున్నవి?

గంగారాముఁడు డాబాదిగి గబగబఁ గ్రిందికిఁ బోయెను. గంగారామున కొడలు కంపమెత్తుచున్నది. ఏఁబది పడవలు. అయిదాఱువందల సిపాయిలు పోలుపుగ వచ్చుచున్నారు. గంగారాముఁ డెప్పుడు తనసైన్యములతో వెడలునాయని, చంద్రచూడుఁడత్యాశతోఁ జూచుచున్నాఁడు. సిపాయిలు సన్నద్ధులగుచున్నారు. వెనుకకు తిరుగుచున్నారు. ముందుకు తిరుగుచున్నారు. నడుచుచున్నారు. బారులుదీర్చుచున్నారు. కాని యింకను బయలుదేరి వచ్చుటలేదు. చంద్రచూడుఁడు తన మనంబున నిట్లని వితర్కించికొనెను. " అకటా ? నేనెంత పసికిమాలినవాఁడను. గంగారాము నేల నమ్మవలెను? ఫకీరుని యుపశ్రుతిఁగొని తగినంతప్రయత్న మేలచేయలేకపోయితిని. ఇంక నాశనము తప్పదు. తేజోరాశి యగునాదేవదూత యేమయ్యెనో ? ఆమెకూడ నన్ను మోసపుచ్చెనా ఏమి? "

చంద్రచూడుఁడు, గంగారాముఁ డేమయ్యెనో చూడవలెనని మేడదిగ నాయత్తపడుచుండెను. అప్పుడొకఫిరంగి శబ్దమాతని చెవింబడెను. అయ్యది మహమ్మదీయుల పడవలనుండి వచ్చినది కాదు. వారికిఫిరంగు లున్నట్లు కూడ లేదు. చంద్రచూడుఁడు కన్నులు బ్రద్దలు చేసికొనిచూచెను. విజయయాత్రికుల పడవలలో నేమూలను పొగ గనుపించలేదు. ఈఫిరంగిశబ్దము వినఁబడినతోడనే శత్రుసైన్యములోని పడవయొకటి మునిఁగినట్లుఁగూడకనిపెట్టెను. అందుండిమునిఁగిన సైనికులు తక్కినపడవలలో నెక్కవలెనని ప్రయత్నించుచుండిరి. చంద్రచూడుఁ డీఫిరంగి మనదైయుండునా యేమి? యనుకొనుచు, నందలి వాస్తవస్థితిఁ గనుఁగొనఁ బదింబదిగ నావైపులకు దృష్టి సారించెను. కోటలోనుండి వెలుపటికి వచ్చిన సిపాయియెవ్వఁడును, గానఁబడఁడయ్యెను. బురుజులపైనున్న ఫిరంగులయొద్దఁ గూడ నెవ్వరును గనఁబడరైరి. ఇంక, ఈఫిరంగిఁగాల్చిన వారెవరైయుందురు?

ఆపొగ యేదిక్కునుండివచ్చుచున్నదో తెలిసికొనవలెనని నలువలఁకులఁ బఱికించెను. రాజమందిరమున కెదుటనున్న స్నానఘట్టము కడనుండి యాపొగలుగిఱ్ఱు గిఱ్ఱునఁ దిరుగుచు వాయుప్రచలితంబు లగుచున్నవి.

చంద్రచూడుఁ డప్పుడు రాజమందిరద్వారము కడ నొకఫిరంగి యున్నట్టు జ్ఞాపకము దెచ్చుకొనియెను. పగవారి పడవ లెవ్వియును, అచ్చట లంగరువేయకుండ రాయలచ్చట నొకఫిరంగి నిలిపెను. అది యే యెవ్వరే నొక రుపయోగించుచు నుండవలయును. ఎవ్వరైయుండును? గంగారాముని సైన్యములోని వాఁడుమాత్రము కాఁడు. కోట గుమ్మము తలుపింకను తెరువనైనఁ దెరువలేదు. మృణ్మయుని సైన్యము లీపాటికి చాలదూరము పోయియుండును. ఈఫిరంగి నిమిత్తమై మృణ్మయుఁ డెవ్వరినేని విడిచియుండునని చెప్పుమాట నమ్మలేము. పైవాఁడెవ్వఁడో వచ్చి కాల్చునను కొనుటకును వలనుపడదు. అట్టివాని కింతగు జేయెట్లు పట్టువడును. అందువలన నియ్యది యెవ్వనిదో అభ్యస్త శస్త్ర విద్యాపారంగతుని చైదమై యుండనోపు. అగుఁగాక. ఆతఁ డెవ్వఁడై యుండును. అనియిట్లు చంద్రచూడుఁడు తనలోఁదాను వితర్కించుకొనుచుండ, భం. భం. భం. అను ఫిరంగిశబ్దమొకటి వాత్యాచక్రమును దొరలించుకొనివచ్చుచు నాతని కన్నులంబడెను. మఱల నాపొగ లా ప్రదేశమునుండియే యేతెంచుచు మఱల నొక్కపడవను ముంచివేసెను. అందులోనున్న సైనికులందఱును, మునిఁగిపోయిరి.

చంద్రచూడున కిది గాంచునప్పటి కెక్కడలేని యానందమును వచ్చి చప్పట్లు గొట్టసాగెను. తప్పక ఈమె యాదేవతయై యుండనోవు. కాళికాశక్తియే కృపఁజేసి భూమిపై నవతరించి యుండు. లక్ష్మీనారాయణస్వామికీ జే కాళీమహాశక్తి కీ జే రాష్ట్రమాతకీ జేఅని కేకలువేయఁ దొడంగెను.

కాని ముందుగ బయలువెడలినపడవలు గట్టుచేరువకు వచ్చి యున్నవి. అందుండి తుపాకులు పేలిన గట్టుపైఁబడును. ఇప్పుడు పడవలలోని సైనికులందఱును తుపాకులను పేల్పసాగిరి. పొగయంతయును గ్రమ్మి సూర్యరశ్మి గనఁబడకుండ పోవుచుండెను. తుపాకులధ్వనిచే చెవులు చిల్లులు పడుచున్నవి. చంద్రచూడుఁడు మనరక్షకుఁ డిప్పు డాకసమునుండి దిగివచ్చిన రానిమ్ము. అతఁడుమాత్ర మేమి సేయఁగలఁడు? మనుజుఁడే యనుకొందము. ఒక్కఁ డేమిసేయనోవు. ఇనుపగుండ్లు వర్షముగురియుచుండ నొకరిద్ద రేమిసేయఁగలరు? ఇట్లు తలంచుకొనుచుండ

మఱల ఫిరంగిశబ్దము వినఁబడెను. మఱల వాతావరణమంతయును ప్రతిధ్వనించెను. మఱలపొగలు, సుళ్లుదిరుగుచు నెగయఁజొచ్చెను. మహమ్మదీయుల పడవ మఱియొకటిమునిఁగిపోయెను. ఇట్లొకపక్షమున నొంటిఫిరంగికిని, రెండవపక్షమున పందలకొలఁది మహమ్మదీయ సేనలకును, ఘోరరణంబు వాటిల్లెను. ఆగర్జానాదమున చెవులు చిల్లులు పడుచుండెను. ఇంద్రుండు పంపకము సేయుచున్న, ఉఱుములధ్వనివలె భయంకరమును తీవ్రమునై శతఘ్నకానినాదము మాటిమాటికి వాతావరణమును భేదించుచుండెను. ఆనది పైభాగమంతయును పొగచే కాఱుగ్రమ్మి మేడడాబాపైనున్న చంద్రచూడునకు గూడ దారుణంబగు ధూమపటలంబునడుమ నచ్చటచ్చట నొకటి రెండు పెద్దపెద్ద కెరటములుతప్ప మఱియేమియుం గనఁబడవయ్యెను. గర్జానినాదము ననుకరించు నాతీవ్రధ్వనినాలకించి హిందూమతమును కాచికాపాడు రక్షకుఁడింకను, నొకఁడుమనకఁడమై యున్నవాఁడని చంద్రచూడుఁడనుకొనెను. ఈయద్భుత సంగ్రామంబెట్టులంతమగునో కన్నులారఁజూడ నాధూమసాగరంబు పాయలిచ్చిన బాగుండునని తెఱపికొఱకై చంద్రచూడుఁడు చూచుచునుండెను.

క్రమక్రమముగ ఫిరంగి సద్దణిగెను. వాయుప్రచారమున ధూమ దృశ్యమయ్యెను. సమరరంగము చంద్రచూడునకు లోచనగోచరంబయ్యెను. మునిఁగిపోయిన పడవలు కెరటముల వడినిఁబడి తలక్రిందుగఁబోవుచుండెను. నదీసలిలోపరిభాగమంతయును ప్రాణములు పోయినట్టియును, ప్రాణావశిష్టముగ నున్నట్టియును, సైనికులకళేబరములచే, గాలివానచేఁ గలగుండువడి పుష్పములును పత్త్రములును, చెల్లాచెదరుగ నుండినవిహారోద్యానము ననుకరించి యుండెను. ఒకఁడు బ్రతికి బైటఁబడవలెనని యీఁదుకొనివచ్చుచుండ నింకొకఁడు వానిని బట్టిదిగలాగిముంచివేయుచుండెను. మునుఁగకుండ నుండినపడవలు, మునిఁగిపోయిన పడవలలోని సైన్యముల నెక్కనంతవఱకెక్కించుకొని ప్రాణములుదక్కించుకొన నావలిగట్టునకు బఱచుచుండెను. దేవేంద్రునియుఱుములచప్పుడుమ్రోఁతకుతాళలేకపఱచు నసురసైన్యముల మాడ్కి మహమ్మదీయ సైన్యమీశతఘ్నికాసంహతికి తాళలేక వెన్నిచ్చిపఱచుచుండెను. చంద్రచూడుఁడు హస్తపద్మములు జోడించి గగనాభిముఖుండై బాష్పజలావృతకంఠధ్వానంబున

"ఓదేవా! శ్రీహరీ! దైత్యసంహారకా! ఆర్తత్రాణపరాయణా! విజయోస్తు. విజయోస్తు." అశ్రుతపూర్వంబగు కృపావృష్టి నేఁడు మాపైఁ గురిపించితివి. నీవు నేఁడే రాష్ట్రసంరక్షణకు దేవదూత వై స్వయముగవచ్చితివి. లేక నీదాసానుదాసుండగు రాయలేవచ్చియుండనోపు. నీయెడ భక్తిప్రపూర్ణుండగు నాతండొక్కండు దక్క ఏమనుజుండు నిట్టియుద్ధమున విజయముఁ గాంచనోపఁడు, అనిభగవంతుని ప్రార్థించుచు చంద్రచూడుఁ డామందిరాగ్రముననుండి క్రిందికి దిగివచ్చెను.



పదునాలవ ప్రకరణము.

తుపాకులశబ్దమును, శతఘ్నికానినాదమును, గంగారాము విని యత్యద్భుతపడి "ఇదియేమి వింత? ఎవరో పోరుచున్నది. ఆదయ్యమా ఏమి? ఆమె నిజముగ దేవతయేమో?" అనుకొనుచు గంగారాము వాస్తవస్థితిఁ గనుఁగొని వచ్చుటకై తన యంగరక్షకునిఁ బంపెను. ఆతఁడు కోటతలుపు తెఱచి వెలుపటికి పోయెను. ఆరోజున కోటగుమ్మము తెఱచుట కదియే ప్రథమము.

జమాదారుపోయివచ్చి "స్వామీ! మహమ్మదీయులు పోరుచున్నారు" అని చెప్పెను. గంగారామదిరిపడి "అది నేనెఱుఁగుదును. మహమ్మదీయు లెవరితో పోరుచున్నారు" అని యడుగుచున్నాను.

జమాదారుఁడు ఎవరితోడను లేదు.

గంగారామునకు నవ్వు వచ్చి.—నీవు వట్టి యవ్యక్తుఁడవు. ఎవరితోడను గాకుండ నెట్లుపోవును? ఆఫిరంగి యెవ్వారిది?

జమాదారు.—నేను ఫిరంగి చూడలేదు. గంగారాము మండిపడుచు,

చూడలేదుసరే. ఫిరంగి శబ్దమైన వినఁబడుటలేదా?

జమా—అవును విన్నాను.

గంగా—ఆఫిరంగి కాల్చునది యెవ్వరు?

జమా—అది నేను చూడలేదు.

గంగా—నీకుఁ గాళ్లులేవా?

జమా—స్వామీ! లేకేమి? ఉన్నవి?

గంగా—అట్లయిన నీకు ఫిరంగి యేలఁ కనఁబడుటలేదు?

జమా—ఫిరంగి జూచినాను. అది స్నానముల రేవుననున్న ఫిరంగి.
గంగా—వానిని గాల్చుచున్న వారెవరు?
జమా—చెట్టుకొమ్మలు.
గంగా—ఓరి పశువా? చెట్లును, చేమలును, ఎప్పుడైన ఫిరంగిగాల్చుట జూచినావురా?
జమా—స్వామీ! ఆఫిరంగిచుట్టును చెట్టుకొమ్మలున్నవి? ఆకొమ్మల క్రింద నేమున్నదియు నెవ్వరికిఁ గనఁబడుటలేదు. అందువలన నాకెవ్వరును గనఁబడలేదు.
గంగా—ఆచెట్టుకొమ్మల నెవ్వరో క్రిందకు దిగలాగి దానిచాటుననుండి యెవ్వఁడో ఫిరంగి పేల్చుచుండు. వాఁడెవ్వఁడో మాత్రము చాలబుద్ధిశాలి. సిపాయిల కాతఁడు గనుపడఁడు. చెట్లుకొమ్మలచాటుననుండి యాతఁడు గుఱిజేయఁగల్గె. ఆచెట్టుకొమ్మలచాటున నెవరున్నారో నీవేల చూడలేదు.
జమా—అది చాల కష్టసాధ్యమైనపని.
గంగా—ఏల?
జమా—వడగండ్లవర్షమువలె నన్నివైపులను గుండ్లవర్షము గురియుచున్నది.
గంగా—ఇంత పిఱికిపందవు నీవు సైన్యమున నేల చేరితివి?

అనుచు గంగారాము దగ్గఱనున్న మఱియొకనిఁ బిలచి యాజమాందారుకడనున్న, కత్తియుఁ, గటారియు, లాగుకొనుమనియెను. యుద్ధము తప్పవి సరియని నిశ్చయమైనపిమ్మట మృణ్మయుఁడు కోటసంరక్షణకై మెఱియలవంటి కొందఱి హిందూస్థానీవాండ్రను నియమించెను. గంగారా మందు నలువురను రావించి "మీరు రాజమందిరద్వారముకడనున్న మెట్లవద్దకుఁబోయి, అచ్చట ఫిరంగిఁ గాల్చుచున్న వారెవరైనఁ గానిమ్ము. ఇచ్చటకు లాగికొనిరండు" అని చెప్పెను.

ఈనలుగురును ఫిరంగిసమీపమునకుఁ బోయెడి సరికి యుద్ధము సద్దణిగెను. బ్రతికియున్న మహమ్మదీయులు పడవలను వెనుకకుఁ ద్రోసికొని పోవుచుండిరి. ఆచెట్లకొమ్మల గుబురుచాటునకు బోయి చూచెడు సరికి అచ్చట నొకపురుషుఁడు చచ్చిపడియున్నవాఁడు. మఱియొకఁడు

నిప్పుతాళ్ళదుచేతఁ బుచ్చుకొని కూర్చుండియున్నాఁడు. ఈతఁడు బలిష్ఠమైన దేహము కలవాఁడు. ఆతఁడు తొడిగికొనిన అంగరకా పొట్టిగ నున్నది. మొగముకనుపడకుండ నెత్తిపైనుండి గడ్డముక్రింద కొకగుడ్డ ముడి వైచికొనినాఁడు. ఆతనిదేహమంతయును, తుపాకిమందుమయమై యున్నది. ఈనలుపురు సిపాయిలు, నాతనికడకువచ్చి పట్టుకొని, యాతనిని "నీవెవ్వరు" అనియడిగి.

పురుషుఁడు—ఏమిరా ! మీకెందులకు ?

సిపాయి—ఇచ్చటనుండి ఫిరంగి నీవేల కాల్చుచుంటివి.

పురుషుఁడు.—ఏమిరా ! మీకేమి అపకారమువచ్చెను ? మీరందఱు మహమ్మదీయుల చేతిలోఁ జిక్కినారా?

సిపాయి—మహమ్మదీయులువచ్చిన మేము వారిని తఱిమియే యుందుము. నీవు వారినెందుకు కాపుచేసితివి? రమ్ము. మా యేలినవారియొద్దకుఁ గొనిపోవుదుము లెమ్ము.

పురుషుఁడు—మీయేలినవాఁ డెవ్వఁడు? నేనెక్కడకు రావలెను?

సిపాయి—కొత్వాల్ సాహేబుగారు ! మిమ్ము తనయెదుటకుఁ గొనిరమ్మన్నారు.

పురుషుఁడు—అట్లైన వచ్చెదను లెమ్ము. మహమ్మదీయులను మాత్రము తఱిమివేయుని. ఆవలిగట్టున మహమ్మదీయుల పురుగు ఒక్కటియైన లేకుండ చేయుదాఁక నే నడుగవతలఁ బెట్టను. నీమాట నటుంచుము. నీ కొత్వాల్ వచ్చినను కదలను. ఈలోపల నా చచ్చిపడియున్న వానిని గుర్తుపట్టఁగలరేమో చూడుఁడు ?

సిపాయి లాశవమును గుర్తించి, ఎఱుఁగుదుము. ఎఱుఁగుదుము. ఈతనిని గుర్తుపట్టితిమి. ఈతఁడు "పేరీలాలు" ఫిరంగి గాల్చువాఁడు. ఈతఁ డెక్కడనుండి వచ్చినాఁడు ?

పురుషుఁడు—ఈతనిఁ గోటలోనికిఁ గొనిపొండు. నే వెనుకవచ్చెదను.

సిపాయిలు తమలో తాముకూడఁ బల్కుకొనుచు "ఈపురుషుఁడు బాగుగఁ జెప్పినాఁడు. మనకు ఫిరంగికడ నెవ్వరు కనపడినవారినెల్ల

కొనిరమ్మని యు_త్తరువయినది కదా. ఈశవ మచ్చుటఁగనఁబడినది కొని పోవలదా?"

ఇది చచ్చినశవము. హిందూసిపాయిలు దీనిని ముట్టరాదు. అందువలన నందొకఁడు చండాలు నొకనిగొని రాఁబోయెను. మిగిలిన వారాతని యాగమనమును ప్రతీక్షించుచుండిరి.

ఇంతలో నొడలెల్లను మసిపై రూపుమూజియున్న వయస్కుఁడు మహమ్మదీయు లందఱు నొక్కరొక్కరే యద్దరి గట్టునఁజేరుటఁ గాంచి సిపాయిలయొద్దకు వచ్చి "మీరు మంచివారలు. ఇటురండు. నేను మీకొత్వాలునొద్దకు బోయి సందర్శించి వచ్చెదను." అని చెప్పెను. అందుపైని సిపాయిలు వానినిఁ బట్టుకొని తీసుకొనిపోయిరి. పురజను లందఱు నొక్కచోట మనస్సుచెదరి పిడుగుమొత్తిన ఆాల వలె, చీమల బాఱుతెన్నునఁ జేరియుండిరి. వారలచుట్టును కావలివాం డ్రాయుధపాణులయి కాచుచుండిరి.

హఠాత్తుగ, ఉత్సాహశబ్దం బొకటి యుచ్చైస్స్వనంబున వినవచ్చెను. ఆశబ్దము దిగంతవిశ్రాంతంబై ప్రతిధ్వనించుచుండెను. వేనవేలు శబ్దము లొక్కుమ్మడి "మహారాజ్ కీజయ్ రాజాధిరాజ సీతారామరాజ్ కీజయ్ లక్ష్మీనారాయణస్వామికీజయ్" అని వినంబడెను. చంద్రచూడుఁడు దేహమంతయును మసిచే గప్పరియున్న యావయసుకానిని బాహాపరీరంభ మొనరింప నావయసుకాఁడాతనిని పాదధూళి కన్నుల నద్దికొనియెను.

చంద్రచూడుఁడు "ఆయుద్ధమే నీవు పట్టణమునకు వచ్చినట్టు చాటినది. నీకు దక్క మఱి యన్యున కట్టి గుఱి మనుష్యలోకమున నెవ్వరికిని లేనేలేదు. కాని నీవు మఱియొకపనికి పోకమున్న గంగారాముని బట్టి భద్రముగ నుంచునట్లు గట్టడి సేయవలయు." అని చెప్పెను.

సీతారామరాయ లట్లొనరించెను. గంగారాముఁడు సీతారాముని చూడగనే, యీర్ష్యాళుఁడయ్యెఁగాని రాయల యాజ్ఞచే నాతనిపట్టి బంధించి కారాగృహాభ్యాగతుం జేసిరి.



## పదునేడవ ప్రకరణము.

ఫిరంగులకడ సిపాయిల నప్పగించెను. ఈఫిరంగులు కోటబురుజులకడఁ గొన్నియున్నవి. ఉచితస్థలంబుల మఱికొన్ని యెడల మఱికొన్ని యున్నవి. మృణ్మయుని స్థితిగతులు తెలిసికొన నొక్కఁడు బోయెను. ఇంతలోఁ జంద్రచూడుఁడం దరుదేర నాతనితో మంతనంబున కుపక్రమించెను.

చంద్ర—"మహారాజా ! నీ వెప్పుడువచ్చితివో సరిగ సమయము గనిపెట్టలేక పోయితిని. ఒంటరిగ నేల వచ్చితివి. నీయంగరక్షకు లందఱు నేమైరి. దారిలో నీకేమియు నంతరాయములు కలుగకుండ వచ్చితివి కద"

రాయలు—మార్గమధ్యమున ననుచరు లందఱను విడచి నేనులేనితఱి స్థితిగతు లెట్లుండునో తెలిసికొన మాఱురూపమున నడచప్పుడును లేని సమయమున నడిరేయి పురము ప్రవేశించితిని. వచ్చి చూచునప్పటికి పురము రక్షితమైయున్న యది. పిమ్మట కారణమును దెలసినది. కోటలోనికి పోవలెనని ప్రయత్నించితిని. కాని వాకిలి వేసియున్నది. అందువలన పురము ప్రవేశింపలేక పోయితిని. అరుణోదయ సమయ మాసన్నమైనది కదా యని నది వైపునకరిగితిని. అచ్చటికిఁబోయి చూచునప్పటికి మహమ్మదీయసైన్యము పడవలమీఁద నదిని దాఁటుచున్నది. కోట సంరక్షింపవలసినవా రెవ్వరును కదలినట్లైనఁ గనుపడవేదు. అటుపైని నాచేతనైన కార్య మేమియో చేసితిని.

చంద్ర—ఆచేసినకార్యము నీకొక్కనికిదక్క మఱియెవ్వనికి సాధ్యము? కాని, అంతమందుసామాను నీకెక్కడనుండి సంప్రాప్తమైనది ?

రాయలు—నాకొకదేవత ప్రత్యక్షమై నాయెడఁ గరుణించి, యీమందుగుండు సామానును, ఫిరంగులు పేల్చువాని నొకనిని సాయము చేసినది.

చంద్ర—ఏమనెదవు? దేవతయా ? నాకును కనుపడినట్లులున్నదే? ఆ దేవి ఈరాజ్యమును సంరక్షించు పరదేవతవలె నున్న యది. ఆమె ఇప్పు డేమైనదో ?

రాయలు—నాకు మందుసామాను తెచ్చి యిచ్చి యదృశ్యమైనది. అయ్యో ! నేను లేనికాలమున నీనడుమ నేమి జరిగినదో సెలవిచ్చె దరా ? అనునప్పటికి చంద్రచూడుఁ డన్ని సంగతులు నెఱిఁగినవాఁడే గనుక నంతయును వివరించి చెప్పెను. పిమ్మట చంద్రచూడుఁడు నీవు ఢిల్లికి పోయితివి కదా ? నీవుపోయిన కార్య మెంతవఱకు జక్కనైనది.

రాయలు నాయత్నము సిద్ధించినది. చక్రవర్తికి నేనొక్కింత యుపకారము చేయుస్థితి తటస్థించినది. అందున కాతం డెంతయు సంతుష్టిం జెంది నాకు పన్నిద్దఱు ప్రభువులు లోఁబడియుండునట్లుగను, నేను. "మహారాజాధిరాజ" బిరుదాంకితుఁడనై వెలయునట్లుగను నను గ్రహించెను. నాకొకఫర్మానాకూడ దయచేసెను. పౌజుదారుతోడఁ గలిగిన యీవిరోధ మొకమహావిపత్తుగా భావించుచున్నాఁడను. ఈ పౌజుదారు, సుబాదారునకును, అతఁడు చక్రవర్తికిని, పూంచీదారు. అందుమూలమున పౌజుదారునకు శత్రువగు నాతఁడు చక్రవర్తికి కూడ శత్రువని యెన్నఁదగియున్నది. అంతయుపకారముచేసిన ఆప్రభువుపైఁ గయ్యమునకు డీకొనుట దారుణమైన కృతఘ్నత యనిపించుకొనదా ? ఎవరియాత్మ సంరక్షణ వారు చేసికొనుట ధర్మమేయగును. కాని, యెదియో యొకలాభము నందఁగోరి పౌజుదారునిపై దాడివెడలుట మాత్రము ధర్మమైనపనికాదు. ఈశత్రుత్వము నాదురదృష్ట వశమున సంఘటిల్లినది.

చంద్రచూడుఁడు—దురదృష్ట మనరాదు. అదృష్టమనియే చెప్పవలెను. అదృష్టమన నీయొక్కని దేయనరాదు. దేశమునం దందఱిదిని యని చెప్పవలయును. నీవే మహమ్మదీయులతో చెలిమిఁజేసి మెలంగుచుంటివేని, ఇంక హిందువులను కాచి కాపాడువా రెవ్వరు ? హిందూ మతమున కింక శరణ్యమెద్ది? నాకిటు లిది అదృష్టమనియందువా ? హిందూమతము నెవ్వఁడుద్ధరింపఁ గలుగునో యాతఁడు మానవజాతియంతలో నదృష్టవంతుఁడు కాఁడా ?

రాయలు.—మృణ్మయుని స్థితిగతులు పూర్ణముగఁ దెలియునంతవఱకును, ఏదియును నిశ్చయించుటకు వలనుపడదు.

ప్రొద్దు గ్రుంకినది. కొంతతడవైన వెనుక మృణ్మయుని సమాచారము తెలిసినది. ఫీరుభక్షు అనుఫౌజుదారుని సేనాని యొకఁడు కొంత సైన్యముతో పురముపై కెత్తి వచ్చుచుండెను. మణ్మయుఁ డాతనిదారిన డుమఁ దలపడియెను. యుద్ధమొకటి జరిగినది. నిరుపమానమైన మృణ్మయుని పరాక్రమమునకును, యుద్ధకార్యకౌశల్యమునకును, ఓపలేక పీరుభక్షు పరాజితుఁడయి నామమాత్రావశేషుండయ్యెను. విజయభేరి వేయించుకొనుచు మృణ్మయుఁడు మఱలి వచ్చుచుండెను.

చంద్రచూడుఁడు రాయలను సంబోధించి "ఓమహారాజా? ఇంక తడయరాదు. ఏటికవ్వలనున్న భూషణపురమును బట్టుకొని విజయమును బరిపూర్తిఁ గావింపుము." అని చెప్పెను.

---

## పదునెనిమిదవ ప్రకరణము.

యయంతి.—ఏమిటి యోచించుచున్నావు? ఇప్పుడు పోయి నీభర్త నొక్కసారి సందర్శించిరమ్ము.

శ్రీ.—నే నిప్పు డాయుద్దేశ్యముతోడనే వచ్చితినా?

యయంతి.—ఆతని కిప్పుడు నీసాంగత్యమునకన్న సంతోషదాయకమైనది మఱియొక్కటి యుండదు. నీవిప్పు డాతని కేల సంతోషదాయినివి కాఁగూడదు?

శ్రీ.—మనోనిగ్రహ యోగమే యోగమని నీవేకదా నాకు బోధించితివి.

యయంతి.—జితేంద్రియత్వము యోగమన్నమాట నిశ్చయమే. నీకది యింకను కలుగలేదా?

శ్రీ.—నామాటఁ జెప్పుటలేదు.

యయంతి—నీవిప్పు డెవ్వరినిగూర్చి ముచ్చటించితివో, ఆతనినిగూడ నీమార్గమునకుఁ దెత్తువుపొమ్ము. అందునకే నీసందర్శన మవశ్యమంటిని. మనుజులందఱిలో రాజయోగి యుత్తముఁడు. అదిగాన, ఈరాజును రాజయోగిగా నేలమార్పరాదు?

శ్రీ.—నాకడ నంతసామర్థ్యమున్నదా?

యయంతి.—అట్టి మహత్కార్యము చేయుటకు నీవే సమర్థురాలవు. నేనెఱుంగుదును. నీ తరుణమునఁ బోయి రాయలకు నమస్కరింపుము.

శ్రీ.—యయంతీ! బెండు, నీటిపై తేలును. కాని దానికి త్రాటితో నొకఱాయిఁ గట్టిన నదికూడ మునిఁగిపోవును. నన్ను మఱల మునిఁగి పొమ్మనియా సెలవు?

యయంతి.—ఒక్కింత చాతుర్యమున, ఈమునుక లేకుండఁ జేసికొనవచ్చును. వలలు సముద్రమున ఆపాతాళమును బోవును. మునుఁగునా? మునుఁగక పోవు టొక్కటియకాక, వానితో రత్నములను గూడ పైకీడ్చుకొనివచ్చును.

శ్రీ.—అట్టిశక్తి నాకడనున్నదను ధైర్యము నాకులేదు. నేను రాజసందర్శనమునకుఁబోవను. నామనస్సును నన్నుఁబట్టి చూచుకొననిమ్ము. అయ్యది నాకు సాధ్యముగాకుండునేని తత్సందర్శనము నుజ్జగించి దేశపరిత్యాగము జేసి పోయెదను.

యయంతి—అయ్యో. నేనాతనికి నీసమావేశము సమకూర్తునని వాగ్దానము జేసితినే. దాని మాటయేమి?

శ్రీ—మన ముభయులమును గూర్చుండి ఈరెండును సంప్రాప్తమగు మార్గము నన్వేషించి చూతము.

అని చెప్పి అప్పుడు శ్రీ, రాజునకు దర్శనమియ్యక చనియెను.



శ్రీ రస్తు.

# శ్రీ సీతారామము

## తృతీయబింబము

## మొదటి ప్రకరణము.



### రాత్రి - భూతము.

---

సీతారామరాయలకు యుద్ధమున జయముకలిగెను. భూషణపురము వశమయ్యెను. మృణ్మయునిచేఁ దోరబుఖానుఁడు హతుఁడయ్యెను. ఇవియన్నియు చరిత్రాంశములు. వీనితో మనకంత ప్రసక్తిలేదు. వానినన్నిఁటిని వివరించి చెప్పుటకు మనకవకాశమును చాలదు. చిత్రకథాప్రాసంగికుఁడు అంతరకృత్యముల వివరించుపట్టున జాగరూకుఁడై మెలంగవలయు. చరిత్రలలో వివరింపఁబడు విషయము లాతని కంతగా ప్రయోజనకారి కావు.

భూషణపురము చేకొని సార్వభౌమికశాసనానుసారముగను తన బాహుపరాక్రమ విస్ఫురణమూలమునను సీతారామరాయలు పన్నిద్దఱ భూనాయకులపై నధికారము చెలాయించుచు మహారాజబిరుదమున వెలుంగుచు నిర్వివాదమగు నధికారమునఁ బ్రజాపరిపాలనము ప్రారంభించెను.

పరిపాలన మారంభమైనవెనుక ముందుగ గమనింపవలసిన విషయము గంగారాముని శిక్షించు విషయము. ఆతనిపై పాత్యమున కేమియును గొదువలేదు. రమాకాంత యొక్కింత, అయుక్తముగఁ బ్రవర్తించిన దన్నమాటయే కాని యామెకు భర్తయనిన పంచప్రాణములును, ఆతనియెడ నామెకుభక్తి తాత్పర్యములు మెండు. రాయలతో జరిగిన యావద్వృత్తాంతమును సపుచ్ఛముగ నామె వివరించి చెప్పెను. అందుగల లోటుపాటులన్నియును, మురళివల్లను, చందాషహా ఫకీరువలనను

విశదపడియెను. ఇంక, గంగారామునిపై నభియోగము మోపి యాతని వాఙ్మూలము పుచ్చుకొనుటయే మిగిలియున్నది. ఈవిషయము కదులు నప్పటికి నగరమంతయును, న ట్టుడికినట్లుడికి పోయెను.

రమ, రాయలతో నీవృత్తాంతము నివేదించునప్పుడు ఆమెకన్నులఁ గన్నీరు జలజల స్రవించెను. ఆమె చెప్పినమాట, యొక్కటి యైనను నమ్మకపోవుటకు తగినకారణము గనుపడదయ్యెను. వెఱ్ఱిబాగుల రమ, రాయలకు కేవలమును నిరపరాధినిగఁ గనుపట్టెను. ఆమెకుఁ గల ప్రేమాతిశయమే, యి త్తరుణమున నామె నింతవఱకుం దెచ్చెను. కాని సామాన్యముగ, అంతఃపురచారులు దానికి లేని పోని విపరీతార్థములఁ గల్పింతురు. గంగారాముఁనేల కారాగృహ నిబద్ధుం జేసిరి? అనునీప్రశ్నము భయంకరమైన యుత్పాతము గలిగించెను. మురళియొక్క యవివేకమువలననో, కావలివాఁడగు పండాయొక్క యవ్యక్తప్రలాపముల వలననో, రమాకాంతయొక్క నామము దానితోఁ గలసిపోవుచుండెను. కొందఱు గంగారాముఁ డీ రాజ్యమును మొగలాయీల కమ్మఁ జూచినాఁడని యనుకొనఁజొచ్చిరి. కొందఱు చిన్నరాణిగారి రాణివాసమున నీత నిని(బట్టికొని నారని చెప్పుకొనసాగిరి. మఱియుఁ గొందఱు నీరెండును గూడ వా స్తవమే యై యుండుననియును, ఇందులకు మూలకారణ మెద్ది యేని నొకటిఁ గలిగి యుండుననియును, ఈరాజ్యవిక్రయమున గంగారాముఁడును, రాణియుఁగూడ, కలిసిపనిచేసియుందు రనియును, నన మొదలు పెట్టిరి. ఇట్టిసంగతులు రాజుగారిచెవిని బడకపోవచ్చును గాని సామాన్యముగ రాణుల చెవిని మాత్రము బడకుండఁబోవు. ఇట్టి కింవదంతు లంతఃపురమునకు బోవుసరికి, ఎన్ని యేని విపర్యాసములఁ బొందుచుండును. రాణులిద్దఱికిని గాలికబురులు వినవచ్చెను. రమ కీమాటలు చెవినిబడుట తోడనే యామె మంచము పట్టెను. కన్నీళ్లు కాలువలై ప్రవహించి ప్రక్కయంతయును తడిసిపోవుచుండెను. చివర కామె యుఱిఁ బెట్టుకొని చచ్చుటయో, ఏకుండముననో దిగుటయో, మేలని యెన్నుకొనియెను. కాని యిప్పట్టున నందమాత్రము కడువివేకమునఁ బ్రవర్తించినది.

రమ అత్యంతవిషాదంబున దుఃఖాతురులభావంబున గోడుగోడున నేడ్చుచు జలములదిగుట మేలా? ఉఱిఁబెట్టుకొనుట మేలా? అనుకొనుసందిగ్ధ

సమయంబున నామెయున్నకడ కేఁగి యామెనుబల్కరించి "ఏమి? ఈయపవాద నీచెవింగూడఁ బడినదిగా" అనెను.

రమ దాని కంగీకారసూచకముగ తలయుంకించెను. ఆతలయూఁపుతో నామెకన్నుల బాష్పకణంబులు పూర్వమున కన్న ముమ్మడి నలుమడిగ స్రవింపఁజొచ్చెను.

నంద యామెకన్నుల కన్నీరుఁదుడిచి మృదుస్వరంబున "చెల్లెలా! ప్రపంచమందఱును గలసియేడ్చినను, ఈయవమానము మాత్రము పోవనేరదు. అనుపయోగమయిన, యీకన్నీటివర్షమునకన్న దానినిసంపూర్ణముగ మాయింప చేతనయినప్రయత్నములం జేయుదము. లెమ్ము. మనస్సుకుదుటఁ బెట్టుకొని తద్వివరణమంతయును తెలియంబల్కుము. నన్ను నీయెడసవతిగా భావింపకుము. ఈయవమానము, లజ్జ, నిన్నంతగా బాధింపకుండినను, ఇంతదనుక నలుగుఱిలోఁ దలయెత్తుకొని తిరుగు రాజునకెంతయో తలవంపులఁ దేకమానదు. ఆతఁడు నీకునునాకునుగూడ ప్రాణప్రియుఁడు. అయ్యది నీకెంత లజ్జాకరమో నాకు గూడ నంతియే,అదియటుండ నంతఃపుర వ్యాపారమంతయును రాజు నాకొప్పగించి పోయినాఁడు. ఈవిషయమాతని చెవింబడిన నేనేమిబదులు చెప్పఁగలదానను?

రమ యీవిషయ మాద్యంతము నే నాయన కిదివఱకే నివేదించినదానను. నామాటయం దాయనకు నమ్మికగుదిరినది. నన్నీ విషయమున నాయన కటాక్షించినాఁడు. నామాటనమ్ముము. ఈవిషయమున నాయం దీషత్తును నపరాధము లేదు.

నంద.—నీమాటలఁ గట్టిపెట్టుము. నీయందు లోపము లేదనుట నిజము. ఆవిషయమై నన్ను నమ్మింపఁబూనిన ప్రయోజనము లేదు. ఈవివరణమంతయును చెప్పినను జెప్పకున్న నొక్కటె.

రమ—నేనీవిషయ మెవ్వరియెదుట జెప్పుమనినను జెప్పెదను. ఇంక నీకేల చెప్పరాదు?

అని రమ కన్నుల నీరుఁదుడిచికొని లేచి ప్రక్కమీఁదఁ గూర్చుండి తన సవతితో నిర్మలహృదయమున నున్నదియున్నట్లు వాక్రుచ్చెను.నందయు నామాటల పూర్ణముగ విశ్వసించెను. చెలియలా! నన్ను విశ్వాసపాత్రురాలినిఁగాఁ జేసికొనవచో నీగతి సంభవింపకుండ నుండియుండును.

గతించినదానికి వగచి ప్రయోజనము లేదు. అయ్యాది కడుపులోనిది కడుపులోనె జీర్ణము జేసుకొనవలెను. కాని మనపూర్వప్రతీతియు, పూర్వపు గౌరవమును, మరల సంపాదించుకొనుటకై, యెట్టి సాహసకార్యముల కయినను సిద్ధపడవలయును.

రమ—అక్కా! ఆపని తీరువఱకును నీవు నిద్రపోరాదు. లేకున్న నే నెందయినదిగియో యెట్లో కంఠమున కుఱిఁబెట్టుకొనియో, యీ గ్రుక్కెడుప్రాణమును పోవిడిచెదను. నీవేమనుకుంటివోగాని నేనును రాజుగారి గారవమున కనురూపమయిన భార్యనే సుమీ. ఇంతటి యప్రతిష్ఠకులోనయి స్వచ్ఛంబయిన యశోదర్పణంబునకు మాలిన్యంబుఁ గల్పించియు కులుకుచు నీప్రపంచమున నుట్టిఁగట్టుకొని యూఁగులాడవలెనని తహతహపడు నిరర్థకురా లెచ్చటనైన నుండునా.

నంద—చెల్లెలా! ప్రాణాపాయంబు దెచ్చుకొనునంతయవస్థకు నీవులోనుగానక్కర లేదు. నేనొక్కసాహసకార్యమును చెప్పెదను చేయుదువా? అట్లయిన ప్రజాసామాన్యమునకు నీనైర్మల్యవిషయమున సర్వసంశయములు నంతరించి పోవును.

రమ:—ఇందులకై, యదియిది యని నీవు చెప్పనక్కర లేదు. ఏమిచేయుమన్న నదియెల్ల చేసెదను.

నంద:—నాతోడఁ జెప్పినంతె నిష్కపటముగ లోకులందఱితోడను వివరించి చెప్పుదువేని వారు నీనిర్మలభావమును విశ్వసింతురు. ఇట్లుజెప్పినందువలన ప్రత్యవాయమేమియును లేదు. నివాక్కునుండీ,యీవిషయమంతయును, ప్రజల చెవింబడియెనేని యీయపనింద యంతయును పోవునని నానమ్మకము.

రమ:—అదిజరుగుట, ఎట్లు? అసాధ్యకార్యముకాదా?

నంద—ఆర్యపుత్రునితో పెద్దసభ యొకటి సమావేశము సేయుమనివిన్నవించెదను. ఆయన ప్రభువుగనుక దేశమంతయునుచాటింపించి అచిరకాలమున బనులనందఱ సమావేశము సేయఁగలఁడు. అచ్చట గంగారాముని సమక్షముననను తండోపతండములుగ మూఁగియున్న పురజనులందఱిసమక్షమునను, ఈ సంగతులన్నియు నున్నవియున్నట్టు లేకరువు పెట్టవలయును. మనము, నరపాలునియక్షాంగులము నూ

ర్యరశ్మి యన నెట్టిదియో, యెఱుంగనివారము. జనులందఱిముందర నిట్టిసాహసకార్యమును సేయఁజాలుదువా? అట్టికార్యనుము సాధింపఁజాలలేని దానివలనవచ్చు నప్రతిష్ఠ, యింతకంటెను విశేషమగును సుమా;

అనునప్పటికి రమ కోడెనుసింగమువలె బొబ్బరిల్లుచు నేమీ? పురజనులందఱిముందరను చెప్పుటకు సంశయింతుననియా నీయూహ. ఒక్కయీ పురజనులెకాదు, ప్రపంచమునంగల జనులనెల్లర రావింపుము. వారందఱముందర నీపట్టుల డంకా ప్రయోగించి మఱిఁ జెప్పెదను.

నంద—ఆధైర్యము నీకున్నదికద?

రమ—ముమ్మాటికిని ఈ కార్యమున నే నించుకంతయేని జంకినట్లు నీకు దోఁచిన నివతలకు రానిచ్చి, కుత్తుకను త్తరింపుము.

నంద—అట్లయిన నన్నుఁబోనిమ్ము. భర్తగారియొద్దకుఁబోయి పెద్దదర్బారొకటి సమకూర్పించి వచ్చెదను. ఇంక నీ విచారమునకు స్వస్తిచెప్పుము. అనినంద, తన సవతికడనుండి యరుగ, రమయును ప్రక్కపయినుండి లేచెను. కన్నిరుఁ దుడిచికొనియెను. చంటిబిడ్డను చంకనెత్తుకొని, అతిగారాబమున ముద్దులాడఁజొచ్చెను. అంతవఱకు నీకార్యములన్నియును శూన్యములయి యున్నవి.

నంద—రాజుగారినిరప్పించి, యంతఃపురమున నాతఁడడుగుబెట్టఁగనె దేశమంతటను గ్రమ్మియున్న యీ యపవాదనుగూర్చి ముచ్చటించెను. దేశమున నెవరినోటఁజూచిన నీమాటయె. తనకును, రమకును, జరిగిన యావత్ప్రసంగమును, ఒక్క ముక్కైన విడువకుండఁజెప్పెను. మీరుమా ప్రార్థనల నంగీకరింపరేని నీపైఁటకొంగు మెడకుఁజుట్టుకొని మీచరణములకడ పొదలుచు, పాదధూళి శిరమునదాల్చి, ఈప్రాణములఁ బోవిడచి యవమానమును బాపుకొనెదము. ఈయది మాయుభయుల విన్నపంబుగా నవధరింపవలయు. అనిచెప్పుచు తనపైఁట చెఱఁగు కంఠమునకుఁజుట్టికొని చేదోయి తనభర్త చరణంబులపై జేర్చి వెక్కి వెక్కి యేడువసాగెను,

ఈ మాటలు వినినతోడనే ఆతనికిని నారాటము పెంపొందెను. దేశమున నపవాద హెచ్చుగుటచే నట్టి, సభయొక్కటి సమావేశముచేయు

ట యవసరమని యాతనికిని పొడకట్టెను. కాని నందవంకఁదిరిగి "రాణి వాసస్త్రీని రచ్చకెక్కీడ్వఁగలను" దేశమునం దందఱిస్త్రీలవలె నాభార్య ను నే నెట్టు లీవిచారణకై సభలో నిలువఁబెట్టఁగలను.

నంద__దేవరవారికిఁ దెలిసినంత బాగుగా నేసంగతులును మాకెఱుకపడ వుగాని, ఒక్కటిమాత్రము యోచించిచూడుఁడు. తాము చెప్పినవిష య మవమానకరమో, రాజపత్ని "రంకులాడి" యను నపఖ్యాతి యవమానకరమో, మాత్రము యోచించిచూడుఁడు.

రాయలు__ఇట్టి నిరాపదలు సీతవంటి మహారాజపత్నికే తప్పినవికా వు. ఈ విషయమున నేనును అనుశ్రుతాచారమునే యవలంబింప వలయునేని రాముఁడు సీతను విసర్జించినటుల నిరపరాధియగు రమ ను అనవసరముగ వర్జింపవలసినవాఁడ నగుదును.

నంద__ఏమీ? ఏవిధమయిన విచారణయును సేయకయె నిరపరాధినియు అబలయు నగు తరుణినొక్కర్తు విసర్జింతురా? ఇదియా మీరాజధ ర్మము. నాఁడు శ్రీరామచంద్రుఁడు చేసినట్టులె చేయవలయునని యా మీయూహ. ఆయన కేవలపరబ్రహ్మస్వరూపుఁడు. ఆయనకు సంయోగమననేమి? వియోగమననేమి? ప్రాణేశ్వరా! అట్టిది నీ కుచితమగునా ?

రాయలు__శత్రులు, మిత్రులు, పండితులు, పామరులు, తక్కుంగల జన సామాన్యమందలి యెదుట చెడిపెలందఱను నిలువఁబెట్టినట్లు, నాయర్ధాంగిని నిలువఁబెట్టుట యనుమాటఁ దలంచుకొనునప్పటికి గుండె పగిలిపోవుచున్నది. ఏమి? నాహృదయము వజ్రసదృశ మనుకొంటివా యేమి ?

నంద__మహారాజా! ఏఁబదివేలమంది ముందర శ్రీ చెట్టుకొమ్మపయి నెక్కి యాటలాడినది. అప్పుడు నీహృదయమున నుద్రేకము కలిగియుండఁ బోలు.

అనునప్పటికి రాయలు నందవంక విషపుచూపొకటి ప్రసరింపఁజే సెను. "నందా! ఔనౌను నామనస్సపుడు నుద్రేకమునే బొందినయది. అట్టి సందర్భము మరల రాకపోయెనని మనసు పరితపించుచున్నది." నం

ద యీావ్యక్తోక్తికి చేతులు దోయిలించి ప్రాణేశ్వరుని క్షమార్పణమును వేఁడెను. ఆమె ప్రార్థేయపూర్వకవచనముల నాలించి రాయలు సభాసమావేశమునకు సమ్మతించెను. అట్టిది జరిగినగాని రమావిసర్జనము తప్పదని యెన్నుకొనియెను. పాప మామె నిరపరాధని యేమియుపాయము? సభా సమావేశముతప్ప గత్యంతరము గనుపట్టదయ్యెను. రాయలహృదయమున నారాటము వృద్ధియయ్యెను. తత్క్షణమె చంద్రచూడుని రావించి యీసభా సమావేశసందర్భములఁ గూర్చి ముచ్చటించెను. చంద్రచూడుఁడు బ్రాహ్మణుఁడు పండితుఁడు. ఆతనికి రాణివాసమున నేమియును గౌరవములేదు.నండ యుపదేశమునకుఁ దలయూఁచెనుగాని రమ మాత్రము నలుగురి లోనికివచ్చి మాటలాడఁగలుగు నను నమ్మక మాతనికిలేదు. రాయలకు నట్టియనుమానమె యున్నది. అందు మూలముననే మొదటినుండియు నాయనకు సభయనఁ దలకెక్కుట లేదు. నలుగురి లోనికివచ్చి యీామె నోరెత్తలేకపోయిన వ్యాపార మింతకంటెను జెడిపోవునని యాతనిభయము.

---

రెండవప్రకరణము.

అనంతరము సీతారామరాయలు గంగారాముని నేరము నిండుసభలో విచారణ జరుగ నిశ్చయింపఁబడినదనియు జనులందఱును, అచ్చటికి రావచ్చుననియును, చాటింపించెను. రాజుగారి హుకుమయినపుడు జనులరాక కేమికొదువ. ఇంక నూర సూక్ష్మపిట్టయైన లేకుండ వచ్చి యచ్చటఁజేరిరి. రాచనగరు వేనవేలుజనులతో నియతకాలమునకు పూర్వమె నిండియుండెను. చెప్పమఱచితిమి? రాయలు ఢిల్లీలోని సభామండపమువంటి మండపమొకటి కడురమ్యముగ నిర్మాణము గావించెను. నేఁడాభవనము కడు శోభాయమానముగ నలంకృతమయ్యెను. సర్కారుద్యోగస్థులందఱును విసుగును విరామమును లేకుండ రాజుగారి యుద్దేశ్యము నెరవేర్పఁ బనిచేసిరి. ఢిల్లిదర్బారు మందిరమువలె నిచ్చట వెండిచాందినియును, ముత్యముల జాలరులును లేవుగాని హొంబట్టు మేలుకట్టునకును మేలిమిజల్తారు నగిషీపనికిని మాత్రము తక్కువ లేకయుండెను. స్తంభములన్నియును, అనల్ప శిల్పచాతుర్యమున పెంపెసలారుచు వలి

పెంపు పట్టువలువల నాచ్ఛాదితమయియుండెను. క్రిందిభాగమంతయును మెత్తని రత్నకంబళ మొకటి పఱచియున్న పలువిధములగు రంగులచే మెఱయువాని పనివానితనము కనుపండువ సేయుచుండెను. నలుతట్టులను ఆయుధహస్తులగు వేత్రధరులు బలసియుండిరి. బహిఃప్రదేశమున నాశ్వికులు తమబలంగముతో సంక్షోభమేమియును గలుగకుండ కావలిగాచుచుండిరి. సభామంటపమున స్ఫటికశిలాస్థగితంబగు నొక్కకొలువుకూటంబున రాయలు సమాసీనుండయియుండె. అతఁ డధిరోహించిన పీఠము సకుమనమము బంగరుపనితోడను, మౌక్తికవిసరములతోడను నిండియుండిన రజితపీఠము.

అంతకంతకు సభారంగమున జనసమ్మర్దము హెచ్చుచుండెను. సభాంతరాళమున మఱియు లందఱకును యథార్హములగు సుఖాసనము లొసంగఁబడియెను. ప్రేక్షకులు వేనవేలు వారిచుట్టును మూఁగి లోపల నేమి జరుగుచున్నదో యని వెలుపటనుండి చూడసాగిరి.

నంద అంతఃపురభవనమున నున్నది. గవాక్షమునుండి యతిసంకులంబుగ నున్న యీ జనసమావేశమును గనుంగొని యంతిపురినున్న రమను రావించెను. వెలుపట జరుగుచున్న సంగతి సందర్భములన్నియును జూపి "ఇప్పుడు నీ మనసెట్లున్నది? ఆ సభామధ్యమున నుండి నీమనసున నున్న దంతయును చెప్పఁగల నను ధైర్య మున్నదా మనసు కుదురుగ నున్నదికద ?" అనెను.

రమ—నేనే సత్యముగ నాప్రాణనాథునిచరణసేవాతత్పరురాల నగుదునేని తప్పక నా కట్టి శక్తిసామర్థ్యములు గలుగును.

నంద—నీతో నెవ్వరయినఁ గూడ రావలయునా? రమ్మనిన సిద్ధముగ నున్నదానను.

రమ—ఈయవమానమహాసముద్రమున నీవు కూడ నేల మునిఁగెదవు? నాతోడ నెవ్వరును బనిలేదు. కాని, ఒక్కటిమాత్రము సేయవలయు. నావాక్కు వెలువడుసమయము తటస్థమగునపుడు నాబిడ్డ నెవ్వరిచేనయిన నాయొద్దకుఁ బంపుము. ఆయాకారము నొక్కసారి వీక్షించితినేని ఎచ్చటలేని ధైర్యమును వచ్చి పయిఁబడును.

దానికి వల్లెయని నంద తలయూఁచి "యిప్పుడు నీవు సభారంగము

నకు పోవ సమయమయినది. బట్టకట్టు నొక్కసారి చక్కఁగ సవరించుకొనుము. కొంచ మవకాశ ముండఁగనే ఆయత్తపడవలయు.

రమ యందులకు సమ్మతించి వస్త్రధారణాదికము నొక్కింత సరిచూచుకొని తనగదిలోనికి పోయి చేతులు జోడించి క్రిందఁ జాగిలఁబడి యిట్లని ప్రార్థింపఁదొడఁగెను. "ఓభగవానుఁడా! లక్ష్మీనారాయణా! నాకు నేఁడు జయముఁగలుగఁ బ్రసాదింపుము. సర్వశక్తుఁడా! నీసంకల్పము లవిజేయములు. నేఁబలుక సంకల్పించుకొనిన పలుకులు పూర్ణమైన వెనుక నాకు మూకత్వము వచ్చినను రానిమ్ము. దీనికి ప్రతిఫలముగ నా కయ్యది సంప్రాప్తమైనను గానిమ్ము. ఈదినము సభారంగమున నా సమాచారమంతయు నేకరువుఁబెట్టినవెనుక నే బ్రతికినన్నాళ్లును నానాలుక కొఱుగుపోయినను సరియె. అదియైన నాకు పరమసమ్మతము. నేఁడు మాత్రము ఈయవమానమునుండి కాచికాపాడుము. పిమ్మట చచ్చిన నొచ్చిన నేకొదువయును లేదు.

అంత తనవేషము మార్చుకొనవలె నను నూహ యొకటి తట్టెను. పరిచారికవలువ నొకదానిని దెచ్చుకొని ధరియించి దానితో సభారంగమునకుఁ బోవసమకట్టెను. నంద యయ్యది కాంచి, యేమి యిది యని యాశ్చర్యముగఁ బలికెను.

రమ——నేఁడొయ్యారముగ నలంకారము గావించుకొనుదినము కాదు. భగవానుఁ డెన్నఁడయిన నట్టివిలాసక్షణము సమకూర్ప ననుగ్రహించు నేని,అప్పు డట్టిపనికిఁ గడంగెదను.లేకున్న నా కిదియె యంతిమవాసస్సగుఁ గాక. నేను సభారంగమునకు నీవలువతోడనే పోయెదను.

రమ పల్కినపల్కులు నందమనసునకు నచ్చి యామె కేమియును నెదురాడ లేక పోయెను.



## మూఁడవ ప్రకరణము.

సముచితసమయమున సీతారామరాయలు సభారంగమునఁ బ్రవేశించి సింహాసనాసీనుండయ్యెను. ప్రతీహారులు బరాబరులు చెల్పిరి. సంగీతము మున్నగు శృంగారవాద్యనినదములు వలనుపడ దని యాజ్ఞ యయ్యెను.

గంగారాముని శృంఖలానిబద్ధుం గావించి రాజునెదుటకుం గొనివచ్చిరి. వెలుపట నున్న ప్రేక్షకుల కాత్రము హెచ్చెను. ఆతని మొగ మొక్కసారి చూడవలయునని యందఱు కాలివ్రేళులపై నిలువఁబడిరి. సంక్షోభనివారకులు వారి నెల్ల వారించిరి.

రాయలు గంగారాముని సంబోధించి భయప్రదంబగు నినాదంబున "గంగారామ్! నీవు నాకు స్నేహితుఁడవు, బంధువుఁడవు, నాప్రజలలోనివాఁడవు, ఇప్పుడు నన్ను కొల్చి జీవించుచున్న వాఁడవు. నిన్ను నే నెంతో దయతో నాదరించుచున్నవాఁడను. నీవు నాకు నచ్చిన బంటవనియు, మిగుల విశ్వాసపాత్రుఁడ వనియు జనుల నమ్మకము. ఒకసారి నీప్రాణసంరక్షణముం గూడఁ గావించితిని. ఇంతచనవున నున్న నీకు ద్రోహబుద్ధి యెట్లు పుట్టెనో తెలియకున్నది. ఇప్పుడు నీ వీ దేశశాసనము ననుసరించి శిక్షార్హుఁడవయి యున్నాఁడవు.

గంగారా మతివినయముతో మెల్లని కంఠస్వరమున నాకుం గిట్టనివాఁ డెవ్వఁడో లేనిపోని యీ యభియోగము నాపయి మోపినాఁడు. నే నెన్నఁడును ఏద్రోహమును జేసి యెఱుంగను. ప్రభువులు స్వయముగ నన్ను విచారణచేయుచున్నారు. ధర్మశాసనమున కతిరిక్తముగ సాక్ష్యమేమియును లేకుండ శిక్షింపరాదు. విధి యథార్థముగ నమలు జరుప వేఁడుకొనుచున్నాఁడను.

రాయలు—నీ యభిమత మెట్లో అట్లే జరుగును. ధర్మశాస్త్రముల నే సాక్ష్యముః బలవత్తమ మయినదని యుద్ఘోషింపఁ బడియెనో యట్టిదె సంపాదిత మయ్యెను.

అని చెప్పి రాయలు చంద్రచూడుని మీఁ దెఱిఁగినదెల్ల వచింపుఁడని శాసించెను. చంద్రచూడుఁడును సర్వమును వివరించి పలికెను. ఆతనివాఙ్మూలమెల్ల విని సభారంగమున నున్నవా రెల్లరు మహమ్మదీయ సైన్యము కోట స్వాధీనముచేసికొనుటకై యేఱు దాటఁబోవునాఁడు చంద్రచూడుఁ డెంత ప్రబోధించినను గంగారా మిందుచేతనే కోట సంరక్షణార్థము కదలిరాఁడయ్యె నని విశ్వసించిరి. ఆయోగి తనకథ యంతయును తుదముట్టించినవెనుక రాయలు "ఓరీ పాపకర్ముఁడా! ఇప్పుడు దీనికేమని ప్రత్యుత్తర మిచ్చెదవురా" అని యడిగెను.

గంగారాముఁడు చేతులు జోడించి " ఈయన పురోహితబ్రాహ్మణుఁడు. యోగక్షేమము లీయన కేమి తెలియును? మహమ్మదీయు లెప్పుడయిన నేఱుదాటిరా? ఇద్దరికి వచ్చిరా! అట్టివి జరిగియుండి నేను వారిని పరాజితులం జేయఁజూడక యూరకుంటినేని, ఈమహాభాగుని వచనంబు లొక్కింత మన్నన సేయవచ్చు. మహారాజా! నేనుమాత్ర మీకోటలో కాఁపురము సేయుటలేదా? అందువలన నాకు లాభ మేమి యున్నది. తద్వినాశము నాకు మాత్ర మనర్థదాయకము కాదా?

రాయలు.—అయ్యది మఱియొకరివలన వినఁగలవు. త్వరపడకుము.

అని చందాసహాఫకీరుని పిలిచి, ఆతనికిఁ దెలిసిన సమాచార మంతయును నుడువుమని యానతిచ్చెను. ఫకీరు పూర్వపురాత్రి తోరబుఖానునకును, గంగారామునకును నడుమ నడిచిన యావద్వృత్తాంతమును పూసగ్రుచ్చినట్లు వాక్రుచ్చెను.

రాయలు.—దీనికేమి చెప్పెదరయ్యా!

గంగా.—వారు చెప్పిన నాఁటిరాత్రి నేను తోరబుఖానుని సందర్శించిన మాట వాస్తవము. ద్రోహి నని పేరు పెట్టుకొని యాతనిని చిక్కుదారుల కీడువవలయుననియు వారిసైన్యము కోటదనుక వచ్చిన వెనుక నచ్చట చావ మొత్తవచ్చుననియు నాయూహ.

రాయలు.—నీ విట్టిపనిఁ జేసినందులకు ప్రతిఫలముక్రింద తోరబుఖాను నేమయిన నిమ్మని యడిగితివా?

గంగా.—అడుగకున్న, ఆతఁడు నన్నెట్లు నమ్మును.

రాయలు.—నీకేమి బహుమాన మడిగితివి?

గంగా.—అర్ధరాజ్య మిమ్మంటిని.

రాయలు.—ఇంకేమయిన నడిగితివా?

గంగా.—ఇంకేమియును లేదు.

రాయలాపయిని ఫకీరును, ఇందునఁగూర్చి మీకేమయినను దెలియునా?

ఫకీరు.—తెలియకేమి?

రాయలు.—నీకెట్లు తెలిసినది?

ఫకీరు.—నేను మహమ్మదీయసన్యాసిని ; తోరబుఖానువద్దకు అప్పుడ

ప్పుడు పోవుచుందును. నేననిన నాతనికి నెంతయో గారవము. అత నిని గూర్చి దేవరకుఁగాని, దేవరనుగూర్చి యాతనికిఁగాని యెప్పు డును ఏమియును చెప్పినవాఁడనుగాను. అందువలననే నేనేపక్షము నను జేరినవాఁడను కానని యందఱును అనుకొనుటకు కారణము. ఇప్పుడంతయును గడచిపోయినది. దీనిసంగతి వేఱు. నాఁడు దేవరచే పరాజితుండై మధుమతీతీరముననుండి యాతఁడు పలాయితుండైన నాఁడు మే ముభయులము త్రోవలో తారసిల్లితిమి. గంగారాముని ద్రోహబుద్ధినిగూర్చి మా కపుడు ప్రసంగము వచ్చినది. గంగారాము తనను నమ్మించి మోసము చేసినాఁడనుకొని యాతండిది యంతయును నే నడుగకుండఁగనే చెప్పినాఁడు. గంగారాము అర్ధరాజ్య మడిగిన మాట సత్యమే. అదిగాక అతఁ డింకొకటి కూడ నడిగినాఁడు. అయ్యది మీకెఱింగించిన కోపము వచ్చునేమో యని భయముగా నున్నది. క్షమింతు రనినఁగాని దేవరచెవిని వేయఁజాలను.

రాజు—భయము లేదు. చెప్పుము.

చంద—ఆతఁడు తమచిన్న భార్యను రెండవ బహుమానముగఁ గోరెనఁట. అంత ప్రేక్షకులందఱును పళ్లు బిగఁబట్టి గంగారాముని తిట్టిపోయ సాగిరి. ఆశబ్దము సముద్రఘోష ననుకరించెను. రక్షకభటు లాస మ్మర్దము నణఁచునప్పటికిఁ గొంతకాలము పట్టెను.

గంగా—ప్రభువరా! ఇది కేవలము నమ్మరానిది. నాకు భార్యయున్న మాట దేవర యెఱుంగని దికాదు. అదిగాక నేనీపురంబున కధినాథుం డను. స్త్రీలోలుండనైన నాచేత నెందఱు లేరు ? నేను నాజన్మమున చిన్నరాణిని గని యెఱుంగను. ఆమెను నే నాశించుట యెట్లు.

రాజు—రాత్రి నిశ్శబ్దసమయమున కుక్కవలె దొంగతనముగ నాయంతఃపురమున కేల పోయితివి.

గంగారాముఁడు—"నేనా"అనునప్పటికి పండా యను కావలివానిని పిలి పించిరి. ఆతఁడు తనదవుడలు తాటించుకొనుచు గంగారాము మురళికు సోదరుఁడని చెప్పుకొనుచు ప్రతిదినమును అంతఃపురమున ప్రవేశించుచుండువాఁడని వాఙ్మూలము నిచ్చెను.

గంగా—దేవా ! యం దేమైన సందర్భమున్నదా! మురళి సోదరుఁడని

యనినంతమాత్రమున నంతఃపురప్రవేశమున కేల యనుమతింపవల యు. అంత పండా తాను గంగారాముని బాగుగ నెఱుఁగుదునని యును,ఆతండు పురనాథుండగుటచే నడ్డుపెట్ట లేక పోయితిననియు ను చెప్పసాగెను.

ఇది వినునప్పటికి గంగారాము తనస్థితి యధోగతికి వచ్చుచున్న దని కనిపెట్టెను. కాని మురళిమాత్ర మీ సంగతు లేమియు నొప్పుకొన దని యాతని గట్టి నమ్మకము. అట్టి యొప్పుదల యామెకుగూడ ప్రాణము మీఁదికి వచ్చునుగదా? అంతమాత్రము జడు పామెకుమాత్రము లేకుం డునా? ఈయుద్దేశముతో "మురళిను రప్పింపుఁడు. అందలి నిజానిజ ములు స్పష్టపడఁగలవు.' అనియెను.

పాపము! అతఁడు పెద్దరాణియగు నంద యీవఱిచారిక నిది వరకే మాటలాడియుంచినదని యెఱుంగ లేకపోయెను. నంద మురళికు నచ్చఁజెప్పి రాజు ఆఁడువాండ్ర నుఱిదీయించఁడు. నీకు ప్రాణభయము లేదు. అదిగాక ఆఁడువాండ్రకు దెబ్బలు,శిక్షలు విధింపఁడు. అందువలన నీ కంత గొప్పశిక్షయుండదు. కాని యేదో నీకు స్వల్పశిక్ష మాత్రము తప్పదు. నిజ మొప్పుకొంటివా కొద్దిశిక్షతో తప్పిపోవును. " అని చెప్పి యొప్పించెను.

మురళి నంద చెప్పినమాట వాస్తవమని కనిపెట్టెను. అందు మూలమున నున్నదున్నట్లు లొక్కయక్షరమైన తప్పకుండ నంతయును చెప్పివేసెను.

మురళి వాఙ్మూలము కాగానే గంగారాము పిడుగు మొత్తిన ట్లయ్యెను. అతని కింకను ఆశాత్యాగము మాత్రము కలుగ లేదు. "మహా ప్రభూ! ఈయూఁడుది పరమనీచురాలు. ఈమె యీపట్టణమున నొనర్చిన నేరము లెన్నెన్ని యో నేను పట్టుకొనినాఁడను. ఈమెకు కొన్నిసార్లు శిక్షలు కూడ నయినవి. ఆకసి తీర్చుకొనుటకై యిప్పుడు సాక్ష్యమునకు వచ్చినది.

రాయలు—గంగారాము ఇంక నెవ్వరిని నమ్మునుసియెదవు. రాణి సు ప్రసిద్ధురాలుకదా. ఆమెమాట నమ్మవచ్చునా? గంగారాము తనకు స్వర్గము తలుపులు తెఱవఁబడెనని యెన్నుకొనియెను. రమ ప్రాణము

పోయినను సభాస్థలికి రాదనియును, వచ్చినను తనసంగతులన్నియు చెప్పలేదనియును నాతనినమ్మకము. అందుమూలమున నాతఁడు "నిశ్చయముగా నన్నామె ద్రోహి నని చెప్పినయెడల తమచిత్తమువచ్చిన శిక్ష విధింపవచ్చును." అని చెప్పెను.

రాయలుదృష్టి యంతఃపురమువంక కరిగెను. మాసినవస్త్రములతో మేలిముసుఁగొకటి వేసుకొని బెదరుచు బెదరుచున్న బిడ్డవలె అడుగులు తడఁబడుచు మెల్లమెల్లగ దర్బారువంక కొకవిగ్రహము వచ్చుచుండెను. ఆరూపమును గాంచునప్పటి కాతనికి ప్రాణము కడఁబట్టెను. గంగారాముని కొడలు కంపించెను. ప్రేక్షకు లందఱు కేకలకుఁ బడిరి. చప్పటులు చఱవసాగిరి. రక్షకభటులా సంక్షోభమునంతయును వారించిరి.

రమ సభాస్థలికి వచ్చి చాలదూరమునుండియే రాయలకు దుమ్ములోఁ జాగిలఁబడి సాష్టాంగ మెఱఁగెను. పిమ్మట పురోహితుఁడగుచంద్రచూడునకు నమస్కరించెను. అనంతరము తన మేలిముసుంగు తీసి పారవైచి ప్రేక్షకుల కాముఖసౌందర్యమును పరిశోధింప వదలెను. అంత ముఱికి గుడ్డలతో నున్నను ఆమెమోముఁనందమున కించుకంతైన వెల్తి లేకుండెను. చంద్రచూడుఁ డామెవంకఁ జూచెను. రాయలు మాటాడ నుంకించెను. కాని యాతనినోట మాట రాదయ్యెను. చూపు లధోగతిని బట్టెను. చంద్రచూడుఁడు రమను పలుకరించి "దేవీ, ఇచ్చట నేఁడు గంగారామునిపై నభయోగ మొకటి మోపఁబడి విచారణ జరుగుచున్నది. ఈతఁ డెప్పుడైన నీయంతఃపురమునకు వచ్చినాఁడా? వచ్చిన నేమికార్యమునకు? మీయుభయులకును జరిగిన సంభాషణమేమి? ఈసంగతు లన్నియును నీవు జరిగినవి జరిగినట్లుగ చెప్పవలెను. ఇది రాజశాసనము. గురువునైన నాయాజ్ఞ కూడ నిదియే. ఇందీషన్మాత్రమైనను మఱుఁగుపెట్టక చెప్పవలయు." అని చెప్పెను.

రమ మొగము పైకెత్తి పురోహితునివంకఁ దిరిగి "రాజపత్నియబద్ధములాడుటకు సాహసించునది కాదు. ఆమెయే అబద్ధికురాలయ్యేనేని సింహాసన మీపాటికే యంతరించియే యుండును." అని చెప్ప ప్రేక్షకులెల్ల ఒక్కపెట్టున రాజపత్నికి జయముజయమని చప్పట్లు చఱవసాగిరి. దానితో రమకు ధైర్యము హెచ్చి "ఓపరమగురూ! నే నే

మని పలుకుదాన. నేను రాజునకు సహచారిణిని. రాజభృత్యుఁడగు నా తఁడు నాకు పరిచర్య చేయుట విధి. అందుమూలమున నే నేమి చెప్పిన నది యెల్లఁ జేయుట ధర్మమేకదా. రాజ్యసంబంధమగు వ్యాపారములు బాగు గ నిర్వహింపఁబడుటకై నే నొకసారి నగరనాయకుని రప్పించితిని. ఆతఁడు వచ్చి నేఁజెప్పినదియెల్ల నొనర్చి వెడలి పోయెను. అందుల కింతవిచారణయేల కావలసివచ్చె. అంతకంటె నే నేమున్నది యని చెప్పుదును." అని చెప్పెను.

ఈమాటలు ప్రేక్షకుల కేమియును నచ్చినవిగావు. అందుమూలమున జనసమూహమున సంతోషచిహ్నము లేవియును కనుపట్టలేదు. కొంతమందికి మనోవ్యథ యంకురించెను. కొందఱు గొణఁగుకొనుచుఁ వినఁబడీ వినఁబడనికంఠస్వరముతో "ఇది మాత్ర మేమి? నేరమునొప్పుకొనుటకాదా" అని యనుకొనఁజొచ్చిరి.

చంద్ర—బిడ్డా! రాత్రివేళ నీవాసభవమునకు నగరనాయకుని రాజకీయవ్యాపారముండుటచే రప్పించితినని చెప్పితివి. ఆకార్యము లేవియో తెల్పెదవా?

రమ—'అట్లైనఁ గరుణించి వినుఁడు.' అని చెప్పి తనప్రేక్షణములఁ దనచిన్నబిడ్డవంకకు మరల్చెను. అప్పు డాబిడ్డఁడు చక్కని వస్త్రాలంకారములతో దాదిచంక నున్నవాఁడు. ఆపిల్లవానియాకారముఁ దిలకించునప్పటికి ఆమెకు ధైర్యము వచ్చి వెనుకటి ప్రకరణముల వివరింపఁబడిన గంగారాముని సమాగమమును గూర్చిన యావత్సంగతులును వివరముగఁ జెప్పెను. దూరస్థమగు సంగీతముపాటవలె నామెసంకథనము మెల్లనిక్షీణస్వరమున నుండెను. కాని పలుకుమాత్రము ప్రస్ఫుటముగ నుండెను. అందుమూలమున సభారంగమునకు వెలుపటనున్న జనసముదాయ మంతయును "దేవీ! మేమెంతకొట్టుకొనినను మీమాటలేమియును మాకు వినిపించుట లేదు." అని కేకలువేసిరి. అంతట రమ స్వరము క్రమక్రమముగ హెచ్చించెను. తనప్రవర్తనమున జనులకు నమ్మకము కలిగింపవలెనని యామెతలంపు. అబద్ధమాడిన తనబిడ్డ కేయరిష్టము సంభవించునోయని వణఁకు నడుమనడుమ నొక్కొక్కసారి యాబిడ్డని మనోహరవ

దనపద్మంబుపై తనచూపులఁ బ్రసరింపఁజేయుచు క్షణమైన నాపక నాదృష్టిని వెనుకకు మరల్చుచు, కన్నీరు కాలువలై ప్రవహింప మాతృవాత్సల్యతరంగము లాకంఠస్వరమునను నీక్షణప్రసారమునను విజృంభమాణముగ ప్రసరింపుచుండ నామెపల్కులు నిర్దుష్టమై దివ్యమై తిరిస్థాయీల నొక్కసారి మేళవించి మ్రోళ్లను కూడ చిగురింపఁజేయు గాంధర్వగానమాధుర్యమును క్రిందుఃబఱచుచు శ్రోతలకు కర్ణరసాయన మొనరించెను. అంతటితోఁ దృప్తినొందక తనచిన్నిపాపను దాదిచంకనుండి లాగుకొని సీతారాముని యడుగులపైఁ బడవైచి హస్తపద్మముల దోయిలించి "దేవా! తమ కింకను వేఱుసంతాన మున్నది. నాకేకపుత్రవిషయము. నా కొక్కఁడే పుత్రుఁడు. మీకు వేఱురాజ్య మున్నది. నాకు సర్వరాజ్యములు నీబిడ్డయే. మీకు మీమతమున్నది. మీధర్మకార్యము లున్నవి. పేరును ప్రఖ్యాతియు నున్నవి. స్వర్గసౌఖ్యము లనుభవింతు రనుగట్టి నమ్మకమును నాశయు నున్నవి. నా మనస్పూర్తిగ గాఢవిశ్వాసముతో చెప్పుచున్నదానను. నాకు మత మీబిడ్డఁడు. నాధర్మకార్యము లీబిడ్డఁడు. నాపేరును ప్రఖ్యాతియు నీబిడ్డఁడు. నా కున్నస్వర్గసుఖ మీబిడ్డఁడు. ప్రభుసత్తమా! నాయభిమానధనంబు నుజ్జగించితినని తలంతురేని మీ రేశిక్ష వేసిన నాశిక్షకుఁ బాత్రురాలను." అని యెలుంగెత్తి ఘోషించెను.

అంత ప్రేక్షకు లందఱును అశ్రుబిందుప్రపూర్ణములైన కన్నులతో చప్పట్లు చఱవసాగిరి. పదిమంది చేరునపు డందఱొకమాదిరివారుండరు. మంచివారును చెడ్డవారును కూడ నుందురు. అట్లే యీసంఘమునను జాలమంది ప్రేక్షకులు ఈసంతోషధ్వనుల పాలుగొనిరి. కొందఱూరకుండిరి. ఇంక నాసందడి విరమింపకుండగనె అందొకఁడు "నిజముగ నాకు నీమెమాటలయందు విశ్వాసము కలుగుట లేదు." అను నస్పష్టవాక్యమొకటి వినఁబడియెను. "సిగ్గులచేటు! మగవాఁడొకఁ డపరాత్రి తనపడకటింటికి వచ్చినాఁడఁట! తాను శుద్ధశ్రోత్రియురాలఁట! ఈమాటలు నమ్మవలెనఁట!" అనుముసలిపలు కొకటి మఱియొకమూల నుండి వినఁబడెను. ఇంకొకచోటనుండి "రాజు కన్నులు పొరలుగ్రమ్మినఁ గ్రమ్ముగాక. మాకును పొరలు గ్రమ్మలేదు." అనువాక్యము వినఁబడియెను. మ

టియొక మూలనుండి "రాజపత్నియంతటి యాపె యిట్టివాని కొడిగట్టుచుండఁగా నింక సామాన్యులు, మనబోఁటివాండ్రమాట యెత్తవలయునా" అనుమాట వినఁబడియెను.

ఈ మాటలన్నియును రాయలచెవిని బడియెను. ఆతఁడు రమను బలుకరించి "నీ విన్ని చెప్పితివిగాని, వింటివా! నీమాటలయందు జనులకు విశ్వాసము గలుగలేదు." అని చెప్పెను. అంత రమ ఒక్కనిమిషము వంచిన తల పైకెత్తలేక పోయెను. అశ్రుధారలు జలజల స్రవింపఁజొచ్చెను. కొంతసేపటికి మనస్సు కుదుటఁబెట్టుకొని మొగము పైకెత్తి రాజును సంబోధించి "ఈజనుల యవిశ్వాసమూలమున నాకింక నొక్కమార్గము మాత్రమె కనుపించుచున్నది. ఇంక నే నీయసురులతో నీయంతఃపురము ప్రవేశింపరాదు. చితి యొకటి యిచ్చటనె పేర్పింపుఁడు. వీరందఱముందర నాచితి నధిరోహించి యీదేహమును దహించి వేయుదును. ఇందు నా కిసుమంతయును విచారము లేదు. నేను మానహీనురాలనని జనులకుఁ గలిగిన యీవిశ్వాసము నాదేహముతోఁ దక్క నంతము నొందనేరదు. ఓమహాప్రభూ! మిమ్ము నే నొక్కటి వేడెదను. అనుగ్రహింపుఁడు. మీరుకూడ నేను మానపరిత్యాగినినని యే నమ్మిక కలిగె నేని నే నీచితి నధిరోహించి మరణించుటవలన నేమియుప్రయోజనము లేదు. ఈజీవప్రపంచసమక్షమున మీరు నాస్వచ్ఛతయెడ నను మానము లేనట్లు నమ్మిక యొదవి దానిని ప్రకటించితి రేని నేనీచితిని స్వర్గసౌఖ్యసదృశముగ గాఢాలింగన మొనరించెదను. ఇదె నాయెట్టయెదుట నాకు పరమగురుఁడు, ఆముష్మికమార్గప్రదర్శకుఁడు, నిలువఁబడియున్నవాఁడు. ఆయనసమక్షమున నాకిలవేల్పగు దైవము పేరుసెప్పి నే నిర్దోషురాలనని వక్కాణించెదను. నాకు మనోహరుఁడవును, ప్రాణప్రియుండవును నగు నీ వీ పరమగురునికన్న, దైవతములందఱికన్న మర్త్యుఁడవైనను, నాకత్యంతపూజనీయుఁడవు. అట్టినీయెదుట నీనామమును స్మరించి నేను నిర్దోషురాల నని యుద్ఘోషించెదను. అనన్యస్పర్శనీయంబగు మచ్ఛయ్యాతలం బన్యస్పర్శనంబున మాలిన్యము నొందెనేని చిన్ననాఁటి నుండియును నేఁజేసిన దైవతారాధనలు, నాచేసిన బ్రాహ్మణపూజలు, నాచేసిన దానములు, నానోఁచిన నోములు, నేనొనర్చిన యుపవాసము

లు ఇవియన్నియు నిష్ఫలములవుఁగాక. స్త్రీలకు పతిసౌఖ్యములనుజూచు నసురక్తి ఆతనియందలి భక్తియు నగ్రగణ్యములు. నీసౌఖ్యసంసిద్ధికై మనోవాక్కాయకర్మముల నే నెట్లు నాశక్తి ధారపోసినదియు నీకంటె నెఱిఁగినవారు మఱియొకరు లేరు. స్త్రీస్వభావసిద్ధంబగు చాంచల్యంబున నేఁ దప్పి జాతియొక్కడుగైన నవతలవైచితినేని పతిభక్తివలన నాకు లభించినఫలమంతయును నిష్ఫలంబగుఁగాక. పాతివ్రత్యధర్మముల నే నీపన్నాత్రమేని అడుగు దప్పి సంచరించినయెడ చిరకాలమునుండి నేనేయే యభిమతముల వాఁఛించుచుంటినో ప్రపంచమున నా కేయేయర్థములు కాంక్షింపఁదగినవో యవి యన్నియును నా కందకుండఁబోవుగాక. రాజా! స్త్రీ జీవితమున పతిభక్తియును, పతిసాంగత్యమునందలి యానందమును అత్యుచ్చస్థానమునందుచుండును. నేను మీాకపయశస్సు దెచ్చితినేని స్త్రీమండలి కంతకు నానందదాయకంబగు సౌఖ్యము నా కెప్పటికిని లభింపకుండఁబోవుగాక. నేను యథామార్గమును దప్పి సంచరించినదాననేని యెవ్వని సురక్షితకై నాకీ నిరపనింద సంఘటిల్లెనో, నాకంటికి ప్రపంచములోని సౌఖ్యములన్నియును నేసౌఖ్యముముందర తృణప్రాయముగ నుండునో ఆనాముద్దులబిడ్డ ఆ నానోములపంట వీనిఁ జూచు భాగ్యము నాకింక నెన్నఁటికిని లేకుండఁబోవు గాక.ఓధర్మైకపరాయణా! నే నింకేమి చెప్పుదాన. నీయెడ నా కనురూపంబైనధర్మము నుజ్జగించి ప్రవర్తించితినేని జన్మజన్మములకును నా కీస్త్రీజన్మమే లభించుఁగాక స్త్రీకి సౌఖ్యప్రదాయకులు ప్రపంచమునభర్తయును, పుత్రుఁడునుకదా! నాకు రాఁబోవుజన్మముల నట్టివారిసందర్శనమే లేకుండఁబోవుగాక.''అను తుదిమాటలామె నోటినుండి వచ్చునప్పటికి రమకు కలిగిన మానసోద్రేకము కుత్తుకబంటియయ్యెను. ఇంక నోటమాట రాకుండఁ బోయెను. వేళ్లతో పెల్లగిల్లిన లతాకుసుంగమువలె నొక్క పెట్టున భూమిపైఁ బడి మూర్ఛిల్లెను. అంత దాదు లిరువు రామెను తోడ బట్టుకొని వాసభవనమునకుఁ గొనిపోయిరి. దాదిచంకనున్న యా మెబిడ్డ తల్లివెంట "కావు కావు" న ఏడువసాఁగెను. దానితో నచ్చటనున్న వారందఱికన్నుల వెంట కన్నీరు ప్రసవింపఁజొచ్చెను. గంగారాము గాలు సేతులును బట్టికట్టిన సంకెలలోఁబడి విలవిల తన్నుకొనఁజొచ్చెను. జనసమ్మర్ద మప్పుడు భూకంపముచే కంపిం

చుచున్న సముద్రమువలె నల్లకల్లోలమై భయంకరరూపము దాల్చియుం
డెను. రక్షకభటు లెవ్విధంబునను దాని నివారింప శక్తులు గాకపోయిరి.
అంత "గంగారామేమి చెప్పెనో విందము. ఇప్పుడు మనము విన్నదంత
యును అబద్ధమనునా? అంత దారుణపాపమున కాతఁ డొడికట్టె నేని వా
నిని తుండెతుండెములుగ ఖండించివేయుదము" అని నలువంకలనుండి
యు బొబ్బరించుశబ్దము బయలువెడలెను. జనవాక్యమును మఱలించినఁ
గాని గంగారాము తనకు సురక్షిత లేదని యెన్నుకొనియెను. ఆతఁడు తెలి
వి తక్కువవాఁడు కాఁడు. రాయలు జనవాక్యము ననుసరించి వారియుద్దేశ
మునే నెఱవేర్చునని యాతఁడెఱుంగును. అందుకొఱ కాతఁడా జనసముదా
య మభిప్రాయమంతయును తారుమాఱుచేయ సంకల్పించి, విజృంభించి
యిట్లు పలుకఁదొడంగెను, "ఓ మహాప్రభూ! ఇప్పు డాఁడుదానిమాట
యో నామాటయో పాటింపవలయు. నీచేత నున్న యీరాజదండము
స్త్రీలమాయలే యాధారమై మెలంగవలసినదా? నావంటి రాజకీయో
ద్యోగిబలమే యనాధారముగ నుండవలసినదా? తెల్పవలెను. స్త్రీలు
సర్వసామాన్యముగా నసన్మార్గవర్తినులుగనుందురు. రాజపత్నులుకూ
డ స్త్రీలలోనివారే. రాజపత్ని తప్పుగఁ జరియించిన రాజు లట్టివారిని
విసర్జించుట రాజధర్మముగ నెంతురు. కృతజ్ఞులగు భృత్యులు తమ్మును
తమధర్మములను విస్మరింప నోపరు. స్త్రీలు తమలోపమును గప్పిపు
చ్చుటకై తమపై నున్న భారమును అత్యంతవిశ్వాసనిరతులగు తమ
భృత్యజనముపై త్రోసి వేయుచుందురు. ఎవ్వని నిశాసందర్శనము లా
మెకు గోచరములయ్యెనో యాతనిపై నిప్పుడీమె యీ నింద మోప
సమకట్టినది. ఎవ్వరుగాని దీనిని నిశ్చయమని, రాజా! రక్షింపుము
రక్షింపుము."

అనిగంగారా మసంపూర్ణవాక్యములతో తన సంభాషణమును
విరమించి భయప్రకంపితుఁడయ్యెను. ఒకమూల మనస్సు దించుకొనిపో
యెడు భయము తనను బట్టి వేధింప ప్రార్థనామయవాక్యములకు దిగి ని
శ్చేష్టతనంది మౌనముద్రుఁడయ్యెను. పక్షవాతముచేఁ బద్ధవానివలె నా
తనిదేహము కంపించెను. అచ్చటఁ జేరియున్న జనసముదాయమంతయు
నాశ్చర్యావిష్టులై పరమభీతమనస్కులై జటాలంబితపృష్ఠభాగయు వ

ల్కాలాంబరశరీరిణియు నగు స్త్రీవిగ్రహ మొక్కటి తనమనోహరరూపం బుచే తేజఃపుంజంబు వెదఁజల్లుచు చేత త్రిశూల మొక్కటి ధరియించి యపరదుర్గయో యన జనసముదాయమును పాయఁజేసికొనుచు గంగారామున్న యెడ కరిగెను. ఒక్కక్షణముక్రింద ఘోషించుచున్న యాజన మహార్ణవ మిప్పుడత్యంతముగ శాంతి వహించెను. ఈ రూపము గంగారామున కొక్కనాఁటిరాత్రి తారసిల్లెను. నిర్దోషురాలగు రమను తనకుచ్ఛితతంత్రంబులచే నాశనముచేయ సమకట్టియున్న యీవిపత్సమయమున నారూపమే హఠాత్సంభవముగ భగవతి చండిక వానిని మట్టుపెట్టఁ బంపిన ఢాకినీవిగ్రహమో యన వచ్చి పడియెను. అత్యంతభయనిమగ్నుండై గంగారాము 'రక్షింపుము. రక్షింపుము' అని కేకలువైచెను. రాజును, చంద్రచూడుఁడును ఒకనాఁటిరాత్రి తమకు తారసిల్లిన యాదివ్యవిగ్రహమును గుఱించి యామె నాపురదేవతగా సంభావించి గౌరవప్రపత్తి సూచకంబుగ తమ యాసనంబులనుండి లేచి నిలువఁబడిరి. తక్కినవారందఱును గూడనట్లే యొనరించిరి.

యయంతి యిటునటుచూడక చరచర గంగారాముని సమీపించి తనత్రిశూలము నాతనిహృదయముపై మోపి "ఏదీ, ఇప్పుడు పల్కు," మని శాసించెను.

త్రిశూలము గంగారామునిశరీరమును సోఁకినది. ఇంక నాతనిప్రాణము ప్రాణమున లేదు. ఇంక నబద్ధముగూడ దానికి జతపడియెనా ఆయాయుధము తన హృదయమును వ్రక్కలించునని తలంచెను. పరమతచేతస్కుండై కపటతంత్రకలాపంబంతయును బరిత్యజింప ఆ జనసమూహము నెదుట తనయథావృత్తాంతమును వినుపింప నుపక్రమించెను. కథయంతయును తుదముట్టువఱకును యయంతి తనత్రిశూలము నాతని హృదయస్థలినుండి మరలింపదయ్యెను. గంగారాము సర్వమును ఉన్నది యున్నట్లు చెప్పివేసెను. రమ నిర్దోషురాలగుటయు, తనకు వికారోద్రేకము కలుగుటయు, తాను ఫౌజుదారునితో సమావేశమును కలుగఁజేసికొనుటయు, వా రుభయులకు నడచినప్రసంగమును తాను దలంచిన రాజద్రోహప్రయత్నమును, ఇన్ని యేల! అన్నియు నేకరువుపెట్టెను.

అంత యయంతి త్రిశూలమును మరలించి చరచర సభారంగ

మునుండి మరలిపోయెను. ఆమె నందఱును దేవతగా సంభావించి త రలిపోవునెడ నామె కెల్లరును నమ్రులై యామెకు దారిసేయుచుండ రతో నందఱును కలవరమొందిరి. ఆమె నెవ్వరును ఏమియగుటకును సంశయించిరి. ఇంక ననుసరించుట యెట్లు? ఆమె యేవంక కేఁగెనో యదిమైన నిర్ధారణగఁ జూచినవా రెవ్వరును లేరైరి.

యయంతి వెడలిపోయినది. రాయలు గంగారాముని సంబోధించి" నీనోటితో నీవే నీనేర మంతయును నొప్పుకొంటివి. ఇట్టి రాజద్రోహికి నీకు మరణశిక్షకన్న వేరొకశిక్ష కానరాదు. ఈదండనాయకునిశాసనమున మరణ మనుభవింప నాయత్తపడియుండుము. " అని శాసించెను.

రాజశాసనమునకు వ్యతిరిక్తముగ గంగారాము పెదవి మెదపుటకు సాహసింపఁగలఁడా? రక్షకభటు లాతని నచ్చటనుండి తరలించుకొనిపోయిరి. మరణదండన విధింపఁబడినతోడనే జనులందఱు నొక్కసారిగ నుద్విగ్నులైరి. మెల్లమెల్లగ వారందఱును తమతమయింటిదారి పట్టిరి. అందఱును రమ కేవలము నపరలక్ష్మియేయని యిండ్లకుఁ బోయి ప్రశంసింపసాగిరి. ఇట్లు రమయశస్సునకు మాలిన్యము గల్పించిన యపనింద నామమాత్రావశేషమయ్యెను.



## నాలవ ప్రకరణము.

రాజు మురళిను ఖరమూత్రసంసేచనంబున బుఱ్ఱ గొరిగించి యూరేఁగించి పురమునుండి పోద్రోలుండని యుత్తరవుచేసెను. ఆయుత్తరువగుటయె తడవుగ నాశాసన మమలు జరిగెను. కొంటెపిల్ల లెందఱో గుంపులుగుంపులుగఁ జేరి చప్పటలు చఱచుచు పాటలు పాడుచు ఆమె నూరినుండి సాగఁబంపిరి.

గంగారామునివంటి కృతఘ్నుఁడగు రాజద్రోహికి బ్రతికియుండఁగనే చర్మమొలుచుట తక్క శిక్షాస్మృతిలో నేశిక్షయును విధింపఁబడినజాడ కానరాదు. ఆ కారణమున నాతని కొఱతవేసి చంపునటుల శిక్ష విధింపఁబడియెను. కాని ఆశిక్ష వెంటనేగాక కొంతకాలమైన వెనుక నమలు జరుగుటకు తీరుమానింపఁబడియెను. రాజుగారి పట్టాభిషేకము కొలఁ

దికాలమున జరుగనై యుండెను. స్వప్రయోజకత్వమున రాయలు తన బాహుపరాక్రమమే తోడుగ హిందూ రాజ్యమొకటి సంస్థాపన మొనరించి రాజబిరుదము నందెను. కాని ఆతఁ డింకను పట్టభద్రుఁడయి రాజనామమును పొందినవాఁడు కాఁడు. హిందూశాస్త్రముల ననుసరించి పట్టాభిషేకమయిననేగాని రాచరిక మాతనియం దన్వయుక్తంబు గానేరదు. చంద్రచూడుఁ డీ సంగతి చెప్పునప్పటికి రాయ లందుల కంగీకరించెను. అట్టి సమయములందు నుత్సవముల జరిగించు నెడల ప్రజలకు రాజభక్తి నాటుకొనిపోవునని యాతని యూహ. అందువలన పట్టాభిషేక మత్యంతమహోత్సవముగ జరుపవలెనని నిశ్చయించెను. నందయును చంద్రచూడుఁడునుంగూడ నట్టి శుభసమయ మొకటి ముందుపెట్టుకొని గంగారాము నుఱిదీయుట శుభప్రదముకాదని ప్రబోధించిరి. ప్రత్యక్షమయిన నష్టములు కలిగినను కలుగకున్నను తత్కాలమున ప్రజలయుత్సాహ మొక్కింత తక్కువయై వారిమనస్సులకు భారముగా నుండక మానదు. రాజుగా రీ యుపదేశమును స్వీకరించెను. రాయలకు గంగారాముని బ్రతికి యుండఁగ నోడలొలిపించుట యన నంతరంగమున నిష్టము లేకుండెను. అదియే రాజు నాయుపదేశము శీఘ్రముగ నంగీకరింపఁ బురికొల్పినది. న్యాయపరిపాలన మొకవంక రాజధర్మ మొకవంక వేధించుటచేత ధర్మపాశబద్ధుండై యాతఁ డీశిక్ష విధించెను. అంతర్యమునంగల యనిష్టమునకుఁ గారణము శ్రీకిని గంగారామునకునుగల రక్తసంబంధమే. వీరిరువురు నేకగర్భజనితులు. రాయల కింకను శ్రీపై విస్మృతి కలుగలేదు. అమెను వెదకి వేసరి యెట్టులైన మరచిపోవుదమనువృత్తితో రాజకీయవ్యాపారములందు తనబుద్ధిని బ్రవేశపెట్టి రాజ్యాంగవిషయములఁ బనిసేయ మొదలుపెట్టెను. ఢిల్లీకి పోయినదియు, సార్వభౌమికసభాస్థలిని సందర్శించినదియు, అచ్చట సనదు సంపాదించినదియుంగూడ నిందులకే. అత్యుత్సాహముతో భూషణపురమునను తత్ప్రాంతమునందలి వంగదేశమునను నిరంకుశమైన యధికారము సంపాదించినదియు నిందుమూలముననే. శ్రీ యాతని హృదయపీఠమున నింకను పట్టభద్రురాలై యున్నది అది యే కారణముగా గంగారాముని శిక్షాకార్యమునకుఁ గడు వేర్పడియెను.

పట్టాభిషేక మతివైభవముతో జరుపుటకై సన్నాహములు జ

రుగ ప్రారంభమయ్యెను. ఏమూలఁ జూచినను ఆడంబరమె. ఎచ్చటఁజూచినను వినోదములె. దేశము నలుతట్టులనుండియును జనులు వచ్చిప్రోగు పడిరి. రాజులు రాజకీయోద్యోగులు బ్రాహ్మణులు విద్వాంసులు జ్యోతిషికులు సర్వవిద్యావశిష్ఠులు పామరులు పెద్దపెద్ద గృహస్థులు ఆహూతులు అనాహూతులు భిక్షుకులు సన్యాసులు సన్మార్గులు దుర్మార్గులు మున్నగువార లెందఱెందఱో వచ్చివిడిసిరి. అన్నిరకముల జనులును గూడవచ్చి చేరుటచే పట్టణమున నెక్కడనుగూడ సందులేక యుండెను. ఈచేరినవారందఱును చేయుచున్న కార్యములలో నగ్రగణ్యమైనవి విందులు. పట్టణమంతయును పారవేసిన తినుబండారములతో మోఁకాలు లోతుగ నుండెను పగిలిపోయిన మృణ్మయపాత్రములతోడను తినిపారవైచిన పుల్లెవిస్తరాకులతోడను మధుమతీనదియును పురముచుట్టునున్న యగడ్తయును నిండిపోయెను. ఆటలు పాటలు సంగీతములు సాహిత్యములు నేమూలఁజూచినను, ఊపిరి సలుపకుండ నుండెను.

ఈపట్టాభిషేకమునందలి ప్రధానాంగము ధర్మము. ఒకప్పుడు రాయలు తాను స్వయముగ, ఒకప్పుడు తనభృత్యగణముమూలముగ వెండి, బంగారము, కాంస్యము, వస్త్రములు మున్నగునవి పంచిపెట్టుచు ప్రొద్దస్తమానమును తీరికలేకయుండెను. తద్దానముల నాశించివచ్చిన వారలసంఖ్య లెక్క కెక్కువయగుటచే పగటికాలమంతయును చాలక రాత్రిపూట కూడ పనిచేయవలసి వచ్చెను. రాయలు మిగిలియున్నపని కనుచరుల నియమించి అంతఃపురమునకు విశ్రమింపంబోయెను. అంతఃపురము ప్రవేశించఁగనే సువర్ణచ్ఛాయగల యాస్త్రీవిగ్రహమె త్రిశూలమును చేతధరించి సర్వవిధముల దేవతారూపము ననుకరించుచు భయావహంబుగ నాతనియెదుట వచ్చి నిలువంబడియెను.

రాయ లత్యంతభక్తితో నామెకు సాష్టాంగ మెఱఁగి వినయవిధుల నడిపెను.

రాయలు—తల్లీ! నీవెవ్వరో యనుగ్రహించి చెప్పెదవా?

యయంతి—మహారాజా! నేనొకయాచకురాలను. నీవు ధర్మాత్ముఁడవన విని నీకడ నొకటి యాచింప వచ్చినదానను.

రాయలు—తల్లీ! గూఢముగ నేలమాట్లాడెదవు. నీవుపరదేవతవని తెలిసికొంటిని. నీవవతారము దాల్చినకమలవు. నాయెడ నను్గ్రహింపుము.

యయంతి—ఓసామంతుఁడా! నేనొక సామాన్య స్త్రీని. లేకున్న నిన్ను నే యాచింపరాను. ఈదినమున నీవర్థులేమడిగిన నదియెల్ల నిచ్చుచున్నాఁడవఁట. అట్టిప్రఖ్యాతినందిన నీకడ నాయట్టి దానికోర్కె నిరర్థకము గాదని యెంచి నిన్నొకటి వేఁడ వచ్చితిని.

రాయలు—ఓదైవతమతల్లీ! నేనీకీయరానిది యొకటి యుండునా? సమయమున నీవు నారాజ్యమును సంరక్షించితివి.ఒక్కసారి నాయర్థాంగిమానధనంబు గాపాడితివి. నీవుదేవతవైనను, మనుష్యసామాన్యవైనను, దానితో నాకుఁబనిలేదు. నీకునేలేదనఁగలగిన దెద్దియునులేదు. నీకేమి కావలయునో సెలవిచ్చుటయే తడవుగ నయ్యది సమకూరఁగలదు.

యయంతి—రాజా!గంగారామునకు మరణశిక్ష విధింపఁబడియెను. నేనిప్పుడాతని ప్రాణము నర్థింప వచ్చినదానను.

రాజు—ఏమీ?

యయంతి—రాజా! ఏమిది? ఇందసాధ్యమేమున్నది?

రాజు—నీచులలో నెల్లఁ గడునీచుఁడు గంగారాముఁడు. అట్టివానియెడ నీకీకరుణ కలుగుటకేమి కారణము?

యయంతి—మేముసన్యాసినులము, మాకనులకందఱును సమానులె.

రాజా—ఔనుగాని నీవేకావా? ఆతని త్రిశూలముతో పొడిచిచంపఁ బ్రయత్నించితివి. ఆతని తుచ్ఛకర్మములన్నియును నీవల్లనేకదా? రెండుమాఱులును బైటఁబడినవి. కరుణార్ద్రహృదయవై నీవు రాజపక్షమవలంబించి పనిఁజేయుటచేతనేకదా యాతఁడు తననేరము నొప్పుకొనియెను. అందువలననేకదా ఆతనికి మరణము లభించినది. అంతయు నైనపిమ్మట నేల ఇట్లు వర్తించెదవు?

యయంతి—అట్టికార్యము నేనప్పుడు చేసియుండుటచేతనే ఆతనిప్రాణము లర్థింపవలసివచ్చెను. ధర్మము విజయమునొందుటకు ద్రోహులను జంపించినందువలనఁ గలుగుప్రయోజనము గానరాదు.నిర్మలహృదయులు

కట్టి కార్యములనిన నుడలు కంపించును. ఇప్పుడు ధర్మము విజయ మునందినది, నరహంతకు నేను దూరస్థురాలనై యుండవలయుననినా కోరిక. అందువలన గంగారాముని ప్రాణములర్థించుచున్న దానను.

రాయలు—నేను నీ కీయరాని దెద్దియును లేదు. నీప్రార్థన మిదివఱకే యొసంగఁబడినది. గంగారాము నిప్పుడే వదలివేయించెదను. తల్లీ! నీకు నేను బహుమాన మిచ్చుపాటివాఁడనా? నేను నీకు దానము చేయఁగలనా? గంగారాముని జీవితము నేను నీ కమ్మెదను. దానికి నాకు మూల్య మొసంగవలెను.

యయంతి—చిఱునగవుతో అయ్యా! నన్ను నీకేమిమ్మ నెదవు? మూల్య ము రాజుదివాణమునకు పేదరాలొసంగఁ గలిగిన ధనమెద్దిగలదు.

రాయలు—రాజకోశములు రాజుయొక్క చైతన్యము నాశించుచుండు ను. నాఁడు మధుమతీ తీరమునందు మెట్లపైన ఫిరంగియొద్దనుండి నేనే పదార్థముకొఱకు తారులాఁడుచుంటినో యావస్తువును సమకూర్చెద నని వాగ్దానముచేసి యుంటిని. నాకదియ మూల్యముగ దయచేయు ము. గంగారాముని జీవితము నామూల్యమునకు నీకు విక్రయించెదను.

యయం:—రాజా! ఆయమూల్యద్రవ్యరాశి యెయ్యది? నీరాజ్యమున నీవు సుస్థిరుండవై యున్నాఁడవుగదా?

రాయలు—నేను ద్రవ్యరాశియడుగుచున్నాను. అందులకై ఈరాజ్య ముకూడ నిచ్చివేయుమనిన తృణప్రాయముగ నీయఁగలను.

యయం—ఐన నది యేదో చెప్పు చూతము.

రాయలు—నాప్రథమభార్య శ్రీ ఆమె నాప్రాణము నీవు దేవతవు. ఏవి కోరిన నది యీయఁగలవు. నాప్రాణమును నాకొసంగుము, గంగా రాముని ప్రాణములు గొనుము.

యయం—రాజా! రాజాధిరాజు ప్రాణమునకు నెప్పటికైన పాపకర్ముఁ డును ద్రోహియునగునాతని ప్రాణము సమానము సేయవచ్చునా? పగిలిపోయిన గుడ్డిగవ్వకు రత్నఖనియా?

రాయలు—తల్లీ! తల్లిదండ్రులు కోరినదానిని పిల్లవాఁడెప్పుడైన నొసం గఁ జాలునా?

యయం—రాజా! కానిమ్ము. నీయంతర్భవనములదారులెల్ల నేటిరాత్రి

తెలిచియుంచుమనుము. త్రిశూలములను ధరించి వచ్చినవారినెల్ల రానిమ్మని ద్వారపాలురకు శాసింపుము. ఈరాత్రియే మీమూల్య ము మీపడకటింటికి చేరఁగలదు. గంగారాముని విడిచిపుచ్చుము.

రాజీమాటలు వినునప్పటి కపరిమితానందమగ్నుఁ డయ్యెను. గంగారాముని తత్క్షణము వదలివేయు మని పరిచారకుల రావించి శాసించెను.

యయం——నీపరిచారకులవెంట బంధిఖానాకు నేనుకూడఁ బోవచ్చునా?

రాయలు——నీ కేమి చేయనలె ననియున్న నదియెల్లఁ జేయవచ్చును. నీ కేమియు నడ్డులేదు.

---

## ఐదవ ప్రకరణము.

గంగారాముని బంధించియుంచిన బందిఖానా యంధకార బంధురమై నేలపాలుగనున్నది. గాలిగాని, వెల్తురుగాని, లేదు. అందుమూలమున నేల తేమగనున్నది. ఆతనిబంధించిన సంకెలలు లతిభారమైనవి. రాత్రి తెల్లవారు దనుక నాతనికి కంటిపైఁగూర్కు లేదు. బ్రతికియుండఁగ తనను ఒడలి చర్మమొలిచివేయుదు రను శిక్ష యాతని చెవిఁబడినది. ఇంకనాతనికి నిదురపట్టలేదు. అన్నముపై విశ్రాంతిపై నాతనిమనస్సు పోవుటలేదు. మనుష్యుఁ డొక్కనిమిషములోఁ జావవచ్చును. మరణమొక గొప్పశిక్ష కాదు. రానున్న భయంకర శిక్షాస్మృతియే సహకారిగఁ జేసి స్వయంకృత దారుణాపరాధమునకు ఫలముగ దనకు మరణముకొలఁది దినములలో ననుభూతంబగు ననుతలంపు మదినిఁబట్టి వేధించుచుండ చీఁకటికొట్టులోఁ బెట్టి బాధించుటకంటె భయంకరమైన శిక్ష మఱియొక్కటిలేదు. అనుక్షణమును గంగారాముఁడు తనను నిలువఁబెట్టి యొడలొలుచుచున్నట్టె యాతఁడు మనస్సున యాతనపడుచుండెను. నిశ్చయముగ నాతనికష్టములన్నియును నిప్పుడు పుంజీభవించి యాతనిపైఁ బడినవి.ఎల్లప్పుడు నదియే యాతనయగుటచే నాతనిమనశ్శక్తి యంతయును నశించెను. ఆతనిమనస్సే యిప్పుడు కేవలాంధకారావృతమైయున్నది. అందువలన మనస్సునకు బాధననుభవించుశక్తిగూడ క్షీణించినది.ఆతనిమనస్సున రెండుబాధలుమాత్రము పట్టి పీడించుచున్నవి. ఒక్కటిభైరవి యనిన భ

యము. రెండవది రమపైఁ బగ. ఈరెండింటిలో మొట్టమొదటిదియే యెక్కువభయంకరముగనున్నది. గంగారామున కిప్పుడు రమపై విరక్తి కలుగుటయే కాక రమయనిన ఆతనికొక గర్భశత్రువువలె పొడసూపుచున్నది.

గంగారామునకు చేతనైన రమను గోళ్లతో చీల్చివేయవలెనని యున్నది. ఎప్పుడైనను ఆతని మనస్సు మనస్సులోనికివచ్చిచేరిన, నిమిషమందు రమను మట్టముసేయ నేమిసాధనమున్నదని యోచించుట దక్క ఆతనికి మఱియొక్కయోజనయే లేకుండెను. ఆతనికి తెలివివచ్చినపుడెల్ల తాను కొఱతను వేయఁబడునపుడు రమపై నసహ్యకరములగు నిందలు మోపుట యెట్లు లాయనునాలోచనలే చేయుచుండెను. సామాన్యముగ ప్రొద్దస్తమయమును ఆతఁడు మందునివలెపడియే యుండుచుండును. తనకు విధింపఁబడిన శిక్ష తలఁచుకొనునప్పటికి ఆతనికి గుండెలు బ్రద్దలగుచుండెను. పట్టాభిషేకసంబంధములగు సందడు లప్పుడప్పుడు వచ్చి యాతనిచెవులుఁ జిల్లులుపోవ సేయుచుండెను. ఆతనికి జైలులో నన్నము పెట్టుట కొక బ్రాహ్మణుఁడు నియమింపఁబడియెను. ఆతనినడిగి యుత్సవసంబంధమైన విషయములన్నియును దెలుసుకొనుచుండెను. రాజ్యమంతయు నామూలలనుండి యామూలలకు కేవల సంతోషసాగరమై పోయినదని యాతఁడు వినియెను.అతఁ డొక్కఁడు మాత్రము చీమలకు దోమలకు నాహారమై సంకెలలభారముచే లేవలేక భయంకరమైన చీఁకటికొట్టులోఁ బడియుండెను. "కట్టా? ఈపాడు రమ నావలె నెప్పుడీయుమయాతనఁ బొందునో? ఆరోజు చూచుభాగ్యము నాకు లభించునా?" అనియాతఁ డనుకొనఁజొచ్చెను.

కాలుక్రమిన యా కాశమున మెఱుపు తీగవలెనాతని మనస్సునకు "అక్కటా? ఇపుడు శ్రీ జీవించియుండెనా? ఎంత బాగుండియుండును" అనునొక యూహ తట్టెను. ఒకప్పుడు శ్రీ యాతని ప్రాణసంరక్షణఁ జేసినది. ఇప్పుడుకూడ నామె యట్టిప్రయత్నము చేసియుండిన నిర్వహింపకపోవునా? తానెంతదుర్మార్గుఁడైనను శ్రీ తన్ను విడనాడదని యాతనిధైర్యము. "అక్కటా? నాయట్టియభాగ్యున కట్టి సోదరి దక్కునా?" అర్ధరాత్రియైనది. ఆచీకటికొట్టుని ద్వారమునకు దగిల్చియున్న గొలుసు ఖంగు

మని చప్పుడయ్యెను.ఆచప్పుడుతో గంగారాముని ప్రాణములు మీఁదివి మీఁది కెగిరిపోయెను. అట్టి ప్రొద్దుగాని ప్రొద్దున కావలివాండ్రెందుల కా ద్వారము తెఱచియుందురు? మఱల నేదేని క్రొత్తవిపత్తు తటస్థము కా లేదుగద?

కారాగృహరక్షకులు చేత దీపములు పట్టుకొనియా కొట్టులోనికి పోయిరి. గంగారాముఁడు గ్రుడ్లు మిణకరించుకొని చూచుచుండెను.ఆత నినోటమాట లేదు. కాని యయంతిని చూచిచూచుటతోడనే "అయ్యో? అయ్యో? రక్షింపుము. రక్షింపుము. నేను నీకేమి యపకృతిఁ జేసినాను" అను కేకలకు దొరకొనెను.

యయం—నీవేమిచేసితివో నీవె యెఱుంగుదువు? ఐనను,నీవె బ్రతికి బైట బడితివి. శ్రీ నెఱుంగుదువా?

గంగా—శ్రీయా? ఆమె ఇంకను బ్రతికియున్నదియా?

యయం—శ్రీ జీవించియున్నది. ఆమె ప్రేరణమున నేను రాజును ప్రాధేయపడి నీప్రాణరక్షణమున కనుజ్ఞఁ దెచ్చితిని. ఇప్పుడు నిన్ను విడిపింపవచ్చితిని. గంగారామా ఇవతలకురమ్ము. రేపు తెల్లవారి నీవిక్కడ నెవ్వరికంటను బడరాదు. అట్లైన నిన్నురక్షించుట మాకెవ్వరికిని తరముగాదు.

గంగారామునకు యయంతి చెప్పిన దర్థమయ్యెనో లేదో చెప్ప లేము గాని యామాటలుమాత్రము నమ్మలేదు. కారాగృహరక్షకులు సంకెల వదల్చుచుండిరి. ఆతఁడూరక నిలిచిచూచుచుండెను. అనంతరము ఆతఁడు "తల్లీ! నిజముగనే నన్ను కాపాడినావా?" అనియెను.

యయం—నీయద్దువదలిపోయినది. ఇంక నీకాలికొలఁదిపొమ్ము.

గంగారాముఁ డతిశీఘ్రముగ తనపిక్కబలము జూపి, యారాత్రియె యానగరమునువిడచిపోయెను.

---

## ఆఱవ ప్రకరణము.

రాయలు గంగారాముని విడచి పుచ్చునటుల హుకుము సాదరు చేసెను.

యయంతి యాజ్ఞానుసారముగా అంతఃపుర ద్వారము లన్నియు తెఱ

చి యుంచ శాసించెను. అటుపైని శయనాగారమునకు పోయి శయ్యా పైఁబరుండెను. తక్షణమే నందవచ్చి యుచితోపచార విధులొనర్చు చుండెను.

రాయ——రమ యెట్లున్నది? అనియామెనడిగెను.

నంద——రమ రోగముచే మంచముపట్టినది. ఆమెకేమియు నారోగ్యము గలుగలేదు.

రాయ——ఈవిషయమునుగూర్చి తరువాత ముచ్చటింతము. ఇప్పుడు చాల ప్రొద్దుపోయినది. మిగుల నలసియున్నవాఁడను. నేనిప్పుడు వచ్చి యెట్లున్నదియును విచారించలేను నాకుమాఱుగ నీవుపోయి యామెను గూర్చి తగిన జాగ్రత్తఁ బుచ్చుకొనుము. నేనురాలేని కారణమును గూడఁ దెల్పుము.

సీతారాముని మాటలు వినినపాఠకులు పెదవి విరువక మానరు. ఈతఁ డిప్పు డిన్నాళ్ళవంటి వాఁడు కాఁడు. ఒకప్పుడు రాయలు హిందూ రాజ్యసంస్థాపనకై తనయావచ్ఛక్తియుక్తులను ధారఁబోసినవాఁడు పిమ్మట రాజ్యాంగవిషయము లన్నియును గట్టిపెట్టి శ్రీని వెదకుటయే పని గ పెట్టుకున్నవాఁడు. ఒకప్పుడు గంగారాము తనను శరణుజొచ్చినాఁడనుమాత్రమున పేరు నిలువఁబెట్టుకొనఁ దనప్రాణములనైన నాశింపకపని చేసినాఁడు. అట్టివానికే ధర్మపాశబద్ధుండై న్యాయకర్తగానుండి తనకర్తవ్యమును నిర్వహించుటకై మొన్ననే దారుణశిక్ష విధించినాఁడు. శ్రీమీఁదగల కేవలమోహాద్వ్యగ్రతచే నట్టివానినిపుడు విడచిపుచ్చెను. ఒకప్పుడు తనప్రజలను తనకంటె నెక్కుడు గౌరవముగఁ జూచుకొనునాతఁడు. ఇప్పుడు స్వకార్యధురుండైనాఁడు.

భర్తకిపుడే కాంతాధివాస మిష్టముగా నున్నట్టుగని పెట్టి నందమఱి మాటఁజెప్పక యచ్చటనుండి తరలిపోయెను. రాయలును ప్రక్కపైఁ బన్నుండి శ్రీయాగమనమును ప్రతీక్షింపుచుండెను.

ఉదయము మొదలు అస్తమయమువఱకు నొక్కటేమాదిరిని పని చేసియుండుటచే నాతఁడెంతయు పరిశ్రాంతుండయ్యెను. మఱియితరసమయము లందయ్యెనా యాతఁడు పాన్పుకన్నులఁ జూచుటయే తడవుగ నిద్దురకు పడియుండును. కాని ఈరాత్రి యాతని కట్టిదైనది కాదు. ఎవ్వరిని

మిత్తమై రాజ్యభారమంతయును నవ్వలకుఁద్రోసి సుఖమునెల్లఁ బరిత్యజించివాడవాడల వెంటఁ ద్రిప్పెనో ? దేనిస్మరణానలము హృదయముల్లనె దహించి వేయుచుండెనో ? యట్టితరుణీమణి నింక కొన్ని నిమేషములలో నాతఁడు తనయక్కునఁ జేర్పనెంచి యున్నవాఁడు.

కాని నిద్రాదేవత ప్రభావము జగత్తునంతయును జయింపసమర్థమైనది. మనుజులెట్టి కష్టములలో నున్నను నెప్పుడో యొకప్పుడామె యాతనికి దర్శనమొసంగక మానదు. రాయలస్థితి యిప్పుడేవిధముగఁ జూచినను నంతవిపత్కరమైనదిగఁ గానరాదు. ఇప్పుడాతని నానందమావేశించినది. తనయోఁచనలెల్ల తల్లగ్న మొనరించినాఁడు. ఇంతలో నొక్కనిమిష మాతనికి నిద్రమత్తు వచ్చినది. మనస్సుద్రేకమును పొందియున్నప్పు డట్టి మత్తువిశేషకాలము నిలిచి యుండదు. కొన్ని నిమిషములలోపలనే యాతఁ డులికిపడియెను. కన్నులు విచ్చిచూచునప్పటి కాతనియెట్ట యెదుట నాతని మనోహారిణియగు స్త్రీ జడలు కట్టుకొనిపోయిన శిరోజములతో కాషాయవస్త్రములధరించిన మేనితో రుద్రాక్షమాలికల ధరియించిన కంఠముతో నెదుట సాక్షాత్కరించెను.

ప్రప్రథమమున రాయలామెను యయంతిగా భ్రమించెను. శ్రీయేమైనదని యడిగెను. ఆయుత్తరక్షణముననే యామె యయంతికాదనియును శ్రీయే యనియును తెలిసికొనెను. ఆమె యూనవాలు తెలియఁగనే "శ్రీ! శ్రీ! ఓ శ్రీ! నా శ్రీ! యని పెద్దపెట్టున కేకలువైచుచు ప్రక్కపైనుండి లేచి బాహాపరిరంభోద్యుక్తుం డయ్యెను. ఆతని మనస్సానందసాగరమున మునిఁగెను. కన్నులు మూతవడియెను. మఱలఁ బ్రక్కమీఁదఁబడియెను. ఒక్కింతసేపటిలో మఱల స్మృతిఁగాంచెను.

మొగముపైకెత్తి ఆమెయందు తనకుగల తసవితీరని మమకారమును వెలార్చుచు అతిచంచలంబగు చూడ్కుల నామెపై నిగుడించెను. నయనము లానందము నొందువఱకును వాక్కునకు తదంతరంగభావముల వెలార్పశక్తిచాలకయుండుటచేతనో నాఁగ నధరోష్ఠములు విడివడకుండెను. అట్లుచూడఁగఁ జూడఁగా అత్యానంద తరంగితంబగు నాతనివదనంబు కొంతసేపటికి తనహర్షసౌష్ఠవంబును గోల్పడి నిట్టూర్పొక్కటి బైలువెడలెను. రాయలంత, శ్రీ, అనియామెను సంబోధించెను. అప్పుడాతఁడా

మెయాతని శ్రీకాపఁనుకొనఁబోలు. ఆతనియెట్టయెదుట నిప్పుడున్నది యొరులకజేయంబై నిశ్చలతరంగనిమూర్తిమంతమైన శాంతము. అశ్రుధారా సంపాతముననైన కళంకముండెంద తేజోవంతమైన సౌందర్య రాశి అయ్యది రూపముదాల్చిన యౌదార్యము. దేవతావిగ్రహముగాని శ్రీ విగ్రహహమా ?

అక్కటా ? రాయలు కేవలతుచ్ఛసుఖమున కాశించి రాజపత్నీ సదృశంబై నతరుణికై పెనగులాడుచున్న వాఁడు. ఆతనికి దేవతశోఁబనియే మున్నది ?



ఏడవ ప్రకరణము.

రాయలును శ్రీయును ఒండొరులు ముచ్చటించుకొనిరి. శ్రీకొఱకై రాయలు సర్వమును పరిత్యజించి ప్రపంచమంతయు నెట్లు పరిభ్రమించెనో యామెకు నివేదించెను. శ్రీయును తనచరిత్ర కొంతవఱ కాతనికిఁదెలియఁబల్కెను.

అనంతరము శ్రీ " నేనిప్పుడు చేయవలసిన దేమి ?

అని యడుగునప్పటి సీతారాముని కన్నులవెంట బాష్పోద్గమంబయ్యెను. ఇన్ని దినములకు భర్తనెడఁబాసియుండిన స్త్రీ తత్సమాగమమును పొందియున్న వేళ " నేనిప్పుడు చేయవలసినదేమి ? " అను ప్రశ్న యే నా వేయవలసినది ! ప్రశ్నమున కుత్తరముగ " తాడొకటి యాదూలమునకు వ్రేలాడఁగట్టుము. నేను నాశిరస్సునందులోదూర్చి యుఱిఁబెట్టుకొనెదను. " అని చెప్పనెంచెను.

కాని యందులకు ప్రత్యామ్నాయముగ "అయిదు వత్సరములనుండి నాకనురూపంబైన పట్టమహిషికొఱకయి యన్వేషించుచుంటిని. నీవిప్పుడాపదవిని స్వీకరించి రాజమందిరముకుదేదీప్యమానముగఁ జేయవలయు."

శ్రీ—ఆర్యా! నందకువచ్చిన పేరును ప్రఖ్యాతియును చాలవఱకు విన్నదానను. అట్టి స్త్రీ నీకు మహిషియగుట నీ వెంతయు ధన్యుండవు. ఇంక నొకరికొఱ కాశింపకుము.

రాయ—నీవు పెద్దభార్యవు. నందనుగుణసంపత్తి యెట్టిదయినం గానిమ్ము నీవు నీస్థానము నేల స్వీకరింపవు?

శ్రీ—ఒకప్పుడు వైకుంఠమునందలి లక్ష్మీపదవినైన వదలి నీతోడతో డు నీడఁగనుండి నీసింహాసనము నధివసింపవలెననియుండెడిది. ఆకాలముదాఁటిపోయినది.

రా—దాఁటిపోయిన దనెదవేల? ఎందులకు దాఁటిపోయినది.

శ్రీ—నేను సన్న్యాసినిని. ఐహికసుఖములకు స్వస్తిచెప్పితిని.

రా—భర్తగల స్త్రీకి భర్తృసేవా తత్పరతకన్న వేఱుసన్న్యాసము లేదు.

శ్రీ—ఐహికసుఖముల నెల్లఁ బరిత్యజించినవారికి భర్తృశుశ్రూషాపరత్వముతోగాని, దైవతారాధనలతోగాని, ఏమియును పని లేదు.

రా—ఎవ్వరుగాని సర్వసంగపరిత్యాగము చేయలేరు. అట్టికార్యమున నీకుమాత్రము విజయముకల్గెనా? గంగారాముని సంరక్షణయందు నీకెప్పుడైన నేమరుపాటుగల్గెనా? ఈనాసందర్శనముకూడ నొకానొక కార్యార్థమేకదా?

శ్రీ—అదినిజమే. నావిరాగిణీత్వమున కయ్యది యొక్కింతలోపమేయగును. ఒక్కవిషయమునందు పరిచ్యుతింగాంచిన తక్కినభగవత్కైంకర్యములన్నియు విసర్జింపవలసినదేనా?

రా—భర్తృసమాగమము స్త్రీలకు భక్తిలోపము గలిగించుననియా నీయాశయము. ఈదుర్బుద్ధి నీకెవ్వరుగఱపినారు? సరే? దాసినటుంచుము. నేను నీభర్తను. నీపై నాకధికారముగలదు. అట్టిదుర్మార్గమునుండి మరలించుభారము నాపైనున్నది. ఆయధికారానుసారముగ నేను నిన్నిప్పుడు పోనిచ్చువాఁడను గాను.

శ్రీ—నీవు నాకు రాజవు. భర్తవు. పైపెచ్చు ఉపకారివి. నేను నీకడనుపకృతిని పొందినదానను. అందువలన నీసెలవయినంగాని నీ సన్నిధానమును విడిచిపోఁగలదానను గాను.

రా—నీవు చెప్పినట్లు నేను నీకు భర్తను. రాజును, ఉపకారిని. అందుమూలమున నా సెలవయినంగాని నీవు నన్ను విడిచిపోవరాదు. నీయందు నాకు మోహముండుటచే నిన్ను విడుచునందాఁక నీవుపోరాదని యెందుకనరాదు. అనురాగానుబంధమును త్రెంచుటయెట్లు?

శ్రీ—రాజా! ఆమంత్రము నాపైఁ బనిచేయుకాలము దాఁటిపోయినది. ఎవ్వనికిప్రేమయుండునో యాతనికి భక్తియును సుఖమును కరగతము

లు కాని యయ్యెవి యెదటివాని కేమి యుపయోగము. ఒకమట్టిబొమ్మ నుచేసి చందనపుష్పాదులనర్చింపుము. నీకుభక్తియును, ఆనందము నుకల్గును. అందువలన ఆబొమ్మ కేమిప్రయోజనము గలదు?

రా—ఏమి యీదారుణ యోచనలు ?

శ్రీ—ఇందు విపరీతమేమియును లేదే? ఇది అమృతసారమైనవాక్యము. భగవంతుఁడన్నింటనుగలఁడు. ఆతనియం దనురక్తియె సర్వప్రాణులకును భక్తికిని ఆనందమునకును మూలాధారము. అందువలననే సర్వసమానురాగ ముదయింపవలయునని విధింపఁబడినది. స్త్రీపురుష సాంగత్యమను ననుబంధము భగవంతునకు లేదు. ఆతనికడసుఖ దుఃఖములకు భేదము లేదు. జీవజంతువ్రులయందలి యాత్మ భగవదంశ యే. అందువలన నిచ్చటయును నాభేదముండరాదు. మనకాతనియం దంకురించుభక్తివలనఁ గాని అనురాగము వలనగాని యాతనికి ఆనందము కలుగఁబోదు. కాని మనయెడ నెవ్వఁడైన ననురక్తుఁడై యుండినందు వలన మనకు సుఖము కలుగుచున్నదే. దాని కేమందు వందురా? అయ్యది యెంతయు మాయా విమోహితము.

రా—నీకెవ్వరో కృత్రిమసన్యాసని యొకర్తు తుచ్ఛము లైనబోధనలమప్పినది. స్త్రీబుద్ధి కడు తేలిక యైనదినదికాదు. శ్రేయోదాయకమైన యోగ్యమైనయుపదేశము నీకొక్కటిచేసెద. నామాటవినుము. మనయుభయులకును అగ్నిసాక్షిగ వివాహముజరిగినది నాతోడిసాంగత్యమే నీకుభక్తి. అదియే నీకుముక్తి. మఱియెద్దిమఱియును గాదు. ఆపైననీకు నేపాలకుఁడను. జనులుభక్తివిచ్యుతులుగాకుండ కాచి కాపాడుట రాజునకు ధర్మము. భార్యకు పతి శుశ్రూషాధర్మముల నెరవేర్పుట పతికి విధ్యుక్తధర్మము. అట్టి సన్మార్గమునకు నిన్ను మఱలించుటనాకువిధి. నిన్నిపుడు నే పోనీయను.

శ్రీ—నీవునాకుపతివనియు, రాజవనియు, ఉపకారివనియు. మున్నే చెప్పియుంటిని. ఇప్పుడప్పుడనక నాకు నీయాజ్ఞలెల్లప్పుడును శిరసావహింపఁదగినవి. నాసాంగత్యమువలన నీ కేమియును, సౌఖ్యము కలుగదని మాత్రము చెప్పవలసి యున్నది.

రా—మనమిద్దఱమును కూడియుండుటయే నాకుసుఖము.

శ్రీ—ఇంకొక్క ప్రార్థనయున్నది. దానితో నాచెప్పునది పూర్తి యగును. నన్ని గృహావాసకార్యముల నిర్బంధించి ప్రవేశపెట్టుచుంటిరి గాన నీరాజమందిరమునందు నన్నుంచుటకన్న నానిమిత్తమై చిన్నగుడిసె నొకటి గట్టించి అందునన్నుంచుటమేలు. నేనుసన్యాసినిని. రాజాంతఃపురము నావసతికొక్క నిమిషమైనను సరిపడదు పైపెచ్చు నేను జనులకందఱకును హాస్యాస్పదురాలనగుదును.

రా—రాజపత్ని వీథికి మూలనగుడిసెలోనుంచుట మాత్రము హాస్యాస్పదముగ నుండదా?

శ్రీ—నేను రాజపత్నినని యెవ్వరికిని తెలియనీయకుము.

రా—నేనునీయొద్దకు రావలదా?

శ్రీ—అయ్యది నీచిత్తముతో చేరినపని.

రా—నేను నిన్ను సమీపింపవచ్చునుగాని నీవుమాత్రము రాజపత్నినిగా ననుపించుకొనవలెననియా? అప్పుడు ప్రజలు నిన్నేమందురో యెఱుఁగవా?

శ్రీ—ఎఱుఁగకేమి? ఎఱుఁగుదును. ప్రజలు నన్ను రాజాగారి రాణివాస పరిజనములోని దాసినియే యందురు. నాకు మానావమానములు సరిసమానములు, ప్రజలెట్లు చెప్పిన, జెప్పికొననిమ్ము. నాగౌరవాగౌరవములు నీచేతిలోనున్నవి.

రా—నీయుద్దేశ్యమేమి?

శ్రీ—నేను నీకాధ్యాత్మికవిషయసహచారిణి నగుదును. అందులకుఁ దక్క మఱి యొక్కపనికి నన్ను నియమింపకుము. ఆధ్యాత్మిక సౌఖ్యములకుఁ దక్క తక్కినవానికి యింద్రియ వ్యాపారముల వినియోగించుట కేవలము పాపవృత్తము. కేవలవిషయలోలత పశుకర్మ. వివాహము విహితమైనది పశుకృత్యములకై కాదు. పశువులలోఁ బరిణయ విధిలేదు. వివాహానుబంధము ఆముష్మికవిధులకై యేర్పఱుపఁబడినది. రాజఋషులు తమయాత్మలు పూర్ణముగ నైర్మల్యమునందువఱకును పత్నీసమాగమము నాసింపరు. ఇంద్రియసుఖములకు దాసులగుట పాపములకెల్ల మూలము. నీయాత్మనైర్మల్యమునందు దనుక, పాపరాహిత్యము నిన్ను జెందుదనుక, కేవలనిష్కల్మష సంభా

వణయేమన యిద్ధఅప్రసంగముగ పరిణమించుదనుకనే నీకాషాయవస్త్రములనె ధరించియుండెదను. రాజా! అంతవఱకు నేనీ జేఁగురు బట్టలను విసర్జింపను. నీవు నాకు దూరముగ నాసీనుండవు కావలయు.

రా—నేను నీకు భర్తను. నామాటసాగవలయు, అదికదా ధర్మము.

శ్రీ—ఒకప్పుడు నీవు బలవంతుఁడ వగుటచే అప్పుడట్టిదియే ధర్మమైన కావచ్చును. ఇప్పుడు నాకుఁగూడ బలము వచ్చినది. అరణ్యముననే నేకాంతాధివాసము చేయుచున్నాను. నావృత్తిననుసరించియున్నవారికి సర్వదా విపత్తులు దరిదాపునవసియించియుండును. అట్టివాని నేమిటిలక్ష్యము సేయకుండ వారు సంచరించుట సుప్రసిద్ధము. అట్టిచిక్కులకులోను గాకుండ సామాన్యముగ మాయొద్ద విషయము సంసిద్ధముగనుండును. అట్టిది నాయొద్దమాత్రము లేకుండనుండునా? అవసరము వచ్చిన నదియె నాకు శరణ్యమగును.

ఓ దైవమా? ఈ శ్రీ సీతారాముని పూర్వపుశ్రీయా?



## ఎనిమిదవ ప్రకరణము.

రాయలందలి యాథార్థ్యమును గ్రహింపలేకపోయెను. ఆతని మనస్సు చెప్పినట్లు వినుట లేదు. తనకు ప్రేమైకస్థానమగు పదార్థము మృతినొందినను మనుజుఁడు తత్సమీపముననే తిరుగులాడుచుండుట సదా మనము చూచుచునే యుందుము. ప్రాణము పోయినను కొంతదనుక పోయినట్టులా తనిమనస్సున నమ్మకము కలుగదు. పిచ్చియెత్తినమనుజునివలె నూపిరియున్నదో లేదో చూచుటకై అద్దముకొఱకు వెతుకులాడుచుండును. ఒక సంపూర్ణవత్సరము రాయలమనస్సున శ్రీనొకదైవముగా నమ్మి భక్తితాత్పర్యములతో నారాధించెను. బహిశ్చారిణియగు శ్రీమాట యెట్లుండినను అంతశ్చారిణి యగు శ్రీమాత్రము యథాస్థితినే పొందియుండెను. బహిశ్చారిణియగు శ్రీనే రాయలు తనహృదయపేటికయందు నిక్షిప్తము చేసినాఁడు. ఆ బాహ్యశ్రీయే ఇప్పు డాతని యెదుట సంచరించు శ్రీ, హృద్గతమైన శ్రీకిని ఆమెకును భేదమేమి? ఈ రెండింటికిని భేదమున్నదని రాయలొక్క నిమిషమైనను తలంచలేక పోయెను.

మనుజులు విశ్వాసము లితరవిషయములం దెవ్వరి కెట్లుండినను అందఱునుగూఁడ మనుజప్రకృతి యెన్నియవస్థలఁ బొందినను ఒక్కమాదిరినేయుండునని మాత్ర మనుకొనుచుందురు. ఈదేహమునందే మనుష్యప్రకృతి యెన్నిసారులు జరామృతులం గాంచుచుండునో యెఱుంగంజాలరు. అట్లే రాయలును తనశ్రీ యీదేహముననే యీబాహ్య ప్రపంచము విడిచిపోయిన దనియును, మఱియొక శ్రీ మఱల యవతరించిన దనియును తలంచలేక పోయెను. అదియే కారణమున నాతని శ్రీయే యీశ్రీయనుకొనుచున్న వాఁడు. శ్రీయెంతగట్టిగ చెప్పినను ఆమెమాట లేమియును ఆతఁడు పాటింపలేకపోయెను. అట్టితలంపులాతఁడు తనమనంబునఁ జాఱచ్చి నాఁడు కాఁడు. ఆశ్రీ నేయాతఁడు పరిత్యజించెనేని ఆతనికీ ప్రపంచకమునందలి యన్నిఁటియందు ననురక్తిఁ గలిగియుండును.

కాని యెన్ని చెప్పినను శ్రీ రాజాంతఃపురమున నుండుట కంగీకరించలేను. చిత్రవిశ్రమమను సుందరమైన చిన్న విహారభవనం బొకటియామెకొఱకై కట్టించి అయ్యది ఆమెకు నివాసస్థానముగా నొనరించెను. అచ్చట శ్రీ వ్యాఘ్రాసనం బొక్కటి పఱచుకొని యందు సుఖాసీన యయ్యెను. రాజనుదినము నావిహార భవనంబునకు వచ్చుచు పోవుచు నుండెను. దూరముగ మఱియొక యాస్తరణపైఁ గూర్చుండి యామెతోఁడగొంత తడవు ప్రసంగించి యాతఁడు మఱల వచ్చుచుండును. కాని రాజునకుమాత్రమీయది విషతుల్యమయ్యెను.

ఓపాఠకులారా! వారిప్రసంగవైచిత్ర్యమును యోచించి చూడుఁడు. రాజెప్పుడు మాట్లాడినను మోహవిషయమగుమాటలే మాటాడఁజొచ్చెను. శ్రీ చిరకాలము తనకంటికగుపడకుండుటచే నాతఁడుపొందిన యాతనలన్నియునునే కరుపుపెట్టుచుండెను. శ్రీలేకుండ తనజన్మమునకొకనిమిషమైన సుఖములేదని చెప్పుచుండెను. ఆమెకొఱకు రాజ్యమునలుదిక్కులకును తానెట్టులన్వేషకులఁ బంపినదియును, అన్వేషణమెట్లునడపి నదియు సవిస్తరముగ నామెతో నివేదింపుచుండెను. రాయలతో శ్రీ తాను జూచిన వేనవేలు పర్వతపంక్తులను ఆరణ్యభూములును, వనమృగములును, పక్షిసంకులంబులును, కందమూలఫలాదులును, వివరించి చెప్పుచుండెను. యతులనుగూర్చి పరమహంసలనుగూర్చి బ్రహ్మ

చారులను గూర్చి ఆ స్త్రీకతానా స్త్రీకతలంగూర్చి చలాచల స్థితిగతులం గూర్చి ప్రసంగించుచు నెన్నియో పురాణగాథలు, ఎందఱివో స్వదేశ పరదేశరాజుల చరిత్రములు ఎన్నెన్నియో వారియాచార వ్యవహార ములు వివరముగ చెప్పుచుండెను.

పృథగా స్తరణాసీనుండయ్యును, రాజు సావధానమనస్కుండై యాకథలు వినుచున్న కొలఁది యాతనిస్థితిగతులె తారుమాఱయి విపత్ప రంపరల నుచ్చస్థితి నందుచుండెను. ప్రసంగమెంతయు మనోహరముగ నుండెను. ప్రసంగమునకంటెఁ బ్రాసంగికురాలు మఱింత మనోహర ముగ నున్నది. నిప్పిదివఱకే యంటుకొనినది. అప్పుడయ్యది రాజిమంట మండసాగెను. శ్రీ మొట్టమొదట నుండియును, హృదయంగమముగనే యుండెను. చెట్టు పలవలలోఁ గూర్చుండి చీరచెఱఁగల్లల నాడించియుద్ధ విజయమునఁగాంచినయా శ్రీమనోజ్ఞత్వమున నీ శ్రీసుందర తీసికట్టుగనుం డెను. దేహారోగ్యము, మానసిక పారిశుద్ధ్యము, ఈరెండును మనుజునియవ యవమనోహరత్వమునకు మఱింతశోభను గలిగించును. శ్రీకి శరీరారోగ్య మునుమనఃపారిశుద్ధ్యమును, మునుపటికంటె నూఱుమడుంగు లభివృద్ధిం గాంచెను. తన్మూలమున నామెయవయవసౌష్ఠవమును తన్మనోజ్ఞతయును మిక్కిలిగ విజృంభించెను. శ్రీయారోగ్యమిప్పుడు విడుచుచువిడుచు చున్న యుదయకాలపుష్పమునను కరించియుండెను. పరిపక్వదశ నొందని తేకొ క్కటియును లేదు. రూపురేఖలయందొక్కింతయు నులోటు లేదు. ఎక్క డను రంగు చెడ లేదు. మిక్కుటమగు నెండ వేఁడిమిచేవాడిన భాగమెద్దియు నుగానరాదు. అంతటను నైగనిగ్యమే. అంతటను జల్లఁదనమె. అంతటను శో భాకరవర్ణమె. శ్రీయవయవములు నవయౌవన ప్రాదుర్భావముం జెందినవి. ఆమెస్వతస్సిద్ధముగ సౌందర్యరాశియని చెప్పనొప్పు. మనస్సు పావనమైనది. వికారోద్రేకములన్నియును తగ్గినవి. ఆందోళనములన్నియు వదలిపోయి నవి. కోరికలన్నియు నశించినవి. పరిపూర్ణమైన భక్తి, పరిపూర్ణమైనప్రే మ, మనుష్యప్రకృతి కనురూపంబై నజాలి. ఇట్టిసుగుణసంపదలన్నియు ను ఆమెకడ మూర్తీభవించియున్నవి. సౌందర్యమచ్చుట రూపొంది నది. విచారమనునది యామెఛాయనైనఁ బ్రొక్కఁజాలకున్నది. కేవ లేంద్రియ సౌఖ్యమునుతలంపు లామెకు కడుదూరముగ వర్తించుచు

న్నవి. వాంఛ లేమియును లేవు. ఎంతమార్దవము ఎంతసుఖము! ఎంత హార్ద భావము! ఈభువనేశ్వరీ విగ్రహముపొంత నాసింహవాహనా రూఢయగు చండికావిగ్రహము సామ్యమునకైన నిలువనోపునా! ఆ మనోహరప్రసంగంబున, ఒకప్పుడు దేశదేశముల వింతలు ఒకప్పుడు చిత్ర విచిత్రములైనవిషయములు, ఒకప్పుడు అశ్రుతపూర్వములైనగాథలు, అమృత రసప్రవాహమువలెఁ బ్రసరింపుచుండ, ఒకప్పు డాశ్చర్య ము ప్పొంగును. ఒకప్పుడు మానసమానందమున వెల్లువలై పొఱుచుండును ఒకప్పుడు వేదాంతజ్ఞానము వెల్లివిరియుచుండును. హృదయంగమంబై యుభయథా యింత మనోహరంబుగనున్న సురూపమునుగాంచిన నిం ద్రియనిగ్రహము లేని మనుజునకింక మనోనిశ్చలత యన నెట్టిది? అగ్ని రగుల్కొనినది. సీతారాము నిల్లు నలుతట్టుల నంటుకొనినది. సీతారాముని సంపూర్ణవినాశనమునకుఁ గారణభూతురాలు శ్రీయే.

మొట్టమొదట రాయలు ప్రతిదినము నొకటిరెండు గంటలు చిత్త విశ్రమమునకు పోయి యామెతో ముచ్చటించి తిరిగివచ్చెడువాఁడు క్రమ క్రమముగా నచ్చట నుండుకాలము హెచ్చైనది. దూరముగాఁ గూర్చుం డినను, రాయలు నిద్రాహార వాంఛలచేఁ దూలిపోవు దనుక అచ్చట నుండి రాలేని స్థితివచ్చెను. ఈకాల విలంబముకూడ మిక్కిలి చిక్కుగ నెయుండెను. రాత్రి తిండికిని పడకకునుగూడ నచ్చటనే, యేర్పాటుఁగా వించెను. ప్రక్కగదిలోపలనే పక్క వేయించుకొని పండుకొనియుండె డువాఁడు. శ్రీవ్యాఘ్రాసనము మాత్రము సమీపింప సమర్థుండు కాక యుండెను. శ్రీతోడి, యీయర్థసాంగత్యము రాయలమనంబున కెంత యు బాధాకరంబుఁగ నుండెను. రాత్రియంతయును అచ్చటనె గడ పుచు ప్రొద్దునలేచి నపుడుంగూడ ఆలస్యముగ లేచుటచే మందిరమున కుఁబోవు నప్పటికి ప్రొద్దెక్కిపోయెడిది. ఉదయముపూఁటకూడ కొంత సేపు శ్రీతోడ సంభాషింపకుండ నుండలేక పోవుచుండెను. లేచుటకిం కను తడవైనయెడ మధ్యాహ్న భోజనమునకుఁగూడ నచ్చటనే యేర్పా టులఁ జేయుచుండెను. భోజనానంతర మొక్కింతసేపు విశ్రమించి రా జ్యకార్యములఁ జక్క పెట్టుటకై మధ్యాహ్నము రాజభవనమున కరి గెడివాఁడు. తరువాత తరువాత రాజ్యకార్యములు నిర్వహించుపనికూడ

వెనుకకుఁ బట్టుచువచ్చెను. చిట్టచివరకు రాజమందిరమునకు వచ్చినను, ఒక్కసారి అటునిటుఁ దొంగిచూచి చిత్తవిశ్రమమునకు మఱలిపోవుచుండెను. విశేషకాల మాస్థలమునువిడిచి యుండలేక పోవుచుండెను. తుదకు చిత్తవిశ్రమమే యాతనికి వాసభవనంబయ్యెను. రాజభవనమునకు పోయెనో కాలక్షేపమునకై గాని మఱియొక్క పనికై కాదు.

అదియటుండ వ్యాపారమున్న వారెవ్వరునుగూడ చిత్తవిశ్రమములోపల నడుగు బెట్టరాదు. దానియంతరము చీమకు దోమకునైనఁ జొరనశక్యముగ నుండెను. వేయేల? రాజ్యకార్యము లన్నియును పరిసమాప్తము నొందినవి.



## తొమ్మిదవ ప్రకరణము.

రామచందు శ్యామచందు అనునిష్కల్మష హృదయులగు నిద్దఱుగృహస్థులుమహాప్మదు పురవాస్తవ్యులు.ఒకనాఁటి యుదయమున వారిరువురును చండీమండపమున హుక్కాపీల్చుచు సంభాషించుచుండిరి. వారి సంభాషణము మాపాఠకుల కొక్కింత తెలియవలసి యున్నది.

రామ—అన్నా ! మంచిదిగాని చిత్తవిశ్రమము నందలి విశేషము లేమైనం జెప్పఁగలవా ?

శ్యామ—అన్నా ! ఇట్టికార్యములు సర్వసామాన్యముగా రాజ్యాధికారము నందున్న వారికందఱకు నున్నవే? నీవెఱిఁగిన వారిలో నిట్టివారు కానివారెవ్వరు? రాజులంగూర్చి రాజకుమారులం గూర్చి ముచ్చటించి యేమిప్రయోజనము? కాని, అట్టివారిలో మన రాజే మెరవడి. అతని కిదియొక్కటియే లోపము.

రామ—అవు నది నిశ్చయమే? కాని యిదివఱకు మన రాజట్టివానికిచోటిచ్చి నట్లు కనుపట్టదు. ఆతఁడు కడుభక్తి తాత్పర్యములు కలవాఁడు. అందు మూలముననే యింతవఱకు యోచింపవలసి వచ్చినది. మొన్నటివఱకు సీతఁ డట్టిపనికి తగిన వాఁడు కాఁడు.

శ్యామ—మనరాజు పూర్వపురాజు కాఁడనుచున్నారు. మనుజునివర్తన మెల్లకాల మొక్కమాదిరిగ నుండదు. ధనముహెచ్చి అవస్థమాఱుటతోడనే మనస్సుయొక్క స్థితిగతులుకూడ మాఱును. ఇంతదనుక

మనరాజ్యము శ్రీరామ రాజ్యముగానున్నది. ప్రజలందఱు సుఖముగ నున్నారు. ఇఁకముం దట్లు సాగునో సాగదోయని సంశయము గానున్నది.

రామ—అవును. ఈచిత్తవిభ్రమ విషయ మారంభమైనది మొదలు సంగతి సందర్భములన్నియును, తాఱుమాఱుగ నున్నవి. రాజు నింతవఱకు వలలో వేసికొనుటయనిన సుసాధ్యమైన వ్యాపారము కాదు. ఈయోఁడుది సామాన్యపు టాఁడుది కాదు. ఆకాశమునుండి యూడిపడి తనరాజ్యము నిచ్చట స్థాపించినది.

శ్యామ—ఆమెను భైరవియో యెవ్వరో యని చెప్పుకొనుచున్నారు. శివశక్తులు మంత్ర మాహాత్మ్యమువలన భైరవులుగ మాఱిపోవుచుందురఁట. ఈమెజతక త్తె యింకొక ర్తె యున్నదఁట. ఆమె గాలిలోనే తిరుగుచుండునఁట. ఆమె నెవ్వరును పట్టుకొనలేరఁట.

రామ—దైవము మనకు శరణ్యుఁ డగు గాక. ఇప్పుడు మనరాజ్యము శివశక్తిచేతిలో నున్నది. ఇంక మన కేమయిన సౌఖ్యమున్న దందువా?

శ్యాము—బాగుగ యోచించి చూచినచో నట్లే కనఁబడుచున్నది. రాయలు రాజ్యకార్యములనిన పెడచెవినిఁ బెట్టుచున్నాఁడు. చూచుటయే మానినాఁడు. పూజ్యుఁడగు తర్కాలంకారుఁడే అన్నిఁటికిని దిక్కుగా నున్నాఁడు. కాని ఆతనికి యుద్ధములు తగాయిదాలు యేమి తెలియును? పులివీఁద పుట్టనబాబు సైన్య మొకటి వచ్చి పైఁబడుచున్నదని చెప్పుకొనుచున్నారు.

రామ—వచ్చినరానిమ్ము. మన మృణ్మయుఁడు లేఁడా?

శ్యామ—అట్టిసంగతు లితరుల కొప్పగింపవలసినవా? ఎవరి కేది విధాయకమో అది వారు చేయవలయును. మఱియొక్కరి కది బలవంత్రబ్రాహ్మణార్థము గంగారామదాసు ముచ్చట మొన్న మొన్నఁటిదేకదా? మృణ్మయుఁ డేమిచేయునో యెవ్వ రెఱుఁగుదురు? ఈతఁడు పోయి పగవారిలోఁ గలిసెనా? మనము తలదాచికొనుటకు స్థలమెక్కడనున్నది. నిశ్చయముగా నేదియో గొప్పవిపత్తు కనిపెట్టుకొని యున్నది.

రాఘ—మనయవస్థ యట్టులె యున్నట్టున్నది. అందువల్లనె ప్రజలొక్క

రొక్కరె మెల్లగ మనలనువిడిచి అవతలకు తారుచున్నట్లు కనుపట్టు చున్నారు. మొన్న తిలకఘోషు తనకుటుంబముతో జస్సోరునకు పోయినాఁడు. నేనప్పు డిందులకని యనుకొనలేదు. ఎందులకోయి! నీవు వెళ్లిపోవుచున్నావని యడుగఁగా "ఇచ్చట సరకులన్నియు ఖర మయినవి. అందువలన వెళ్లిపోవుచున్నా"నని చెప్పినాఁడు. ఈతీరుగా మున మనచుట్టు పట్టులనున్న కుటుంబములు కొన్ని తరలిపోవు చున్నవి.

శ్యామ—మనలో మనమాట. అన్నా! నేనుకూడ పెందలకడనె లేచి పోయెదను సుమా.

రామ—నిశ్చయముగా ఏకత్తికో యెరయగుటకు నేనుమాత్ర మెందుల కిచ్చట నూఁగిసలాఁడు చుండవలెను? కాని యీయిండ్లు వాఁకిండ్లు చాల వెచ్చపెట్టి కట్టినామోయి. నావంటి డబ్బులేనివానికి నివన్ని వదలిపెట్టి మఱియొక్కచోటికిపోవుటయనిన నొకపట్టున మనసొప్ప కున్నది.

శ్యామ—కాని అవస్థ మాఱిపోయినది. ఏమిచేయఁగలము. ఇల్లువాఁకిలి యునా? ప్రాణమా? ఏది? మనము ముందు కాపాడుకొనవలసినది. రాజ్యము నిలిచెనా? మరలవత్తము. మనయిండ్లు వాఁకిండ్లును ఎక్కడకును పాఱిపోవు కదా?

---

## పదియవ ప్రకరణము.

శ్రీ—రాజా! నీవు సదా చిత్తవిశ్రమముసందే నివసించుచున్నావు. నీరా జ్యకార్యము లెవ్వరు చూచుచున్నారు?

సీతా—నాకు నీవే రాజ్యమవు. రాజ్యమునందు నాకు నీయందుకంటె ఎక్కువతీపియా?

శ్రీ—రాజా! ఇవి యేటిమాటలు. నీవు హిందూరాజ్య సంస్థాపన మొనరించినది యిందులకా? నాయెదుట నీకది తృణప్రాయముగనున్న దా. నీ ప్రధానకార్యము లన్నియును బరిత్యజించి నాకా నీవు ప్రాముఖ్యము నిచ్చుచున్నది? ఈరాజు సీతారామరాయలేనా?

సీ—ఈ రాజ్యమన్ని రాజ్యములవలెనే చక్కఁగా నాఁటుకొనిపోయినది
శ్రీ—ఈస్థితినుండిన విశేషకాలముండునా ?
సీ—దీనిని నశింపఁ జేయుటకు సామర్థ్య మెవ్వరికున్నది ?
శ్రీ—నీవే దానిని నాశనముచేయువాఁడవె. వితంతువును స్వార్థపరిత్యాగమును రాజదండమును సరిసమానములైనవి. ఎప్పుడజాగ్రత్తగా నుండిన, అప్పుడే తూఁలిపోవును.
సీ—ఏవిషయమున నంతజాగరూకత కావలసినది ?
శ్రీ—రాజ్యధర్మముల నీ వెప్పుడైనను జూచుచున్నావా ? ఎల్లప్పుడును నీవు నాకన్నులయెదుటనే కనుపడుచున్నావు.
సీ—నేను రాజ్యధర్మములు చక్కఁగాఁజూచుట లేదని నీవుచెప్పరాదు. నేనీదినము రాజమందిరమునకు పోనిది? ఇతరులు సాయంతనము చేయుపని నేనొక్కతెప్పపాటులోఁ జక్కఁబెట్టుదును. అదిగాక పూజ్యుఁడు తర్కాలంకారుఁడున్నాఁడు. మృణ్మయుఁడున్నాఁడు. వారిద్దఱును చాలసమర్థులు. వారున్నంతవఱకును నే నెక్కడ నాడుకొన్నను భయములేదు.
శ్రీ—ఆనడుమ నిట్టిసమర్థులుండఁగనే కాదా ! రాజ్యము నాశనమగుటకు సంసిద్ధమైనది. అవశాత్సంభవముగ నీవాతరుణమున రాఁబట్టి కాని రాజ్యమీపాటి కేమైయుండునో ? మఱల నట్టివారి నేల నమ్మియుండెదవు ?
సీ—నిజమేకాని నే నిచ్చుటనేయున్నను, అశుగైన కదలుటలేదు. ఏదైన విపత్తు మఱల తటస్థమయిన యెడల కాపాడుటకు సంసిద్ధుఁడనయియున్నాను.
శ్రీ—అట్టి నమ్మకము నీ కొరులయందున్నంతవఱకు నీ వేపనియును మనస్ఫూర్తిగ సేయనేరవు.
సీ—నా కిప్పుడు దేనియందు శ్రద్ధ తక్కువగానున్నది ?
శ్రీ—నేను అబలను. పైగా సన్న్యాసినిని, రాజ్యాంగ విషయముల లోటుపాటులను నే నేమి చెప్పఁగలను? ఒక్క విషయమునమాత్రము నా మనస్సులజడి పొందుచున్నది. మూర్షిడాబాదు వ్యవహారములేమైనను తెలిసికొనుచున్నావా ? తోరబుఖానుఁడు పోయినాఁడు. పన్ని

ద్దఱు భూస్వాములపై నుండు నధికారమును క్రమక్రమముగ నొత్తి
గిలి పోయినవి. ఈ యపచారము లన్నియును దిగమ్రింగి యూర
కొనునా ?

సీ—ఆవిషయమై నీ వేమియును భయపడవలసినపని లేదు. మూర్ఖదుకూ
లీపన్ను చెల్లుచున్నంతవఱ కీవంక కాతఁడు కన్నెత్తిచూడఁడు.

శ్రీ—అతనిపన్ను చెల్లుచున్నదా ?

సీ—పన్ను సకాలములో చెల్లుటకేర్పాటు చేసితిని. ఇంక ఆఖరు కిస్తీ క
ట్టవలసియున్నది. ఖర్చులు చాల హెచ్చి మొత్తమై పోయినవి.

శ్రీ—అతఁడు నిద్రపోవుననుకొంటివా ?

సీతారాముఁడు తలవాలవేసెను కొంత సేపటివఱకును యేమి
చెప్పుటకును పాలుపోవక యూరకుండెను. తదుపరి యాతఁడేమిచేయు
చున్నాఁడో ఆసంగతి నే నేమియు లెక్కచేయ లేదని చెప్పెను.

శ్రీ—ఓ ప్రఖ్యాత పురుషుఁడా ! చిత్తవిశ్రమమునం దిప్పుడు నీకుఁ గలి
గియున్నపని మూలమున నీ సంగతులన్నియు మఱచినావా ? రా
యలు కొంత దనుక యోజించి “అట్లు లేయెనవి, నీ రూపరేఖా విలాస
ములు నా కేవనిమీఁదికిని దృష్టి బోనిచ్చుట లేదు. అట్లయిన నాదొక్క
ప్రార్థనమున్నది. నా యీ పాపపుముఖమును మఱల నీకుఁ గనఁబడ
కుండఁ జేయుదునా? లేకున్న సీతారామరాయుల పేరున కది యప
ఖ్యాతిఁ దెచ్చును. ఇందు మూలమున ధర్మరాజ్య మొకటి యంత మొం
దిపోవును. మరల నన్నరణ్య వాసమునకుఁ బోనిమ్ము.

రా—ఏమైనను గానిమ్ము. సంగతులన్నియు యోజించి చూచినాను.
నిన్నో రాజ్యమునో రెంటిలో నొకదానిని పరిత్యజింపవలెను. రా
జ్యమే పరిత్యజించుట మేలుగా నెంచినాను నిన్ను నే నెడఁబాయఁ
జాలను.

శ్రీ—అట్లే కానిమ్ము. నీ రాజ్యభారమును తగినవానికి ధారఁబోసి సన్యా
సివై నాతోడఁ గూడ నుండుము.

కొంతదనుక రాయలకేమి చెప్పుటకును తోఁచదయ్యెను. ఆలో
చనాధీనుండయ్యెను. ఆతనిమానసంబునవిషయప్రాపారవాంఛమిక్కిలి
తఱుచైనది. పూర్వపురాయులైన రాజదండమును సూక్ష్మముగ మఱియొ

కరి కొప్పగించియుండును. ఆతఁడిప్పుడు పూర్వపురాయలుకాఁడు. రాజ్యసుఖములకు మఱఁగి సీతారాముని మనస్సు చెడిపోయినది. రాజ్యపదవిని విసర్జించుటకు తగినధైర్యసాహసము లాతనికడనిప్పుడు నశించినవి.



## పదునొకండవ ప్రకరణము.

రమ దర్బారుహాలులోఁ గ్రిందఁబడి మూర్ఛనంది యిప్పటికి చాలకాలమైనది. పరిచారిక లిరువురు ఆమెను దోడుబట్టికొని పోయి శయ్యపైఁ బరుండఁజేసిరి. ఆదినమున రమ మంచమునుండి లేవనేలేదు. ప్రాణమునకు తెగించి యామె తనమానమును కాపాడికొనినది. ఆమె ఖ్యాతికేమియును కొఱఁతలేకుండఁ బైటఁబడినది. కాని ప్రాణముమాత్ర మపాయమునఁ జిక్కుకొనియెను.

రోగము జీర్ణించెను. మొదటినుండియు నీవ్యాధి పూర్వోత్తరములఁ బరిశీలించి చూతము. ఇప్పుడు మంచముపట్టియున్నది రాజుగారిరాణివాసము. ఉపచారవిధులకేమి లోటుండును? మొట్టమొదటి నుండియును వైద్యులను సమీపమునువచ్చి చూచిపోవుచునే యుండిరి. వారి కింతవఱకెప్పుడును తగినపనియే కలుగుటలేదు. వారికాలమంతయును పరిచారకులకు వీర్యవృద్ధికై మందులిచ్చుటయందునను, పరిచారికలకు ఉత్సాహమును బుట్టించి సంజీవనివలెఁ బనిచేయునౌషధము లొసంగుటయందునను, గడిచిపోవుచుండెను. అట్టివారు నేఁడు రాజపత్ని రోగియగుటచే నొక్కసారిగ పెద్దవైద్యులై పోయిరి.రోగనిదానమునకై యందఱును తలాయొక తెన్నున జుట్టు పీఁకుకొనుచుండిరి. ఒకనాఁడామెకు మఱపు తెలిపి,ఒకనాఁడు వాతము,ఒకనాఁడు పిత్తము,ఒకనాఁడు హృద్రోగము.ఇట్టిరోగముల పేరులు వినలేక రాజాంతఃపురవాసినుల చెవులు తడకలుగట్టుచుండెను.ఒకరుమాధవనిదానము, ఒకరుచరకము.ఒకరు శుశ్రుతము,తీసి ఆశ్లోకమును, ఈశ్లోకమును చదువుచుండిరి. రోగమూలము గాని, రోగముగాని, పట్టుకొనిన వారెవ్వరును లేకపోయిరి. కేవలమాశ్లోకము నీశ్లోకమును జదువుచు మాత్రమె కాలక్షేపము చేయుచుండిరను నపవాదవైద్యులపై మనము మోపరాదు.వారు ననేక విధములైన

మందులిచ్చి చూచిరి. చూర్ణములిచ్చిరి. తైలములు మర్దనలఁ జేసిరి. క్రొత్తక్రొత్త యౌషధములెన్నియేని జేయించిరి. తమయొద్దనున్న మందులే యమోఘములని వానినే సేవించుచువచ్చిరి. ఏమైనను గానిమ్ము, రాజుగారి యంతఃపురమున రాజపత్ని రోగిగానున్న సమయమున అవసరమున్నను లేకున్నను క్రొత్తమందులు తయారు కాలేదని చెప్పుట మాత్ర మసంగతము. ఆమందులపేరున వారికొక రెండుడబ్బులు, వీరికొక రెండుడబ్బులు, దొరక లేదని చెప్పుటకూడ నుచితమైన పనిగాదు. నిజమునకు గూడ క్రొత్తమందులు తయారు చేయించుటలో రాజపరిచారికాజనమంతయును నిద్రాహారములు లేకుండఁ బనిచేసిరి. ఒకచోట మూలికలు కల్వములలో వేసి నూరుచుండిరి. ఒకచోట చెక్కలు బెరడులు నొలుచుచుండిరి. ఒకచోట మృణ్మయపాత్రములలోను, వాలుకాయంత్రములలోను, శుద్ధికని తైలములును, రసములును, పోసి వండుచుండిరి. ఇవి యన్నియును జూచి పరిచారిక యొకర్తు "నేనును రాజపత్నినై రోగముచేఁ బడియుండుట మేలనిపించుచున్నది" అని యాశ్చర్యపడసాగెను.

ఎవరినిమిత్తమై ఈమందులు తయారైనవో వారీమందుల ముఖమైనఁ జూచియెఱుంగరు. వానిరంగైన నెట్లుండునో రమ యెఱుంగదు. అట్లని వైద్యులు మందు లిచ్చుటలో లోపముచేసిరని గాని అవిమంచిమందులుగావని గాని చెప్పఁబోవుట లేదు. ఎంత భక్తిశ్రద్ధలతోఁ బనిచేసినను వారిప్రయత్నము నిష్ఫలములై పోయెను. ఈలోపమంతయును రమదే. ఆమెయొక్క మందైనను, నాలుకమీఁద వేసికొనలేదు. మురళిస్థానమున యమునయను మఱియొక్క పరిచారిక యామెకుపచారము సేయుచుండెను. నంద యామెవయసుఁ గడిచినదియని, ఇచ్చట పరిచర్యకై నియమించెను. కాని యమునమాత్రము. తననెవ్వరైన వయసుఁ జెల్లినదియనిన నెగిరి పైఁబడుచుండును. అంతగపుర పరివారజన ముద్దేశ్యము మాత్రము దానికి ప్రతికూలముగ నుండెను. ఏది యెట్లున్నను యమున రూపము వయసుతిరిగిన దాసిరూపము ననుకరించియున్నది. ఆమె రమ నత్యంత శ్రద్ధాభక్తులతోఁ గాచి కాపాడుచుండెను. పథ్యపానములఁ జూచుట ఆమెకు నియామకమైనపని. వైద్యులిచ్చిన మందులన్నియును

నామెచేతఁ బడుచుండెను. రోగము రాకుండఁ గాపాడుప్రక్రియలు గూడ నామెకేనియమిత మయ్యెను. కాని యామె యీపనులకు వేనికిని తగినదియైనది కాదు. రమ యెట్లును మందు పుచ్చుకొనన దయ్యెను.

రోగమూ ఆరోజు కారోజు తగ్గిపోవుటకు బదులుగ క్రమక్రమముగ ముదిరెను. రమ మంచము మీఁదనుండి కూడ దిగలేనిస్థితి వచ్చెను. "నేను పెద్దరాణిగారి యొద్దకుపోయి స్థితిగతులన్నియును చెప్పివచ్చెదను" అని యమున నిశ్చయించుకొని రమతో "నేనుపెద్దరాణిగారిని దీసుకొని వచ్చెదను. నేను మీతోఁబడలేను. మీకు మందు లామెయే గాని మేమియ్యలేము" అని చెప్పెను.

రమ—ఇట్టిసమయమున నన్నేల బాధించెదవు? మనలో మనమే చూచుకొందము రమ్ము.

యమున—మనలోమనకు కుదురుట యెట్లు?

రమ—నీకు ఒక్కొక్క మాత్ర కొకరూపాయిచొప్పున నిచ్చెదను. అది పుచ్చుకొని యూరకొనుము.

యమున—ఏమమ్మా ఇది? ఈమందులు నీవి. నేనువానిని మీకమ్ముటయా? సరిసరి.

రమ—ఈమందులు డబ్బుపుచ్చుకొని నాకిచ్చితివా నీపనితీరును. నేను పుచ్చుకొనినను పుచ్చుకొనకున్నను నీనోరూరకుండును.

కొండొకసేపు యమున మనస్సున, ఈమెయెట్లును జీవింపదు. వచ్చిన డబ్బేల పోఁగొట్టుకొనవలెను? అనివితర్కించుకొని "అమ్మా! ఈమందులు నీవు డబ్బిచ్చినను ఇయ్యకుండినను నీవు పుచ్చుకొనవచ్చును. నీవు పుచ్చుకొనకుండిన యెడల నీమందులు నాచేతనుండి యేమిప్రయోజనము" అని చెప్పెను. ఉభయులకును షరతులుకుదిరెను. యమున రమకు మందు లమ్ముచుండెను. డబ్బుపుచ్చుకొనుచుండెను. ఒకమాత్ర మంచముక్రింద. ఒకమాత్ర తలగడక్రింద, ఒకమాత్రపీకిదానులో, రమ పాఱవేయుచుండెను. మఱియొక్కచోటఁ దూరముగఁ బాఱవేయుటకు రమ లేవలేనిస్థితియందుండెను.

మృత్యుదేవత యారోజునకారోజు నామె దరి దాపులకు వచ్చుచుండెను. నంద ప్రతిదినమును రమయొద్దకు వచ్చి చూచి ఆమాటయు నీమా

టయు నాడి యోగ క్షేమము లరసిపోవుచుండెను. మృత్యుదేవత యా మెను తొంగిచూచి పోవుచున్నదని నందకూడ కనిపెట్టెను. నంద "ఈ స్థానమును గనిపెట్టుకొనిన వైద్యులనుగూడ శివశక్తి తనవలలో వేసి కొనియెను" అనుకొని వైద్యుల నందఱిని నొక్కసారిగ రావించెను. తెర చాటుననుండి వారువచ్చుట కనపడినతోడనే "ఇంతంత జీతములు పుచ్చుకొని యారోగము కుదర్చలేనివారు మీరెందులకు" అని వారి నందఱను చీవాట్లువేసెను.

అందు వృద్ధవైద్యుఁ డొకఁడు దానికు త్తరముగా "అమ్మా! వైద్యులు మందు వేయఁగలరు గాని, ఆయుష్యుఁ బోయఁగలరా?" అని చెప్పెను.

నంద—"అట్లయినమందులు నక్కరలేదు. వైద్యులు నక్కరలేదు. ఇంక మీ మీ యిండ్లకు మీరుపొండు" అని చెప్పునప్పటికి వైద్యులంద ఱును దిగులుఁజెందిరి. ఆవృద్ధుఁడు మిక్కిలి మేధావి. "అమ్మా! మా యదృష్టము మంచిది కాదు. మేమేమి చేయఁగలము? స్థితిగతు లీక డకువచ్చినవి. మేమిచ్చిన మందులు కేవలమును ధన్వంతరి చేతిలోని వే యనినమ్ముఁడు. ఇప్పుడైనను నేను రోగము మూఁడు రోజుల లోఁ గుదర్చెదనని శపథము జేసెదను. ఒక్కదానికి మాత్రము అ మ్మగారు పూచీపడవలెను."

నంద—ఏమది?

వైద్యుఁడు—ఆమెమందు నాయెదుటఁ బుచ్చుకొనవలెను.

ఆమె మందులు పుచ్చుకొనుట లేదని యావృద్ధుని గట్టినమ్మకము. మందులు పుచ్చుకొనిన రోగి యెప్పుడును అంతపాడుగనుండఁడు.

నంద యందుల కంగీకరించెను. వైద్యులనందఱ వీడ్కొల్పెను పిమ్మట రమకడ కేఁగి యంతయును చెప్పెను. ఆమె కిప్పుడు నవ్వుటకుఁ గూడ శక్తిచాలకున్నయది. ఆమెస్థితి యంతవఱకు శుష్కించుకొని వచ్చినది.

నంద—"అమ్మాయీ ! నవ్వుచుంటి వేమి? "

రమ—చిఱునవ్వుతోడిముఖముతో నేనుమందులు పుచ్చుకొనఁ దలఁచు కొనలేదు.

నంద—అమ్మాయీ ! అట్లనరాదు. ఇదివఱకెన్నియో మందులు పుచ్చుకొనిన దానవు, ఇంక మూఁడురోజుల కెందున కట్లు చెప్పెదవు.
రమ—నే నింతవఱకు మందే పుచ్చుకొనలేదు.
నంద—ఈమాట విని నిశ్చేష్టురాలయ్యెను, "ఏమీ ? పుచ్చుకొననేలేదా ? పుచ్చుకొననేలేదా ?" అనియాశ్చర్యపడెను.
రమ—అన్ని మాత్రలును ఈతలగడ క్రింద నున్నవి చూఁడుము.

అన నంద తలయంటి తిరగవేచిచూచెను, మాత్రలన్నియును అచ్చటనే యుండెను.

నంద—ఆత్మహత్య నేల చేసికొనియెదవు ? స్థితిగతులన్నియును కుస్థాలోనికి వచ్చినవి.
రమ—నీవు చెప్పుచుంటివిగాన పుచ్చుకొనియెదను.
నంద—ఎప్పుడు పుచ్చుకొనియెదవు?
రమ—రాజువచ్చి నాచెంగట నిలుచుండినపుడు.

అని చెప్పునప్పు డామెకన్నుల బాష్పజలంబు లురలెను, నందకూడ గన్నులనీరుఁ బెట్టికొనియెను, ఇప్పుడు రాయలు రమయెట్లున్నది యని విచారించుటయైన మానినాఁడు. చిత్తవిభ్రమమే యాతనికన్నియు నయ్యెను.

నంద రమ కన్నులనీరుఁదుడుచుచు "ఆయన దేవిడీలోనికి వచ్చినపుడు తప్పక నీ చెంతకువచ్చి విచారింపఁగలఁడు, ఊరడిల్లుమని యోదార్చెను.



పండ్రెండవ ప్రకరణము.

"ఆతఁడు దేవిడిలోని కీసారివచ్చినపుడు తప్పకవచ్చి నిన్నుఁగూర్చి విచారింపఁగలఁడు." అని నంద చెప్పిన నిశ్చయవాక్యమును ఆధారము చేసి యెట్టెటులో రమ ప్రాణములు బిగఁబట్టికొని యుండెను. శరీరమును మనస్సుకూడ చెడియున్నయామె యెన్నినాళ్లని యూరాకకై కనిపెట్టుకొనియుండఁగలదు, ఆమె చెప్పిన పలుకు నంద మఱచిపోలేదు. ఆమెకా పలుకు సదాజ్ఞప్తికే వచ్చుచున్నవి. రాజునెట్లైన సమావేశము చేయవలెనని యామె సర్వవిధముల ప్రయత్నించిచూచెను. రాజునామెఁగలిసికొనినప్పు డెల్ల "ఈరోజుకాదు రేపు" అని చెప్పి యాతఁడు కాలయా

పనచేయుచు నాయుత్తరక్షణమునుండి కంటికిఁ గనబడకుండఁ బోవఁజొచ్చెను. రాయలయెడఁ దానెన్నఁడును కోపమును దెచ్చుకొనననని నంద దైవసాక్షిగ ప్రమాణము చేసికొన్నది.

రాజిప్పు డాశివశక్తిచేతిలోఁ బడిపోయినాఁడు కాని యింతమాత్రముచే తన భాగ్యదేవతను నాపై తన ప్రభావముచూపనీయరాదు. నాశాంతమును విడచిన నాయీగృహ సంరక్షణ సేయువా రెవ్వరు ? అని నంద యనుకొనియెను. రాయలపై నంత వ్యతిరేకాభిప్రాయము గలిగియున్నను నందదాని కనురూపంబగు నింద్రియోద్రేకమును తనభర్తపై రానిచ్చినదికాదు, కాని యీమెకు శివశక్తిపైఁ గలిగిన క్రోధమునకు మేరలేదు, శ్రీయే ఈశివశక్తియని నందకు తెలియదు, నందయొక్కతకే యననేల రాయలకొక్కనికి తక్క తక్కినవారి కెవ్వరికిని, ఈసంగతి తెలియనే తెలియదు. ఈరహస్యమేమియో కనిపెట్టుమదని నంద కొందఱ దూతలను బంపెను, కాని రాయలు చిత్తవిశ్రమము నీడయైన నెవ్వరినిగాని త్రొక్కనిచ్చినవాఁడుకాడు, నందప్రయత్నము లేమియును ఫలించలేదు, ఈశివశక్తి పగటిపూఁట నత్యంత మనోహరమైన తరుణీమణియై గృహకృత్యములెల్ల నిర్వహించుచున్నదనియును, రాత్రిపూఁట నొకయాఁడు నక్కయై స్మశానవాటికల కడకేఁగి అచ్చట శవములు పీఁకుకొని తినుచుండుననియును, ఒకప్రళయమైన కిం వదంతి పుట్టెను. దీనితో గగ్గోలుపడి నంద పూజ్యుఁడైన చంద్రచూడుని, అందలియాథార్థ్యమును దెలిసికొమ్మని బ్రతిమాలుకొనియెను. చంద్రచూడుఁడు, పేరుమోసిన మాంత్రికులను కొందఱిని పిలిపించి రాయల సంరక్షణకై హోమములు చేయించెను. ఇవి యేమియు నాశక్తని రూపుమాపలేకపోయెను. చిట్టచివరకందులో నొకమాంత్రికుఁడు "ఇటు వినుండు, ఇందేవియును మీకోరిక లీడేర్పఁజాలవు. ఈశక్తి సాక్షాత్కైలాస నివాసినియగు భవాని సహచారిణీగణములోనిది. విశాలాక్షితో తుల్యమైనది. రుద్రశాపమునంది మర్త్యలోకమునఁ గొన్నాళ్లు మర్త్యునితో సాహచర్యము సేయవచ్చినది" అని చెప్పెను. అందుమీఁదట నందా చంద్రచూడులు తమ ప్రయత్నములన్నియును మానుకొనిరి. కాని వారిమనంబునందలి యాందోళనముమాత్రముతగ్గలే

దు. నంద "ఈశక్తి భవానీసహచారిణియే గానిమ్ము. నాకన్నుల కొక్కసారి కనుపడియెనా తుణికములో చీల్చి ప్రేఁగులు మెడలోవేసుకొని యుందును." అనితలపోయఁజొచ్చెను.

ఈకారణముచేత నందకు రాయలనిన నేమియును కోపములేక పోయెను, రాయలు రాజమందిరమునకు వచ్చినప్పుడు నందను సందర్శించిపోవుచుండెడివాఁడు, వచ్చినపుడెల్ల రమ స్థితిగతులు ఆతని కెఱింగించుచుండెను. రమ స్థితి యస్తవ్యస్తముగ నున్నదని చెప్పుచుండెను. దైవముపై నొట్టుఁబెట్టుకొని యొక్కసారియైనవచ్చి యామెను జూచిపొమ్మని ప్రతిమాలుకొనుచుండెను. చాలకాలము రాయలు తప్పించుకొనుచుండెను. నేఁడు నంద గట్టిపట్టు పట్టినది. "ఈరోజున మీరు వచ్చి చూడవలెను. లేకున్న మీకు చూపులుదక్కవు" అని కంఠోక్తిఁగాఁ జెప్పెను.

అటుపైన రాయలు రమ శయనాగారమున కరిగెను. రమ రాయలమొగము జూచునప్పటికి గోడుగోడున నేడువ మొదలుపెట్టెను. ఇప్పుడామెస్థితి భర్త నేమియును కసరుకొనుస్థితిలోలేదు, నాలుకపిడచ కట్టుకొనిపోయెను. రాయలకప్పుడైనను కనికరము పుట్టినదో లేదో చెప్పలేము, కాని అనురాగసూచకములైన యోదార్పులతో నీకేమియు భయములేదు ఆరోగ్యము కలుగునని ధైర్యముతో చెప్పెను.రమ మొగమునఁ గ్రమక్రమముగ సంతోషచిహ్నములభివృద్ధిగా సాగెను. ఆమెయధరోష్ఠముల మధురంబగు మందహాసాంకురంబులు మెఱయఁజొచ్చెను.ఆనవ్వేమినవ్వు ? ఆనవ్వుఁజూచుటతోడనే రాయలామెకు కాలము సమీపించిన దని కనిపట్టెను.

రాయ లామె మంచమువద్దఁ జేరెను. రమ చిన్నకొమరుఁ డాతని యొద్దకువచ్చెను. అదిచూచి రమ కన్నులనీరు గిరగిరఁద్రిప్పెను. కొంతసేపు చిక్కి శల్యావశిష్టమయి యున్న యామెగండపాళీనుండి కాలువలై స్రవింపసాగెను. తల్లికంట నీరుచూచి పిల్లవాఁడు కూడ, ఏడువఁజొచ్చెను. మాట లోఁబడినది. కన్నులచే భావమును దెలుపుచు హీనస్వరముతోడనే "ఒక్కసారి, ఈపిల్లవాని నెత్తికొని ముద్దాడుఁడు." అనిచెప్పెను. కాదనలేక రాయలు అట్లే యొనరించెను. రమ దుఃఖాకుల భారంబున వినఁబడీ వినఁబడని

స్వరముతో " వలదు. వలదు. ఈబిడ్డను, వదలవలదు. తల్లిచెడుగుదియ నిచెప్పి బిడ్డనువదలఁదగదు. ఇదియే నాకడపలుకు. పెద్దక్క కీబిడ్డ నొప్ప గింపవలెనని యనుకొంటిని. మఱల మీ కేయొప్పగింపనెంచితిని. నా మొ ఱ యాలింపుఁడు" అనిచెప్పెను.

రాయలు తలయూఁచెను. రమ రాయలను దగ్గఱకు రమ్మని సంజ్ఞఁ జేసెను. దగ్గఱకువచ్చినతోడనే అతనిపాదద్వంద్వము చేతులతోఁ గన్నుల నద్దుకొని పాదధూళి తన ప్రక్కమీఁదఁ జల్లుకొనియెను. " నాకు సెల వొసంగుఁడు. ఇదియేకడచూపు. జన్మజన్మమునకు నీవె నాపతివై యుండు నట్లాశీర్వదింపుము. " అనివిన్నవించెను.

రమమాట పడిపోయినది. ఊపిరియాడుట దుర్ఘటమయ్యెను కన్నుల కాంతిమాఱెను. మొగము క్రమక్రమముగ నలుపెక్కెను. జగమంతయును అంధకార మయ్యెను. అన్నిబాధలు వదలిపోయినవి. రమ బొందినుండి ప్రాణము లెగిరిపోయెను.



## పదుమూఁడవ ప్రకరణము.

రమ మృతినొందినదినమున రాయలు చిత్త విశ్రమమున కరుగ లేదు. ఇప్పటి కాతనిస్థితి అంతవఱకు చెడలేదు. రాజదండమును స్వీకరింప కమున్న, శ్రీతో సమాగమము కలుగకమున్న రాయలు రమను చాలగ మోహించినవాఁడు. ఆమెయందు రాయలకు నంతకన్న నెక్కుడు మోహము. కాని ఆమోహమెంత శీఘ్రముగఁ జెడిగనో? అంతశీఘ్రముగనే మఱలఁ జల్లఁబడినది. ఇదియేమి చెప్పమాయని రాయలెప్పుడును దానిని యోజింపనైన యోజింపలేదు. నేఁడాతని ధ్యానమొక్కింత యావైపుల కరిగెను. తలఁచిచూచునప్పటికి లోపమంతయును తనదిగనే కన్పట్టెను. ఇంతయేల ? ఆతని హృదయాంతర్గతమును తడవిచూచికొని తనయందే తనకిష్టం డసంతుష్టి యుదయించినట్టు గనిపట్టెను.

అప్పటియాతనిస్థితి యెవ్వరును కోరఁదగినదికాదు. శ్రీసాంగత్యమునకై యాతనికి మనస్సుపోవుట లేదు. తనయందు తనకుఁగల నిరసనభావమునకు శ్రీయే కారకురాలుగా నెంచికొనియెను. ఆమెమూలముననే

కదా రమయెడ నాతఁడంత నిర్దయాత్ముఁడై మెలంగినది. అట్టిసమయము నం దామెయొద్దనే యుండిన నాకడుపుమంట మఱింత యుద్రేకముగాక యుండునా? ఆకారణముచే శ్రీసాంగత్యము మాని రాయలిప్పుడు నంద యొద్దకుఁ బోయెను. నందమాత్ర మొక తప్పుచేసినది. ఆమెకు రాయల యెడ నెంతయోకష్టముగ నుండెను. శివశక్తియందలి యనురాగముచేత గానీ, మఱియొక దుర్మార్గురాలియెడ మోహముచేతగానీ, మఱియేకారణము చేతగానీ, తనయందు రాయలకుఁగల్గిన నిరాదరణకామెకించుకంతయును, మనస్సున విచారములేదు. కాని రమయెడ నాతఁడుజూపిన నిర్దయవృత్తియును ఆమెయెడ నాతఁడు జూపిననిరాదరణయును రమయకాల మరణమునకుఁ గారణములని యెంచి నంద రాయలయందు కోపోద్రిక్తచిత్తయయ్యెను. తననుకూడనట్టి నిరసనభావముతోడఁ జూచుచున్నాఁడను వృత్తికూడవచ్చి క్రమక్రమముగ నామెను బాధింపఁ జొచ్చెను. ఆమె మనస్సునఁ బుట్టిన క్రోధభావ మెంత యామెయనువుబెట్టినను అణఁగునట్టి స్థితిలోలేదు. రమామరణమునుగూర్చి ముచ్చటించుచు "నాథా! రమచావునకు మీరేకదా? కారకులు" అనియెను.

భర్తయెడ తనకుఁగల మనస్సులోని యుద్రేకభావము నింతవఱకు చెప్పుటకే ఆమెకు దుర్ఘటకార్యముగఁ గనుపట్టెను. ఇదివఱకే యాతని హృదయమునఁ జిచ్చున్నది. ఈమాటచే నయ్యది రవిలిమండఁజొచ్చెను. తనయందు తనకుఁగల నిరసనభావముచేతనే యాతఁడిప్పుడు మతిచెడియున్నవాఁడు. ఎట్లులైన నాబాధనుండి తప్పించుకొనవలయునని ప్రయత్నము చేయుచున్నయాతని హృదయమున నందనోటినుండి వెలువడిన ఈధిక్కారము శూలమైనాటెను. "నాథా? రమమరణమునకు మీరేకదా కారకులు" అనిగదా నామెయనినది. ఆమాట లాతని చెవిసోకఁగనే యాతఁడు "ఔనౌను. మీయందఱి మరణమునకును నేనెకారకుఁడను. నాయెడలిరక్తమునూడ్చి ప్రాణమునకు తెగించి సంపాదించిన రాజ్యమునకంతకును నిన్ను పట్టపుదేవిసిగా చేసితిని. ఔను? అట్టినీవు నీ మరణమునకు నేనేకారకుఁడను అని యనవలసినదే. రమగంగారాముని తనశయనాగారమునకుఁ గొనిపోయి నాప్రాణములఁ దీయఁపనెంచినపుడు మీయందఱినోళ్లునేలమూతఁబడినవో?" అని పెద్దపెద్దకేకలు

వేయసాగెను. ఈ కేకలతో నాతనికి రౌద్రమెక్కుడై యాతఁడు నందసా మీప్యమునుండి లేచి వెలుపలిగదిలోనికి పోయెను. అచ్చట పూజ్యుఁడగు చంద్రచూడుఁడు తారసిల్లి రమమరణమువల్ల రాయలకు విచారము కల్గిన దనితలంచి యాతని నెట్టులైన నపనయింపనావిషయము నీవిషయమును గూర్చి ముచ్చటింపఁజొచ్చెను. రమమరణమాతని మనస్సునకు పశ్చాత్తాప ము గలిగించెనని యాతఁడనుకొనియెను. మానుషప్రయత్నములె రాయ ళమనస్సు శివశక్తిమీఁదనుండి త్రిప్పఁజాలు నెడల నీప్రయత్నములకంటె మంచివి మఱియొండు లేవని చెప్పనొప్పు. దానికి ప్రస్తావనగా చంద్రచూ డుఁడు "ఇంక కొంచెము శ్రద్ధాళుండవై యుంటివేని, రాజా! చిన్నభా ర్య బ్రతికియుండును" అనియెను.

గోరుచుట్టుమీఁద రోఁకంటిపోటు. ఇదివఱకే మంట ప్రారంభమై నది. ఈగాలివచ్చి యామంట జాజ్వల్యమానముగఁ జేసెను.

రాయ.—"అయ్యా! మీకుఁ గూడ రమ మరణమునకు నేనే కారణమని తోఁచెనుగా?" అని జవాబు చెప్పెను.

చంద్రచూడుని వాస్తవమైన యుద్దేశ్యమదియె. ఆతఁడు తనమనం బున 'రాజున కీవిషయము నచ్చచెప్పవలయును. ఎవరిలోపములు వారికి కనపడినగాని బాగుపడుటకు ప్రయత్నింపరు. నేనీతనికి గురువరుండను, ఈతనిలోపములను చూపుటకు నాకే ధైర్యము చాలదేని, ఇంకెవ్వరికుం డును?" అని యనుకొని "నేను చెప్పినది యంతతప్పు గాదు" అని జవాబిచ్చెను.

రాజు.—అంతతప్పుగాదేమి? మీమనస్సున మీరెట్లు యోచించిన యో చింపవచ్చు. నేనెవ్వరి మరణమైన నాశించితినేని, ఈరాజ్యమునందొ క్కపురుగైనఁ జేరియుండదని యోజింపుఁడు. ఆపూర్వపుస్థితిమాత్ర ము జ్ఞప్తికి దెచ్చుకొనుఁడు.

చంద్ర—ఎవ్వరి మరణముగాని నీవు కోరి తెచ్చితివని నేను చెప్పఁబోవుట లేదు. నీసంరక్షణయే ప్రాణాధారముగా నున్న వారియెడ నీకు నిర సనభావమును, శ్రద్ధావిరహితత్వమును కలిగినపుడు వారిమరణమును నీవాసించినను యాసింపకున్నను అయ్యది కలుగకుండ మానునా? ఎన్నిదినములనుండియో నీతోడ మాటలాడవలయునని వేచియుం

టిని కాని సందుదొరకనిచ్చే నట్లు చేయలేకపోతిని.

రాయ.—అందఱునుకూడ నాయశ్రద్ధనే నిందించుచున్నారు. వీరందఱు నేమిచేయుచున్నారో అని యనుకొని రాయలు మీరందఱును నాకా రోపించునది శ్రద్ధారాహిత్యముకదా ? మీరేమి చేయుచున్నారు.

చంద్ర.—ఇది యంతయు నీచేతిలో నున్నది. మేమెందరమైనను రాజ గుదుమా ? రాజశాసనము లేకుండిన మేమొక్క పూరిపుల్లయును కదపలేము. రేపటియుదయమున తాము దర్బారునకు దయచేయుఁ డు. అన్నియును వివరించి చెప్పెదను. కాకితములన్నియునుం జూ పెదను. ఆపైన రాజాజ్ఞ యెట్లయిన నట్లు కావచ్చును.

రాయలంతర్గతముగ "నీవు నాకుగురువునని చెప్పి యెక్కువ స్వతంత్రము తీసుకొనుచున్నావు. నీకు కొంచెము బుద్ధి చెప్పవలయు ను" అని యనుకొని "సరే యోజింతము" అనిచెప్పెను. చంద్రచూడుని తిరస్కారవాక్యములచే రాజునకొడలంతయు మండఁజొచ్చెను. కాని యాతఁడు తన కుపదేశికుఁడగుటచే నేమియును అనలేకుండఁబోయెను. ఆ రాత్రి యాతనికి నిద్రపట్టలేదు. చంద్రచూడునకు బుద్ధిచెప్పుట యెట్లు ? యను యోచనతోడనే సరిపోయినది. అరుణోదయమునకు పూర్వమె పడకనుండిలేచి కాలకృత్యములఁ దీర్చుకొని దర్బారునకుఁ బోయెను చంద్రచూడుఁడు కాగితములఁదెచ్చి గుట్టలక్రిందఁ బడవైచెను.



## పదునాలవ ప్రకరణము.

చంద్రచూడుఁడు రాజుతో ముచ్చటింపఁ దలఁచిన యంశమిది. రాజెంతవాఁడైనను ధనములేక రాజ్యమునడువదు. మన కుటుంబము లెవ్వియును ధనములేక నడచునవికావు. మనకండ్లయెదుట, నిప్పుడు నడ చుచున్న, ఈబ్రిటిషు సామ్రాజ్యము మాటయేమి ? అదిమాత్రము ద్ర వ్యము లేకుండ నడచునా ? పూర్వము మిక్కిలి ప్రబలమైన రోమకసా మ్రాజ్యము ధనములేక నశింపలేదా ? దానితోడ ప్రాచీననాగరికతయం తయునున స్తమింపలేదా ? ఎవ్వరికిని తెలియకుండ రాయలదొరతనమిట్లే ధనములేక యిప్పుడు పరితపించుచున్నది.

సీతా రాముని రాజ్యము ద్రవ్యహీనత ననుభవించపవలసినది కాదు. దాని రాఁబడి అమితముగ వృద్ధియయినది. ఫౌజుదారుని యధీనమందున్న భూషణరాజ్యములో చాలభాగము రాయల యధీనమైనది. పన్నిద్దఱు భూస్వాము లిప్పుడీతనికి కప్పముకట్టుచున్నారు. అందుమూలమున ఢిల్లి యందున్న సామ్రాజ్యకోశమునకై యీ భూస్వాముల యొద్దనుండి సొమ్ము జమ చేసికొనుట కధికార మొసంగఁబడినది. ఈకుణికము వఱకు ను మూర్షడాబాదాకు ఒకగవ్వయైనఁ బంపలేదు. వసూలైన సొమ్మంతయును స్వంతముక్రింద వెచ్చమగుచున్నది. అందువలన రాయలకోశమునం దిప్పుడు ధనము వెలితిగ నున్నది. రాఁబడివృద్ధియైన కొలది జనుల వెచ్చమును వృద్ధియగును. ఆయవ్యయములు రెండును ఒకదానినొకటి యనుసరించి యుండును. భూషణపురము స్వాధీనము చేసికొనుటకు కొంత సొమ్ము ఖర్చుపడినది. ఈపన్నిద్దఱు భూనాయకులను తనయధికారమునకు లోబఱచుకొనుసరికి కొంతసొమ్ము వెచ్చమైనది. సైన్యసంరక్షణము కొఱకును తద్విజృంభణకును నిరంతరముమ కొంతసొమ్ము వెచ్చమగుచున్నది. దేశమున నెచ్చటనైన విప్లవము జరిగినదాని నడ్డగింపవలయును. పరరాజెవఁడైన దండెత్తివచ్చినవాని నిర్జింపవలయు. రాజుగారి పట్టాభిషేకమునకు కొంతసొమ్ము వ్యయమైనది, ఇవియన్నియును సమకూర్చినచో అయ్యెడిఖర్చు, నిలవయున్న ధనమునకు మించియున్నట్టు లెంచఁదగియున్నది.

ఖర్చునకును వెచ్చమునకును సరిపోయిన సొమ్మున కింతలోటు రానేరదు. ఇక్కడ దోఁపిడీలక్రింద కొంతధనము పోవుచున్నది. రాజు రాజ్యాంగ వ్యాపార మించుకంతయును విచారించుటలేదు, చిత్తవిశ్రమమహా ఆతనికి సర్వదా నివాసస్థానమైనది. రాజకీయ ధనాగారమందలి ద్రవ్యమంతయును ఆయుద్యోగస్థుల స్వంత వెచ్చములక్రింద ఖర్చునగుచున్నది. ఇది కొన్ని దినముల నుండి యాచారమైనది. దాని నణఁచువారెవరును లేరు. పూజ్యుఁడగు చంద్రచూడుఁడు దీని నాఁపవలెనని ప్రయత్నించెను. కాని యాతనిమాటలు వినుపించుకొనువారెవ్వరును లేరైరి. పెద్దయుద్యోగస్థుల దొంగతనము లాతఁడు పట్టుకొనియెను. వారినామరుసటి దినమున రాజుగారు దర్బారునకు వచ్చినవెంటనే ఆయిన యెదుటఁ బెట్టవలెనని

యోచించెను. కాని రాజునొద్ద నతనికీ విషయము మాట్లాడ సమయము దొరికినదికాదు. "ఆతనినంతయును నీవేచక్కఁబెట్టుము" అని చెప్పియూ తఁడు త్త రక్షణముననే వెడలి పోవుచుండును. చంద్రచూడుఁడింక చేయు నదియేమియును లేక కొందఱిని యుద్యోగమునుండితప్పించి యుత్తరువు లు సాదరుచేసెను. అది చూచునప్పటికి నేరస్థులకు నవ్వువచ్చెను. " ఓ పూజ్యుఁడా ! మాకు శ్రుతిస్మృతులయందు నమ్మకముండునేని మీయు త్తరువులయందు మాకు విశ్వాసముండును. రాజుగారి దస్కతు మొహ రులుగల యుత్తరువులుండిన మాకుచూపుఁడు. లేకున్న మీయింటికిపో యి మీరు మీ ధర్మముల నిర్వర్తించుకొనుచుండుఁడు " అనియాయు త్తరువులకు వారు ప్రత్యుత్తరము లిచ్చిరి.

రాజుగారి ముద్రికవేయించుట యనునది యిప్పుడొక గొప్పకార్య ముకాదు. కాగిత మాతనియొద్దకు పోవుటయే తడవుగ ముద్రికపడుచుం డెను. అందేమున్నదో చూచుటకైన నాతని కవకాశము లేకుండెను. చిత్తవిభ్రమము మీఁది దొక్కటి యేలోకము వారి బర్తరపు హుకు ములు వ్రాయించి సంతకములకు పంపెను. రాజు వానిని చదువనైన చదువకుండ సంతకము చేసిపంపెను.

కాని యాయుత్తరువు లమలు జరిగినవికావు. కోశాధ్యక్షుఁడు నేరస్థులలో నగ్రేసరుఁడు రాజుగారి కాగితముపై సంతకముచేసి నపుడా తఁడెదురనే యుండెను. రాజు కాగితమేమియో యెఱుఁగకనే సంతక ముచేసినాఁడని యాతఁడు కన్నులారఁజూచెను. రాజు వెడలినతోడనే "నీయుత్తరువును నేను లక్ష్యముసేయను. అది నీయుత్తరువుగాని రా జుగారి హుకుముకాదు. ఆయన ఆకాగితము చదువనైనఁ జదువలేదు. మానేరమును రాజు స్వయముగా విచారణఁజేసి మమ్ము శిక్షించినయె డల తప్పక మేమీయుద్యోగముల విడచి పోయెదము. "

అంతవఱకు మేమిచ్చటనుండి కదలువారము కాము. అనియా తఁడందులకు బదులుచెప్పెను. అందుమూలమున నెవ్వరును తమయు ద్యోగములనుండి వదలిపోవరైరి. ధనాగారము వారివశమందుండుటచే ననుదినమును దొంగతనములు జరుగుచునే యుండెను చంద్రచూడుఁ డెఱిఁగియును ఏమియును చేయలేకుండ నుండెను.

చంద్రచూడుఁడు ఇందువలననే రాయల నెంతో ప్రాధేయపూర్వకముగ దర్బారునకు రమ్మని ప్రార్థించెను. నేరస్థులెదుట నుండఁగనే వారిపైని నేరములన్నియును రాజునకు వివరించిచెప్పెను. రాజుమనస్సు ఇదివఱకే కోపోద్దీపితమై యుండెను. దొంగదోఁపుగ జరుగుచున్న యీ దోఁపిడులనుగూర్చి ఆతనిచెవినిఁ బడునప్పటికి మనస్స్వస్థతయంతయునుచెడి యావేశపరవశుండై యానేరస్థులనందఱ బ్రతికియుండఁగనే యొడలిచర్మ మొలువ శాసించెను.

ఈశిక్ష వినునప్పటికి సభయెంతయును గడగడలాడిపోయెను. చంద్రచూడుఁడుగూడ పిడుగు మొత్తినవానివలె నిశ్చేష్టితుఁ డయ్యెను. "రాజా! నీ విప్పుడేమనుచున్నది యెఱుంగకున్నాఁడవు. ఇంత చిన్న తప్పిదమున కంత దారుణ శిక్షయా?" అని యనియెను.

ఆగ్రహముచే దుందుడుకుఁజెంది "రాయలు తప్పిదము స్వల్పమనుచున్నావు. నీయుద్దేశ్య మేమియో నాకు బోధపడుటలేదు. దొంగకు బ్రతికియుండఁగ ఒడలిచర్మమొలిపించుటయే స్వల్పశిక్ష" అని ప్రత్యుత్తరమిచ్చెను.

చంద్ర.—అవును గాని ఇందులోఁ గొందఱు బ్రాహ్మణులున్నారు. బ్రాహ్మణ వధకెట్లు లొడఁగట్టుదవు?

రాజు.—బ్రాహ్మణుల ముక్కుచెవులు గోయింపుము. వారిమొగముల కణకణలాడు ఇనుపకడ్డీలతో "దొంగ" అను అక్షరముల వ్రాయించి సాగనంపుఁడు. మిగిలివారికందఱ "కొడలిచర్మము లొలిపింపుఁడు."

ఇట్లు త్తరువులుజేసి రాజు చిత్తవిశ్రమమున కరిగెను. రాజుశాసన మెట్లుండె నట్లు శిక్షలన్నియును అమలుజరిగెను. పట్టణమంతట నే మూలఁజూచినను "అబ్బా? అబ్బా" అను విస్మయవాక్యములే వినంబడియెను. దీనితో దివాణములోని యుద్యోగస్థులుచాలమంది తమతమ యుద్యోగములు విడచి పురమునుండి పాఱిపోయిరి.



## పదునైదవప్రకరణము.

బందిపోటు లీవిధముగ నాఁగిపోయినవి. ఇంకను ఈతిబాధలు పెక్కులున్నవి. రాజ్యవిషయ ములన్నియు రాజు స్వయముగ చూచుకొనవలసినయవసరము కలిగెను. రాజు నెవ్వరును సమీపించుటకైనను సమర్థులు కాకయుండిరి. ఎవ్వరైన సమీపించినను వారుచెప్పినదేదియు నాతఁడువినుపించుకొనుట లేదు. నిష్ఫలప్రయత్నము లెన్నియేని నైనవెనుక, చంద్రచూడుఁడొకనాఁడు రాజును స్వయముగ వచ్చిపట్టుకొని " సామంతవరా! నీవు రాజ్యవిషయముల జోక్యముకలుగఁ జేసికొనకుండ నిట్టులె యింకకొంతకాల ముంటివేని నీరాజ్య ముప్పాగల్లుకైన పనికి రాకుండపోవును " అనియెను.

రాజు—నాకిప్పు డేదియును వినుపించుటలేదు. అట్లననేల ? శ్రద్ధాళుఁడనై యున్నాఁడను. జరిగినదియెల్ల వచియింపుము.

చంద్ర—సిపాయిలు మందలుమందలుగ లేచిపోవుచున్నారు.

రాజు—కారణమేమి ?

చంద్ర—వారికి జీతము సరిగా ముట్టుటలేదు.

రాజు—ముట్టకుండుటకు కారణమేమో ?

చంద్ర—ఖజానాలో ద్రవ్యము సరిపోయినది.

రాజు.—సంచితరుగులు ఇంకను సాఁగుచునేయున్నవా ?

చంద్ర.—అయ్యవి కట్టుబడినవి. అయిననేమి? దోఁపిడియైన సొమ్ము మఱల వచ్చుటకు పాయము లేదే. తిన్నసొమ్మంతయు కక్కువా రెవ్వరు?

రాజు.—రావలసిన సొమ్ములు వసూలగుట లేదా ?

చంద్ర.—ఒక్కదమ్మిడి వసూలగుట లేదు.

రాజు.—కారణము ?

చంద్ర.—పన్నులు వసూలుచేయు తహశ్శీలు దారులు వసూలుచేసిన సొమ్ములో నెప్పటికైన నేవైన లోటుపాటులు రాఁగలవు. ఎవ్వరో తినిన సొమ్ముల కెవ్వరినో పట్టుకొందురు మేమాయిడ్పులఁబడ లేమనుచున్నారు.

రాజు—అట్టివారినందఱిని పనిలోనుండి తీసివేయరాదా ?

చంద్ర—క్రొత్తవా రెచ్చటినుండి వత్తురు ? సొమ్మువసూలుపని నమ్మి క్రొత్తవారిమీఁదనుంచుట యుక్తము కాదు.

రాజు—అట్లయిన వారందఱను బట్టి బంధింపుఁడు.

చంద్ర—కటకటా ! మఱల నెవ్వరైన తహశ్శీలుదారులనిన మొగము జూతురా ?

రాజు—బాకీ పైకమంతయును దమ్మిడీలతో వసూలుచేయకుంటిరేని వారినందఱిని చీఁకటికోటలో త్రోయింపుఁడు.

చంద్ర—ఈ కోటు తహశ్శీలుదారుని దొక్కనిదేనా ? ప్రజలు చాల మంది పన్నులు చెల్లించుట యెగవేసినారు.

రాజు—వారికేమి పోఁగాలమువచ్చినది?

చంద్ర—రాజ్యము మహమ్మదీయుల వశమైన తరువాత పన్నులు వారికిఁ జెల్లింపవచ్చును. ఇప్పుడొకసారి యిచ్చికొని మఱల రెండవమారిచ్చికొనఁగలమా యనుచున్నారు ?

రాజు—బాకీదారుల నందఱను బట్టి బందిఖానాయందు బంధింపుఁడు.

చంద్రచూడున కీమాటలతో నోడలుకంపమెత్తెను రాజా! బంధిఖానాలో చోటు విశేషముగ లేదు.

రాజు—పెద్దపెద్దకొట్లు క్రొత్తవి కట్టింపుఁడు. అని చెప్పుచు తహశ్శీలుదారులను బాకీదారులను పట్టిబంధించి చెఱఁబెట్టుఁడని యుత్తరువులు వ్రాసిసంతకములుచేసి చిత్తవిశ్రమస్థలి కేఁగెను. అంత చంద్రచూడుఁడీరాజునకు రాజ్యవిషయముల నివేదింపరాదని యనుకొని యట్లు చేయనని యొట్టుఁ బెట్టుకొనియెను.

ఈయుత్తరువులవలన దేశమునకు గలిగిన యనర్థములు మితిలేకుండనుండెను. చంద్రచూడుఁ డెన్నికొట్లు క్రొత్తవికట్టించినను స్థలము కుశలముకాఁజొచ్చెను. బాకీదారులును తహశ్శీలుదారులును దేశము విడిచి పాఱిపోవఁజొచ్చిరి. వారితో పాటు ఎన్నఁడు బాకీయునవేమో యెఱుంగని వారందఱునుగూడ వెడలిపోవసాగిరి.

ఇందు మూలముననే నిప్పు రాజినదనియును నిల్లంటుకొనినదనియు సూచించియున్నాము. శ్రీ రామన్న యెడల రాయలు తనయుచ్చస్థితినుండి యింతటి విచ్యుతింగాంచునో లేదో మేము చెప్పఁజాలము. ఏమందురా?

రాయలు తన యంతరంగమునుండి శ్రీస్మరణమును బోఁద్రోలి తన హృదయమును రాజ్యవిషయములపైఁ బ్రవేశింపఁజేయ సంకల్పించుకొనియెను. ఈవిషయమిదివఱకె సందర్భవశమున మాపాఠకులకు విశదీకరించితిమి. శ్రీమఱల నాతని కంటఁబడినది. రాయల కామెపై మమకారము హెచ్చుపెరిగినది. అనిశ్చితము వరదపెల్లున తుడిచికొనిపోవు నిసుక కట్ట ననుకరించెను. కేవల రాజ్యధర్మ తత్పరతయే సర్వరోగనివారకౌషధమగునని చెప్పఁబోవుట లేదు. శ్రీ నందవలెనే యంతఃపురమున నివసించి యామెవలెనే సహధర్మచారిణియై మెలంగియుండెనేని అధికార మదాంధతవలనఁ గలిగిన, ఈవినాశము తటస్థముకాకుండనుండి యుండును. అధఃపతనమునకు మూలాధారమైన గర్వము రాయలకు శ్రీ, నంద, లిరువురును సాయపడిరేని తొలంగియుండును. చిత్త విభ్రమము తనకు నివాసస్థలముగఁ జేసికొనుటకు మాఱుగ నంతఃపురముననె యామె నివసించి యుండిన యెడల యోగినీధర్మముల నడుపుటకు మాఱుగ తన యథాస్థితికి తగిన కృత్యముల నామె నెఅవేర్చి యుండినయెడల నిట్టి దురవస్థ పట్టకుండ నుండి యుండును. రాయలొక్కసారి సార్థమనోరథుఁడై యుండిన, ఆతని మనంబు నావేశించియున్న మహోన్నత్తత తనయుద్రేకమును గోల్పోయియుండును. కొన్ని దినములకు వెనుకనైన తననుజుట్టియున్న యనర్థములనన్నిటి నాతఁడు కన్నువిచ్చి చూచియుండును. శ్రీ యోగిని యయ్యెంగదా? ఆ యోగినీ ధర్మంబులనైన నామె యందఱివలెనే నడుపుచున్న యెడలనైన నింతటివిపత్తులు, ఉత్పన్నములై యుండవు. వేషము, సన్యాసివేషము, ఆకారము, సర్వజన సమ్మోహిని యంత్రము. అపరశచియేయనఁ జెల్లు. వ్యాఘ్రాసన సంస్థితయయ్యెను, తనమధురాధరము నుండి యమృతధారలఁ గురియుచుండెను. అట్టిరూపమున కొక్కింత దూరమున నాసీనుఁడై యున్న రాయలు శునకమువలె నామె మొగమువంకఁ జూడ్కులు నిగుడించుట తక్క మఱియేమి చేయఁగలఁడు? వారి యుభయులకు సంఘటిల్లిన పరిణయ సంబంధమింకను, అవిచ్ఛిన్నముగ నున్నయది. ఈరీతిని రాయ లయిదు వత్సరము లహోరాత్రము లామెకై ఘోరతపస్సుచేసెను.ఇంతికంటె నుత్కృష్టంబైన దురవస్థయొక్కటి యుం

ఆమె మనస్సు ఇప్పుడు తారాపథము నంటి కేవల భగవద్ధ్యాన తత్పరతచే తాదాత్మ్యము నొందియున్నది. రాజువంకఁ దిరిగి "నీశాసనానుసారముగ నేనిప్పుడు దిగంబరి నగుచున్న దానను. నీవుమాత్రము నావంకఁజూడరాదు. నీవీరాష్ట్రమున కధినాథుఁడవు. నీవే ఇట్టి పశుకృత్యములను చేయుచున్న నీ ప్రజలేమి చేయరు? ఓకీర్తికాముఁడా! రాజా! నేనాటవికను. అడవులవెంట సంచరించుదానను. అచ్చట నాకనేకపర్యాయములు వస్త్రవిహీనముగ నుండవలసిన సమయము తటస్థమగుచుండును. ఒకప్పుడు నేనొక పెద్దపులినోటఁ బడితిని. అప్పుడెట్లో యాఘాతుకమృగము బారినుండి తప్పించుకొని బైటఁబడితిని. అప్పుడు నాకు వస్త్రవిసర్జనము కాలేదు. నీచర్యలనుజూచి నిన్నిప్పుడు వన్యమృగమవని భావించుచున్నాను. అందువలన నీయెదుట నాకు సిగ్గులేదు. కాని నీవాఁడు వాండ్రతో సంచరించుచున్నవాఁడవు. సంసారము చేయుచున్నవాఁడవు. దేశమున ప్రభువన్న పేరున నెగడుచున్నాఁడవు. నీవుమాత్రము సిగ్గుఁబడవలసి యున్నది. నీకన్నులు విప్పకుము" అని చెప్పెను.

కాని ఈమాటలుకూడ నాతని చెవులకేమియు నాటినవికావు. ఆతని క్రోధము మఱింత యెక్కువయయ్యెను. ఆతనికిప్పుడు నిజముగ నేత్రము లంధీభూతములగ నే యున్నవి. యయంతి వాక్యముల కుత్తరువైన జెప్పు ప్రయత్నమునఁ బోక కటికవానిపై బొబ్బరిల్లుచు "ఓరీ చూచెదవేమి? వస్త్రమునూడ్చుము. పట్టితన్నుము" అని కేకవేసెను.

యయంతి ఇంక చెప్పి ప్రయోజనము లేదని నిశ్చయించి యావేదికపై మోకరించెను. ఆమె మోనముజెందినది. కన్నులవెంట నశ్రుకణములు బయలుదేరెను. ప్రాపంచికములైన సుఖదుఃఖములన్నియును నామె విసర్జించినది. హేయములైన కష్టసుఖములఁ గడచి గట్టెక్కినది. ఇంతమాత్రము చేతనె లజ్జాపరిత్యాగ మగునా? ఆమెకడ నింకొకమహత్తు కూడ నున్నది. మనస్సునకును, ఇంద్రియములకును, సంధానముకూడ లేకుండ చేయఁగలదు. అందువలన వస్త్రమున్నను, లేకున్నను, ఒక్కటే యనుకొన్నది. పాపలేశము సిగ్గునకు మూలము. అది లేకున్న మఱి సిగ్గెందులకు? సుఖదుఃఖములకు దాసులై యుండు మనుష్యమాత్రుల కడ సిగ్గన నర్థములేనిమాట. దైవసమక్షమున నుండవచ్చు. ఇంక నీమె

దఁబడ్డట్టులయ్యెను. రాజ్యపరిపాలనము చంద్రచూడుఁడు వదలివేయుట యన, రాయలకు రాజ్యపరిత్యాగమో? శ్రీపరిత్యాగమో? రెంటిలో నేదోయొకటి సంప్రాప్తముకావలసివచ్చెను అందువలన రాయలా పరమపురుషునిఁ దీర్థయాత్ర ప్రయాణమునుండి మఱలుఁడని వేఁడి కొనియెను.

చంద్రచూడుఁడీదేశమున నింక నిలువఁగూడదని నిశ్చయించుకొనియెను. దుర్మార్గని తుంటగు రాజు రాజ్యవిషయములం దట్టివారు పాలు గొన నిచ్చగింతురా? అందుమూలమున చంద్రచూడుఁడొక పట్టునఁనొప్పి కొనినవాఁడు కాఁడు. ఈకార్యము ముగియునప్పటికెంతయో కాలవిలంబమయ్యెను రాజును, చంద్రచూడుఁడు బహువిధములఁ జీవాట్లువేసెను. రాజును తదనురూపమగు సమాధానములఁ బల్కెను. ఎట్టకేలకుఁ జంద్రచూడుఁడు తీర్థయాత్ర మానుకొన నీయకొనియెను. ఇదియంతయు ముగియునప్పటికింక రాత్రి విశేషము ప్రొద్దులేదు. అందుమూలమున రాజుచిత్తవిశ్రమమునకు పోలేదు. ఈలోపున విహారభవనమున మాత్రము చక్కనివింతయొకటి పుట్టెను.



## పదునాఱవ ప్రకరణము

ఆకస్మికముగ నాఁటిరేయి భైరవియొక్కర్తు చిత్తవిశ్రమద్వారమువద్ద దర్శనమిచ్చెను. అయ్యది యానందాశ్రమమెయయ్యెను రాజుల కుసికిపట్టగుటచే నాఁకిటద్వారపాలకులుండి యుండిరి. భైరవివచ్చి లోపలికిఁ బోవ ననుజ్ఞ యిమ్మని వేఁడికొనియెను.

ద్వార:—ఇది రాజమందిరము. ఇందు రాణి నివసించుచుండును. ఎవ్వరిలోపలికిరానిచ్చుటకు మాకు త్తరవులు లేవు. రాజాంతఃపురమునందలి జనులనందఱినిగూడ తత్పరిజనులు రాణులనియె పిలుచుచుందురు.

భైరవి:—అది నేనెఱుఁగుదును. మీరాజుకూడ నన్నెఱుఁగును. నేను లోపలికివచ్చుట కభ్యంతరముండదు. పరిజనులఁమీరుపోయి రాజుగారికి నారాక నెఱింగింపుఁడు అనియెను.

ద్వారపాలకులు లోనికి పోయివచ్చి "రాజుగారులోపల లేరు. మహలులోనికిఁ బోయినారు."

భైరవి—అట్లయిన నచ్చటనుండు రాణితోఁ జెప్పుఁడు. ఆమె సెలవయి నచాలదా ?

ద్వారపాలకులకేమియుఁ బాలుపోయినదికాదు. చిత్తవిశ్రమము లోనికెవ్వరిని రానీయఁగూడదని రాజుగారు ప్రత్యేకముగ హుకుము చేసినారు. రాణికూడ పైవారినెవ్వరిని రానీయఁగూడదని శాసించెను. ఒకసారి రాజుగారు లేనప్పుడు నందయొద్దనుండు దూతికలిద్దరు అంతర్భవనమునకుఁ బోనిమ్మనిరి. రాణి వారిప్రార్థనవినియు వారినిలోనికి రానీయలేదు. రాణితో నీసంగతిమరల నెఱింగించిన ప్రయోజనమేమున్నది? కాని ఆకారవిశేషమును బట్టిచూడ కేవల మనుష్యసంజనితవలె కనుపట్టదయ్యెను. ఆమెనుఁ బొమ్మనిన నేమిచిక్కులు వచ్చునో?

కొంతసేపేమి చేయుటకుఁ గ్రుక్కదిరుగక నొకపరిచారికచేత సమాచారమును లోనికిఁ దెలియఁబంచిరి. భైరవి యాగమనమును వినినతోడనే రాణి యామెను లోనికి రమ్మని యుత్తరువు చేసెను. యయంతి యంతఃపురమునఁ బ్రవేశించెను.

ఆమెను సందర్శించినతోడనే శ్రీ "నీవు మంచి తరుణమునకు వచ్చితివి. నేనిప్పుడు గొప్పచిక్కులలోఁబడి కొట్టుకొనుచున్న దానను. నీయుపదేశము తక్క వేఱుశరణము లేదు." అనియెను

యయంతి:—ఈవేళ నీస్థితిగతులరయ నిశ్చయముగ నేనిచ్చటకు వచ్చెదనన లేదా ? రాజ్య వ్యాపారములన్నియు నవ్యక్తముగ నున్నవనియు దీనికంతకును నీవె కారణమనియుఁ బట్టణమంతయును జెప్పికొనుచున్నారు. పాఠశాలలో విద్యార్థులు రఘువంశము పందొమ్మిదవ సర్గలోని శ్లోకములు చదువుచుండ చెవినిబడ్డవి. ఇప్పుడు మీకుఁగలిగిన గొప్పవిపత్తేమియో చెప్పుము.

శ్రీ:—అందుకొఱకే నీరాక నాకాంక్షించితిని." అని యాది మొదలు అంతమువఱకు నంతయును జెప్పెను. అదివిని యయంతి అట్లయిన నీధర్మమునేల నిర్వర్తింపక మానితివి ?

శ్రీ:—నిశ్చయముగా నాధర్మమేదియో నాకు బోధపడలేదు.

యయంతి:—శీఘ్రముగ రాజమందిరమున కరుగుము. అతనికి సహధర్మ చారిణివై వర్తింపుచు ఆవిధ్యుక్తధర్మముల నాతఁడు నిర్వహించు పట్టున మంత్రివయి మెలంగుము. అయ్యది న్యాయముగ నీయందను ప్రయుక్తంబై యున్నది. అన్యులు దాని కర్హులు కారు.

శ్రీ.—నాకాధర్మములు తెలియవని నానిశ్చయము. రాణి యెట్లు వర్తింపవలెనో నేనింతవఱకెఱుంగను. నాకు మొదటనుండి నీవు నేర్పినది నివృత్తిమార్గము. ఎన్నఁడు ముఖమెఱుంగని కార్యమునఁ బ్రవేశించితినా? తప్పక నాసని అస్తవ్యస్తమగును. ఇంతకాలము నుండి విరాగినై ప్రవర్తించునా యట్టి దాసికడ నాతని కంతఃపుర సౌఖ్యము లేమి లభింపఁగలవు? అందువలన ప్రయోజనమేమున్నది.

యయంతి—యోచించిచూచి ''అది నేనుచెప్పలేను. నీవుమాత్రము నీకృత్యము నెరవేర్చుట కసమర్థురాలివలెఁ గన్పట్టుచున్నావు. అట్టిదియే నీకు సాధ్యమైయుండెనేని యిట్టిదుర్గతి సంభవింపదు.

శ్రీ—నాచేలాంచల మల్లలాఁడించిన మాత్రముననె మున్నొకనాఁడు మహమ్మదీయ సైన్యము నాశనమయినది. ఆరోజుననైన యెడల నీకార్యమున విజయము కలిగియుండును. నాకామార్గము సంప్రాప్తము కాలేదు. ఇది నన్నన్యత్ర త్రిప్పినది. ఆయుపదేశము లుపేక్షితములయినవి. నే నిప్పుడు కేవలమును వ్యతిరేకమార్గమునఁ బ్రవర్తించుచున్నదానను, నాయాశ్రమము, నావైరాగ్యము, అవియే లోకము గాని మఱియొక్క టేమియును లేదు. ఇది రేవు మఱియొక్కతో ని వకు పోవచ్చు. ఎవఁడెఱుఁగు.

యయంతి—ఇప్పుడు చేయతగ్గదేమి ?

శ్రీ—ఇప్పు డిచ్చటనుండి పాఱిపోవుట తక్క మఱి యుపాయమేమియును లేదు. ఇది రాజును రక్షించుటకు గాదు. రాజ్యమును రక్షించుటకును గాదు. నాస్వలాభముకొఱకే ఎల్లప్పుడు నాతనియెదుటనె యుండుట చేతఁ గాఁబోలు నే నాతనిధర్మపత్ని నన్న యుద్దేశ్యము మఱలఁ దలంపునకు వచ్చుచున్నది.

యయంతి—తప్పక నీవు ధర్మపత్నివే కాదా ?

శ్రీ—ఆవాక్యము పూర్వవృత్తాంతముల నెన్నిటినేని తలంపునకుఁ దెచ్చును. ఈ అహంకార మమకారములలో మఱలఁబడి పొరలుమనియే నా నీయానతి ఇందునకే గాదా నేను మరల రాజును చూడనని నీతోడఁ జెప్పికొన్నది. నాకిప్పుడు రాజుతోడఁ గూడ శత్రువులు పన్నిద్దఱున్నారు.

యయంతి—మిగిలిన పదునొకండుగురు నీలోనే యున్నారా? అట్లైన నీవైరాగ్య మొకవింత వైరాగ్యమువలె నున్నది. జగద్గురుని సన్నిధానమున కనిచిన యాశత్రువులనందఱ మరల సంగ్రహించినావా? మేలు మేలు, నిస్వప్రయోజనమా నీవిప్పుడు యోజించుకొనుచున్నది, ఇదియా నీవైరాగ్యము.

శ్రీ—అందువలననే పాఱిపోవుట మంచిదికాదా యని యడిగినది.

యయంతి—కాకేమి? మంచిదియె.

శ్రీ—నేనాతని విడచినయెడల రాజు ఆత్మహత్య చేసుకొనియెద ననుచున్నాఁడు.

యయంతి—ఇవియన్నియు మదనోన్మాదులగు పురుషులు అబలల వలలలో వేసికొను మార్గములు.

శ్రీ—అట్లైన నట్టిభయమేమియును లేదుగదా?

యయంతి—ఉన్న నికేమి? రాజుచచ్చిన నేమి? నొచ్చిననేమి? అతఁడు నీభర్తగనుకనా? ఏమి యీయభిమానము? వైరాగ్య మననదియా?

శ్రీ—ఔనో కాదో? నాకు తెలియదుకాని రాజుచచ్చిన ప్రపంచకమునకు కలుగు నుపకార మేమియున్నది?

యయంతి—రాజు చావఁడు. అందునిమిత్తమై నీవు విచారపడ నక్కఱలేదు. చంటిపిల్లవాఁడు చేతులోని బొమ్మపోయిన యేడ్చునేగాని చచ్చునా? నీవు కష్టపడి యార్జించుకొనిన తపఃఫలమంతయు నీటఁ గలిపి అంతరించుచున్న యరిషడ్వర్గములకు మరల లోనయ్యెదవా?

శ్రీ—అట్లయిన శీఘ్రముగ పలాయనమే యుత్తమమార్గమా?

యయంతి—తత్క్షణము.

శ్రీ—నేనిప్పు డిచ్చటనుండి తప్పించుకొనుట యెట్లు? నన్నీ ద్వారపాలురు విడచి పుత్తురా?

యయంతి—నాశాటి రుద్రాక్షలు త్రిశూలమును ఇవిగో ఇవి గైకొనుము. భైరవి వేషము ధరియింపుము చరచర చక్కఁబొమ్ము? నిన్నీ ద్వారపాలు రెవ్వరును అడ్డు చెప్పరు.

శ్రీ—నీవే నేననుకొందురు పిమ్మట నీగతియెట్లు?

యయంతి చిఱునవ్వు నవ్వెను. "నా అదృష్టమేమని చెప్పను." ఇంత కాలమునకు నాగతి యేమని యడుగు పుణ్యాత్మురాలవు నీవొక్క తెవె కనుపడినావు, సోదరీ! నే నిచ్చటనుండి రాలేకపోయిన కలుగు కీడేమి?

శ్రీ—నీవు రాజుచేతిలోఁ బడిపోవా? అతఁడు నీపై నెంతయాగ్రహించునో యెఱుఁగరాదు.

యయంతి—అతఁడు నన్నేమి చేయఁగలఁడు? సన్యాసిని కపకారము చేయు సామర్థ్యముకూడ నున్నదా?

శ్రీకి యయంతియందు మిక్కుటమైన విశ్వాసమున్నది. ఇంక నామె నేమియును వేధింపక "నేను నిన్నెచ్చట మఱలఁ గలసికొనుట" నీవు గ్రామమునకు పొమ్ము. రాజుగారి పురోహితుని సందర్శింపుము. నాకు నీ త్రిశూలమిమ్ము, నాది నీవు పుచ్చుకొమ్ము. రాజుగారి పురోహితుఁడు నాకు నచ్చిన శిష్యుఁడు. నీచేతిలోని యీనా త్రిశూలమును చూపుటతోడనే నీవు చేయుమనినదియెల్ల చేయుచుండును. అతని నీదగ్గఱ నుండుమనుము. నిన్ను వెదుక నెందఱో బయలుదేరుదురు. రాజభవనమున నిన్నాతఁడెచ్చటనో దాఁచియుంచును. అచ్చటనే నిన్ను గలిసికొందును, పొమ్ము.

శ్రీ యామె పాదధూళి శిరస్సున నుంచుకొని యథామార్గమున అరణ్యాధివాసమున కరిగెను. ద్వారపాలు రామెను నిరోధింపలేదు.

---

## పదునేడవ ప్రకరణము.

---

రామచంద్రు—వ్యాపారమంతయు కడుదారుణముగ నున్నది. తలఁచు కొనిన గుండె తల్లడపడుచున్నది. ప్రజ లెన్నాళ్లోపికపెట్టఁగలరు.

శ్యామచంద్రు—సోదరుఁడా! ఇంక నొక్క నిమిషమైన మన మీరాజ్యమున నిలువరాదు.

రామ—నీవు చాల కాలము క్రిందటనే పోవ నెంచియుంటివి. నీవేముందేల దారితీయరాదు.

శ్యా—నేను వెళ్లిపోయినట్లే, నాభార్యను పిల్లలను ఇదివఱకే నలరంగకు పంపివేసితిని. ఇంక నేను, ఇక్కడ కొంచెము బాకీలు రావలసియున్నవి. వానికోసమై వేచియున్నాను. సాధ్యమైనంతవఱకు వసూలుచేసుకొని మఱి పోవవలయునని యుంటిని. నేనిచ్చటఁ గొంతకాలముండిన నుండఁగలను. కాని యీసొమ్ము వసూలయ్యేడు మార్గముమాత్రము కానరాకున్నది. బాకీదారులందఱను బట్టి బంధించుచున్నారు.

రామ—ఈనుధ్య కొత్తవింత లేమైన పుట్టినవా ఏమి? ఇప్పటి గడబిడకు కారణమేమైన నెఱుఁగుదువా? బందిఖానాలన్నియు నిండిపోయినవఁట. ప్రాఁతకొట్లలోనే కాదు. క్రొత్తఁగాఁగట్టించిన వానిలోఁ గూడ చోటుమియు లేకుండ నిండియున్నదఁట. స్థలము చాలక పసుపుల సాలలన్నియు నీఖైదీలకొఱకు పరిశుభ్రము చేయించుచున్నారఁట.

శ్యామ—సంగతి తెలియనే తెలియదా యేమి? "ఆశివశక్తి" పాఱిపోయినదఁట.

రామ—ఆమాట తెలిసినది. దాని దేశములోనుండి బయలుదేరఁగొట్టవలెనని విశ్వప్రయత్నము లెన్నియేని జరిగినవి, ఆగమ తంత్రములు కూడ నడచినవి. ఆ ప్రయత్నములు జరిగినంతవఱకు నది లేచిపోవనే లేదు, ఇప్పుడామె తనంతట తానే లేచిపోయినట్లున్నది. కారణమేమో?

శ్యామ—ఎవరి ప్రేరణయును లేకుండఁగనే పోయినది, మనతో మన మాట—అసంగతులన్నియును తలఁచుకొనిన యెడల, ఒడలు గగు

ర్పొడుచును. ఏదో పరదేవతవచ్చి యామెను పట్టి పీడింపఁగాఁ గాలి కొలఁది దూకినదఁట.

రామ—నీమాటలకేమిలే ?

శ్యామ—ఈపట్టణమున కప్పుడప్పుడొకదేవత వచ్చుచుండును. అదియైన విన్నావా? అప్పుడప్పుడామె అందఱకునుకూడ కనఁబడును. ఆమె ననేకులు పట్టుకొనినారుకూడను. చిన్నరాణిమీఁది యభియోగము విచారణ జరిగినప్పుడు నీవు దేశములోనున్నావా?

రామ—లేకేమి ? ఉన్నాను. ఆమెయేనా ? ఆమె యెవ్వరో ఎఱుఁగుదువా ?

శ్యామ—ఆమె కథ యెవ్వరికిని చెప్పినది కాదు. అనేకు లనేక తరహాలను చెప్పుచుందురు.

రామ—నీవు విన్నది చెప్పు విందము.

శ్యామ—కొందఱామె యీగ్రామదేవతయే యనుచున్నారు. కొందఱామె లక్ష్మీనారాయణస్వామి దేవాలయమునుండి తన యథారూపమున బయలుదేఱి వచ్చుచుండునని చెప్పుచుందురు. మఱికొందఱామె దశభుజ యేయనిచెప్పుదురు. కొందఱు దశభుజ దేవస్థానమునకామె పోవుటఁజూచినారు.మఱల నచ్చటనుండి వచ్చుటమాత్ర మెవ్వరును కని యెఱుంగరు. ఆమె అచ్చట నంతర్ధాన మగుచుండును.

రామ—అదియును యథార్థమే కావచ్చును, లేకున్న నామెకీ భైరవివేషమేల ? ఆమె యీవేళ తన భైరవీ రూపముననే దయచేసినదఁట.

శ్యామ—ఆమె యెవ్వరైననుం గానిమ్ము. ఆమెను నాఁడు సందర్శించియుంటిమి. అదియే మహాభాగ్యము. కాని రాజుగారి మనస్సు మాత్రము బొత్తుగా నస్వస్థమైనది.

రామ—దానికేమి గాని, ఇప్పుడా శివశక్తియెట్లు విరుగడైపోయినదో అది విననిమ్ము.

శ్యామ—రాజ్యమునందలి యీయనర్థము లెల్ల ఆశక్తివల్లఁ గలిగినవని కనిపెట్టి ఒకనాఁడా కాళికాదేవి భైరవి యాకారమునవచ్చి యామెను నులిమివేయఁ బంపించెను.

రామ:—ఏమి? దారుణముగా నున్న దే?

శ్యామ:—దారుణముగాక యేమున్నది. ఈదుర్గ యుద్ధసన్నద్ధురాలై వచ్చుటఁగని పెట్టి వికృతా కారిణియగు నా శివశక్తి తాటిచెట్టు ప్రమాణమున పెరిగి భయంకరాకారము దాల్చి కేకలు, బొబ్బలు, పెట్టుకొనుచు అదృశ్యమై పోయినది. ఎక్కడికిపోయినదో? ఎవ్వఁకిని తెలియదు.

రామ:—ఇది నీకెవ్వరుచెప్పినారు?

శ్యామ:—ఎవరుచెప్పవలెను? కన్నులారఁజూచినవారే చెప్పినారు. రాజు ఆశక్తియం దెంతయో మక్కువఁగనున్నాఁడు. అది పోయినదని చెప్పి "చిత్రవిశ్రమమునఁ గల దాసదాసీజనుల నందఱఁబట్టి కొట్టులోఁ ద్రోయించినాఁడు. ఈసంగతులు నాతో చెప్పినదియును, వారే" ప్రభువును మన మేమనుటకును, అవకాశము లేకున్నది. దైవయత్నమటుండ మనమేమిచేసిన నేమిప్రయోజనము. అని వారందఱు ననుచున్నారు.

రామ:—అట్లయిన నీవుచెప్పినవి గాలికబురులు కావు.

శ్యామ:—నే నట్లుచెప్పుదునా?

రామ:—ఆశక్తి మాంసాహారిణికదా? రాత్రు లేశవములనో పీఁకికొని తినుటకు పోయియుండును. మఱల రాలేదని యెట్లుచెప్పఁగలవు? రాజుగారి యాగ్రహమునకు తాళలేక పరివారజనము యేదోమసి బూసి నేరేడుకాయఁ జేసియుందురు.

శ్యామ—నేనుచెప్పినదంతయుఁ గల్పనాకథవలెనేయున్న దావిమి? ఆమె కోఱలు ముల్లంగి గడ్డలవలె నున్నవఁట. తల జనపనారపీఁచువలె నున్నదఁట. నాలుక మొసలి నాలుకయఁట. గ్రుడ్లు మిడిగ్రుడ్లఁట. ఆమె చన్నులు పెద్దపెద్దకుండలవలె నున్నవఁట. ఉచ్ఛ్వాసనిశ్వాసములు మేఘగర్జనము లేనఁట. కంఠస్వరము చెప్పనక్కరయే లేదఁట. భూమి బ్రద్దలగునఁట. ఇది యంతయుఁ జూచినవారు చెప్పినసమాచారము.

రామ—నీకథవినిన, ఒడలు కంపమెత్తుచున్నది. ఏదోరాజుగారి వ్యాపారమ స్తవ్యస్తముగా నున్నదని చెప్పవచ్చితివి. అదేమి?

శ్యామ—వదలిపెట్టును. అదియును చెప్పెదను. విను. నిరపరాధులెంత మంది జైలులోనున్నారనుకున్నావు? వికృతస్వరూపిణియగు నాశివశక్తిని వెదకితీసుకొని వచ్చుటకై దేశదేశములవెంట విసుగును విరామమును లేకుండ చారులను బంపుచున్నాఁడు. ఆమె తనయవతారము చాలించినపుడు ఎవ్వరు ఎచ్చటనుండి పట్టితేఁగలరు. పిచ్చిగాని, వెళ్లినవారు వెళ్ళినట్లువచ్చి చేతులుజోడించి ఆమెజాడలు తమకేమియును తెలియలేదని చెప్పుచున్నాడు.

రామ—రాజేమనుచున్నాఁడు.

శ్యామ—నాకుకనపడలేదని చెప్పినవాని నెల్లపట్టి కారాగృహమునఁద్రోయుచున్నాఁడు. ఈవిధముగా శిక్షాశాలలన్నియును నిండిపోయినవి. ఉద్యోగస్థు లందఱు నీదారుణచర్యలు చూచి భయప్రకంపితులయి, ఇల్లువాఁకిలి పెండ్లము బిడ్డలును అన్నియును వదలిపెట్టి కంటికిఁ గనుపడకుండఁ బోవుచున్నారు. వారే యిట్లు చేయుచుండఁగా, ఇంక సామాన్య జనులును, దుకాణదారులును పాఱిపోవుచున్నారనిన వింత యేమున్నది.

రామ—ఆశక్తి తనదివ్యదృష్టితో నొక్కసారి చూచెనా, ఈ నిరపరాధు లందఱును క్షణములో సురక్షు గందురు.

శ్యామ—ఆమె సాక్షాద్భగవతియే. ఆదేవి ఈకల్లోలమంతయును విని భైరవీరూపమును ధరించి రాజుగారి సముఖమునకు వచ్చి, ఇట్లనియెను. "రాజా! నిరపరాధులను పీడింపకుము. అట్టి పీడ రాజ్యాంతమునందుగాని కలుగదు. ప్రజ లించుకంతయును నిందాపాత్రులు కారు. ఆపాడుశక్తిని పాఱదోలినది నేను. దానివల్ల రాజ్యమునకు వినాశముగలుగుటఁ జూచి యట్లుచేసితిని. ఇదియే యపరాధమందురా. ఆయపరాధిని నేనుగాని వారెట్లగుదురు? ఎవ్వరినైన శిక్షింపఁదలంతువేని వీరినందఱి వదలి నన్నుఁబట్టి శిక్షింపుము."

రామ—పిమ్మట?

శ్యామ—దీనినిఁబట్టియే రాజునకు పిచ్చియెత్తినదని చెప్పుచున్నాను. ఆభైరవీరూపము తనను విడిచిపోయిన క్షణమునుండి రాజు భయరౌద్రరూపంబును ధరియించినాఁడు కాకియును, గ్రద్దయును, నైన

సమీపింప సమర్థములుగాక యున్నవి. అప్పుడప్పుడు పూజ్యుఁడగు చంద్రచూడ తర్కాలంకారుఁడును పెద్దరాణియును చూచుచుందురు. పాపకర్మము వారికాళ్లనుకూడ వచ్చి చుట్టుకున్నది.

రామ—ఏమందువు? ఆచార్యునకు పాపకర్మమా? అతనికి నిరాపనిందయా? అట్టిమాట వచియించు వాకుకూడ నున్నారా?

శ్యామ—అందున కడ్డుచెప్పువారు కూడ నున్నారా? తరువాత నేమి జరిగినదో వినుము. ఆతని యాగ్రహరూపము ప్రథమావస్థలో, ఎదుట పడ్డవారెవ్వరో ఎఱుఁగుదువా? భగవతియె. ఆమె సందర్శనమిచ్చి నేను నీకు చెప్పినసంగతు లన్నియును చెప్పినది. ఆమాటలు రాజు చెవిని బడినవి. ఆతనికన్నులు జొత్తులయినవి. అట్లు తనబాహువుల పైకెత్తి యామెను మోఁద నుంకించెను. అట్లు చేసినను బాగుగనే యుండును. అంతకంటె దురాగతము చేసినాఁడు.

రామ—ఏమి చేసినాఁడేమి?

శ్యామ—ఆదేవతను బంధిఖానాలోఁ ద్రోయించినాఁడు. ఆశక్తిమూఁడుదినములలో రాకయుండెనేని పురజనులందఱి ముందర నాదేవతను కట్టుపుట్టములొల్చి చండాలునిచేఁ జదియమోఁదించుట కుత్తరువుఁ జేసెను.

రామ—హా ఆహా! తాను దేవతలనుకూడ శిక్షింపఁగలననియా యాతనియూహ రాజునకు పిచ్చియెత్తెనా యేమి? దేవతను కారాగృహమునను౦చిరా? మనుష్యసంభవుం డెవఁ డామెను కారాగృహమున నిలుపఁగలఁడు?

శ్యామ—దేవతామాహాత్మ్యమును పూర్ణముగఁ గనుఁగొన్న వారెవ్వరు? రాజు రాజ్యము చేయుకాలము సమాప్తమైనది. అందువలననే ఆదేవత యేదో ఒకమిష పెట్టి తన యథాస్థానమునకు మరలి పోవఁ జూచుచున్నది. రాజాజ్ఞ చెవింబడుటతోడనే యాదేవి తనను గానట్టు గజేంద్రగామినియై కారాభవనంబునఁ బ్రవేశించె. రాజమందిరమున రోజురోజు రాత్రులు పెద్దపెద్ద కేకలు వినఁబడుచుండునఁట. దేవత లందఱును గలసి మంత్రపఠనము సేయుదురఁట. జనులు వేదబుక్కులును తదితరమంత్రములును పఠియించుచుందు

రఁట. ఈవేదఘోష కారాగృహమువఱకు వ్యాపించి అచ్చటనుం డు పహరావాండ్రకు కూడ వినిపించుచుండునఁట. వారు తలుపుతె అచి చూచునప్పటికి ఏమియును గనుపడదట. యయంతియే మంత్ర పఠనము సేయఁగలదనియు ఆమె వేదవేదిని యనియును, చదవరులు గ్రహింతురు గాక.

రామ—పిమ్మట.

శ్యామ—ఈరోజుతో మూఁడురోజులును పూర్తిఅయినది. ఒకసన్యాసిని గప్పె బందిపోటు కేసుకు వచ్చినదనియును, ఆమెను రేపటిదినము దిగంబరం గావించి చదియ మోఁదెదరనియు చూడ నభిలాషగల వారందఱును రావచ్చుననియు రాజుగారు దండూరా వేయించిరి. అది నీచెవినిఁ బడలేదా ఏమి?

రామ—ఈరాజునకు మతిపోయినది. పూజ్యుఁడగు తర్కాలంకారుఁడైన, నీవిషయమున అడ్డు చెప్పలేదా? పెద్దభార్య నందయైన చెప్పవలదా? ఎదుటఁబడిన రాజు చీవాట్లుపెట్టునని భయపడి యూరకుండిరి కాఁబోలు?

శ్యామ—వారందఱకును చాల వితర్కములు జరిగినవఁట. రాజు వారితో ఇట్లనెనఁట. "ఆమెదేవతయూ? అటునయిన నామెను సంరక్షింప మీకింత ప్రయాసమేమి? "ఆత్మరక్షణోపాయ మామె యెఱుఁగదా? అట్లు గాక మనుష్యమాత్రురాలేయైన ఆమె తెరవాటుకత్తె యగుటచే శిక్షార్హురాలు. చేసినది దొంగతనము. నేనురాజును. ఏల ఈ వృథాప్రయాసము."

రామ—రాజు చెప్పినదియుఁ గొంతవఱకు సయుక్తికముగానే యున్నది. అతఁడుపట్టునది ఆయుపుపట్టే. రేపు ఏమిజరుగునో చూడఁదగినది మాత్ర మగును. కష్టమునకు తగిన ఫలితమున్నది. నీవు వెళ్లెదవా?

శ్యామ—మానుటకూడనా? అందఱును వెళ్లి తీరవలసినదే. ఇంతటి వింత మఱియొక్కటి కన్నులఁబడునా? నీవుమాత్ర మేల రారాదు?

—oo:o:oo—

## పదునెనిమిదవ ప్రకరణము.

నేఁడు యయంతిని శిక్షించుదినము. ఆమెకు దెబ్బలశిక్ష విధింపఁబడినది. యయంతిని దిగంబరం గావించి బహిరంగముగ చావమోఁదెదరని దేశమంతటను చాటించిరి. ఇంకను సూర్యోదయము కాలేదు. అప్పటికప్పుడే జనులు రామొదలు పెట్టిరి. అరుణోదయమునకు పూర్వమే రాజమందిరము నందంతటను ప్రేక్షకులువచ్చి నిండిపోయిరి. సభారంగమంతట నెక్కడను నెడములేదు. క్రిక్కిరిసియుండెను. జనులొకరినొకరు త్రోసికొను చుండిరి. వారిసందున నిసుకఁజల్లినను రాలునట్లు లేదు. ఇటునటునొత్తిగిలుటకైన నవకాశము లేకయుండెను. ఊపిరి నలుపుటకైన లేదు. వెనుక నొకసారి యీ సభారంగముననే వేనవేలు జనులు వచ్చి ప్రోగుపడిరి. అప్పుడే కదా? రమా యువతిపై నేరమువిమర్శజరిగినది. నేఁడు యయంతికి విధింపఁబడిన శిక్ష యమలు జరుగనున్నది. నాఁటి విమర్శనము కన్న నేఁటి శిక్షాకార్య మెక్కువ జనుల నాకర్షించెను. గవాక్షము వద్దనుండి నంద ఇదియంతయును జూచుచున్నది. ఆమెదృష్టికి సభారంగమునందలి జనమంతయును జీవ సముద్రమువలెను అందలి నల్లగడ్డములు తరంగములవలెను గనుపట్టెను. అచ్చటచ్చట మేలిముసుగులతో నున్న ఆఁడువాండ్ర శిరస్సులును, పురుషుల యుత్తమాంగములపై నలంకారముగనున్న శిరోవేష్టనములును బుడగలవలెఁ గాన్పించెను. రమా యువతి విమర్శసమయ మామెకు తలంపునకు వచ్చెను. నాఁటి జీవసముద్రము విశేషముగ చలనము నొంది యున్నట్లును పెద్దగాలిదెబ్బచే సంకులమునొంది కలగుండుపడినయట్లును గనుపడెను. నాఁడు సంక్షోభ నివారకుల కెందరకో పనికల్గెను. జనులయల్లరి మాన్పుటకడుకష్టసాధ్యమయ్యెను. నేఁడో? ఎచ్చటచూచినను నిశ్శబ్దమే. రాజకీయమగు ననర్థమెద్దియో యొకటి పొంచియున్నట్లును, తథావిధమగు భయమొకటి వచ్చి వారినెవ్వరిని నోరెత్తకుండ నదుముచున్నట్లు నుద్యోతకమగుచుండెను. ఏమియో యెవ్వరికిఁ దెలియదు. భయమందఱకు నావేశమయ్యెను. నేఁడు రాజభవనము భయంకరమైన యరణ్యమువలెఁ గనుపట్టెను. ఇందలి జనులే అచ్చటనుండు పెద్దపులులును, భల్లూకములును. అచ్చట నిశ్శబ్దమే ఇచ్చటనిశ్శబ్దము.

ఆసభా భవనాంతరమున విశాలమైన ముంగిలి యొకటి యున్నది. తన్మధ్యమున నెత్తుగ నొక వేదిక యమర్పఁబడి యున్నది. ఆ వేదికపై యాకారము దాల్చిన అంధకారమువలె చండాలుఁ డొకఁడు చేతబెత్తముపట్టికొని భయంకరాకారమున నిలువఁబడి యున్నవాఁడు. యయంతి నచ్చటకుఁ గొనితెత్తురు. అందరి ముందర నామె నచ్చటఁ దిగంబరం గావింతురు. రాజశాసనమున నేఁడామె నచ్చట దిగంబరయైయుండ మోఁదెదరు.

యయంతి నింకను గొనిరాలేదు. రాజుగారి రాకకై వేచియుండిరి. ఆయన వచ్చినవెనుకఁ గొనివత్తురు. ఆ వేదిక కెదురుగా రాజుగారి సింహాసనము రక్షకభట పరిరక్షితమై యున్నది. పెద్ద యుద్యోగస్థు లెవ్వరును వచ్చినవారు కారు. అట్టి దుర్భరమైన వీక్షణము వారి మనస్సున కెట్లు సహింపుగనుండును? అదితలఁపున బొడమునప్పటికే మనస్సున పరితాపము మిక్కుటమయ్యెను. రాజుగారైనను, వారినెవ్వరినిగాని రమ్మని వర్తమానమంపలేదు.

జనులు తండోపతండములుగఁ జేరి రాజుగారి రాకకై నిరీక్షింపుచుండిరి. స్త్రీయో? దేవతయో? ఎవ్వరో యొకరు నేరస్థురాలగు నామె యాగమనమునకై వేచియుండిరి. అందఱు నెప్పుడెప్పుడని కనిపెట్టుకొని యుండిరి. ఇంతలో రాజభటుల కేకలు వినఁబడియెను. డంకానగారాల మ్రోఁతలు ప్రేక్షకులుల కండఱకును రాజుగారి రాకను విశదీకరించెను. నేఁడు రాజుచిత వేషమున లేఁడు. గ్రీష్మ దివసావసాన సమయమునందలి కాలమేఘమువలె రాజునాకారము భయావహముగనుండెను. కన్నులెఱ్ఱవడియెను. విశాలమగు వక్షస్సు దుందుడుకుం జెందియున్నది. వర్షాసన్నమగునెడ మేఘపంక్తి క్రిందకు దిగునట్లు రాయలువచ్చి సింహాసన మాక్రమించెను. రాజాగమనమును సూచించు వందిమాగధ స్తవములుగాని, జయజయవాక్యములుగాని, సూచనామాత్రము లైనఁగానరావయ్యెను.

అచ్చటఁ జేరిన జనసముదాయంబంతయు నెప్పుడెప్పుడని తమ యాగమనకార్యమును బ్రతీక్షింపుచున్నారు. అటునిటుఁ జూచుచున్నారు. యయంతిని రక్షకభటులు శిక్షా వేదికకుఁ గొనిపోవుట వారికన్నులఁ

బడియెను. రక్షకభటులామెను నచ్చటకుఁ గొనిపోయి విడచివచ్చిరి. ఇంటి నడికొప్పుపైఁ బ్రకాశించు పూర్ణచంద్రునివలె నావేదికపై నిరుపమానం బగు యయంతి సమ్మోహనాకారము భాసిల్లుచుండెను. తేజోవిరాజిత యై గైరిక వస్త్రధారిణియై మెరయు యయంతి రూపమును ప్రేక్షకులం దఱును మొగము పైకెత్తి తదేకవీక్షణమునఁ బరికించి చూచిరి. ఔదార్యమై, అత్యంత మనోహరమై, దేదీప్యమానమై, నవయౌవన ప్రాదుర్భావంబునఁ బరిపక్వమై, అలరు నాయాకారము, దివ్యమగునా నిశ్చలత్వము, మూర్తీభవించియున్న నా ప్రశాంతము, చూచిన వారినెల్ల నద్భుతసాగరమున ముంచివేయుచుండెను. యయంతి ముఖవర్చస్సు, బాలసూర్యుని యరుణకిరణములచే సరసీరుహ పద్మమువలె శోభాయమానమై కలకలలాడుచుండెను. ఆమె యధరోష్ఠంబున మృదుమధురంబగు స్మేరాంకూరంబు యత్నపూర్వకంబుగ నిరోధితంబయ్యె. ఆమందస్మితంబె యాసన్నంబగు విపత్తులకెల్ల విజయచిహ్నముగ నలరెను. ప్రేక్షకులలోఁ జాలమంది, ఆమె నొకదేవతగా సంభావించి చేతులు దోయిలించి నమస్కారము సేయసాగిరి. అట్లు నమ్రులగు వారిం బొడగాంచుటచేనోడ నేతక్కుంగలవారికిగూడ కొందఱికి నామెయెడ భక్తి తాత్పర్యంబులు జనియించి, "లక్ష్మీమాతకీజయ్." "మాతృశ్రీకిజయ్" అని కేకలువేయుచు చప్పట్లు చఱవందొడఁగిరి. ఈచప్పట్ల సందడి, యొకమూల నుండి యొకమూలకు ప్రతిధ్వనించి పర్వత ప్రాంతమునందలి మేఘగర్జనము ననుకరించెను. తుట్టతుదకచ్చటనున్న వారందఱి వాక్కులుగూడ గొంతసేపు "జయజయ" శబ్దములతో నిండి సభాభవనమంతయును మొగిరిపోవునట్లయ్యెను. చండాలుని చేతనున్న కొరడాక్రింద జారిపడియెను. యయంతి తనమనంబున దైవము నిట్లు ప్రార్థింపఁ దొడంగెను.

"ఓమహాప్రభూ! విజయము నీయధీనము. ఈసభయంతయును నీమాహాత్మ్య ప్రతిపాదకము దక్క మఱి యేమున్నది? ఈమహాసంఘమున బయలుదేరిన యీసంకులారావ మంతయును నిన్ను నీవేల పొగడుకొనుట కాని వేఱుకాదు. ఓవిశ్వనాథా! జయము. జయము. దేవా! విజయము నీదికాదా? నేనవ్వతెను?"

క్రోధోద్రేకముననున్న రాజు రౌద్రమూర్తియై గర్జారవంబున

గుడ్డలు లాగివేయుము. కొరడాకు పనిచెప్పుము. చూచెదవేమి? అను సమయమున త్వరత్వరగ చంద్రచూడుఁడు రాజును సమీపించి రెండుచేతులనుబట్టికొని "ఓమహారాజా! ఈమెయెడఁ గరుణాఖండవుగమ్ము. నాకీయొక్కవరమిమ్ము. ఇంకనే నిన్నేమియును వేఁడఁబోను. ఈమెను వదిలివేయుము," అని ప్రార్థించెను.

రాజు—"పరిహాసముగ" ఏమీ? ఈదేవతకు తప్పించుకొనుటకు శక్తియే లేదా? ఈనీచురాలికి, ఈవంచకురాలికి, ఇదియే శిక్ష.

చంద్ర—ఆమె దేవతకాకపోవచ్చు, కాని యబల.

రాజు—అబలలనుమాత్రము రాజు శిక్షింపఁ దగఁడా?

చంద్ర—ఈజయజయశబ్దములు నీచెవిం బడుటలేదా? దానితోడ నీపేరంతయును మాఱిపోవదా?

రాజు—ఓగురుప్రవరా! నీవు నీపనికిఁబొమ్ము, నీకచ్చేరీపని యంతయును పూర్తియైనదా?

చంద్రచూడుఁడు వెడలిపోయెను. రాజశాసనాను సారముచండాలుఁడు మఱల కొరడా చేతఁబట్టెను. తాటించెను. యయంతి మొగము వంక తేరి పాఱఁజూచెను. కొరడా క్రిందకువాల్చి రాజువంకనొకసారి చూడ్కులు నిగుడించెను. రాజుపైనుండి దృష్టిమఱలించి మఱల యయంతిపైఁ బ్రసరింపఁజేసెను. చిట్ట చివరకు చేతనుండుకొరడా అవతలఁ బాఱవైచి కదలకుండ మెదలకుండ నిల్చెను.

రాజు—ఏమిరా ఇది; అని బొబ్బరించెను.

చండాలుఁడు—మహాప్రభూ! నేనీపనిఁ జేయలేను. అని ప్రతివచనం బిచ్చెను.

రాజు—ఓరీ చండాలుఁడా భద్రము. నిన్ను బ్రతికి యుండఁగ నీయొడలి చర్మ మొలిపించెదను.

ఛం—చేతులుగోయిలించి, అదియే దేవరశాసనమయ్యేనేని దానినెల్లని సహించెదను. కాని ఈపనిమాత్రము చేయఁజాలను.

అంత రాజు మండిపడి భటులనుబిలచి యాతలవరిని బట్టి బందిఖానాలోఁద్రోయుఁడని శాసించెను.

రాజభటులు రాజశాసనము నెరవేర్ప గద్దెపై నెక్కుచున్నారు.

అది యయంతి కంటఁబడినది. వానిని బట్టి బంధింపఁబోవుటఁగాంచి యయంతి రాయలను సంబోధించి "రాజా! ఈతని నేల బాధించెదవు? నీ శాసనము నేనే నెరవేర్చెదను. దీనికి చండాలు లక్కఱ లేదు. తలవరుల తోఁ బనిలేదు" అని చెప్పెను.

అట్లు చెప్పినను లక్ష్యముసేయక భటులా తలవరినిఁ బట్టఁబోవుచుండ యయంతి "ఓరీ, ఏమిరా, ఊరక నాకొఱకు నీవేల, ఈ యాపదల పాలగుదువు. నేను సన్యాసినిని. కష్టములన నాకు లెక్కలేదు. నేను కష్టసుఖముల రెండింటను గూడ జయించినదానను. అవి నన్నేవియును చలింపఁజేయఁజాలవు. ఈకొరడా నన్నేమిచేయఁగలదు "వస్త్ర విసర్జనమొట్లు సైతువందువా? నావంటి దానను దిగంబరినైన నేమి? సాంబరినైన నేమి? ఎందులకుఁ గష్టపడియెదవు? కొరడా దీసికొనుము.

చండాలుఁడు కొరడా గ్రహింపఁడయ్యెను. యయంతి "వత్సా! నా మాటయందు నీకించుకంతయును విశ్వాసము లేకపోయెను. నేను స్త్రీనగుటచేతనా? కావలసిన నీనిదర్శనము జూడుము" అని యయంతి యా కొరడాను దెప్పించి కుడిచేతిలోఁ బుచ్చుకొని గట్టిగఁ బట్టుకొనియెను. ఆమె యడుచేతులు అతిమృదులము లైనవి. వికచారవిందసదృశములై యున్నవి. ఎడమచేయిఁ బూర్ణముగఁ జాఁపి జనులందఱునుఁ గన్నులారఁ జూచుచుండఁ తనశక్తికొలఁది యాకొరడాతో గట్టిగ నొక దెబ్బఁగొట్టుకొనియెను. కొరడా చేతిలో సగమువఱకు దిగిపోయెను. చేయితెగెను కొరడాపైకి తీయునప్పటికి నెత్తురు కండలుగూడ దానివెంటి వచ్చెను. రక్తము కాలువలుకట్టెను. యయంతి కాషాయ వస్త్రమును, ఆవేదికయును రక్తమయమై తడిసిపోయెను. అచ్చటఁ జేరినజనులందఱును, అబ్బా? అబ్బా ? అని నకనకంబడఁ జొచ్చిరి.

యయంతి నిరోధితస్మేరాంకూరయై చండాలుని సంబోధించి "వత్సా! చూచితివా? ఇంద్రియనిగ్రహము గల స్త్రీలకు బాధయననెట్టిది ? నీకేటి కీభయము" అని చెప్పెను.

కణకణలాఁడు నిప్పువలెనున్న నాపుడును సంతోష వికాసముచేఁ దరంగితంబగు నామెముఖవర్చస్సును ఆతలవరిచూచి వెనుకకు దిరి

గి యా వేదికనుండి క్రిందికి దుమికి పాఱిపోయెను. ఆమందిలో వాఁ డె చ్చటఁ గలిసిపోయెనో ఎవ్వరికిం గనఁబడలేదు.

అంత రాజు తన యనుచరులంబిలిచి అదరిపడుచు "దో స్ప్రాలడ్మీ కీలాద్" మఱియొకనిఁ బిలువుము. అని కేకలువేసెను అంత నాభటవరులు మృత్యుదేవత యపరమూర్తియో యన నొప్పు కటికవాని నొక్కని మహామ్మదీయుని గొనితెచ్చిరి. మహామ్మదుపురమున గోవులను చంప నిచ్చుటలేదు. దాని శాఖానగరమున మేఁకలను గొఱ్ఱెలను గోసి యామాంసము నమ్ముకొని యతఁడు జీవించుచున్నాఁడు. ఆతఁడు పోతవిగ్రహమువలె నుండి చూడ భయంకరముగ నున్నవాఁడు. రాజుగారి యాజ్ఞయైనది. ఆతఁడు యయాంతియున్న గద్దెపైనెక్కెను. కొరడా చేతఁ బట్టుకొని యయంతి కెదురుగనిలచి ఆమె కెట్టయెదుట నాకొరడానుతాటించుచు నా కటికవాఁడు "ఓసీ? నీగుడ్డ లూడ్చివేయుము. నిన్నిపుడు ముక్కలు ముక్కల క్రిందఁగోసి నాదుకాణమున నమ్మెదను" అని కేకలకు దొరకొనియెను.

యయంతి ముఖమున మనోవేదనా సూచకంబైన వికారం బించుకంతయును గనుపట్టదయ్యెను. మొగమునఁ జెమటబిందు వొకటియైనఁ గలుగలేదు. ఆ జనసముదాయము నందఱ సంబోధించి "నాకు రాజశాసనమైనది. ఈవేదికపై నావస్త్రమును విసర్జింప వలయు. మీలో నిర్దోషురాండ్రయిన స్త్రీలకు బుట్టినవారందఱుచు మీతల్లుల సంస్మరించుకొనుచు నొక్కింతసేపుఁ గన్నులు మూసికొనుఁడు. మీలో ఆఁడుబిడ్డలుగన్నవాండ్రందఱును నన్నుఁగూడ మీగర్భవాసమునఁ బుట్టినబిడ్డఁగా భావించుకొని నిమీలితాక్షులరగుఁడు. ఇందెవ్వరైన హిందువులుండి దేవబ్రాహ్మణ పక్షపాతు లుండినయెడ వారందఱును, ఒక్కింత సేపుఁ గన్నులఁ దెఱవకుఁడు. సంకరస్త్రీలకుఁ బుట్టినవారును, అసచ్చరిత్రలైన తల్లులగువారును, తమ చిత్తమువచ్చినట్లు చేయువచ్చును. వారియెదుట నాకే సిగ్గునులేదు. అట్టివారిని నేను మనుష్యులుగ బరిగణింపను. అని ప్రార్థించెను.

ఆ జనులందఱును గన్నులు మూసికొనిరో తెఱచికొనియుండిరో మన మెఱుఁగముగాని యయాంతిమాత్రము వారివంకఁ జూడదయ్యెను.

ఆమె మనస్సు ఇప్పుడు తారాపథము వంటి కేవల భగవద్ధ్యాన తత్పర తచే తాదాత్మ్యము నొందియున్నది. రాజువంకఁ దిరిగి "నీశాసనాను సారముగ నేనిప్పుడు దిగంబరి నగుచున్న దానను. నీవుమాత్రము నావం కఁజూడరాదు. నీ పీరాష్ట్రమున కధినాథుఁడవు. నీవే ఇట్టి పశుకృత్యము లను చేయుచున్న నీ ప్రజలేమి చేయరు? ఓకీర్తికాముఁడా! రాజా! నే నాటవికను. అడవులవెంట సంచరించుదానను. అచ్చట నాకనేకపర్యా యములు వస్త్ర విహీనముగ నుండవలసిన సమయము తటస్థమగుచుం డును. ఒకప్పుడు నేనొక పెద్దపులినోటఁ బడితిని. అప్పుడెట్లో యాఘా తుకమృగము బారినుండి తప్పించుకొని బైటఁబడితిని. అప్పుడు నాకు వ స్త్రవిసర్జనము కాలేదు. నీచర్యలనుజూచి నిన్నిప్పుడు వన్యమృగమవని భావించుచున్నాను. అందువలన నీయెదుట నాకు సిగ్గులేదు. కాని నీవాఁడు వాంఛతో సంచరించుచున్న వాఁడవు. సంసారము చేయుచున్న వాఁడవు. దేశమున ప్రభువన్న పేరున నెగడుచున్నాఁడవు. నీవుమాత్రము సిగ్గుఁబడ వలసి యున్నది. నీకన్నులు విప్పకుము" అని చెప్పెను.

కాని ఈమాటలుకూడ నాతని చెవులకేమియు నాటినవికావు. ఆతని కుద్రేకము మఱింత యెక్కువయయ్యెను. ఆతనికిప్పుడు నిజముగ నేత్రము లంధీభూతములుగ నే యున్నవి. యయంతి వాక్యముల కుత్తరువైన జెప్పు పుణ్యమునఁ బోక కటికవాఁపైపై బొబ్బరిల్లుచు "ఓరీ చూచెదవేమి? వస్త్రమునూడ్చుము. పట్టితన్నుము" అని కేక వేసెను.

యయంతి ఇంక చెప్పి ప్రయోజనము లేదని నిశ్చయించి యావేది కపై మోకరించెను. ఆమె మోసముజెందినది. కన్నులవెంట నశ్రుకణ ములు బయలుదేరెను. ప్రాపంచికములైన సుఖదుఃఖములన్నియును నామె విసర్జించినది. హేయములైన కష్టసుఖములఁ గడచి గట్టెక్కినది. ఇంతమాత్రము చేతనె లజ్జాపరిత్యాగ మగునా? ఆమెకడ నింకొకమహత్తు కూడ నున్నది. మనస్సునకును, ఇంద్రియములకును, సంధానముకూడ లేకుండ చేయఁగలదు. అందువలన వస్త్రమున్నను, లేకున్నను, ఒక్కటే యనుకొన్నది. పాపలేశము సిగ్గునకు మూలము. అది లేకున్న మఱి సిగ్గెందులకు? సుఖదుఃఖములకు దాసులై యుండు మనుష్యమాత్రుల కడ సిగ్గన నర్థము లేనిమాట. దైవసమక్షమున నుండవచ్చు. ఇంక నీమె

కాజనులయెదుట సిగ్గుపడ నవసరమేమి ? అందువలననే యయంతి కీషత్తైనను మనస్సు వికలత్వము నొందలేదు. దెబ్బలమాట యామెతలఁ పనైనఁ దలపలేదు. వస్త్రవిసర్జనము సేయుతరుణ మాసన్నమైనది. పాపపుసిగ్గెచ్చటినుండి వచ్చెనో యామెను గ్రమ్మివేసెను. ఆమె సంపూర్ణమైన ఇంద్రియ విజయమును గాంచినది. ప్రాపంచికములగు సుఖదుఃఖముల మాటఁ దలంపులకైన రాకుండ వాని నణఁచివేసినది. అందువలననే స్త్రీజన్మమునందలి తిరస్కారభావమును దెలుపు నుద్దేశ్యముతో యయంతి చేతులనుజోడించి మోఁకరించెను. ఆమె యాత్మ నిష్కల్మషముగ నున్నది. మనస్సు పూర్ణముగ వశ్యమైనది. ఇప్పుడు తన్మయత్వమునంది ఇట్లు భావింపసాగెను. "ఓ దీనజనశరణ్యా ! ఆపద్బాంధవా ! నన్ను నేఁడుకాపాడుము. ఐహికములగు సుఖదుఃఖములన్నియును విసర్జించితినని గర్వించితిని. ఓగర్వాపహారీ ! నాకు గర్వభంగమైనది. నన్ను నేఁడు కాపాడి రక్షింపుము. ఓదేవా ! నే డీలజ్జ నన్నెల యనుసరించె. ఐహికములగు సుఖదుఃఖముల సుకరముగనె నిర్జింపవచ్చు. స్త్రీస్వభావసిద్ధమగు లజ్జనుమాత్ర మేవిధముచేతను విసర్జించుట సాధ్యముకాదు. ఓలోకేశ్వరా ! నేఁడు నిన్ను శరణుజొచ్చితిని. కాపాడి రక్షింపుము.

అని ఇట్లు యయంతి సర్వశక్తులఁగూర్చి పరిదేవనము సేయుచున్నది. కటికవాఁడీనడుమ నామె పైఁటగొంగునుబట్టి దిగలాగుచుండెను. ప్రేక్షకులందఱును, అయ్యో? అయ్యో? అని విన్నఁబోవుచున్నవారు. కన్నులు మూసికొనుచున్నారు. తెలచుచున్నారు. "ఓమహారాజా ! ఈపాపము నిన్ను నాశనముసేయును, నీరాజ్యమున కవసానమువచ్చినది" అని తిట్టిపోయుచున్నారు. పాపము? యయంతి అసహాయ, ఏమిచేయఁగలదు? వానిచేతనున్న పైటకొంగు వదల్చుకొనఁ బ్రయత్నించుచున్నది. ఆ కటికవానిచేత తనకొంగుండుట యామె కిష్టములేదు. కన్నీరు జలజల చెక్కులపైఁ గాలువలు గట్టుచున్నవి. శ్రీ ఈసమయమున దగ్గిఱనుండెనా? తప్పక ఆశ్చర్య మగ్నమానసయై యుండును. యయంతి కడ నింతవఱ కెవ్వరు నేవికారము కనిపెట్టుంగరు గాయముతగిలిన చేత తనపైటకొంగు బట్టుకొని "ఓజగదీశ్వరా ! రక్షింపుము. రక్షింపుము" అని కేకలు వేయఁదొడంగెను.

జగదీశ్వరున కీకేకలు వినఁబడఁబోలు ఏమి? ఈ యాశ్చర్యము! అచ్చటఁ జేరిన వారెల్ల నేడ్చు నేడ్పులు "జయము జయము దేవీజయము" అను విజయ ధ్వనులక్రిందను, చప్పటలుక్రిందనుమాఱెను, యయంతి మోఁకరించియుండెను. మొగము వంచికొనియున్నది. ఆమె చెవ్రలకు ఆభరణముల ధ్వని యొక్కటి వినవచ్చెను. మొగమెత్తిచూచునప్పటికి పట్టమహిషియగు నంద పరిచారికా పరివృతయైవచ్చి వేదికపై కెక్కుచుండెను. అదిగాంచి యయంతి లేచెను. స్త్రీలందఱును వచ్చి యయంతిచుట్టును మూగిరి. నంద యయంతి కష్టముగ పిలిచెను, చప్పటలు జఱచుచు ప్రేక్షకులందఱు హాస్యరణఁ జేయసాగిరి. కటికవాఁడు యయంతి చెఱఁగువిడచెను. ఇంక నాతఁడు నా వేదిక దిగఁడయ్యెను.

రాజున కొకమూలకోపమును, ఒకమూల వింతయును కలుగుచుండెను. అతిరౌద్రమూర్తియై కోపోత్కంఠతతో దేవి! ఏమి నీ కీసాహసము?" అనియెను.

నంద—ప్రాణేశా! నేను బిడ్డలు గలదానను; సంసారము సేయుచున్నదానను, నాబొందెలోఁ బ్రాణమున్నంతవఱకు నేను పిన్ని పాపకార్యము చేయుసియను.ఆపైనఁగాని "నా" అనుమాట లేకుండఁబోదు.

రాజు—యథాక్రోధముతో "నీవు మాట్లాడఁదగినది అంతగపురము కాని యాస్థానము కాదు. శీఘ్రముగ నీయుచిత స్థానమున కరుగుము. నంద బదులు చెప్పదయ్యెను.

యయం—ఎలుగెత్తి "ఈ సభాభవనమున నింతమంది యున్నారు. ఈ దురాత్ముని నాసన్నిధానము నుండి తొలఁగింపఁగలపుణ్యాపురుషుఁడొక్కఁడును లేఁడా యని యఱచెను.

అంత తండోపతండముగ ప్రేక్షకులందఱును వచ్చి "తన్ను తన్ను మనుచు" అతిరౌద్రమూర్తులై యాకటికవానిపైఁ బడిరి. వాఁడును, వేదిక దిగి పాఱిపోవఁ బ్రయత్నించెను. కాని ప్రేక్షకులు వానిని పోనీయక పట్టుకొని, తన్నులు, గుద్దులు, వర్షము గురిపించి వీథిగుమ్మమువఱకును నెట్టుకొని పోయిరి. అచ్చట నాతని లేఁపోని యుల్లంఘన లెన్నియేని, బెట్టి ప్రాణావశిష్టుని జేసివిడచిరి.

నంద యయంతితో "అమ్మా! నాకభయమిమ్ము, మాయందు లోపములు వెదుకనే దేవతవో యిట్లవతరించితివి. ఈనేరమును మన్నింపవలయు. మాయంతఃపురమున కొక్కసారి విచ్చేసి నీ పాదధూళిచే నయ్యది పవిత్రముగావింపుము. నీచరణసేవఁ జేసెదను.

అంత రాణి యయంతిని వెంటఁబెట్టుకొని తన పరివార జనముతో నంతఃపురమునకు బోయెను. తానేవిధముగను, అపుటకు వలనుపడక రాజును సింహాసనమునుండి దిగిపోయెను. ప్రేక్షకులందఱును, నందపై యాశీర్వచనవర్షములం గురిసి సభాభవనమునుండి యరిగిరి.

యయంతి రాజాంతఃపురమున విశేషకాలముండలేదు. గంగాజలముల తచ్చరణములఁ గడిగి సేవింప సెలవిమ్మని నంద యయంతిని వేడుకొనియెను. కాని యయంతియందుల కంగీకరింపలేదు యయంతి చిరునగవుతో "బిడ్డా! నీకెప్పుడు "శుభంబగుగాక" యని యాశీర్వదించుచున్నదానను. నా కిందుమూలమున విచారముగలిగినదనిగాని కోపమువచ్చినదనిగాని తలంపకుము. నీకెప్పుడును, ఏకీడును రాకుండ దైవము కాపాడుఁగాక, నీకెప్పుడైన నేయాపదయైన వచ్చెనేని నాకు తెలిసిన తక్షణమేవచ్చి సాయపడియెదను. ప్రాపంచిక సౌఖ్యముల విడిచిన స్త్రీకి అంతఃపురము వాసయోగ్యము కాదు సెలవిమ్ము" అని చెప్పెను.

నందయును తత్పరివార జనమును, యయంతి పాదధూళిని శిరసా ధరియించి ఆమెను వీడ్కొలిపిరి.



పందొమ్మిదవ ప్రకరణము.

రాజాంతఃపుర సమాచారములు చాలమంది నోళ్లంబడినవి గాని అవి యున్నవి యున్నట్లు మాత్రము వెలుపలకు వచ్చుటలేదు. ఒకరి నోటినుండి యొకరినోటికి ప్రాకి అసలుసంగతి అనేక వికృతులను పొందుచుండును. యథార్థముచేత నాఁడు వాండ్రనోటఁ బడినదాని కెన్నియో వన్నెలు చిన్నెలు వచ్చును. అందులోఁ గొంచెమాశ్చర్య పడఁదగిన విషయమువచ్చెనా? అందలి యతిశయోక్తి చెప్ప నవసరమే లేదు. మనమాలించిన పౌరుల సంభాషణమును బట్టి యయంతిని గూర్చిన యూహ

లెంతవఱకు సత్యమో తేలుచునేయున్నవి. యయంతి అంతఃపురమున తడవునిలువక వెంటనే వెడలిపోయినది. ఆమే బయటవచ్చినది. జనానా లోనుండి యద్భుతముగా అంతర్థానమైనదని చెప్పుకొన సాగిరి. చాల మంది కామాటలయందు విశ్వాసముకూడ కుదిరినది.

అందుమీఁద ఆప్రజలకందఱకును ఆమె ఆపుర దేవతయే యని యును, పట్టణమును గాచిరక్షింపుచున్న దామెయేయనియు నమ్మకము కలిగినది. ఏన్నాళ్లోటులు కనిపెట్టి ఆమిషమీఁద రాజ్యము వదలిపోవ నెంచి యామిష దొరకినమీఁద పట్టణరక్షణ విడచిపోయినదని చెప్పు కొనసాగిరి. ఇంక రాజ్యము పోయినట్లె యెంచుకొనిరి. దురదృష్టవశము న మూర్షడాబాదానుండి నబాబుసైన్యము వచ్చుచున్న దనుకింవదంతి కూడ నొకటివచ్చిపడియెను. ఇంక ప్రజలకు కలిగెడి యలజడికిని విశ్వా సమునకును కొదువ యేమియుండును? పట్టణమేమూలఁ జూచినను సా మానులు సర్దుకొనుటలో గజిబిజి పడుచుండెను. జనులనేకులు పట్టణ ము విడచిపోయిరి.

రాజెక్కడ నేమి జరుగుచున్నదో విచారించనైన విచారింపకుండ చిత్తవిశ్రమమునఁ గూర్చుండియుండి యువతులకు రాడయ్యెను. ఇప్పుడాత నిమనస్సును బట్టి వేధించుచున్నది క్రోధము. అదియె సర్వవ్యాపియై యాతనిబట్టి పీడించుచున్నది. అందఱిమాట యటుండ ఈకోపము శ్రీయం దెక్కువయయ్యెను.

రాజు బుద్ధి మాఱిపోయినది. నీచపు పనులకైనను రాజునకనుచ రులకు కొదువయుండదు కదా? పట్టణమున చక్కని స్త్రీలనెల్ల బట్టి తనభోగమునకు దెమ్మని వారలకాజ్ఞ నిచ్చెను. ఈదూతికలు రాజ్యము నలుతట్టులకును పోయిరి. సొమ్ముపై నాసయున్న స్త్రీని సొమ్మిచ్చి తె చ్చిరి. ధూర్తలగు స్త్రీలను బలిమినిబట్టి తెచ్చిరి. ఈదారుణముచే మును పటి గోలకు మఱియొక్క గోలకూడ వచ్చిచేరెను.

వ్యాపారము లీకడకు వచ్చినట్లు చంద్రచూడుని చెవిని బడినది. ఇంక నాతఁడెవ్వరితోడను చెప్పకుండ దండెయును తాళమును గట్టు కొని, ఒక సేవకుని నెత్తిమీఁదఁ బెట్టి వాని వెంటఁగొని తీర్థయాత్రా ప్ర యాణొన్ముఖుఁడై పోయెను. దారిలో చందాపహాఫకీరు ఎదురుపడి

"గురువరా? ఎచ్చటికి పోవుచున్నారు?" అని యడిగెను.
చంద్ర—కాశీకి. మీరెక్కడికి పోవుచున్నారో దయచేసి చెప్పుఁడు.
చందా—మక్కాకు.
చంద్ర—తీర్థయాత్రకు పోవుచున్నారా?
చందా—హిందువులు కాపురము చేసెడు దేశములో నేనింక కాపురముసేయఁ దలఁచుకొనలేదు. సీతారామరాయలు నాకు మంచిపాఠమును గఱపినాఁడు.



ఇరువదియవ ప్రకరణము.

యయాతికి హృదయభారమంతయును శమించినది. మహమ్మదు పురమునుండి వెడలి పోయెను. ఆమె మనస్సాక్షిణమైన నెప్పుడును యాతనను బొందియెఱుఁగదు. ఇప్పుడామె బొందుచున్నంతటి సుఖమామె యిది వఱకెఱుంగదు. దారివెంటఁ బడిపోవుచు ఆమె భగవద్ధ్యాన తత్పరయై యిట్లు ధ్యానింపఁ జొచ్చెను. "ఓ మహాత్మా! నీవు అపారకరుణాళుండవు. నీయౌదార్యమునకు మేరలేదు. నిన్ను గుర్తెఱుఁగని వాఁడు. నిన్ను ధ్యానింపనివాఁడు. అనేక విపత్తుల పాలగును. దేవా! నేనిదివఱకాపదయన నెట్టిదియో యెఱుఁగ. అది యెట్టిదియని కూడ నాకు ద్యోతకమగుట లేదు. నీవు నాకిప్పుడు లభింపఁ జేసిన యీయవస్థయెంతయు శ్రేయస్కరమైనది. నేను పట్టివ్రర్ధురాలను. గర్విష్ఠురాలను. అహంకారప్రపూర్ణనై మతసమ్మత మగుమార్గముల నుండి వెలియయినట్టు కనిపెట్టలేక పోయితిని. అర్జునుఁడు నిన్ను ప్రార్థింపలేదా? నేను నట్టిదాననే జగత్పితా! నాలోటుపాటులఁజూపి కరుణింపుము.

శ్లోకము. యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే,
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్.

యయంతి అవసరమగు నపుడెల్ల దైవమును ధ్యానించి తద్రూపమును దన మనోనయనంబునఁ జూడ నేర్చినది. అతనితో సంభాషింప నభ్యసించినది లోకరక్షకునికడ తనసర్వమును మఱుంగుపెట్టక విశదీకరింప నలవాటు చేసికొనినది. తల్లికొంగుబట్టికొని లాగుపిల్లవలె యయంతి పరమేశ్వరునికడ నల్లారుముద్దుచేష్టల కలవడినది. ఇప్పుడామె తనముద్దుచెల్లిం

వుమని దైవమును ప్రార్థింప నారంభించినది. రాయలనుగూర్చి "సీతారామ రాయలిప్పు డనుసరించుచున్న మార్గమున నతని కధోలోక ప్రాప్తి తక్క వేఱొండు లేదు. అతని వినాశము చేరువకు వచ్చినది. ఈతని రక్షించుట కుపాయమేమియును లేదా? భగవంతుఁడు కరుణా సముద్రుఁడు. అం దొక్కబిందువమైన నీతనిపైఁ బ్రసరింపరాదా?" అని తనమనంబున పరిదేవనము సేయఁదొడంగెను. ఇట్లనుకొని భగవంతుని ధ్యానింపఁ జొచ్చెను. "దైవము నొక్కసారి స్మరించుకొనిన నీతనికి తరణోపాయము దొరకఁగలదు. రాయల మనస్సాతనిపైఁ బోవుటయే లేదు. అతని స్మరించుటయే మానినాఁడు. లేకున్న నాతఁడింతటి యనర్థముల కేల పాల్గొను? పాపాత్ములకు ఘోరమగుశిక్ష యెద్దియన? భగవద్ధ్యానవిస్మృతియే? అతఁ డపార దయామయుండు. రాయలు కేవలమును దురాత్ముఁడైనాఁడు. అందువలననే దైవస్మరణ మరచినాఁడు. ఇంకనాతని నామమైనను చ్చరింపఁడు. అతఁడు స్మరించినను స్మరింపకున్నను నేనాతనిపక్షమున నొక్కసారి స్మరియింతునా? నాప్రార్థన మాలింపఁడా? అతనిపాదములపై బడి యీపాపాత్ముని పాపములఁ బరిమార్పుమని ప్రార్థించెద. నా మొఱఁ బెడచెవింబెట్టునా?" "ఓసర్వవ్యాపీ! నీనామ సంకీర్తనమే విజయము. సీతారామరాయలు పాప కృత్యములనుండి బయలుగాంచుగాక." అని ధ్యానించెను.

తదుపరి యామెకు మఱియొక్క యూహ తట్టెను. కేవల తామసుల మొఱలు ఆపరమపావనుండు పెడచెవింబెట్టు. నేనీతని న్యాయముగ సంరక్షింప ప్రయత్నింపకుండ సర్వశక్తుఁడగు నాతఁడు నా మొఱనేల విననలయును? అయినను చూచెదనుగాక. ముందుగ శ్రీజాడ లరయ వలయు. శ్రీపాఱిపోవుట బాగుగనున్నది కాదు. కాని ఆమె పాఱిపోవకున్న నేమి జరుగునో యెవ్వరు చెప్పఁగలరు? ఆపరమగురుని శాసన పరంపరల నెచ్చట యేచిక్కున్నదో తెలిసికొన నాకు శక్తికలదా? అట్టివిషయముల నా జ్ఞానమెట్టిది?

యయంతి శ్రీని సందర్శింపఁబోయెను. ఒక్కింత సేపటిలో వారుభయులును తారసిల్లిరి. సర్వము నామెకు వివరించి చెప్పెను. శ్రీ మనమునకు మనోవ్యధారూప మగు మేఘ మొక్కటి వచ్చి క్రమ్మెను.

శ్రీ "ఈ రాజునకు వినాశకాలము చేరువకు వచ్చినది. రక్షణోపాయము లేనట్టున్నవి.

యయంతి—లేకున్నదీ? జగద్గురుండు సర్వసంరక్షకుండు. అతండు భగవంతుని మఱచినాండు. అతం డెప్పుడు మఱల నాతని స్మరించునో అప్పుడు మఱల బాగుపడును.

శ్రీ—అది జరుగుట యెట్లు? నేనాయనతోడకూడనుండి నంతవఱకు భగవద్విషయములు దక్క మఱి యితరమెద్దియును మాటలాడలేదు. ఆయనకూడ శ్రద్ధతోడనున్నట్లే కనుపడువాండు.

యయం—అతని శ్రద్ధ నీనోటనుండి వచ్చినమాటల వినవలెననియే. అందున కాతం డిష్టమనస్కుండై నీరూపరేఖావిలాసముల నదేపనిగం జూచుచుండెడివాండు. నీకంఠమాధుర్యము గాంచియు, నీమనోహర సందర్శనమును జూచియు, అతం డున్మాదమును పొందియున్నవాండు. దైవవిషయమెప్పుడును అతని చెవుల కెక్కలేదు నీప్రశ్నములకు దేనికైన నాతండు ప్రత్యుత్తరమిచ్చినాండా? చిక్కువిషయము లెప్పుడైన వినవచ్చినపుడు అందలిసారాంశము లేమైన విశదముగం జెప్పుమనియైన నడిగినాండా? హరినామస్మరణ విను నప్పుడాతని యెడ నేమైనయుత్సాహమును కలిగినట్టు కనిపెట్టినావా?

శ్రీ—లేదు. అట్టిదేమియును గనుపట్టలేదు.

యయం—ఇంక నా శ్రద్ధయంతయును నీమోహనాకార సందర్శనమునకై గాని నీవు ముచ్చటించిన దైవవిషయములనుగూర్చి కాదు

శ్రీ—అయిన నిప్పు డేమార్గమవలంబింపు మనెదవు?

యయం—ఇంక నొక్కమార్గమేయున్నది. అదియవలంబించెదవా? నీ వింతవఱకు సన్యాసిని వై పోతిననియు, అన్నికార్యములును సంత్యజించితిననియు, చెప్పియుంటివే?

శ్రీ—నీ వెట్లుగ అపితివో యట్లే చేసితిని.

యయం—అదియా నీకు నే నేర్పినది? ఫలాపేక్ష లేకుండ, అహంకారమును మమకారసంబంధమేమియును లేకుండ, చేయుకార్యమే వైరాగ్య మనియును, అదితక్క మఱియొక్కటి ముక్తిసాధనము కాదనియును కా

దా భోధించినది. నీభర్తను యుక్తమార్గమునకుఁ గొనివచ్చుట సత్కార్యము కాదా?

శ్రీ—నన్ను నీవేల పాతివ్రత్యమని యుపదేశించితివి?

యయాతి—రాజు నాకు గల పన్నిద్దఱు శత్రులువులలో నొక్కఁడని నీవు చెప్పుటను బట్టి యింద్రియవికారముల నీవు జయింపక లేపోయితివని గ్రహించితిని. అట్లగుటం జేసి నీకు భర్తృశుశ్రూషణము పరమధర్మము కాదా? స్వలాభాపేక్ష వదలినఁ గాని యేకార్యమును వైరాగ్యమనిపించుకొనదు. అందు మూలమున నిన్ను పాతివ్రత్యంటిని. ఎవరికిగాని వారు మోయలేనిభారమును నేనంట గట్టఁజాలను.

ఈమాటలు వినునప్పటికి శ్రీకి సిగ్గయ్యెను. నేను నీకు ప్రత్యుత్తరమిచ్చెదనని చెప్పెను. ఇంక నావిషయమునుగూర్చి వారుభయులును మాటాడుకొనలేదు.

శ్రీ యయాంతులిరువు రాదినమున విశేషకాలము కలిసియుండను కూడ లేదు. కట్టకడకు యయాంతి "సన్యాసినీ! నాప్రశ్నమున కేమియుత్తరమిచ్చెదవు?" అనియడిగెను.

శ్రీ—మఱి యొక్కసారి పరీక్షించిచూతును.

యయాంతి యందుల కంగీకరించెను. మనము మహమ్మదుపురమునకు పోవుదము లెమ్ము? మన యుభయులకును కర్తవ్యమెద్దియో దారిలో యోచింతము.

ఉభయులు మహమ్మదుపురమార్గమును బట్టిరి.



## ఇరువదియొకటవ ప్రకరణము.

గంగారాముఁడు వెడలిపోయెను. రమ మరణించెను. శ్రీ పలాయితురాలయ్యెను. యయాంతియు, చంద్రచూడుఁడును, చందాసహా ఫకీరును, మహమ్మదుపురమును విడిచిపోయిరి. కాని, రాయలకు కన్నులు విడలేదు.

ఇంక మృణ్మయుఁడు నందమాత్ర మాతని నంటిపెట్టుకొని యున్నారు. నంద యింతకుము న్నంతగపుకోపన్యాసములచే భర్తను ధిక్కరించుచుండెను. ఇప్పుడు కేవల కోపోద్దీపితమానస యయ్యెను. పాతివ్ర

త్యముగల స్త్రీ యెంత కాలమని యిట్టిపనుల కోపిక పెట్టి యూరకుండఁ గలదు ? నందను సంరక్షించువా రెవ్వరును లేరు. ఇంక మృణ్మయుఁ డొక్కఁడె ఆమెకు శరణ్యుఁడు. అప్పుడుండు సంగతి సందర్భములనుబట్టి యేమి చేయుటకును తోఁచక మృణ్మయునె రావింపనెంచెను. కాని, కట్టా ? అతని నామె సమ్ముఖమునకుఁ గొనివచ్చుటకు మనుష్యమాత్రునకు సాధ్యముకాని యవస్థవచ్చెను. అతఁడప్పటికప్పుడే ఈదేహము చాలించినవాఁడు. ఆయుదయమునవే పరమపదమున కేఁగినాఁడు. పాప మీ సంగతి నంద కింతదనుక తెలియదు.

ప్రొద్దున నిద్రమంచముమీఁదనుండి లేచునరికి మహమ్మదీయ సైన్యము పట్టణముపై వచ్చుచున్నదను కబురువినియెను. ఈమాట యాతని చెవింబడునప్పటికే సైన్యము కోటదరిదాపులకువచ్చెను. ఆవార్త వినునప్పటికి మృణ్మయునికి బుద్ధలయ్యెను. అతఁడు యుద్ధసన్నద్ధుఁడు కాలేదు. మహమ్మదు పురమునుండి చంద్రచూడుఁడు తరలిపోవుటతోడనే గూఢచారుల పరిచర్యయంతయు నంతరించినది. శత్రువు లెప్పుడు రానైయున్నదియు, ఎప్పుడువచ్చుచున్నదియు, చెప్పువా రెవ్వరును లేరు. యథార్థస్థితిని గనుఁగొనుటకై తానే గుఱ్ఱము నెక్కి పరుగుపరుగునఁ బోయెను. అతఁడు కొంతదూరము పోయెడు నరికి మహమ్మదీయ సైన్యమెదురయ్యెను. పాఱిపోవుట యనుమాట నెట్టిదియో యాతఁడెఱుఁగఁడు. అందు మూలముగ శత్రువు లాతనిబట్టి చిత్రవధఁ జేసిరి.

మహమ్మదీయ సైన్య మప్పుడు మీఁదికివచ్చి సీతారామ రాయల కోట నాక్రమించిరి. పాఱిపోఁగా మిగిలిన పౌరులుకూడ నిప్పుడు తమవికి బలమును జూపిరి. చెప్పుటకేమున్నది. పట్టణము స్థితియంతయును ఎట్టులుండవలెనో యట్టులున్నది. చిత్తవిభ్రమమున స్త్రీలోలుఁడై యొడ లెఱుఁగక మహానందమున మునిఁగియున్న సీతారామరాయల కీవార్త తెలియవచ్చెను. మృణ్మయుఁడు మరణించెననియు, మహమ్మదీయ సైన్యము కోటపైఁ బడినదనియు, తెలిసినది. అప్పుఁడాతఁడు తనలో “ ఇదియే నా రాజ్యమునకు కడపటిదినము. నాయానందమున కిదియే

అంతిమదశ. నా బ్రతుకుకూడ నేఁటితోడ నేసరి." అనుకొని తన భోగ స్త్రీలనుండి వడివడి లేచి నిలువఁబడియెను.

చతుష్పాత్తువలె కేవలేంద్రియలోలుండైన యానరపశువు "ఓ మహారాజా ! నీవెక్కడికిపోయెదవు ? మమ్ముల నిచ్చట విడచిపెట్టి యెక్కడకుపోవలెనని నీయూహ." అని కేకలు వేసెను.

తన యంగరక్షకులం బిలచి 'వీనినిఁబట్టి కొట్టుండని' శాసించెను.

ఈపిచ్చిధోరణిఁ గాంచునప్పటికి పరివార జనమునకంతకును పట్టరానినవ్వు వచ్చెను. అందఱును హరిహరీయని చప్పటులు గొట్టసాగిరి. అందున్న సుందరాంగులలో నొక్కరిత పేరు భానుమతి. ఆమె తక్కుంగల వారలనందఱి నూరకుండఁబెట్టెను. రాజునెదుర్కొని, "రాజా ! ప్రపంచమునందలి దుర్మార్గమునంతయు చలమూని యొనరించెడువాఁ డొకఁడున్నవాఁడని నేఁటికి నీకు నమ్మకము కుదిరినట్లున్నది. మేమందఱమును సద్వంశసంజాతలము, గౌరవముగ సంచరించుచున్నవారము. మమ్ములనందఱి నవమానించి మాయభిమాన ధనమును చూఱఁగొని మాకులమున కంతకును మాలిన్యంబు గల్పించితివి. కొందఱు తల్లులు, కొందఱు తండ్రులు, భర్తలు కొందఱు, పిల్లలు కొందఱు, నీప్రాణములకు స్సరుమని యేడ్చుచున్నారు. వారి యేడ్పులన్నియు నూరకపోవుననియె నీ యుద్దేశ్యమా ? ఇవియన్నియు చిత్రగుప్తుఁడు లెక్క వ్రాయుటలేదా ? ఇఁక నీవే యడవుల వెంటనే పోవలసినవాఁడవు కాని నలుగురిలో మొగమెత్తి తిరుగవలసినవాఁడవు కావు. ఇఁక నరుల కంటఁబడకుము. మనము చేసినదంతయును మన మనుభవించక తీరదని మాత్రము మనస్సున నుంచుకొనుము" అని తూలనాడెను.

ఈమాటల కేమియుఁ బ్రత్యుత్తరము చెప్పకుండ గుఱ్ఱముపైఁబడి వాయువేగమునఁ గోటగుమ్మమువద్దకు పోయి వ్రాలెను. అతనియందు మక్కువఁగల స్త్రీలు కొందఱు వెంబడించిరి. మఱియు కొందఱు, "అక్కా ! రమ్ము రమ్ము. అంతఃపురము కొల్లపెట్టిరఁట. రమ్ము." అని పిలువసాగిరి. ఇంకను కొందఱు "సీతారామరాయలవినాశము చూచి యానందింతమురమ్ము." అనుకొనిరి. కొందఱు "సీతారామరాయలు

తాను భగవంతునకు సమర్పణము గాుచున్నాఁడు. మనముకూడ వానిని వెంబడింతము రండు.'' అని యనఁ జొచ్చిరి.

ఈమాంటలేమియును రాయలచెవుల కెక్కలేదు. అతిరూక్ష భాషణంబులు, కోపోద్దీపితయై "భానుమతి" పలికిన పలుకు లాతని చెవుల ములుకులవలె నాటి యాశబ్దములే చెవులు గింగురుమని పోయెను. ఇంకనేమియు వినఁబడుటలేదు. ప్రపంచమునఁ జేసిన దంతయును, అనుభవించి తీరవలయునని రాజున కిప్పటికి తట్టెను.

కోటగుమ్మమువద్దకు వచ్చి మహమ్మదీయు లింకను కోట ముట్టడింపనట్లు కనిపెట్టెరు. కోటను సమీపించుచున్నారు. మార్గదర్శకులు ముందు మార్గముచేసుకొని పోవుచున్నారు. తమతమ యుచిత స్థానముల నిలువఁబడుచున్నవారు. జండాలు బయలుదేరినవి. గుఱ్ఱపు దళము వచ్చుచున్నవి. ధూళి రేఁగినది. అగ్రవాహిని కోటగుమ్మము వైపులకు వచ్చి మోహరించుచున్నవి.

నిలువ సైన్య మేమైనదో యని రాజుపరికించి చూచెను శిపాయిలందఱును తనను విడిచిపెట్టినట్లు కనుపడెరు. వారికి జీతబత్తెములు సరిగా ముట్టక పోవుటచేత నందఱు నొచ్చిగిలిపోయినట్లు మూపారకు లిదివఱకే తెలుసుకొనియుండురు. ఇంకను అంటిపెట్టుకొనియున్న వారందఱును మృణ్మయుని మరణమును, మహమ్మదీయ సైన్యము రాకయును,విని పలాయితులయిరి. బ్రాహ్మణులుకొందఱును, రాజపుత్రులు కొందఱును మాత్రము నిలిచి వారికండయై తమ ప్రాణములుకూడ నాతని కర్పింప సంసిద్ధులైయుడింరి. వారందఱును స్వామిసేవా తత్పరులు, ఒక్కసారి యొకరిసొమ్ము తినిరా, ఇంక నెన్నండును వారు మఱవఁగలవారుకారు. లెక్కకు వారేఁబదియో యెందఱో యుండిరి. రాజు తనలో పాపముల నే నెన్నియొఁ జేసితిని. వీరిప్రాణముల నేనేలఁగోల్పడఁ జేయవలెను.'' అని యనుకొనియెను.

ఉద్యోగస్థులెవ్వరును రాజుకంటఁబడలేదు. వారందఱును తమ సొమ్ముసంబంధములెల్లఁ బట్టుకొని ప్రాణములను దక్కించికొనిపోయిరి. పరిచారికలుకూడ నెవ్వరులేరు. తమయజమానునితోడ కూడ తమమాన ప్రాణము లర్పింపసంసిద్ధులై కోటను గనుపెట్టుకొనియున్న పూర్వ

పుపరిచారికలు కూడ నెవ్వరును లేరు. తమయజమానునితోడ తమమాన ప్రాణము లర్పింపనున్నవారు కొందఱుమాత్రము గ్రుడ్లను నీరుగ్రుక్కి కొనుచు కోటలగ్గిలనున్న రాజునుం తారసిల్లిరి.

రాజు అంతఃపురమునకుం బోయిచూచెను. అచ్చోటుంగూడ విజనంబైనది స్నేహితులు, బంధువులు, దాయాదులు, అందఱునొత్తిగిలి పోయిరి. ఎవరిమట్టుకు వారె ప్రాణములు దక్కించుకొనుట దుస్తరమయ్యెను. ప్రాణములుకేపిగదా? కిటకిటలాడుచున్న మహాభవనంబంతయును, అరణ్యమునలె విజనమై నిశ్శబ్దమై అంధకారబంధురమై, కనుపట్టెను. సీతారామరాయల కన్నులను గిఱగిఱందిరిగెను.

ఒక్కవిషయము మాత్రము రాయలు నిశ్చయముగా నెఱుంగును. అదియేమందువా? ఎందఱెల్లపోయినను నందమాత్రము తన్నువిడిచిపోవకున్నది. ఆమెయెచ్చటికి పోవుటకును ఏవిధమైన ఆశాకరమును లేదు. కన్నులనిరుని చుకొని నందయుండునెడకు పోయెను. అప్పటికిశత్రువుల పిరంగులు భంభమ్మనసాగెను. కోటను ముట్టడించిరి. కోటగోడలు పగుల్ప ప్రయత్నములు జరుగుచున్నవి. సర్వమహావిలయము వలెనున్నది. ఆశబ్దముతో అంతఃపురమధ్యములుగూడ ఘూర్ణిల్లుచున్నవి. అంతఃపురమునందలి జనుల చెవులు చిల్లులువడుచున్నవి.

నందయుండు ప్రదేశమునకరిగెను. ఆమె ఉత్క్రిందంబడియున్నది. ఆమెపిల్లలును, రమకుమారుండును, ఆమెచుట్టను మూగి రోదించుచున్నారు ఆతనిముఖసందర్శనము కాంగానే "అయ్యో! నాథా, ఏమిచేసినారు?" అని పెద్దపెట్టున నేడ్చెను.

రాయ—విధిసూత్రమెట్లు త్రిప్పినదో అట్లు నడచితిని. భర్తృమృతికి కారణభూతురాలగు నొకస్త్రీని నాపక్కకు దెచ్చితిని. ఆమెమంత్రమే నాకవినాశకాలబుద్ధి పుట్టించినది.

నంద—అస్త్రీ శ్రీయసియా మీతలంపు?

రాయ—ఔను శ్రీయే

నంద—మేమందఱముమాంత్రికురాలని చెవలెక్కియుసి భాషించినది శ్రీయేనా? ప్రాణనాథా? ఇంతకాలము మామాటమాట చెప్పకుండనేల దాంచితిరి? అనియడిగెను.

అట్టిసమయమునఁగూడ నందముఖచిహ్నములు సంతోషచిహ్నములై యుండెను.

రాయలు—చెప్పినమాత్రమున నేమిప్రయోజనము, శ్రీగారూ, శివశక్తిగారూ, ఫలితార్థమొక్కటియేకదా? మృత్యువిప్పుడు నాకాసన్నంబైయున్నయది.

నంద—ప్రాణేశ్వరా! వినశ్వరములగు నీజీవయాత్రలన్నియును జననమరణరూపకములు. అందులకు నాకించుకంతయును విచారము లేదు. శతసహస్రయోధులకధినాథుండవై యుండు నీకునే వెన్నంటి వచ్చుచుండ నట్టిమరణము సంప్రాప్తం బయ్యెఁగదా యని మాత్రము విచారమగుచున్నది.

రాయలు—ఈక్షణమున నాయొద్దశతసహస్రము కాదే, ఒక్కశతమైన యోధులులేరు. అట్లున్నను యుద్ధమున నే చచ్చెదను. దానినాఁపువారెవ్వరు? ఇంకొక్కక్షణములో ద్వారము తెఱచి మహమ్మదీయసైన్యమిందు ప్రవేశించును. నీకొకటి చెప్పి యాయుధముం గొనిపోవ వచ్చితిని.

నందకన్నుల వెంట నశ్రుధారలు జలజలస్రవింప సాగెను. ఆమె యెట్లోకన్నీరుతుడుచుకొని నేనిప్పుడు మీానిశ్చితమునుండి మరలింపఁదలంతునేని మీాసుఖమును యోచించినదాననుగాకపోదును. మీాయెప్పటిమనస్థైర్యము మీాకువచ్చినది. అదియేపదివేలు. ఈమనస్థైర్యమింతకుమున్నె వచ్చిన నెంత బాగుగానుండియుండును. నాథా? మీారుమరణించునపుడు నేనును మీా వెన్నంటియె వచ్చెదను. అసహాయులగు నీపిల్లలపనియేమగునో యనిమాత్రము విచారముగనున్నది. వారుతప్పకమహమ్మదీయులచేతిలోఁ బడిపోవుదురు. ఇదినిశ్చయము" అని చెప్పుచుండ నందకన్నీరు కాలువలు గట్టెను.

రాయ—అందునకే నీవు బ్రతికియుండవలెను. ఈపిల్లలను జూచుకొనియు బ్రతికియుండుము.

నంద—నేను బ్రతికియున్నంత మాత్రమున వారు సురక్షితముగ నుందురనియా? మీాయూహ?

రాయ—నందా ? ఎంతమంది తప్పించుకొని పోయినారు కారు ? వారి మార్గమేల యనుసరించినావు కావు ? అట్లుచేసియుండిన నీనిసుగులైనను జీవించియుందురు.

నంద—మీకుభార్యనైయుండి రాజా ; నేనుపాఱిపోవుట యెవ్వరి వెంటనంటి ? మీయనుమతిలేనిదే యీపిల్లలనొకరికొప్పగించుటయా ? పుత్రులాసద్గతికి మూలము. నీవేనాకన్నియును. నిన్నువిడిచి పిల్లలననుసరించుటయా ?

రాయ—ఇప్పుడీదురవస్థ తప్పించుకొనుట యెట్లు ?

నంద—మహమ్మదీయు లసహాయులని కరుణించినగాని యేమిసాధనమున్నది? వారిట్లుచేయకున్న వారిని సర్వరక్షకుని రక్షణకొప్పగించుట తప్పవేఱుశరణ్యమేమున్నది. ? వారిదేహమునఁ బ్రవహించునది క్షత్రియరక్తము. రాజకుటుంబములకు కష్టసుఖములు కావడికుండలు. ఆవిషయమైన జిజ్ఞాస నాకించుకంతయును లేదు. మిమ్మెవ్వరైనపిరికిపందయనుకొందురేమో యనిమాత్రము మనసున బరితపించుచున్నారు.

రాయ—భగవద్యత్న మెట్లున్న నట్లవును. ఇదియేమన కడపటి సమావేశము. ఇఁక మఱిమాటాడక రాజుఝరాలున లేచి యాయుధాగారమునఁ బ్రవేశించెను. పిల్లలనువెంటఁ బెట్టుకొని నంద యాయన వెన్నంటిచనియెను. రాజుయుద్ధకార్యసన్నాహములుచేసెను. కన్నుల నీరుజిమ్ముకొనుచు నంద తనపిల్లలతో నాతనిమార్గమును బరికించి చూచుచుఁ బోయెను.

ఆయుధము లెన్నియేని ధరియించి కేవలరణశూరుఁడై సీతారామరాయులు సీతారామునివలె తేజరిల్లెను. వెనుక నెవ్వరు లేరు. ఆయుధమాత్రసహాయుండై కోటగుమ్మముకడకు పోయెను. మృత్యుదేవతా సమాలింగనము గావింపవలెనని యాతనియుద్దేశ్యము. వీరపురుషోచితంబగు పౌరుష మావేశమైనది. నంద మఱల నొకసారి గ్రిందఁబడి పొరలి వెక్కి వెక్కి యేడువసాగెను. రాజట్టులొంటరిగఁ బోవుచున్న వాఁడు. యయంతి శిక్షాకార్యమునకై యేర్పడినస్థానమున నెవ్వరివో యిరువురి రూపములాతని కన్నులఁబడియెను. మృత్యుదేవతనాశించి పోవుచున్న యో

ధవరునకు పైతమాయాకారములు జూచినంత దేహమున వడకుబుట్టె
ను. గుండెతల్లడపడియెను. చేతత్రిశూలములును మెడను రుద్రాక్షమా
లలును మఱియు కాషాయవస్త్రములనుధరించి యావేదికపైనున్న య
యంతిరూప మత్యాతురతతో నాతఁడు గనుంగొనియెను. శ్రీకూడ భైర
వీ రూపముననే యామె ప్రక్కను గూర్చుండెను.

మృత్యుమేఘమాతని నొక్క క్షణములో గ్రమ్మనైయుండెను.
అంతటి భయోత్పాత సమయంబున నట్టివేషములతో తారసిల్లిన యా
రూపముఁజూచిన నాతని కెందులకంత భయోత్కంఠత? ఆతఁడు వా
రిం బల్కరించి " ఎఱిఁగినస్థలమునుండి యెవ్వరు నెఱుంగని చోటికి, నే
పైనమైపోవుచుండ, మీరిచ్చటికేల త్రోసికొని వచ్చితిరి, ఇంకను మీ
పగ తీరలేదా ? " అనియెను.

యయంతి యధరోష్ఠమున దరస్మితము తాండవమాడెను. రాజున
కు శ్రీస్వరము హీనస్వరముగను, కన్నుల గ్రుధారా పూర్ణములుగను గ
నుపట్టెను. ఆమెకాతనితో మాటాడవలెనని యూహ. మాట నోటిచివర
వఱకును వచ్చుచున్నది. బైటికిరాదు. రాయలామెముఖము వంక తదేక
వీక్షణముగఁ జూచెను. శ్రీ మాటాడలేదు.

కట్టకడకు రాజు శ్రీ! నీభాగధేయవిలసనమే యీరూపమున ఫలిం
చినది. మృత్యుదేవతను నాపై విడచినది నీవే. నీప్రాణప్రియుని మరణము
నకు కారకురాలవైన నిన్ను పరిత్యజించుటలోఁ దప్పేమియును లేదు.
ఏమైనను విధిలిఖితము తప్పినది కాదు. మఱల నీవేల యిచ్చటికి వచ్చినావు.

శ్రీ—నేను చేయఁదగిన కృత్యములు కొన్నియున్నవి. వాని నాచరింపవ
చ్చినదానను. నేఁడునీమరణదినము. నేనును నీతోడరానున్నదానను.

రాయ—విరాగిణులైన స్త్రీలకుగూడ సహగమనమున్నదా ?

శ్రీ—సన్యాసులకుగాని, సంసారులకుగాని, అందఱకును జావస్వాతం
త్ర్యమున్నది.

రాయ—విరాగిణులకు కర్మములులేవు. నీవువిరాగిణివి. మృతుఁడనగు
చున్న నన్ను నీవేల యనుగమించెదవు. నేను మృత్యుదేవతకతిథినగు
చున్నాను. నంద నన్ననుగమించుటను ఆమె సిద్ధముగనున్నది. నీవైరా
గ్యమునుద్ధరించుకొనుచు బ్రతికియుండుము.

శ్రీ—ఓప్రఖ్యాతుఁడా? ఇంత కాల మోపికపట్టియున్న నీకు నేఁడు నాపై గోపము రాదగదు. నీయెడ నేనొనరించిన యపరాధమునకు ఫలము గ మనమిప్పుడే లోకమునకును గాని శ్రీవను బడి రెంటికిం జెడి మ ధ్యను కొట్టుకొనుచున్నారము. ఇదే నాశిరస్సు నీపాదపద్మములఁ జేర్చుచున్న దానను. అని శ్రీ "యా వేదికనుండి దిగి సీతారాముని పాదములపై సాష్టాంగమెఱఁగెను."

శ్రీ—నీపాదములఁగొట్టి ప్రమాణముచేసెదను." నేనింక సన్యాసినిగాను నన్ను క్షమించెదవా? నన్ను మరల నీభార్యఁగాఁ గ్రహించెదవా?

సీతా—నిన్ను నెంతమక్కువతోడనైనఁ జూచుచుంటిని. ఇప్పుడు తరుణము మించినది.

శ్రీ—చచ్చుటకుఁ గావలసినంత కాలమున్నది శ్రీ సీతారాముని పాద ధూళి శిరస్సునఁ దాల్చెను.

యయంతి—నేను భిక్షుకురాలను, మీరు నేఁడు మొదట శాశ్వత మగు విజయమునంది మెలంగునటుల ఆశీర్వదించుచున్నాను.

సీతా—తల్లీ! నేను నీయెడ నెంతయు నపరాధము చేసినపాపాత్ముఁడను. నావినాశముం గాంచి నీవానందింపవచ్చితి వనుకొననవకాశము లేదు. నీసద్వృత్తి నీయాశీర్వాదమువలననే విశదమగుచున్నది త ల్లీ! దయచేసి యేప్రాయశ్చిత్తమువలన నాపాపము శమించి నీకు సంతుష్టియగునో తెల్పుము? వింటివా? మహమ్మదీయుల ఫిరంగుల శబ్దము. ఇంకనొక్కనిముసమున కాఫిరంగి కొక్కదాని కెరయయ్యె దను. కాలవిలంబముగాకుండసీదయ, నీక్షమూర్పణము నాకెంతమూ లమున లభియించునో సెలవొసంగుము. ఇదె దోసిలొగ్గితిని.

యయంతి—వెనుక నొక్కసారి యసహాయుండవై యొక్కఁడవే ఈకో టఁగాచికాపాడితివి.

సీతా—నేఁ డామాట తలపరానిది, నీటికిని నేలకును నెంతో భేదమున్నది. నేఁడసహాయుండై యీకోటనుద్ధరింపఁ గలవాఁడు ప్రపంచమున లేఁడు.

యయంతి—నేఁటికిని నీవెల్లునడిపిన ల్లునడచుట కేఁడుదిమంది సంసి ద్ధులైయున్న వారు.

సీతా—ఆసంకులము వినఁబడుట లేదా? అపరిమితమగు నాసైన్యము

ముందర నేఁబదిమందియన నేపాటి. నా ప్రాణము లెట్లయిన త్యజింప గలను. స్వామి భక్తితత్పరులై కేవల నిరపరాధులై వెలయువారి ప్రాణము లూరక హతముసేయుట కెట్లు మనసొప్పును. ఏఁబదిమందితో ; ట్టియుద్ధమునఁ గన్నులు మూసికొని దుముకుట యనిన మృత్యువున దురుగఁ బోవుటయె కాక మఱియేమున్నది.

శ్రీ—నేనో నందరయో యొకమార్గము నిశ్చయించుకొనినారము. మరణమే మాకృతనిశ్చయము. ఒక్కటిమాత్రమున్నది. నందకును రమను బిడ్డలున్నవారు. వారిరక్షణోపాయము దోఁపకున్నవి.

సీతారాముని కన్నులనుండి బాష్పములు రాలెను. నేఁడు నాః పాపాత్మునకు సహాయ మెచ్చటనుండి వచ్చును?

యయంతి—ఓమహారాజా! ఇట్టిసమయమునందు కూడ అసహాయునకు రక్షకుఁడున్నవాఁడు అది నీకుమాత్రము తెలియదా? అందఱును తెలిసినదే. ఎఱింగియున్నను రాజ్యమదాంధత్వమున విస్మృతి కగును. అసహాయునకు సహాయుండును, మార్గవిచ్యుతునకు మార్గదర్శకుండు నగునాతని నింకనైన స్మృతికిఁ దెచ్చుకొనవా?

సీతారాముని తల వాలిపోయెను. దైవస్మరణ యనునది. య మనంబుననుండి యెట్లొ త్రిగిలిపోయి యెంతకాలమైనదో! అసహాయు సహాయుండును, ఆర్తుల కెల్ల రక్షకుఁడును అగునాతని నామమిప్పుడు ఆల నాతనితల కెక్కినది. కాలమేఘము లన్నియును జ్ఞానవాతముచే చెదరైనవి. ఆతనిమనోగగనమున జ్ఞానసూర్యుఁడు మఱల తన తేజః ప్రర ముదయింపజేసెను. అటుపైనఁ జూచుకొనునప్పటి కీజగత్తునంతను పరిపాలించునది యప్రాకృతమైన తేజోరాశియని పొడకట్టెను.

సీతారాముఁ డిప్పుడు భగవద్ధ్యానతత్పరుం డయ్యెను. "దే దీనులకుశరణ్యుండవును, ఆర్తవిరహితుల కాపుండవును, అసహాలకు సహాయుండవును, మార్గవిచ్యులకు మార్గప్రదర్శకుండవును, ు త్తుల పాపపరిహర్తవును, అగునీవు నేఁడీపాపాత్మునిపైఁ గృపాళుఁ కాకుందువా?" సీతారాముఁ డట్లు హృదయపూర్వకంబుగ దైవ నతత్పరుండగుట కనిపెట్టి యయంతి శ్రీపై భావగర్భితంబగు వీక్షణ కటాక్షము ప్రసరింపఁ జేసెను. అంత వారిరువురు నావేదికపై సాష్టాంగ

చేతులుజోడించి మొగముపైకెత్తి ప్రార్థింపఁజొచ్చిరి. వారికంఠస్వర ములైక్యమై యంతరిక్షమార్గమునఁబోయి యవ్యక్తమధురస్వరంబున శకుం సంతానంబుల నధఃకరించుచు, నీమందిరము నలుతట్లువ్యాపించి, ప్రతి ధ్వనించుచుండెను.

శ్లో. త్వమాదిదేవః పురుషః పురాణ స్త్వమస్యవిశ్వస్య పరం నిధానం,
వేత్తాసి వేద్యంచ పరంచ ధామ త్వయా తతం విశ్వమనంతరూప.

కోటగోడలకు వెలుపల మహమ్మదీయసైన్యము సముద్రమువలె ఘూర్ణించుచుండెను. ఆగోడలు పగల్పనాయత్తపడియున్న ఫిరంగుల "భం భం" మనుశబ్దముతో పొలములు, అడవులు, ఏళ్లు, కోళ్లు నేకమయ్యె. కోటలోపలమాత్రమెవ్వరును లేరు. విజనమైయున్నది. వెలుపటనుం డివచ్చు ప్రతిధ్వనితప్ప మఱియేశబ్దమును వినవచ్చుట లేదు. శ్రీ, యయంతుల, యనుపమానకంఠస్వరములనుండి బయలువెడలి స్వరముద కుండ కీర్తనము సేయ భగవన్నామస్మరణమాత్ర మాశబ్దమున కం తరాయముకలిగించుచుండెను. శ్రీ, యయంతులు, రూపములుదాల్చిన, భక్తిజ్ఞానములు. వారికంఠస్వరము లంతరిక్షమార్గమునఁ బోవుచున్నవి. సీతారాముని దేహముప్పొంగి పోవుచున్నది.

శ్లో. నమోనమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపినమోనమ స్తే, నమః పురస్తాదథపృష్ఠతస్తేనమోఽస్తుతే సర్వత ఏవసర్వ.

కర్ణరసాయనంబుగనున్న యామాధుర్యరసంబు సీతారాము చెవింబడునప్పటికి మత్తుమందు జల్లినట్లయ్యెను. ఆనిమిషమందాతనికి నున్న యాపత్తులన్నియును మఱపునకువచ్చెను. హస్తద్వయంబుదో యిలించి మనస్సుచలించినవానివలె మొగమ్ముపైకెత్తి ఆవందాగ్రసులు ల్పఁజొచ్చెను. "హరీ! హరీ! హరీ!" యనుహరినామస్మరణము కోటగోడలమెల్లఁ గ్రమ్మిపోయెను.

ఇది యిట్లుండ కోటలోపలనుండి, "జయము సీతారామా! జయ మహారాజాధిరాజా! జయము" అను రణోత్సాహసూచకంబులగు గొప్పపెద్దకేకలు వినఁజొచ్చెను.



## ఇరువదిరెండవ ప్రకరణము.



సిపాయిలందఱును కోటలోపలనే మకామని మాపాఠకు లిదివఱ కేయెఱుంగుదురు. పైపెచ్చునిలువ సైన్యమునందలి సిపాయిలెల్లరును సైన్యమును విడచి పలాయితులైనట్లు చెప్పుకొనుచున్నారు. బ్రాహ్మణులును, రాజపుత్రులును, చేరి మొత్త మేఁబదిమాత్రము తాము తిన్నతిండి వ్యర్థముగా పోకుండ రాజుపక్షమునకుండి తమశక్తియెల్ల ధారవోసి పనిచేయుచుండిరి. వారందఱు ఎన్నికలోనివారు. లేకున్న డబ్బును, దుగ్గాణిగయును లేకుండ ప్రాణములకు తెగించి యింతపనిచేయుదురా? వీరికిని అసంతుష్టి ప్రారంభమైనది. మహమ్మదీయసైన్యము సమీపమునకు వచ్చియున్నది. భయంకరముగ హాహారవంబు ప్రారంభమయ్యెను. ఫిరంగి ఛాంకారముచే చెవులు, బ్రద్దలగుచుండెను. అందుండి యెగిరిపడునగ్ని గోళములు కోటగోడల సత్తువ నదలించుచుండెను. కాని వారి నెవ్వానిగాని నడపినపాపమున బోయినవారు లేరు. రాజు స్వయముగ వచ్చినిలువ సైన్యముల మఱలం గుమిగూర్చెను. అతఁడుమాత్రము యథాక్రమముగ నడుపఁగలిగినాఁడా? వారందఱును వచ్చి యాంతని వెనుక నిలువఁబడినది దేహములర్పించుటకై గాని విజయపట్టము నందుటకు గాదు. "రండు. మీప్రాణముల నాకై యర్పణముసేయుఁడు" అనువారలైనను లేరు. అట్టిచో వారి యీయుద్దేశ్యము నెఱవేరుట యెట్లు? అసంతుష్టి యుద్రిక్తమాయినది. ఇంక భయభక్తులతోఁ బ్రసక్తియేముండును?

అందఱు నొక్కచోట సమావేశమైనారు. రఘువీరమిశ్రుఁడు వయసుచేతను, ఉద్యోగధర్మముచేతను కూడ పెద్దవాఁడు. అతఁడు ముందునకువచ్చి "అన్నలారా! ఈమీరందఱును కదలకుండ మెదలకుండ నీగోడలలోఁ గూర్చుంటిరేని మహమ్మదీయు లిందు ప్రవేశించి మిమ్ము నిర్మూలము చేయుదురు. వారికాళ్ళక్రిందఁ బడి నలిగిపోవుట యుత్తమమో? పౌరుషంబగు మరణముత్తమమో? యోజించుకొనుఁడు. రండు. మగతనముజూపి మఱి చత్తుముగాక. ఆయుధసన్నద్ధులరగుఁడు. యుద్ధమునకు పోవుదము లెండు. మనకు నాయకుఁ డెవ్వఁడును లేఁడందురా? లేకపోయిన లేకపోవుఁగాక. ఇందు నియంత్రితుఁడు కావలసినవా రెవ్వరు? చావు

నకు గూడ సెలవుకావలెనా? మనము రాజువలన బ్రతికినారము. అతనికొ ఱకై పోరాడుట మనవిధ్యుక్తధర్మము. మనకిప్పుడు నియామకుం డెవ్వఁడు ను కనుపడుట లేదన్నమాత్రమున మనకృత్యమును మనముచేయక యూరకుండుట ధర్మమా? చెప్పినను చెప్పకున్నను మనకృత్యమును మనము చేయుదము లెండు." అని హెచ్చరించెను.

ఈయుపదేశము నందఱును శిరసావహించిరి. గయాపండా యను నాతఁడు "మనము యుద్ధము చేయుమార్గమేమి? ఇప్పటిసంగతి సందర్భములనుబట్టి ఫిరంగులు మాత్రమె కోటను సంరక్షింపవలసియుండెను. ఫిరంగులు కాల్చువారు లేరు. అందఱును పలాయితులైరి. ఫిరంగులతోఁ బనిసేయుట మనపనికాదు. యుద్ధప్రక్రియ నిర్ధారణసేయుఁడు" అని చెప్పెను.

దానిని గూర్చి పెద్దచర్చజరిగెను. జమాదారు ధర్మసింగు "ఈచర్చలతోడ ప్రయోజనములేదు. మనచేతనాయుధములున్నవి. గుఱ్ఱములున్నవి. రాజు కోటలోపలనున్నాఁడు. మనమందఱము సాయుధులమై అశ్వములనెక్కి రాజునొద్దకుపోవుదము. ఆయనయుత్తరవులఁ జెందుదము ఆయన యెట్లు చెప్పిన నట్లుచేయుదము. లెండు" అనిచెప్పెను.

అందున కందఱును సమ్మతించిరి. చరచరఁబోయి యుద్ధసన్నద్ధులై అశ్వములనెక్కి సాటోపంబున "మహారాజకీ జయ్. సీతారామ రాజకీ జయ్" అనువిజయవాక్యంబులఁ బలుకుచు ఆయుధముల నప్పళించుచు బయలుదేరిరి.

ఈహుంకారములు సీతారాముని చెవింబడియెను.



## ఇరువదిమూఁడవ ప్రకరణము.

శ్రీ, యయంతుల, ప్రార్థనామాధుర్యమున నానందపరవశుండై వేదికపైనున్న సీతారామునొద్దకు రణోత్సాహసూచకంబులగు జయజయవాక్యంబులతో సిపాయిలందఱును వచ్చిరి. అంత సీతారామునిగాంచి మఱింత కేకలకుఁ బడిరి.

రఘువీరమిశ్రుఁడు "రాజశాసనమేమి? దేవర సెలవయ్యేనని ఈ బోడిబుఱ్ఱల తఱిమివేయుదుము."

సీతా——ఇక్కడ నొక్కింతసేపు నిలుఁడు. మఱల నేనిప్పుడే వచ్చె దను.

అని రాజు అంతఃపురమునకరిగెను. ఈలోపల మనస్సు చెదరనీకుండ తదేకధ్యానమునకు విఘ్నముకలుగకుండ, తమమనోనిశ్చితంబు వెలి పోవకుండ, విరాగిణులిరువురును పాడుచుండిన న్యాప్రార్థనాశ్లోకముల ను సైనికులందఱు నాలించిరి.

నియతకాలమునకు రాజు మరలివచ్చెను. అతనివెనుక నొకపల్లకీ కూడనుండెను. రాజాంతఃపురమునందలి పరిచారకులందఱును పలాయి తులైనారని యిదివఱకే చెప్పియుంటిమి. కాని, ఆదినుండియును కనిపె ట్టుకొనియున్న సేవకులుమాత్ర మింకను అంటుపెట్టుకొనియున్నారు. నం దయును ఆమెపిల్లలును యెక్కివచ్చినపల్లకిని మోసికొనివచ్చినది ప రిచారకులే.

రాజు సేనాసముదాయమువద్దకువచ్చి వారినందఱను పూర్వము నందలి వ్యూహప్రక్రియలననుసరించి ముమ్మొనలు దీర్చియుండునటుల వారినిశాసించెను. నంద నానడుమనుంచి తానొక మొనను నిలిచి యాకో ణమును కాచియుండెను. శ్రీయయంతులిద్దరను బిలచి "మీరిచ్చట వె లుపల నేలయుండెదరు? మా సైన్యసముదాయము నడుమనుండు విజనప్ర దేశంబున కరుగుఁడు" అని చెప్పెను.

శ్రీయయంతు లిరువురును చిఱునగవుతో "మేము సన్న్యాసినులము. మాకు చావుబ్రతుకులు రెండును సమానములె." అని పలికిరి. మఱు మాటలాడకుండ సీతాముముందు "ఓ దేవా! విజయోస్తు. లక్ష్మీనారా యణా విజయోస్తు." అని కేకలువేయుచు ద్వారమువంకకుఁ జనియెను.

ఆతనివెన్నంటి ముమ్మొనలు దీర్చియున్న యావాహిని బయలుదే రివచ్చెను. సన్న్యాసిను లిరువురు నీమహాన్మాత్రమైన పిక్కచెదరులేకుండ త మహస్తములనున్న త్రిశూలమును త్రిప్పికొనుచు రాజుగుఱ్ఱమునకు ముందువంక నడచుచుండిరి. ఈక్రిందిశ్లోకమును బిగ్గరపుచుచప్పటులఁజఱు చుచు ద్రోవఁదీయుచుండిరి.

పద్యం. జయశివ! శంకర! త్రిపురనిధనకర!
రణే భయంకర! జయ జయ రే!

చక్రగదాధర! కృష్ణ! పీతాంబర!
జయజయహరి! హర జయజయ రే!

వారిచర్యలకు రాజచ్చెరువంది "ఇంకొక్కనిముసములో మృత్యుముఖమునఁ బడనున్న వారికి మీకీసాహసమేమి?" అనిపల్కరించెను. శ్రీ—దేవా! "రాజులకే మృత్యువనిన భయములేనపు డింక సన్యాసినుల కా భయము." అని చెప్పిరి.

యయంతి యేదియో ధ్యానించుకొనుచుండెను. ఆమెమాటలప్రమేయమునకుఁ బోఁడయ్యెను. రాజా స్త్రీలేవిధముగను తనమాటలు లెక్కసేయనివారగుటఁగని పెట్టి యింకవారితో ముచ్చటింపఁ డయ్యెను.

రాజు ద్వారపార్శ్వమునకు వచ్చి స్వయముగఁ దాళముఁదీసి గడియ వెడలించెను. పటిష్ఠులైయున్న ద్వారపాలకు లీక్రమముగ పెద్దపెద్ద కేకలు వేసిరి. ఆ కేకలతో సింహద్వారమెగిరిపోవునట్టులయ్యెను. గుఱ్ఱములతెక్కలచప్పుడు తచ్చుమూసిస్వనంబుతో మిళితమై ప్రతిధ్వనించుచుండెను. మహమ్మదీయసైన్య మహాసముద్రతరంగముల బలిమిచే బలిష్ఠమగునాపాశిద్వారము బంధులుఁదడదడ రాలిపోయెను. తెఱచియున్న ద్వారమును ముమ్మొనవాలుదాల్చియున్న సీతారాముని గుఱ్ఱపుదళములుత్సాహప్రేరితములై ఆఁగిపోయిరి.

ఆఁగిగట్టుతెగిన యప్పుడు నిండియుండిన యేటివెల్లువ యత్యుద్రేకమున దోడదోడఁ బ్రవహించునట్లు తెఱచియున్న ద్వారముననుండి మహమ్మదీయ సైన్యములోపలఁ జొరఁబడియెను. కాని, వారందఱును శ్రీయయంతులను జూడఁగనే, ఈశ్వరవేరుసోకిన పాములవలెఁ గదలమెదలకుండ నుండిపోయిరి. వారియాకారమే సర్వసమ్మోహన యంత్రముగనున్నది. ఆరూపము లీస్థూల ప్రపంచకముననుండఁదగినవి కావు. వింతయైన వస్త్రరచనావిధానము, అత్యద్భుతమై యశ్రుతపూర్వమైన వీరత్వము, సర్వవశీకరణమంత్రమువలె పనిచేయుచున్నవి. జయసంప్రార్థనా వచనము. ఇవియన్నియు నొక్కచోఁ జేరియుండుటఁగాంచి మహమ్మదీయులు వారల నాపురదేవతలనుగా భావించి భయావహులై వారికి త్రోవయొసంగిరి. మహమ్మదీయ సైన్యమధ్యమునఁ బ్రవేశించి దమత్రిశూలములచే దారిఁ జేసికొనుచు జొరుచుకొనిపోయిరి.

అదృష్టవశమున త్రిశూలములకు లభియించిన యాత్రోవ సీతారామునకుగూడ లాభించెను. వారివెనువెంటనే శత్రుమధ్యమునుండి సీతారాముఁడు తన సైన్యమునుకూడ నడపించుకొని పోయెను. సీతారాముఁ డిప్పుడు కేవలమును మనుష్యులలో లేఁడు. భగవద్ధ్యాన తత్పరుఁడై నడచుచున్నాఁడు. చావు సన్నద్ధమైయున్నది. తన మనస్సిప్పుడు భగవంతునియందు తదేక లగ్నమైనది. ఇప్పుడాతని మనస్సున కేయాందోళములును లేవు. నిశ్చలమై, తదేకలగ్నమై, సంతోషదాయకమై యొప్పుచున్నది. మొగమునం జిఱునగవు తొలుకాడుచున్నది. భైరవీరసనాళము నుండి బయలువెడలి మృదుమధురంబై యొప్పుచున్న యాహారినామస్మరణముల తనివిదీరఁగ్రోలి తనమనంబు నాతఁడిప్పుడు తద్దైవమునందు లగ్నముగావించి తనను తా మఱచెను. అట్టిక్షణమున మహమ్మదీయసైన్య మేపాటిది. కేవల తృణప్రాయముకాదా ?

సంతోషతరంగితంబగు నాతని ముఖమునుజూచి అల్పముగనున్నను జయప్రదంబగు నాతని సైన్యమును నవలోకించి "మహమ్మదీయులు. వారిని చావనిండు చావనిండు" అనిపిడుగులు గురియునటుల కేకలు వేయసాగిరి. కాని, స్త్రీలనిర్వురను మాత్ర మెవ్వరును ఏమియు ననరైరి. వారి దారినుండి యందఱును తొలఁగిపోయిరి. సీతారాముని, యాతనిసైన్యమును, అన్నివైపులనుండియును ముట్టడించిరి. వారుమాత్ర మెదిరినెమరుకొనుటకై నడుమనెచ్చటను నిలువకుండఁజేసి, చరచరముందునకు నడిపించుకొని పోయెను. అందులో చాలమందికి చావుదెబ్బలు తగిలినవి. కొందఱా దెబ్బలచే గుఱ్ఱములనుండి గుభాలునఁ గూలి మడిసిరి. కాని వారి స్థానమున వెనుకనుంచి మఱియొక రాయు త్తరక్షణముననేవచ్చి యాగుచుండిరి. ఈరీతిని సీతారాముని సైన్యము శత్రుమధ్యముననుండి శ్రీ యయంతులు దయచేసినదారి చెదరకుండఁ బోఁగలిగెను. ఆసిపాయిలపైఁబడిన సైన్యభార మతిఘోరమైనదియె కాని సీతారామునిశిక్షయును, తాల్మియును, అంతరాయములనెల్ల నిర్జించెను. సిపాయి లెల్లరు ఇటునటుజూడకుండఁగనే ముందునకు మొగిసిపోయిరి. పోనుపోనుకొందఱికి గాయములు తగిలెను. కొందఱు మడిసిరి. వెనుకంజవేసిన కొంద

ఱు గుఱ్ఱముల కాళ్ళక్రిందఁబడి నలిగిపోయిరి.

ఈయద్భుతచర్య గాంచి మహమ్మదీయ సైన్యనాయకుఁడు సీతారాముని ముందు గమనము నాపుటకై యాతని సైన్యమున కెదురుగ నొక ఫిరంగిననుపఁ బంచెను. కోటగోడల ముట్టడించుటకై వారిదివఱకే ఫిరంగులఁ గొన్నిఁటిఁ దగిన స్థలముల నమర్చియుంచిరి. అందువలన ఫిరంగి వెంటనే సమకూరదయ్యెను. అయినను రాజదంపతులు తప్పించుకొని పోవుచున్నారని కనిపెట్టి, అత్యంత శీఘ్రముగ జాగరూకతతోఁ గడుకష్టము మీఁదఁ నొక ఫిరంగి రావించి సీతారాముని సైన్యమున కెదురుగ నిలిపెను. కాని ముసల్మాను నాతనిపై తాను స్వయముగఁ బోవసమర్థుఁడు కాఁడయ్యెను. కోటతలుపు తెఱచియుండెను.

మహమ్మదీయసైనికులు దోఁపిడి కుపక్రమించిరి. వారిని మరలింప శక్తుఁడు కాఁడయ్యెను. సుబాదారుని బాకీపైక మెక్కడ రాకుండ దాఁటిపోవునో యనుభయముచే నాతఁడుకూడ యా పనిమీఁదనే యుండవలసినవాఁడయ్యెను. ఈలోపున ఫిరంగివచ్చెను. సీతారాముని సైన్యమాశలన్నియును నిరాశఁ జేసికొనిరి. కాని శ్రీపనిమాత్ర మట్లులేదు. శ్రీయయంతులిరువురును చరచర ఫిరంగియొద్దకుపోయి యెదుర్కొనిరి. యయాతిముఖమువంక తేఱి పాఱఁజూచుచు తనహృదయము నాఫిరంగికెదురుఁగ నిలిపి శ్రీ చిఱునవ్వునవ్వెను. అటునిటుఁ గలయంజూచెను. తోడనే తన హర్షసూచకమై జయప్రదంబైన చిఱునవ్వొకటి యామె యధరోష్ఠమునఁ గనుపట్టెను. యయంతి యామె ముఖవికారములఁ బరిశీలించి చూచెను. అంతట తనచూపు లాఫిరంగివాని మొగముపై ప్రసరించెను. అట్టిచిఱునవ్వే యీమెముఖముమీఁదఁ గనుపట్టెను. ఒకరినొకరుచూచుకొనిన యాచూపులు ఫిరంగిని జయించితిమని యొకరితోనొకరు మాట్లాడుకొనుచఁబోయిరి. సీతారాముఁడును భార్యయును పిల్లలును హతశేషులైయున్న సిపాయీలతో మహమ్మదీయ సైన్యమధ్యమునుండి యిట్లు లతిసాహసమున నొకసురక్షితస్థలంబునకుఁబోయి చేరిరి. మహమ్మదీయులు కోటదోఁపిడికిఁ దొరకొనిరి.

సీతారామునిరాజ్య మిట్లు లంతరించెను.

---

## ఇరువదినాలవ ప్రకరణము.



రాత్రియైన వెనుక శ్రీ, యయంతు లొక వివిక్తస్థలంబునఁ గలిసికొనినప్పుడు శ్రీ "ఆఫిరంగివాఁడెవ్వఁడు" అని యడిగెను.

యయంతి—సీతారాముఁడు చంపినవాఁడెవ్వఁడనియా నీవడుగుచున్నది?

శ్రీ—అవును. వానిని నీ వేల చంపవలదంటివి?

యయంతి—విరాగిణుల కీసమాచారము తెలిసికొనినందువలనఁ బ్రయోజనమేమున్నది ?

శ్రీ—ఏమియును లేకున్నమానె. కంటఁదడిపెట్టినఁ బెట్టవచ్చుఁగా? అంతమాత్రము చేత విరాగమార్గమున కపాయముగలుగునా?

యయంతి—కంటఁదడిమాత్ర మెందులకు బెట్టవలెను?

శ్రీ—బ్రతికియుండగ నాతఁడెవ్వరో గుర్తించలేకపోతిని. రాజును నీవంతరాయపెట్టుటంగాంచి యాతనిశవము నొక్కింత గుర్తుపట్టితిని. నా మనస్సునకు సంశయముగా నున్నది. అతఁడెవ్వడైనం గానిమ్ము? అతనిమరణమునకు నేనేకారకురాలను. తచ్ఛతఘ్నిముఖంబున కెదురుగ నేను నిలువకయుండిన నాతఁడు తప్పక ఫిరంగికాల్చియేయుండును. రాజును అంతమునొందియుండును. ఇంక నాతనిఁ జంపువారెవ్వరు?

యయంతి—అతఁడు చచ్చుటవలననే రాజు బ్రతికినాఁడు. నీకర్తవ్యమే మీయో నీవు నెరవితివి. దానినిఁగూర్చి ప్రశంసించినందువలనఁ బ్రయోజనమేమి ?

శ్రీ—సంశయము నివృత్తికావలదా ?

యయంతి—సన్యాసినికింత తొట్రుపాటేల?

శ్రీ—సన్యాసినికానీ, మఱియెవ్వతను గానీ, మనుష్యప్రకృతిమానునా? నీవు నిశ్చయముగా దేవతాసమానురాలవని యెఱుఁగుదును. అట్టినీవు కూడ పదుగురిలో నిలువఁబడినప్పుడు లజ్జాపరిత్యాగమును చేయలేకపోయితివి. ఇంక నావంటి సన్యాసినికి గలమనోవికృతులమాట యేల తలపెట్టెదవు?

యయంతి—అట్లయినరమ్ము. మనసంశయము నివృత్తిఁ జేసికొందము.

ఇప్పుడుచీఁకటిపడినప్పటికిని ఆస్థలమున నాకొకసాంకేతిక మున్నది ? పోయిచూతమురమ్మ. కాని,మనతోడఁగూడ దీపముట్టుకొని వెళ్లవలెను.

అంతవారిరువురు గడ్డిమోటయొకటి వెలిగించి యుద్ధరంగమునకరిగిరి. యయంతిపెట్టుకొనిన గుఱుతులనుబట్టి వారిరువురును తమగమ్యస్థానమునకు చేరిరి. ఆదీపసహాయమున వెదుకఁగా వెదుకఁగా నాతనిశవముగనుపడెను. కాని శ్రీ కింకనుసంశయము విడిపోయినదికాదు. అంత యయంతి యాఫిరంగివాని తలనున్న మసలివెంట్రుకల తలకట్టునూడఁబెరుకగఁ నతనియథాస్థితిబయటఁబడియెను. పిమ్మట నాతని కట్టుగడ్డము నూడదీసెను. ఈరెండింటితోడను శ్రీకిసంశయనివృత్తి యయ్యెను. అతఁడు గంగారాముఁడు.

అంత శ్రీ కపోలఫలకమునుండి యశ్రులుకాలువలుగట్టసాఁగెను. యయంతి. " సోదరీ ! ఈమాత్రమునకే నీవింత వలవంతనలయుదువె ? నీకు విరాగిణీత్వ మెట్లు లభ్యము కాఁగలదు ? "

శ్రీ—నాయం దేదోషమును లేకయే రాజు నాపై నేరస్థాపనఁ జేసినాఁడు. ఆతనిమరణమునకు నేనా కారకురాలను? నేను సోదరమరణమునకు కారకురాలను. విధిచెయిదంబు లవిలంఘ్యంబులు.

యయంతి—పరమపురుషుం డెవ్వరిచే నెవ్వరికేది సంఘటనఁజేయఁదలంచునో యయ్యది కాకమానదు. నీవడ్డు పడుటవలన రెండుమాఱులు గంగారాముఁడు బ్రతికి బైటఁబడినాఁడు కాని ఆనీవే యిప్పుడాతని మరణమునకుఁ గారకురాలవైతివి. కాని,గంగారాముఁడు పాపాత్ముఁడు. మరల పాపకార్యమునకు సంకల్పించివచ్చినాఁడు. రమచచ్చిపోయినదని యాతఁడెఱుంగడు కాఁబోలు ? మాఱువేషమున నామె నెట్టులైన వంచించి పట్టుకొనవలెనను బుద్ధితో నతఁడు మహమ్మదీయ సైన్యమునఁ జేరినాఁడు. రమ తనను గుఱుతుపట్టిన తన నామె వరింపఁబోదని యాతనియూహ. ఆడోలీలోనిది రమయని యెంచియుండు. తత్కారణమున రాజుసైన్య మాతఁడరికట్ట నెంచినాడు. అయినదేమియో అయినది. అనుపయోగమైన ఈయశ్రుధారల నపనయించుకొమ్మ. లేలెమ్మ. ప్రేతభూమికిఁ బోవుదము.

అని వారిరువురు గంగారాముని శవమును గొని దహనక్రియలఁ గావించిరి.

శ్రీయయంతు లింక సీతారాముని జాడ లెఱుంగ యత్నింపరైరి. ఆరాత్రియె వారిరువురును అంధకారమునందైక్యమునొందిరో యన్నట్లు లంతర్ధానము నందిరి. ఎక్కడకుపోయిరో ? యేమైరో ? ఎవ్వరికిని తెలియదు. శ్రీ శ్రీ శ్రీ శ్రీ.



ఉ ప సం హా ర ము.

రామచంద్రు శ్యామచంద్రు అను మాపూర్వస్నేహితులిరువురును పాఠకుల కిదివఱకే కృతపరిచయులు. చాలకాలము క్రిందటనే వారుపలాయితులయిరి. ప్రస్తుతమున వారిప్పుడు నలదంగయను గ్రామమున నివసించుచున్నారు. అచ్చట నొకయచలమున నిలువంబడి వారిరువును ముచ్చటించుకొన సాఁగిరి.

రామ—అన్నా! మహమ్మదుపురసమాచారము నీకేమైనఁ దెలియునా?

శ్యామ—తెలియకేమి ? నాకిదివరకే విదితమైనది. ఆపురమునందలి కోటయును, తత్సమీపస్థలములును, మహమ్మదీయు లిదివఱకే వశము చేసికొనిరి. ఆపట్టణమంతయును కొల్లఁగొట్టిరి.

రామ—రాజదంపతుల సంగతి యేమయ్యెనో ?

శ్యామ—వారిని కాలుసేతులుకట్టి మూర్షడాబాదాకు పంపించిరఁట. అచ్చట వారిం బ్రతికియుండఁగనే యొడలెల్ల నొలిచివేసినారఁట.

రామ—నాకును అట్లేవినవచ్చినది. కానివారు విషము పుచ్చుకొని ప్రాణముల విడచిరనికూడ యొకకింవదంతి కలదు. వారిమృతకళేబరములఁ గొనిపోయిచర్మము లొలిచి కట్టలకు వ్రేలాడఁగట్టిరని చెప్పుకొనుచున్నారు.

శ్యామ—తల కొకతరహాగా చెప్పుచున్నారు. కొందఱీ రాజదంపతులసలె పట్టుపడలేదనుచున్నారు. వారిప్రత్యక్షదేవతవచ్చి అంతరాళమున కుఁగొనిపోయినదఁట. మహమ్మదీయులెక్కడనోయిర్వురు మనుష్యులనుగొనివచ్చివీరె రాజదంపతులని చెప్పివారిచర్మము లొలిచిరఁట.

రామ—ఇవియన్నియు మనహిందువుల కల్పితములు. పుక్కిటిపురాణ ములకంతమెక్కడ ?

శ్యామ—ఇం దేది పుక్కిటిపురాణమో ఏది కాదో తెలిసికొనుటె ట్లు ? రెండవది మహమ్మదీయులకల్పన కావచ్చును. మనమా రమును చిల్లరవర్తకులము, ఓడవర్తకపు కబురులు మనకెందుకు? మనము బ్రతికి బయటంబడినాము. అందుకు భగవంతుని కొనియా డవలెను. ఏది నీచిలుము. ఒక్కసారి యిటు తెమ్ము.

అని రామచందు శ్యామచందు లిరువురును చిలుము చేతంబట్టి ఆనందించసాఁగిరి. అంతతో గ్రంథము పరిసమాప్తమయ్యెను.



264 పుట 24 పఙ్తిలో "మాఁటాడు" అను దానికి పిదప క్రిందిపఙ్తులుండవలెను.

ఈనడుమ రాయలు ముందునకు దుమికి ఫిరంగివానిని జంపఁ గత్తిఁ దూసెను. అంత యయంతి "ఓశక్తిమంతుఁడా! తొందరపడకు ము. దయచూపుము" అని కేకవేసెను. రాయలు శత్రువునిపై ద యయా? యని బదులుచెప్పుచు యెత్తినఖడ్గ మెత్తినట్టుగనె యాతని శిరస్సు కఱుక్కున దెగనఱకెను ఉత్తరక్షణముననే నిరుపమానంబగు తననేర్పంతయు నుపయోగించి యతిలాఘవంబున ఫిరంగి యెదిరిసైన్య ముపై, మలపి తనసైన్యము ముందుదారి కడ్డులేకుండ చేసెను. అతని చేత ఫిరంగి లయకాలమునందు గర్జించు వలాహకసముదాయంబువలె భంభమ్మని మ్రోయఁదొడంగెను. ఇనుపగుండ్లు వరషము కురిసినట్లు గురియుచుండెను. మహమ్మదీయులు చెల్లాచెదరలై పఱచిరి. దారినడ్డ మియు లేకుండఁబోయెను. రాయలసైన్యమునకుఁ దోవ సుగమం బయ్యెను.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
192, ఎస్ప్లనేడ్, చెన్నపురి, ఈ.



## సంస్కృతగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| బాలరామాయణము, సటీక ... ... | 0 | 2 |
| అధ్యాత్మరామాయణము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము ... | 8 | 0 |
| డిటో మూలము, చిన్నసైజు ... ... | 0 | 12 |
| సుందరకాండము, మూలము, చిన్నసైజు ... ... | 0 | 12 |
| డిటో ఆంధ్రతాత్పర్య సహితము ... ... | 1 | 0 |
| యజుర్వేద సంధ్యావందనము, పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్ర టీకాతాత్పర్యసహితము, చిన్నసైజు, మంచికాగితములు ... | 0 | 4 |
| మహాన్యాసము, చిన్నసైజు, శుద్ధప్రతి ... ... | 0 | 5 |
| రుద్రము, పురుషసూక్తమువగైరాలు, చిన్నసైజు ... ... | 0 | 2 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు ... ... | 0 | 2 |
| ఋగ్వేదాహ్నికము, సటీక ... ... | 0 | 2 |
| వ్రతరత్నాకరము. ... ... | 0 | 6 |
| మంత్రపుష్పము, సటీక ... ... | 0 | 1 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు ... ... | 0 | 1 |
| సంధ్యావందనభాష్యము, చక్కనిప్రతి ... ... | 0 | 6 |
| దేవతార్చన, చిన్నసైజు ... ... | 0 | 1 |
| కాలామృతము, సటీక, చక్కనికూర్పు ... ... | 0 | 12 |
| ముహూర్తదర్పణము, సటీక, చక్కనికూర్పు ... ... | 0 | 8 |
| హరిమీడేస్తోత్రము, సటీక, చక్కనికూర్పు ... ... | 0 | 3 |
| ఆత్మబోధము, ,, ... ... | 0 | 4 |
| సౌందర్యలహరి ,, ... ... | 0 | 3 |
| ఉత్తరగీతా, సటీక, చిన్నసైజు, మంచికాకితములు ... ... | 0 | 6 |
| భగవద్గీతలు, ఆంధ్రటీకాతాత్పర్యసహితము, పట్టుబైండు ... | 1 | 8 |
| భగవద్గీతలు ఆంధ్రతాత్పర్యసహితము, చక్కనికూర్పు ... ... | 1 | 0 |
| భగవద్గీతలు, ఆంధ్రతాత్పర్యసహితము, చిన్నసైజు ... ... | 0 | 6 |
| రఘువంశము 10 సర్గలు సవ్యాఖ్యానము, శుద్ధప్రతి ... ... | 0 | 8 |
| మేఘసందేశము, సవ్యాఖ్యానము ... ... | 0 | 4 |
| పుష్పబాణవిలాసము, సవ్యాఖ్యానము ... ... | 0 | 2 |
| కుమారసంభవము, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు ... ... | 0 | 10 |
| భర్తృహరిసుభాషితము, ఆంధ్రపద్యతాత్పర్యసహితము మేలుకాకితములు | 0 | 12 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| శబ్దమంజరి, చక్కనికూర్పు, శుద్ధప్రతి ... ... | 0 | 2 |
| కృష్ణకర్ణామృతము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము కాలికోబైండు ... | 1 | 4 |
| సప్తర్షిస్తోత్రము, సటీక, చిన్నసైజు ... ... | 0 | 1 |
| దేవీమానసికపూజ ... ... | 0 | 1 |
| పరమేశ్వరస్తోత్రకదంబము, శుద్ధప్రతి, చిన్నసైజు ... ... | 0 | 6 |
| దేవీస్తోత్రకదంబము, చిన్నసైజు ... ... | 0 | 4 |
| విష్ణుసహస్రనామము, నామావళీసహితము, చిన్నసైజు ... ... | 0 | 6 |
| లలితాసహస్రనామము, త్రిశతి, పంచదశీస్తోత్రము వగైరాలు, నామావళీసహితము చిన్నసైజు ... ... | 0 | 8 |
| రామకర్ణామృతము, ఆంధ్రపద్యతాత్పర్యసహితము, శుద్ధప్రతి ... | 1 | 4 |
| రామసహస్రనామము, నామావళీసహా, చిన్నసైజు, శుద్ధప్రతి. ... | 0 | 4 |
| లక్ష్మీ ,, ,, ,, ,, ... | 0 | 3 |
| శివ ,, ,, ,, ,, ... | 0 | 3 |
| ఆంజనేయ ,, ,, ,, ,, ... | 0 | 3 |
| సుబ్రహ్మణ్య ,, ,, ,, ,, ... | 0 | 3 |
| నీతిశాస్త్రము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము ... ... | 0 | 2 |
| దేవీసప్తశతి, చక్కనికూర్పు ... ... | 0 | 5 |
| అమరము, మూలము, మూడుకాండలు, శుద్ధప్రతి, చిన్నసైజు. ... | 0 | 6 |
| అమరము, సటీక, చక్కనిప్రతి ... ... | 0 | 14 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు ... ... | 1 | 4 |
| గురుబాలప్రబోధిక — చిన్నసైజున రామాశ్రమీయాద్యనేకగ్రంథముల సహాయముతో చక్కగ పరిష్కరించి అకారాది అనుక్రమణికతో ముద్రించియున్నాము. ... ... | 2 | 8 |
| నానార్థరత్నమాల, చక్కనిప్రతి ... ... | 0 | 12 |

## ఆంధ్రగ్రంథములు.

| | రూ. | అ. |
|---|---|---|
| ఉత్తరరామాయణము, కంకంటి, పాపరాజప్రణీతము, చక్కని కూర్పు... | 1 | 0 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు ... ... | 1 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు ... ... | 2 | 8 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిప్రతి ... ... | 2 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కగ ముద్రితము | 0 | 8 |
| అచ్చతెనుగురామాయణము, శుద్ధప్రతి ... ... | 1 | 4 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము దళసరికాకితములు, చక్కనికూర్పు. ... | 2 | 8 |
| ఆముక్తమాల్యద, సటీక, అట్టబైండు ... ... | 2 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము ... ... | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రభాగవతము. పోతనామాత్యప్రణీతము. ఈవరకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది. | 3 | 0 |
| డిటో మేలుప్రతి, చక్కనిబైండు ... ... | 4 | 0 |
| డిటో మేలుప్రతి, రెండువాల్యుములు ... ... | 4 | 12 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండువాల్యుములు ... ... | 5 | 8 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కగ ముద్రించియున్నాము. బైండు అద్భుతము. శ్రీకృష్ణదేవరాయలయొక్కయు, రామస్వామి శాస్త్రిగారియొక్కయు ప్రతిమలు యిందుగలవు. | 1 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము ... ... | 0 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు ... ... | 1 | 8 |
| రాఘవపాండవీయము, సటీక చక్కనికూర్పు ... ... | 1 | 8 |
| శృంగారనైషధము ... ... | 0 | 10 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... ... | 0 | 8 |
| విజయవిలాసము ... ... | 0 | 4 |
| రంగారాయచరిత్ర, దిట్టకవి. నారాయణకవిప్రణీతము.... ... | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు, రామభద్రకవి. ... ... | 1 | 4 |
| నీలాసుందరీపరిణయము ... ... | 0 | 4 |
| రసికజనమనోభిరామము ... ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, కూచిమంచి తిమ్మకవిది ... ... | 0 | 6 |
| అనిరుద్ధచరిత్ర, అబ్బయామాత్య ప్రణీతము ... ... | 0 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు—టీకానుక్రమణికాసహితము, కాలికోబైండు | 0 | 12 |
| సులక్షణసారము, సటీక ... ... | 0 | 8 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు, 1200 పద్యములు ... ... | 0 | 4 |
| మాతృశతకము ... ... | 0 | 1 |
| సుమతిశతకము, సటీక ... ... | 0 | 2 |
| కుచేలోపాఖ్యానము ,, (భాగవతములోనిది) ... ... | 0 | 4 |
| డిటో ,, గట్టుప్రభుకృతము... ... ... | 0 | 6 |
| కుమారీశతకము, ,, ... ... | 0 | 2 |
| దాశరథీశతకము, ,, ... ... | 0 | 4 |
| మానసబోధశతకము ,, ... ... | 0 | 2 |
| భాస్కరశతకము ,, ... ... | 0 | 3 |
| కలువాయిశతకము ,, ... ... | 0 | 2 |
| నృసింహశతకము ... ... | 0 | 2 |

